## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

# శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి

## మొదటి సంపుటము

## శుష్క వేదాంత తమోభాస్కరము

ప్రకాశకులు

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము

**శ్రీ వ్యాసాశ్రమము**

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

## ఓమ్

ఆశకు సమమైన పిశాచము లేదు.

నిరాశకు సమమైన దైవమున్ను లేదు.

విరాగమునకు సమమైన అమృతము లేదు.

సరాగమునకు సమమైన విషమున్ను లేదు.

దయకు సమమైన పుణ్యము లేదు.

నిర్దయకు సమమైన పాపమున్ను లేదు.

జ్ఞానమునకు సమమైన సుఖము లేదు.

అజ్ఞానమునకు సమమైన దుఃఖమున్ను లేదు.

భక్తికి సమమైన భూషణము లేదు.

ముక్తికి సమమైన ధనమున్ను లేదు.

అహంకారమునకు సమమైన శత్రువు లేడు.

సోఽహంకారమునకు సమమైన బంధువున్ను లేడు.

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు.





''సత్యం వద''  ''ధర్మం చర''

# విజయ ఘోషలు

దైవమతము ప్రతిష్ఠితమగును గాక!

కరుణామతము వృద్ధి నొందును గాక!

శాంతిమతము స్థాపితమగును గాక!

సత్యమతము స్థిర ప్రతిష్ఠ నొందును గాక!

ధర్మమతము ఉద్ధరింపబడును గాక!

ఋషిమతము వర్ధిల్లును గాక!

స్వాతంత్ర్యమతము జయించును గాక!

జ్ఞానమతము వ్యాపకమగును గాక!

*ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః*

శ్రీవ్యాసాశ్రమము,

ఏర్పేడు - చిత్తూరుజిల్లా

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ

శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం

1-3-2000 ప్రకాశకులు

ఓమ్

# శ్రీ శుష్కవేదాన్తతమోభాస్కరము

## విషయసూచిక



శ్రీ సద్గురు మలయాళ స్వాములవారు

(30 సం॥ 35 సంవత్సరముల మధ్యకాలము)

ఓమ్

# విజ్ఞాపనము



ఈ గ్రంథమున బ్రత్యేకముగా విభజించి తారక, సాంఖ్య, అమనస్కములను వివరింప బూనలేదు. ఏలయన, వేదాంతవిషయమై ప్రస్థానత్రయము, పంచదశి, జ్ఞానవాసిష్ఠము, శ్రీ సీతారామాంజనేయ సంవాదము, విచారసాగరము మొదలయిన అనేక వేదాంత సారగర్భితములయిన దివ్యగ్రంథము లుండగా నూతన గ్రంథ నిర్మాణము సూర్యుని యెదుట దీపమువలెను, శ్రీ హనుమంతుని ముందు కప్పగంతులవలెను ఉండునని తలంచెదను. మఱియు, వేదాంతమార్గము పరమ కాష్ఠ నొందియుండుట చేతను, పై నుదాహరింపబడిన గ్రంథములలో గల విషయములకన్నను క్రొత్తగ జెప్పవలసిన సంగతులు లేనందుచేతను తారక, సాంఖ్యామనస్కములను విభాగించి చెప్ప బూనలేదు.

"అటులయినచో ఏల ఏతద్గ్రంథ నిర్మాణము చేయవలసి వచ్చినది?" అనియెదరేమో, ఋషి శ్రేష్ఠులచే జెప్పబడిన దివ్యగ్రంథములలో గల అమూల్య సారామృతమును పానము చేయుటకు ముముక్షువులు పరిపక్వదశను చెందక యున్నారని నా తలంపు. కారణ మేమనగా; మధ్యకాలములో మన ప్రాంతమున అపార బ్రహ్మనిష్ఠులును, దయామూర్తులును, తీవ్రవిరక్తులును, యథార్థజ్ఞానబోధకులును జన్మింపని దోషము చేతనే ప్రస్తుత జనులు బ్రహ్మనిష్ఠ కర్హులు కాకపోయిరని వ్యసనపూర్వకముగా చెప్పవలసివచ్చినది. ఒక్క మార్గము విశాలమయి ఉండినను, కొంత కాలము జన సంచారము లేకపోయినచో పక్షమున నెటుల తృణవృక్ష కంటకాదులచే నావరింపబడునో, అట్లే విస్తీర్ణమై,

విశదమయి ఉండు నీ మోక్షమార్గమున మహాత్ము లప్పుడప్పుడు నడువకపోయిన నా ప్రదేశము దురాచారదుర్గుణ దుష్టవృత్తులచే నావరింపబడును. కావున నిది చిన్న గ్రంథమైనను, నిజమగు బ్రహ్మనిష్ఠల పవిత్రమార్గ ముపదేశించునని నమ్ము చున్నాను. కొందరు పూర్వాచారమని చెప్పి దురాచారములలో నుండుటచే అటువంటివారికి దీనియం దతృప్తి కలుగవచ్చును. వీరు గూడ నీగ్రంథముపై గల విషమదృష్టిని క్షమతో కొంచె మోర్చుకొని చదివిన యెడల గొప్ప లాభమును పొందగలరని దృఢముగా నమ్ముచున్నాను. ద్వేషబుద్ధితో చదువువారికి యథార్థము తెలియుట దుస్తరము. అదెట్లన? రక్త నీల వర్ణములు గల అద్దముతో జూచువారికి శ్వేత పీత వర్ణములు సయితము ఆ దర్పణవర్ణములబోలె గనుపడును గదా! ధవళ వర్ణము గల అద్దము ద్వారా చూచువారికి మాత్రము సమస్త వర్ణములు యథార్థముగా గోచరించును. ఆలాగుననే శాంతబుద్ధిగలవారై సత్త్వగుణముతో గూడి దీనిని పఠించువారందఱును దురాచార దుర్గుణ పాపదూరులై మాయా విముక్తి నొంది శాశ్వత సుఖము నిచ్చు మోక్షము నొందగలరు. ''దూషణం జ్ఞానహీనానాం భూషణం జ్ఞానచక్షుషామ్'' అని వజ్రసూచికోపనిషత్తు.

మఱియు నీ గ్రంథమున అంతగా భాషానియమములను అనుసంధింపబూనలేదు. అందరకును తెలియునటుల కేవలము దేశీయ పదములతోనే వ్రాయుటకై పూనితిని.

ఓం లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.



# పీఠిక



ఓ ఆర్యోత్తములై పరమపవిత్రులైన నా ప్రియ సోదరీ సోదరులారా! ఇక్కాలమహిమచే సమస్తమైన జాతియందుండు స్త్రీ, పురుషులకు నాత్మజ్ఞాన విషయమై యొక గొప్ప జిజ్ఞాస హృదయమందు స్ఫురించిన సంగతి లోకమంతయు గనబడుచున్నది. అరుణోదయము సూర్యోదయమును జూపునట్లు, ఆత్మజ్ఞానోదయమునకు ముందుగా శుభేచ్ఛ యుదయమగును. ఈ స్థితికి వచ్చినవారందరున్ను ధన్యాత్ములే; సంశయము లేదు.

ఇట్లున్నప్పటికి వైరాగ్య, భక్తి సదాచారములు పూర్తిగా లేని కారణముచే పూర్ణానంద సుఖము నొందక జనులు పూర్వస్థితినుండి గొప్పస్థితిని బొందజాలక యున్నారు. ఏలయనగా, పోషణము లేని కృషివలె బ్రహ్మానంద సుఖమైన ఫలము ననుభవింపక చిన్న స్థితియందుండు కారణముచే ముముక్షువుల వైరాగ్య బోధోపరతి పూర్తి కొఱకై ఈ చిన్న పుస్తకము వ్రాయడమైనది.

దీని యందు శబ్దదోషము లనేక విధములుగా వచ్చుచున్న విషయము మీరు యోచించుటకు ముందుగానే నేను పలుమారు జెప్పగలను. కారణమేమనగా, నాకాంధ్రభాషాపరిజ్ఞానము తక్కువగా నుండుసంగతి నన్నెరింగిన వారందరికి బాగుగా దెలిసిన విషయమే. కనుక, దీనియందుండు శబ్దదోషములను బాటింపక అర్థములను మాత్రము గ్రహించుటకై ప్రార్థించువాడను. ''చెఱకునకు వంకపోయిన జెడునె తీపు'' అను రీతిగా నేను నిశ్చయించినాను. ఇంకనొక్క విధముగా సాధ్యమైనంత కఠినపదములును, దీర్ఘాన్వయములును రాకూడదని దృష్టి నిండా పెట్టియుంటిని. ఎందుకనగా విద్యావిహీనులైన స్త్రీ బాలురు కూడ వినినంతమాత్రముచే నర్థము గోచరమగుటయే దీని యొక్క ముఖ్యోద్దేశము. కనుక చిన్ని చిన్న పదములతో వ్రాయంబడినది.

దీనియందుండు విషయములలో నెవరికైనను నొకటి మంచిదిగా దోచిన ఎడల నది నా యొక్క శ్రీ సద్గురు దివ్య పాదారవిందరేణుకోట్లలో నేక రేణుకోట్యంశ ఫలమే గాని మరియేమియుం గాదు. దీనియందుండు విషయములలోనే విషయ మనిష్టమై యెవరికైనను దోచినయెడల ఆ తప్పులు నాయొక్క ప్రమాదముచే గలిగినవి. దానికి నేనే పాత్రుడను గాని, ఆలాటి దోషములేమిన్ని మద్గురువైన యాపుణ్యాపురుషుని యందు ఎప్పటికిన్ని లేనే లేవు. ఏలాగనగా, సమదృష్టిగల సూర్యుడు దుర్గంధమైన మలములలో గూడ బ్రసరించినను ఆ దుర్వాసన సూర్యునియందెట్లుండదో, ఆలాగుననే కరుణామూర్తియు, అజ్ఞానాంధ తమోభాస్కరుడైన యామహాత్ముడు మహామందుడనైన నన్ననుగ్రహించినను, నాయందుండు దోషములేమాత్రము ఆ పరమ పవిత్రుని యందుండవు. కాని యీ పుస్తకము జదువు వారొక్కొక్క విషయము జదువునప్పు డనిష్టము గలిగినను పూర్ణ దయతో క్షమించి మరియొక్క సమయమందు మనశ్శాంతి గలిగినప్పుడు గడవరకు చదువుటకై ప్రార్థించుచున్నాడనం. కోపముతో దృజింపరాదం. ఏలయనగా, ఒక్కద్వీపాంతరమునకు బోయినవా డాకాలానుసారమైన, అనగా వర్ష, గ్రీష్మ, హేమంత ఋతువుల యొక్క తత్సమయస్వభావము జూచి యీ దేశస్థితి యెల్లప్పటికి నాలాగే యుండునని నిశ్చయింపరాదుగదా! ఆరు ఋతువులైన పండ్రెండు మాసములు అచ్చట నివసించిన యెడల నీ జ్యోతిశ్చక్రము నొకతూరి చుట్టివచ్చును. అప్పుడు మాత్ర మాదేశ శీతోష్ణాది స్థితిని గని పెట్టసాధ్యమగును గాని, తొందరపడిన యెడల నిజముగా దెలియక పోవునుగదా! ఆలాగుననే యీ గ్రంథమందు గూడా కొన్ని కొన్ని స్థలములయందు దమ కనిష్టమైయుండిన దంతయు బర్యాలోచించినయెడల మహాయిష్టము గానే యుండును.

జ్ఞానవాసిష్ఠము రీతిగా నీ గ్రంథము జదువుట ఆత్మ జ్ఞానము బొందిన యథారూఢుల కనావశ్యము. ఆలాగుననే జ్ఞాన హీనులైన

కేవలమందమతులకున్ను అనుపయోగము. మరి యెవరి కుపయోగమనగా, అజ్ఞాన మహాదుఃఖమునుండి విముక్తి పొందుటకై ప్రయత్నము చేయు అభ్యాసులకు గొప్ప ప్రయోజనకరమై యుండును. వీరికిది గొప్పరోగికి దివ్యరసాయనము వంటిది. సంసారమహా సాగరమునకు విశాలమైన సేతువువంటిది. రోగము లేనివారికి దివ్యౌషధమైనను నిష్ప్రయోజనము గదా! ఆలాగుననే యసాధ్యమైన రోగికిన్ని అనుపయోగము. సాధ్యమైన రోగికి గదా యౌషధము యొక్క గొప్ప ఫలసిద్ధి గలుగును!

**అహం బద్ధో విముక్తస్స్యామితి యస్యాస్తి నిశ్చయః ।**
**నాత్యంతమజ్ఞో నో తజ్జ్ఞః, సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్ ॥**

నేను సంసారబంధము గలిగియున్నాడను, ఈ మహాబంధమునుండి విమోచనము బొందుదునుగాక! అను నిజమగు తలంపెవ్వనికి గలదో వాడే యీ గ్రంథము జదువుటకు నధికారము గలవాడగును. మరియెవ్వనికి బొత్తిగా జ్ఞానము లేదో యట్టివారున్ను, ఇంకా యెవ్వరు బాగుగా దెలిసిన వారుగా నుందురో యట్టివారున్ను దీని కధికారులు గారు.

ఇంక నీ విషయమై యధికముగా జెప్పనక్కరలేదు గాని, సత్పురుషులైన మహాత్ములయొక్క స్వభావ మసత్తును ద్యజించి సత్తును మాత్రము గ్రహించుటకు స్వతస్సిద్ధమైయున్నది. ఎట్లనగా, జలమును పాలను నొకటిగా చేర్చినను రాజహంసము జలమును ద్యజించి పాలను మాత్రము గ్రహించునట్లును, భ్రమరము (తుమ్మెద) వృక్షమునందుండు ముండ్లు, ఆకులు మొదలైనవి యుపేక్షించి లోపల దూరి పుష్పమధ్యమందుండు మధువును మాత్రము స్వీకరించునట్లు, సజ్జనోత్తములు దీనియందుండు లోపములను వదలి సారమును గ్రహించుటకై కోరెదను. దుర్జనులకు సారమును విసర్జించి దోషమును గ్రహించుట స్వభావమై యున్నది. ఎట్లనగా ఏనుగులు అత్తరు, పన్నీరుతో నభిషేకము జేసి కస్తూరి, కుంకుమ, పచ్చకర్పూరము

మొదలయిన సుగంధ వస్తువులచే నలంకరించినను దానికి నీచమైన మట్టిధూళితో దృప్తిబొందుట స్వభావము. ఆలాగుననే వీథి శునకమునకు క్షీరాన్నాది దివ్యభోజన మిచ్చినను దుర్గంధమైన మలము దినుటకై యిచ్ఛగించును గదా! అట్లే కుబుద్ధులైన కుతర్కవాదులు సారమును వదలి నిస్సారమైన దోషములను గ్రహించు విషయము లోకప్రసిద్ధము. కనుక ఈ విషయమై నేనధికముగా జెప్ప నక్కర లేదు. ఇప్పుడు చెప్పుటకై పూనిన విషయము బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై గురుస్థానము వహించి శిష్యుల ననుగ్రహించు గురువులకు సంబంధించి యున్నది.

ఓ మహాత్ములారా! తమ సన్నిధానమునకు వచ్చు ముముక్షువులలో విషయ వైరాగ్యాది గుణములు సంపూర్ణముగా నున్నవారికి నిర్బంధము జేసి, వివాహము జరిపి, సంసారమందు గొంతకాలముండనిచో మోక్షము బొందుట బహుప్రయాసమని చెప్పకుండుటకై ప్రథమ ప్రార్థన.

మరియు, కొందరి క్ష్టము లేకయే వివాహము జేసిన యెడల నట్టివారు గొంతకాలమందుండి భార్యను విడిచి విరాగులై పోవుట గన్పట్టుచున్నది. భర్తకుండునట్లు వైరాగ్యభక్త్యాది గుణములు భార్యకు లేని కారణముచే కష్టమునకు గారణమగుచున్నది. మరి కొందరికి వైరాగ్యాది గుణములుండినను సంసారము నుండి విముక్తి బొందుటకై బహు విధములుగా కష్టపడుచున్నారు. ఇంక దమలో గొందరి కేదో కారణాంతరముచే గంజాయి, అభిని మొదలైన సత్తు లేని మత్తువస్తువులను జిన్నకాలము నుండి యవలంబించుటచే నిప్పుడు విడుచుటకు గష్టమైన యెడల నాలాటి దుర్వృత్తులు శిష్యులకు నేర్పింపకుండుటకై ద్వితీయ ప్రార్థన.

ఎందుకనగా ననేకులు త్యాగులై గృహము వదలి వచ్చినను నీ లాహిరి వస్తువుల జ్ఞానపత్రియని భావించి యుదయము మొదలు మధ్యాహ్నము వరకు యాచించినను గంజాయికి బూర్తిరాక గష్టపడుచుండు విషయమందరికి తెలిసియే యున్నది. ఈ యొక్క గొప్ప ప్రతిబంధముచే ధ్యాననిష్ఠ

పూర్తికొఱకు గాని, శ్రవణ మననములకు గాని సమయము దొరకక జీవితము వ్యర్థమై పోవుచున్నది. దీనినుండి విముక్తి బొందినయెడల శీఘ్రకాలములో లోక ముచ్ఛస్థానమునకు వచ్చును.

తృతీయ ప్రార్థన యేమనగా, ప్రాణి హింసాది ఆహారము లేకుండునట్లు మీరు ప్రయత్నించినయెడల దానికంటె నొకగొప్ప సహాయము లోకమునకు జేయవలసిన దేదియు లేదు. ఈ మూడు విషయములు ముఖ్యమైనవి.

1. ఇంక నుత్తమ, మధ్యమ, అధమాధికారులను యోచించి కనిపెట్టక అందరకు మొట్టమొదట నమనస్కము బోధించిన యెడల వేరొకగొప్ప యుపకారము లేనే లేదని నా యొక్క దృఢాభిప్రాయమై యున్నది.
2. తైలము లేకయే దీపమెప్పుడు ప్రకాశించునో, జలము లేకయే పైరెప్పుడు పండునో యప్పుడు మాత్రమే జీవకారుణ్యము లేని వారికి పరిపూర్ణజ్ఞానము గలుగునని వీడు నిశ్చయముగా జెప్పుచున్నాడు.
3. కట్ట లేకయే చెఱువునం దేకాలములో జలము నిండుగా నిలుచునో యప్పుడు గదా యింద్రియ నిగ్రహము ( అనగా విషయవిరక్తి) లేని వారికి జ్ఞానము స్థిరముగా గుదురునని నేను దృఢముగా జెప్పువాడను. ఇకమీద జెప్పబోవు విషయము గురు పుత్రులై ఆత్మజ్ఞాన పూర్తికొరకు నభ్యాసము జేయు నా ప్రియసోదరీ సోదరులకు సహాయకారియై యున్నది.

ఆత్మజ్ఞానమనెడు శాశ్వతానంద నిర్వాణ సుఖముకొరకు ప్రయత్నము జేయు నా ప్రియసోదరీ సోదరులారా ! తమ గురుస్వాములలో గొందరు విధి నిషేధము లేకయు, మరికొందరతి వర్ణాశ్రమస్థితియందుండు వారును, ఇంకకొందరు ధారణాధ్యానమునుండి విముక్తులును, కొందరు దావాగ్ని వలె సమస్తమును భక్షించువారుగా నుండగలరు. వారియొక్క యవస్థను దెలియక మీరాలాటి పనులలో ప్రవేశించిన యెడల మీ జన్మము నిరర్థకమగును. మహాత్ములకు నిగ్రహానుగ్రహములను రెండు శక్తులు గలవు. ఇది అందరికిని

సాధ్యము కాదు. గరుత్మంతునికి గొప్ప విషసర్పము సుఖభక్ష్యము గాని తదితర జంతువుల కది ప్రాణహానికర మైయున్నది. హంసపక్షి సముద్రమందు సుఖముగా నివసించును గాని, ఊరకోడి దానియందు ప్రవేశించినయెడల దానికదే ప్రాణాంతకము. కుమ్మరపురుగు బురదయందుండినను దానికి దానియందు సౌఖ్యముగా నుండును గాని, కంబళి పురుగునకు ప్రాణ హానికరము. అట్లే మహాత్ముల మార్గ మపక్వమైన జీవులవలంబించిన యెడల నాశకరమైయున్నది. కావున నాలాటిపనులయందు ప్రవేశింపక తన స్వరూపస్థితిగలుగు పర్యంతము నేకాంతవాసము, మితాహారము, ఆత్మసంయమము, ఆత్మానుసంధానమైన ధ్యానమున్ను వదలగూడదు. ఇదంతయు నెంతకాలము వరకనగా, తనయొక్క యపరోక్షజ్ఞానపర్యంతము జాలును. అప్పుడు నిలువవచ్చును. వడ్లు దంచువా రప్పుడప్పుడును బియ్యమును శోధించి తవుడున్న యెడల మరల దంచునట్లును, అన్నమును వండువా రప్పుడప్పుడొక మెతుకు బట్టిచూచి పక్వములేని యెడల నిప్పు నెక్కువ జేయునట్లును, రత్నము సాన బట్టువాడప్పుడప్పుడు జూచి పూర్ణజ్యోతి పర్యంతము సానరాతియందు బట్టునట్లును, తనకుతానే ప్రాకృతికమైన వికృతులు నశించెనా ? విషయములయందు మనసు పోవుచున్నదా? గురూపదేశ ప్రకారము తనకు పూర్ణత్వము గలిగినదా అని పరిశోధించి లేని యెడల మననినిదిధ్యాసరూపమైన ధ్యానము విడువరాదు. విడిచినవారు పూర్ణస్థితి నొందక భ్రష్టు లగుదురు. బ్రహ్మానంద సుఖము బొందరు. ఎట్లనగా, నవమాసములు బూర్తిగాక ప్రసవించిన శిశువును, పరిపక్వము లేని బీజమును నాటిన వృక్షమున్ను ఎట్లనుపయోగమౌచున్నవో వీరియొక్క గతియు నాలాగుండును. ఈ కారణముచే గొందరు కొంతకాలము ధ్యానము జేయునప్పుడు, కొంత ఆత్మసౌఖ్యమును, గొంత వాచాసిద్ధియును, అనేకులకు గొప్పవాడనను బుద్ధియున్ను గలుగునప్పుడు ధ్యాననిష్ఠను వదలి నేను సర్వజ్ఞుడనైతినని తలంచి మోసపోయి లోక వ్యవహారమునకు దిగి కేవలమైన

హీనస్థితికి వచ్చుచున్నారు. ఎట్లనగా కొండజ్వరము వచ్చువారికి కొయినా మొదలగు మందు దిన్నప్పుడు తత్ క్షణము జ్వరము నిలుచును. వారలింక మీద జ్వరము రాదని తలంచి మందు బుచ్చుకోక పథ్యము విడిచినయెడల కొన్ని దినములలో జ్వరము యథా ప్రకారము పునరావృత్తి యగును గదా! ఆలాగుననే యజ్ఞానమను మహారోగముచే బీడితుడైన వాడాత్మ ధ్యానమను దివ్యౌషధము కొంతకాలము సేవించుచున్నప్పుడు కొంత సౌఖ్యము గలుగును. అంతట ధ్యానము వదలిన వారు పునఃసంసారమందు మగ్నులగు చున్నారు. పూర్ణాపరోక్షజ్ఞాన పర్యంతము ధ్యాననిష్ఠ యందుండువారికి నజ్ఞానము సమూలముగా నాశనమై శాశ్వతానంద సుఖ స్వరూపు లగుదురు. ఆ విధముగానే బుద్ధిమంతులు జ్వరము నిలిచినను గొన్ని రోజు లౌషధము సేవించి పథ్యముగా నుండుటచే నిత్యసుఖ స్వరూపు లగుచున్నారు.

ఓ ప్రియ సోదరీ సోదరులారా! జ్ఞానసిద్ధి బొందువారికి ననేకములైన విఘ్నములు వచ్చును. వాటినంతయు దాటుటకై జగదీశ్వరునియొక్క కరుణా కటాక్ష వీక్షణామృత ప్రవాహము నిండి యుండవలయును. లేనివారికి దాట శక్యము గాదు. దాని కనన్యమైన దైవభక్తి సంపాదింపవలయును.

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥**

ఇట్టి త్రిగుణాత్మికయై దైవ సంబంధమగు నా యొక్క మాయ సాధారణ జనుల కతిక్రమింప సాధ్యము గానే కాదు. కాని నన్నెవరు శరణమని ప్రార్థించి భక్తితో నాశ్రయింతురో యట్టి భక్తులు మాత్ర మిట్టి ఘోరమైన మాయను సులభముగా దాటుదురని భగవద్గీత. కనుక నెవరు తన గురువు నీశ్వరునిగా నమ్మెదురో వారికి మాత్రము మోక్షము దొరుకును గాని, తదితరులకు సాధ్యము గాదని శ్రుతి ఘోషించుచున్నది.

శ్రుతి॥ యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥

ఎవరి కీశ్వరునియందమితమైన భక్తి గలదో, ఆలాగుననే గురువునందు గూడా ఉండునో యట్టి మహాత్మునికి మాత్రము జ్ఞానము ప్రకాశించును గాని తక్కినవారికి గలుగనేరదు. అనగా గురువు వేరు, ఈశ్వరుడు వేరు అను భేదజ్ఞాన ముండగూడదని తాత్పర్యము.

గురువక్త్రే స్థితా విద్యా గురుభక్త్యా చ లభ్యతే ।
త్రైలోక్యే స్ఫుటవక్తారో దేవర్షిపితృమానవాః ॥

బ్రహ్మవిద్య గురుముఖమునందు స్థిరముగా నున్నది. అది వారియందమితమైన భక్తిచే లభ్యమగును. కాని మరియొక్క విధముచే దొరకదని మూడులోకములలో దేవర్షి పితృ మానవులు స్పష్టముగా జెప్పుచున్నారు.

కావున, ఆర్యోత్తములారా ! గురువునందును, ఈశ్వరునియందును అనన్య భక్తిగలవారై యీ జనన మరణ మహా దుఃఖకరమగు ఘోరసంసార సాగరమును సుఖముగా దాటుదురు గాక !

ఇక మీద జెప్పుటకు ప్రారంభించు విషయము మత్ప్రియ సోదరీ సోదరులై, గురూపదేశము కొఱకు వెదకుచుండు జిజ్ఞాసులైన ముముక్షువులకు శ్రేయస్కరముగా నుండునది.

నాయనలారా ! ఇక్కాలమందు గురువు లనేకు లుండినప్పటికిన్ని వారిని బాగుగా శోధించి మాత్రము దగ్గర జేరవలయును. లేనియెడల దుఃఖమునకు బాత్రులగుదురు.

గురవో బహవస్సంతి శిష్యవిత్తాపహారకాః ।
తమేకం దుర్లభం మన్యే శిష్యహృత్తాపహారకమ్ ॥

శిష్యుల విత్తాపహారముకొఱకు గురుస్వాములు చాలమంది గలరు గాని, శిష్యుని హృత్తాపము బోగొట్టి జ్ఞానానందము నిచ్చు గురువు నిండా దుర్లభమని కరుణామయుండగు పరమేశ్వరుం డాదికాలమున గురుగీతయందు జెప్పినాడు. కావున ముముక్షువులారా ! గురువును బాగా యోచించి దగ్గర

చేరుదురు గాక! అవసరపడవద్దు. లేనియెడల మీకిప్పుడున్న భక్తి, వైరాగ్యాది సద్గుణములు కూడా నశించిపోవును. ఇప్పుడున్న గురువులలో గొందరు శిశ్నోదరపోషణ పరాయణులై రాజయోగులమని చెప్పువారు, మరికొందరు, వికల్పమైన గంజాయిని ( బంగిపత్రిని) కల్పమని చెప్పువారు, మరికొందరు చిత్తభ్రమము జేయు అభిని మనోనిగ్రహమని వాదించువారు, ఇంక కొందరు నిస్సారమైన సారాయి అమృతపానమని నమ్మువారు, మరి కొందరు మాంసము దేహపోషణమని తలంచువారు, మరికొంద రంతయున్ను చేయవచ్చును. ఆత్మ యేమియు జేయువాడు కాడు, ఇంద్రియము లాయాపనులు జేయుచున్నవని పలికి నిషిద్ధకృత్యవముల జేయుపాపులు- ఇట్లున్న వారందరున్ను బాధగురువులుగాని బోధ గురువులెప్పటికి గారని నేను జెప్పువాడను. ఇటువంటి శుష్కవేదాంతుల దగ్గర జేరక భక్తితో సర్వజీవరాసుల యందు గారుణ్యము గలవారై, హృదయకమలమందు గురోర్గురువై కరుణానిధియైన పరమేశ్వరుని ధ్యానించిన యెడల మీకు దర్శనమిచ్చి యుపదేశము జేయును. ఇది సత్యము. లేక తగిన సద్గురుని తటస్థించునట్లు జేయుచు భక్తులను గృతార్థులను జేయును. లేక స్వప్న రూపముతోనైన నుపదేశించును.

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే ॥**

ఎవ్వరు భగవంతుని నమ్మి పరమాత్మయందాసక్తి గలవారై ప్రీతి పూర్వకముగా భజింతురో యట్టివారికి దన్ను ప్రాప్తించుటకై యేయే యుపాయము గలదో యట్టిమార్గము నేను ప్రత్యక్ష రూపముచేగాని, లేక యే విధముగానైనను బోధించుచున్నాను అని శ్రీభగవద్గీత యందు శ్రీకృష్ణభగవానులు సెలవిచ్చియున్నారు. కనుక నొక్కరు గురువును స్వీకరించునపుడు బంగారు పనివాడేలాగున సువర్ణమును బరీక్షించి దానిలో సంశయముండిన వరపువేసి చూచునో, ఇంకను సంశయమున్న యెడల సుత్తితో గొట్టి శోధించునో, మరియు సందేహముండిన గరిగించి చూచినప్పుడు నిజము దెలుసుకొనునో, ఆలాగుననే యొక్కరిని చతుర్విధములుగా

బరిశీలించిన ధన్యు లేర్పడుదురు. అనగా వారివచనములు శాంతమై సత్యమై స్వానుభవమైయున్నవా ? వారింద్రియాది సుఖములందు రమించువారా ? లేక, ఆత్మారాములై యున్నారా ? వారి యాహారాది దినచర్యలు సాత్త్వికమై, మితమైయున్నవా ? వారు జేయు పనులు స్వార్థమునకా ? లేక లోకోపకారము కొరకా ? అని నాలుగు విధములుగా బరిశీలించవలెను. లేనిచో బంగారమని భ్రమించి గిల్టునగల గొనిన వారివలె కష్టమునకు బాత్రు లగుదురు. ఒక్కరు ధన్యాత్ములై యుండిన నట్టి వారింద్రియ సుఖమందు రమింపరు. సమస్త జీవరాసులను దనవలెనె చూతురు. చేయుపనియంతయు లోకోపకారమై యుండును. శత్రు మిత్ర భేదములు కనబడవు. తన వస్తువులు పోయినను దుఃఖింపరు. అన్య వస్తువుల కాశింపరు. దయాస్వరూపులై యుందురు. ప్రాకృత పురుష సంఘమం దుండుట కిష్టపడరు. మృదు మధుర వచనములు వచింతురు. ఈలాగున ననేక సద్గుణములున్నవారు చండాలజాతివారు గాని, స్త్రీగాని యుండినట్లైన వేదబ్రాహ్మణుడు కూడ వారినుండియుపదేశము బొందవచ్చును. ''చండాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ'' అని శ్రీ శంకరభగవత్ పాదాచార్యులు మనీషా పంచకమందు జెప్పియున్నారు, ''అంత్యాదపి పరం ధర్మం'' అని మనువు. ఇట్లున్న వారిని సాక్షాత్ భగవత్స్వరూపులుగా నెంచవలయును.

వారికి లోకమందుండు విద్వత్తు లేనప్పటికిని విరోధము లేదు. వారి మాటలంతయు వేదవచనములుగా నుండును. వారి దర్శనముచే సకల పాపములు నశించును. ధర్మార్థ కామ మోక్షములైన చతుర్విధ పురుషార్థములు సులభముగా జేకూరును. అట్లున్న వారి కీశ్వరుడు గూడ భృత్యునివలె వారి కార్యము పూర్తి కొఱకు పాటుపడును. ఇది నిజము.

ఇట్లు తమ ప్రియసోదరుండయిన చరాచర సుఖాభిలాషియగు,

శ్రీ మలయాళస్వామి.

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.



ఓమ్

# విజ్ఞాపనము★



ఓ పరమపవిత్రులగు ప్రియసోదరీ సోదరులారా! ''శుష్కవేదాంత తమో భాస్కరము'' మొదటి కూర్పు, రెండవ కూర్పు, మూడవ కూర్పు, నాలుగవ కూర్పు త్వరలో ఖర్చయిపోయిన కారణము చేతను, అనేకులాపుస్తకము నడుగుట చేతను దైవకృపవలన అయిదవ కూర్పు ప్రచురించుటకై సంగతి గలిగినది. మొదటి రెండవ మూడవ నాలుగవ కూర్పులలో గలిగియుండు లోపములు సాధ్యమైనంత సవరింపబడినవి. ఐనను దీనిలోగూడ ననేకలోపములు గలిగియుండునని నేను దృఢముగా నమ్ముచున్నాను. ఆ తప్పులు నా కాంధ్రభాషా పరిజ్ఞానము లేనందునను, బుద్ధిశక్తి పూర్ణముగా లేనందున గలిగియున్నవి. కావున చదువరులగు బుద్ధిశాలురు దీనిని సవరించి చదువుటకు, అర్థము వ్యక్తముగా గ్రహించుట కొరకు ప్రార్థింతును. గంగానది వక్రగామియై ప్రవహించినను, పావనత్వమునకు హాని లేనట్లు శబ్దలోపములు గలిగినను, అర్థమునకు హాని లేదని నమ్మినాను. మరియు జదువరులు నిండా శ్రద్ధ వహించి పొరపాటులన్నియు గనిపెట్టి, ఆయా పేజీలను గుర్తుపెట్టి, యే యే విషయము లద్వైత శాస్త్రమునకు సరికానివో వానిని మాకు వ్రాయుటకై ఆశించుచున్నాము. ఆలాగున వ్రాసిపంపువార్లకు మేము సర్వదా కృతజ్ఞులమై మరల ప్రచురించునప్పుడు, దానిని విచారముజేసి పుస్తకమున జేర్చుకొని యచ్చువేయుటకై కుతూహల హృదయము

---

★ ఇది ఈ గ్రంథము యొక్క ఐదవ ముద్రణమునకు శ్రీవారు వ్రాసినది. ఆ తరువాత ఈ గ్రంథము పలుసార్లు ముద్రింపబడి బహుళ ప్రచారము నొందినది. (సం.)

గలవారము. మరియు, ఈ పుస్తకము వ్రాసినది యొక్క మతమునుగాని, ఒక్క దైవ భక్తునిగాని దూషించుకొఱకునను, మరియొక్క మతమునను భూషించుకొఱకునను గాదు. దీనియందు వ్రాసిన విషయములు నా హృదయమున నప్పుడప్పు డుదయించిన సంగతులు. దానిని కొందరు ముముక్షువు లచ్చువేసినదే గాని, నాకు గ్రంథము వ్రాయుటకు దగువగు విద్య కాని, బుద్ధిశక్తి కాని, యోగబలము గాని, లేవు. కాని సర్వశక్తుడగు భగవదనుగ్రహముగాని, సద్గురు కృపగాని యుండినచో నాకన్న నెంతో జిన్నవాడు గూడ నెంతో గొప్పపని సులభముగా జేయగలడు. మరియు, ఇప్పుడుండు ముముక్షువులలో కొందరు నిత్యసుఖము నెరుంగక ప్రాణిహింసచేయుటయు, గంజాయి త్రాగి చెడిపోవుటం జూచి నా హృదయంమము నిండా దుఃఖించుచున్నది. ఎట్లన, బ్రహ్మనిష్ఠుడగు ఒక్క బ్రాహ్మణునకు నలుగురు పుత్రులుండి ఒక్కడు జాతిభ్రష్టుడై నీచమగు మద్యమాంసాదులను భుజించుటయు, గంజాయి త్రాగి మతిచెడిపోవుటయుం జూచునప్పుడు తక్కిన సోదరులెంత దుఃఖించుదురో, ఆలాగున నిత్యశుద్ధ ముక్తులగు మహర్షుల పరంపరగా వచ్చుచుండు ఈ బ్రహ్మవిద్యా విచారకులలో చండాలుడు కూడా చేయుటకై సంశయించుచు భయపడి యుండు ప్రాణిహింసాది భక్షణమున్ను, మత్తువస్తువులచే నిజబోధ మరచియుండెడు వారలంజూచి సహింపరాని సంకటము కలుగుటచే నీ గ్రంథము నచ్చు వేయించినాము. ఏమన నేను పరిశుద్ధబోధస్వరూపులై సంసారపార దృక్కులగు సాధువుల కనుగామినై యుండుటచే వారికి సోదరుడనైతిని. నేనేదైన అపచారము చేసియుండినచో సహస్రావర్తి క్షమింతురు గాక ! కాని, నేను ప్రాణముండు వరకును ఈలాటి దుర్వృత్తులు కూడనే కూడదనియు, అది పైశాచిక కృత్యమనియు, శాస్త్ర నిషిద్ధమనియు, మోక్ష ప్రతిబంధమనియు చెప్పుట

మాత్రము మానను. అట్లు చెప్పుచుండినచో ఒక్కడైనను బుద్ధిమంతుడు గ్రహింపకుండునా ? మరియు రాబోయెడి ముముక్షువులు సన్మార్గమున నడచుకొని, శాశ్వతసుఖమగు మోక్షము నొందగలరు. ఇంకొక్కమాట జెప్పకుండుట కొరకై నామనస్సొప్పలేదు. అది యేమన ఆది కాలమున సంసారమందుండి, అనేక స్త్రీ పురుషులు రాజయోగావలంబులై ముక్తినొందిన సంగతి సత్యము. అప్పుడు వారు సంసారమందున్నను సాక్షాదృషిచర్యలతో కూడియుండు వారలు. ఇప్పుడున్న వారలు ఆ పరిశుద్ధ మార్గమునకు ఎన్నియో యోజనముల దూరముగా నడుచుచున్నారు. ఈ సంగతి మాత్రము సర్వదా గమనించుదురు గాక !

ఇట్లు
తమ చరాచర సుఖాభిలాషియగు,
శ్రీ మలయాళస్వామి





# శ్రీ శుష్క వేదాంత తమోభాస్కరము

## ప్రథమ పాదము

## మంగళము

ఓం ఓం ఓంకారరూపం త్ర్యహమితి చ పరం
యత్స్వరూపం తురీయం
త్రైగుణ్యాతీతనీలం కలయతి మనస-
స్తేజ సింధూరమూర్తిమ్ ।
యోగీన్ద్రా బ్రహ్మరన్ధ్రే సకలగుణమయం
శ్రీహరేన్ద్రేణ సంగం
గంగంగంగం గణేశం గజముఖమభితో
వ్యాపకం చిన్తయన్తి ॥

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఓం నమో దేవదేవాయ లోకానాం సిద్ధిహేతవే ।
సచ్చిదానందరూపాయ శివాయ పరమాత్మనే ॥

పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రపన్న పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥

అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।
సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణే నమః ॥

ఓం బ్రహ్మణే మూర్తిమతే శ్రితానాం శుద్ధిహేతవే ।
నారాయణయతీంద్రాయ తస్మై శ్రీగురవే నమః ॥

మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥

## గ్రంథారంభము

అధ్యాత్మధ్యానమందు మగ్నులై, శాంతులై, దాంతులై, ఏకాంతమందు బ్రహ్మనిష్ఠయందున్న వారైన శ్రీ మలయాళస్వాములవారికి వినయ భక్తితో సాష్టాంగ నమస్కారము సమర్పించి శివప్రసాదైన నేను చిన్నగా అడిగినాను.

ప్రశ్న॥ ఓమహాత్మా! అజ్ఞానాంధకారమయమ్మైన ఘోరసంసారారణ్యమందు తాపత్రయాగ్నిచే దహింపబడు నన్ను భవదీయకరుణా కటాక్ష వీక్షణామృతమయమ్మైన శీతలవర్షముచే జల్లార్చి శాశ్వతానంద మోక్షసుఖము నొసగుమని గద్గదస్వరముతో వేడుకొంటిని.

ఈ ప్రశ్నకు ధ్యాననిష్ఠయందున్న వారై చిత్రపు బొమ్మవలె నుండిరే గాని వారు ప్రత్యుత్తర మేమియు వచింపలేదు. కొంచెము నిదానించి పునః ప్రశ్న జేసితిని. ఓ పుణ్యపురుషా ! తమబోటి మహాత్ములు మాత్రము శాశ్వతానంద నిర్వాణసుఖము ననుభవించి మౌనమందుండిన మాబోటి సంసారసాగరమందు మునిగి నాశము నొందు వారెవరి కరుణ యను పడవనెక్కి మోక్షమను దరి జేరగలరు?

ఉత్తరము ॥ ఓ పరమపవిత్రుడవైన ప్రియసోదరా ! నీ ప్రశ్నకు తగిన యుత్తరము నిచ్చుచునే యున్నాను గాని నీవు దానిని తెలుసుకొనజాలకుంటివి

అని చెప్పి మందహాసముతో మధురమై మృదువైన వచనముల నర్థగాంభీర్యముతో నిట్లనిరి.

ఓ నిర్మలహృదయముగల బాలుడా! పవిత్రమైన యేకాంత స్థలమునందు మనోవాక్కాయేంద్రియముల సంయమము జేసి యేకాగ్రచిత్తుడవై, మౌనివై, స్వస్వరూపధ్యాన మందు స్థిరముగా నిలుచుటయే పరమపురుషార్థమైన మోక్షసామ్రాజ్య శాశ్వతానంద సౌఖ్యమని తెలిసికొనవా ?

ఈ బ్రహ్మజ్ఞానామృతము గ్రోలుటకై యిక్కాలమందుండు అనేక స్త్రీ పురుషులైన ముముక్షువులు ప్రయత్నము జేయుచున్నప్పటికిని విషయవైరాగ్య మొకటి మాత్రము సంపూర్ణముగా లేని కారణముచే విషయానందమందు మగ్నులై నిష్ప్రయోజనజన్మము గలవారగుచున్నారు. ప్రస్తుత కాలోచితమైన నీయొక్క ప్రశ్న అత్యంతోపకారకమై యున్నది. కనుక సంతసించితిని. ఈ దివ్యపదవిని బొందువారు సమస్తవిషయవాసనలు అను మనోవృత్తులు నశించి శరత్కాలమందు వదలిపోయిన మేఘముచే నిర్మలాకాశమువలె పరిశుద్ధమైన హృదయమును, అనేక జన్మములలో జేసిన యనన్య భక్తిచే కరుణానిధియైన పరమేశ్వరుని అపారమైన కరుణయున్ను, బహుకాలము సద్గురుసేవ చతుర్విధములుగా జేసి శమదమాది గుణములు గలిగి శ్రీగురుకరుణాకటాక్షవీక్షణామృత ప్రవాహమున్ను పొందియుండవలయునని మదీయాచార్యులైన తపోనిధులు చెప్పియున్నారు. ఇది శ్రుతి సమ్మతమైయున్నది.

**శ్రుతి ॥ బుద్ధిప్రసాదాచ్చ శివప్రసాదా ద్గురుప్రసాదాత్పురుషస్య ముక్తిః॥** దీని అర్థము పైచెప్పినదే.

---

## సంసార విముక్తి మార్గము

ప్రశ్న ॥ మనోనిర్మలత్వము, దైవానుగ్రహము, సద్గురుకరుణయు - ఈ మూడును నొక్కకాలమం దొక్కరు పొందుటకు సాధ్యమౌనా ?

ఉత్తరము ॥ వాస్తవమే. ఈ మూడును లేనివారికి మోక్షము లేదే ! ఒక్క సమయమున పొందుట దుర్లభము గాని, ఒక్కొక్కదానిని సంపాదించి

పరిపూర్ణుడు గావలయును. ఈ కారణముచే మోక్షమార్గమందు మృదు, మ
తీవ్రములను ( ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారులను) మూడు తరగ
మహర్షులచే నేర్పరుపబడినవి.

1. మృదువనగా నొకరు అధికసమయము ప్రవృత్తి మార్గమందుండి సన్యా
యప్పుడప్పుడు మాత్రము సాధుసంసర్గము, ఆత్మవిచారముతో
యుండిన ప్రపంచ విషయము వదులుట కష్టముగా దోచును.
భగవద్గీతయందు జెప్పినరీతిగా నిష్కామకర్మము శ్రద్ధాభక్తులతో జేసి
మనో నిర్మలత్వము గలుగును.

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**

యజ్ఞము, దానము, తపస్సు, వ్రతము, యోగాభ్యాసము మొ
శ్రద్ధాభక్తులతో సంపూర్ణముగా జేయవలయును. ఒకప్పుడును త్యజింప
ఈ కర్మలనంతయు నీశ్వరార్పణ బుద్ధిచే జేయుచు రాగారాగా
పాపకర్మములును నశించి మనోనైర్మల్యము గలుగును. ఈ శ్రీకృష్ణస్వామి వ
మరువరాదు. ఈ విషయమై కరుణామూర్తియైన శ్రీజగద్గురు శంకరపాదాచా
ఆత్మబోధయందు మొట్టమొదటనే యీ శ్లోకమును జెప్పిరి.

**తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణామ్।**
**ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే ॥**

శాస్త్రోక్తములైన జప, పూజా, ధ్యాన, తపము లీశ్వరార్పణబ
శ్రద్ధాభక్తులతో జేయునప్పుడు, సమస్తపాపములు నశించి, ప్రకృతి విక
క్షయించి, నిర్మలహృదయులై పరమశాంతు లగుదురు. తదుపరి రాగద్వేష
నశించి విషయవిరక్తి గలిగి వైరాగ్యమును బొందుదురు. త
నిత్యానిత్యవస్తువివేకముదయమై యనిత్యములైన దేహ, ధన, పుత్ర, దారాద
తుచ్ఛబుద్ధి గలిగి మోక్షమందు తీవ్రతరవిచారము గలుగును. అట్లు

లేనివారికి మనః పారిశుద్ధ్యము రాదు. మనోనైర్మల్యము లేనివారికి శాంతి కలుగనేరదు. శాంతి లేనప్పుడు రాగద్వేషములును, అరిషడ్వర్గములును నశింపవు. అరిషడ్వర్గము క్షయము నొందనివారికి మోక్షావస్థ దుర్లభము.

2. మందమనగా విషయసుఖమందు పూర్ణనిరాశ కలుగకనే మోక్షమున కధికమైన యభిలాష గల్గియుండుట. అట్టివాడు ధర్మముతో గూడుకొని సంసారమం దర్ధసమయమును, అర్ధసమయమీశ్వరధ్యాన సాధుసేవలలో గడుపును. వీనికి యజ్ఞవ్రతాది కార్యముల జేయ నవసరము లేదు. ఈశ్వరోపాసన మాత్రము దప్పక యుండవలయును. (జప ధ్యాన మితాహారములు) వీనికి శ్రీ గీతయందు, 7అ. 14 వ శ్లోకమున జెప్పిన రీతిగా, అనన్యభక్తి మాత్రము చాలును. శ్రీ శంకర భగవత్పాదాచార్యులు, అపరోక్షానుభూతిలో జెప్పిన రీతిగా,

**నిత్యాభ్యాసాదృతే ప్రాప్తి ర్నభవేత్సచ్చిదాత్మనః ।**
**తస్మాద్బ్రహ్మ నిదిధ్యాసో జిజ్ఞాసుశ్రేయసే చిరమ్ ॥**

నిత్యము పరబ్రహ్మధ్యాన మనన్యచింతతో జేయనివానికి బ్రహ్మపద మందదు. కావున జిజ్ఞాసువు మోక్షసుఖము కొఱకు సర్వదా, సర్వావస్థలయందు, పరబ్రహ్మధ్యాన నిష్ఠయందుండవలయును. ఈలాగుననే వాసిష్ఠమందు గూడా చెప్పియున్నది.

**యావన్నానుగ్రహస్సాక్షా జ్జాయతే పరమేశ్వరాత్ ।**
**తావన్న సద్గురుం కశ్చి త్సచ్ఛాస్త్రం వాఽపి నో లభేత్ ॥**

ఎంతకాలమువరకు సాక్షాజ్జగదీశ్వరుని యనుగ్రహము సంపూర్ణముగా గలుగలేదో, అంతవరకు వీనికి ఉత్తముడైన గురువు గాని, సారమైన గ్రంథము గాని దొరకదు. ఈ కారణముచే కరుణాసముద్రుడైన భగవంతుని ప్రీతి కొఱకు భజన చేయవలయును.

3. ఇకతీవ్ర మార్గము, లేక యుత్తమాధికారి లక్షణము. వీరు జన్మనా విరక్తులై పూర్వజన్మ సంస్కారశక్తిచే మల, అజ్ఞాన రహితులై, శుక వామదేవాదులవలె ప్రపంచవాంఛాశూన్యులై యుందురు. వీరికి యజ్ఞ, దాన, తపః, కర్మ, భక్తుల

జేయవలెనని నిర్బంధము లేదు. వీరు తత్త్వమస్యాది మహావాక్య శ్రవణ, మనన, నిదిధ్యాసనముల జేయవలయును.

**పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః ।**
**గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥**

పైన జెప్పినవిషయము లెస్సగా జేసినవారి హృదయము దూదివలె పవిత్రమైయుండును. వీరికి శీఘ్రముగ నాత్మసిద్ధి గలుగును. అగ్ని ప్రవేశించినప్పుడు దూది యేలాగున భస్మమగుచున్నదో, ఆలాగుననే గురూపదేశ సమయమందు హృదయగ్రంథులు నశించి స్వరూపసిద్ధి గలుగును. పరిపక్వ హృదయము గలవారికి స్వయముగా నీ రాజయోగ అమనస్కము గలుగును. ఆలాగుననే గురువునందును, దైవమందును భక్తిగల సకలమనుజులకును ప్రయాసములేకయే త్వరలో నాత్మసిద్ధి గలుగును అని అపరోక్షానుభూతి. వీరు కొంతకాలము జనబాహుళ్యము లేని నిర్మలస్థలమందుండి ప్రణవ మంత్రమును మాత్ర మాత్మానుసంధానముగా ధ్యానము జేయవలయును. అనగా నేను పంచకోశ విలక్షణుడను, అవస్థాత్రయ సాక్షిని, దేహత్రయాతీతుడను, నిత్య శుద్ధ బుద్ధ ముక్తుడై, ఓంకార వాచ్యుడైన పరమాత్మ శుద్ధ శివస్వరూపుడ నేనని ధ్యానించునప్పుడు మల, అజ్ఞాన, విక్షేపములను హృదయగ్రంథులు భేదించి మేఘము వదలిన సూర్యునివలె స్వయముగా స్వస్వరూపస్థితి గలుగును.

**శ్రుతి ॥ శివోఽన్యస్త్వహమేవాన్యః పృథగ్భావం వివర్జయేత్ ।**
**యశ్శివస్సోఽహమేవేతి చాద్వైతం భావయేత్సదా ॥**

శివస్వరూపమైన పరమాత్మ వేరు, జీవుడనైన నేను వేరు అను పృథగ్భావమును విడిచి యేయొక్క శివస్వరూపముండునో, అదే నేనను అద్వైతచింత జేయవలయును.

**శ్రుతి ॥ యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

ఎవని హృదయమందున్న సమస్తకామములు నశించి, ఆత్మధ్యానమందు

స్థిరత్వము గలుగునో, వాడు శరీరముతో గూడియుండినను పరబ్రహ్మస్వరూపుడే (అనగా దేహముతో గూడి జీవించి యున్నప్పటికిని ముక్తుడే ! )

---

## అధికారి లక్షణము

1. ఉత్తమాధికారి దూదివలె నిర్మలుడైయుండును. మాయామయమైన సమస్తవిషయ వాసనలు బహుజన్మయోగధ్యాన తపములచే నశించినవి. కనుక వానికి ఈ జన్మమందు గురూపదేశసమయమున సద్యోముక్తి గలుగును. ఎట్లనగా, దూది యగ్ని స్పర్శచే భస్మమగునట్లు, వీని యజ్ఞానము సమూలముగా నశించును.

2. మధ్యమాధికారి యెండిన కట్టెలవలె నుండును. వాటియందగ్ని ప్రవేశించినను గొంచముసేపూదినయెడల నగ్ని జ్వలించునట్లు వీనికి యోగ, ధ్యాన, శ్రవణ, మనన, నిదిధ్యాసనములు కొంత కాలముండవలయును. అప్పుడు వాడును కృతార్థుడగును.

3. కనిష్ఠాధికారి నులి కట్టెలవలె నుండును. వీటిని యెండబెట్టనిదే జ్వలింపవు గదా? అలాగుననే వీడు జప, ధ్యాన, తపో, వ్రతము లీశ్వరార్పణబుద్ధితో దప్పక జేయువలయును. అప్పుడు వీడున్ను ఈశ్వరానుగ్రహముచే ధన్యుడగును. ఈ ముగ్గురికి నితాంతాపార భూతదయ హృదయమందు నిండియుండవలయును. లేనియెడల తపో, ధ్యానయోగములంతయు వ్యర్థమగును. ఏలయనగా, తైలములేని దీపమును, జలములేని సస్యములును ఎట్లు నిష్ఫలమగునో, ఆ రీతిగా వీరి ప్రయత్నమంతయు నిష్ప్రయోజనము.

ప్రశ్న ॥ అయ్యా స్వామీ ! ఇప్పుడు కొందఱు రాజయోగులు గురుపూజ మొదలైన పవిత్ర కార్యములయందు జీవహింస జరుపుటయే గాక సమస్త వస్తువులను దినవచ్చును, జీవుడు హింసింపబడువాడు గాడు, దాని మాంసము మాత్రము దినుటకు విరోధము లేదని శిష్యులకు బోధించునప్పుడు తమరు జెప్పినరీతి భూతదయ వీరికెచ్చట నున్నది ?

ఉత్తరము॥ ఆహా ! ఘోరకృత్యము. ఈ మాట వినుటకే సాధ్యము

కాదే; అయ్యయ్యో యిట్లుకూడ గలదా ? మహా పాపకృత్యమే. పవిత్రమైన రాజయోగి యని చెప్పుచున్నావే. సాధారణ సంసారమందున్న గృహస్థులు గూడ ఈ భయంకర కృత్యమునకు భయపడకుందురా ? గృహస్థాశ్రమమందుండు, ఎందరో పుణ్యాత్ములు శాంతులై, దైవభక్తిపరులై, జీవకారుణ్య దయాస్వరూపులై యున్నారు. అట్లున్న స్థితిలో దివ్యమైన రాజయోగి యని పేరు వహించిన పుణ్యాత్ములలో నీ విపరీతకృత్యము జరుగునా ? జరుగుచుండిన శుష్కవేదాంతులని వారిని వేదాంతరహస్య మెరిగిన పెద్దలు జెప్పుదురు. ఆ దురాచారకృత్యము జేయువారికి రాజభోగి యని గాని, లేక రాగ రోగి యని గాని, లేక రాక్షసభోగి యని గాని నామకరణము జేయవలయునే గాని దేవతలచే స్తుత్యర్హులైన రాజయోగులని చెప్పవచ్చునా !

## అహింస

ప్రశ్న :- భేదాభేదము లేకయే సమస్తమును భుజించువారు గదా పెద్దలు ?

ఉత్తరము ॥ భేదాభేదములయొక్క యర్థ మపారమై యున్నది. మాంసాది వస్తువుల భుజించెడి గద్దలకు గాదు సుమా ? అనగా శవమును దిను జంతువులు గద్దలు గాని పెద్దలు గారు. ఈ పెద్దలకంటె గద్దలే మేలు. ఏమన గద్దలు నీచ జంతువులౌటచే వాటికి స్వభావసిద్ధమైన నీచాహారముల దినుటలో నేయాక్షేపణ లేకుండెను. మనుజులు శ్రేష్ఠులైనందున శుద్ధాహారమున కన్యములైనవి, స్వభావ విరుద్ధమగును; గనుక వీరికంటె యవియే మేలు. ఇట్లున్న వారికి గద్దలని నామధేయ మిడిన గాని లోకమందు రాబోవు అనేక పుణ్యాత్ములైన ముముక్షువుల వైరాగ్య భక్తిజ్ఞానములకు హాని రాకుండును. ఈ హింస విషయమై వేదశాస్త్రమం దేమి చెప్పియున్నదని కొంచెము యోచింతము.

శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రన్థకోటిభిః।
**దయాసమం నాస్తి పుణ్యం పాపం హింసాసమం న హి ॥**

నేనర్ధ శ్లోకముచే కోట్లకొలది గల వేదశాస్త్రములసారమును జెప్పెదను. భూతదయకు సమమైన పుణ్యమును లేదు. ప్రాణి పీడనముకంటె గొప్పపాతకము లేదని శ్రీనారదమహర్షి యభిప్రాయము. ఈ ఘోర కృత్యమైన ప్రాణిహింస

నిలుపుటకై శ్రీభగవానుడు బుద్ధావతారమెత్తెను. ''అహింసా పరమో ధర్మః'' అని భేరిని ఘోషించి ప్రాణిహింసయైన యజ్ఞాదికర్మములను వినాశము జేసి, జీవహింసాది మతములను ఖండించి, సర్వజనులను సహోదరభావముగా నుండునటుల ప్రత్యక్షముగా ననుష్ఠించి శాశ్వతానంద నిర్వాణసుఖమును బోధించిన దయాసముద్రుడు శ్రీబుద్ధదేవుడు. వీరి చరిత్ర మొకతూరి జదివిన వారికి మరియొకటి ఇంత పవిత్రమైన దేదియు లేదు. ఇప్పుడు లోకమందుండు జనసంఖ్యవెుత్తములుగా నాలుగింట మూడు భాగములు శ్రీ బుద్ధ మతావలంబులే. వీరధికముగా జపాన్, చైనా, టిబెట్, బర్మా, సిలోన్ మొదలైన యనేక దేశములలో వ్యాపించియున్నారు.

అహింస యనగా,

**కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా ।**
**అక్లేశజననం ప్రోక్తా త్వహింసా పరమర్షిభిః ॥**

మనస్సుచేతను, కర్మముచేతను, వాక్యముచేతను సర్వకాల సర్వావస్థలయందొక ప్రాణికైనను క్లేశము గలుగజేయకుండునది యహింసయని మహాత్ములైన మహర్షులచే జెప్పబడినది. అనగా కఠోరమైన మాటలచే గష్టమును, మనసుచే పరద్రోహవిచారమును, కరములచే జేయు దుష్క్రియలచే దుఃఖమును గలుగ జేయకుండుటయే అహింసయను ముఖ్య ధర్మమని శ్రుతులు చెప్పుచున్నవి.

**అహింసా పరమో ధర్మః అహింసా పరమం తపః ।**
**అహింసా పరమం దానమిత్యూచుర్మునయ స్తథా ॥**

అహింసకు సమమైన ధర్మమును లేదు. అహింసకు సరియైన తపమును లేదు. అహింసకు సమమైన గొప్పదానమును లేదని తపోధనులైన మునిశ్రేష్ఠులు చెప్పియున్నారు. అనగా, అనేక యజ్ఞాది క్రతువులును, కృచ్ఛ్రచాంద్రాయణాది ఘోరతపములును, అన్నదానాది షోడశమహాదానములును, తీర్థయాత్రాది పుణ్యకర్మములును అనేకముగా జేసినవాడైనను, అహింస యను గొప్పగుణము లేనియెడల, అవియన్నియు బూడిదయందు హోమించిన హవిస్సువలె నిష్ప్రయోజనము.

**ప్రవిశంతి యథా నద్య స్సముద్రం ఋజువక్రగాః ।**
**సర్వే ధర్మా అహింసాయాం ప్రవిశంతి తథా దృఢమ్ ॥**

ఏలాగున సమస్తమైన నదులు, కాలువలు, ఋజువక్రములై సముద్రమందు జేరుచున్నవో అలాగుననే సమస్తమైన ధర్మములును, అహింసయను దయాసముద్రమందు జేరుచున్నవి, ఇది నిశ్చయము. అనగా జీవకారుణ్యవ్రత మెవరికి గలదో వారి కితరమైన తపము, దానములు, వ్రతములు, తీర్థయాత్రలు యోగాభ్యాసము లేవియు బనిలేదు.

**సర్వ యజ్ఞేషు యద్దానం సర్వతీర్థేషు యత్ఫలమ్ ।**
**సర్వదానఫలం వాపి తన్న తుల్యమహింసయా ॥**

అశ్వమేధాది యాగములయందు ఏ దానఫలము గలదో, సప్తసాగరతీర్థ స్నానఫలమేది గలదో, గోదానాదిషోడశ మహాదానములచే నేఫలము గలదో, అది యంతయు అహింసయొక్క కోటిఫలములలో నొక్క భాగము గానేరదు.

**అహింసా పరమో ధర్మ స్త్వధర్మః ప్రాణినాం వధః ॥**

అహింసకంటె శ్రేష్ఠమైన ధర్మము లేదు. హింసకన్న వేరే యధర్మము లేదు.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥**

ఓ యర్జునా ! ఏ పుణ్యాత్ముండు సమస్తభూతముల యొక్క సుఖదుఃఖములు తన సుఖదుఃఖములుగా జూచునో, అట్టి యోగి యందరిలో నాకెక్కువ ప్రియు డగుచున్నాడు. ఇది నానిశ్చయాభిప్రాయము. అనగా తన శరీరమునకు బాధ యెట్లు గష్టముగా నుండునో, ఆలాగుననే సమస్త జీవరాసులకు బాధ కష్టముగా నుండునని తెలియవలయును.

**సూ॥ అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ।**

ఎవరి హృదయమందహింసాధర్మము స్థిరముగా నున్నదో వారి సన్నిధియందు ఘోరమైన పులులు, సింహములు, సర్పములు మొదలైన క్రూరజంతువులు కూడ వైరము విడిచి యాటలాడును.

విశేషార్థము॥ తమవలె సమస్త జంతువులను జూచువారికి ఏ యొక్క జీవరాసులు ఉపద్రవము జేయకుండును. భూత, ప్రేత, పిశాచ, కాళీ, భేతాళాది భూతగణములును, యమదూతలు సహితము ప్రేమతో స్నేహింతురు.

ఈ కారణముచే పూర్వ ఋష్యాశ్రమములలో స్వభావ విరోధము గల గోవులును, పులులును, సింహములతో గజములును, సర్పమండూకములును మూషిక మార్జాలములున్ను సోదరులవలె నేకమై నివసించిన సంగతి శాస్త్రమందు గన్పట్టుచున్నది.

**అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।**
**మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥**

అహంకారము, బలము, గర్వము, కామము, కోపము నవలంబించిన వారై తమ దేహములందును, పరజీవులయందును ఒకటే ప్రకారముగానుండు నన్ను ద్వేషించుచు సత్పురుషులయం దసూయ గలవారై అనగా నీ జంతువులు దమ యాహారము కొఱకు నిర్మింప బడియున్నవని బలాత్కారముగా హింసించు అహంకారులును.

**తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।**
**క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు ॥**

అట్లు సర్వజీవ హృదయస్థుడనైన నన్ను హింసించు క్రూరులైన దుష్టులను జనన మరణ దుఃఖకరమైన ఘోరసంసార సాగరమందు మాటిమాటికి బహుదుఃఖకరమైన యసుర యోనులయందు బుట్టించెదను.

**ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।**
**మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్ ॥**

ఓ యర్జునా ! అట్లసురయోనియందు బుట్టిన ప్రాణి హింసకులైన మూఢులు ప్రతిజన్మమునందు నన్ను బొందుమార్గము దెలియజాలక అందుండి యధోగతిని బొంది బహుకాలము దుఃఖ భూయిష్ఠమైన ఘోరనరకమును బొందుదురు. వీరు అసుర స్వభావము గలవారని శ్రీకృష్ణభగవానుల

యభిప్రాయము. మరియు, పూర్వకాలమున ధర్మరాజు దేవగురువులైన బృహస్పతులవారిని ధర్మములగూర్చి,

ధ్యానంబింద్రియ వృత్తుల
మానించు టహింస గురు సమర్చనవిధి ని
త్యానుష్ఠానము దమమను
వీనం బరసేవ్యమెద్ది వినగా వలతున్.

అని యడుగగా బృహస్పతి ఇట్లనియె.

ఈ యారును మంచి తెరువు
లైయుండు నహింస యున్న యైదిటికి బవి
త్రాయతన మట్లు గాకయు
నే యుత్తమధర్మములను నిది వెలిగించున్.

అని చెప్పి వెడలిపోయెను. తర్వాత

ధర్మనందనుడు పితామహుతో సర్వ
దేవతలును భూమిదేవతలును,
మునివరులు నహింస కొనియాడుదురు దాని
తెఱగు చెప్పు నాకు దేటపడగ.

అని ధర్మజుండు భీష్ములవారి నడుగగా వారిట్లని చెప్పదొడంగిరి.

దంతి యడుగులోన దక్కిన జంతుచ
యంబు నడుగు లెల్ల నడగియుండు,
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధగుణ! యహింస కింత నిజము.

మరియు

దానము ధర్మము దమమి
జ్ఞానిష్ఠ యనంగ గల్గు సత్క్రియ లెల్లన్,

మానవనాథ యహింసా
నానాకృతులంద్రు శ్రుతుల నానిన పెద్దల్.

దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచమంత్రతంత్ర సత్యములును,
బుధు లహింస రూపములు గాగ జెప్పుట
యెల్ల కల్మి సుమ్మహింస కలిమి.

మనుస్మృతిలో

వర్షే వర్షే ఽశ్వమేధేన యో యజేత శతం సమాః ।
మాంసాని చ న ఖాదేద్యస్తయోః పుణ్యఫలం సమమ్ ॥

శతవర్ష దుష్కరతపః
కృతి నంజుడు దినమినగు సుకృత మివి రెండున్,
మతి దలప నొక్కరూపని
శ్రుతివేత్తలు జెప్పుదురు కురుక్షితినాథా !

నూరు సంవత్సరములు క్రమముగా దపస్సుజేయుటయు, మాంసము దినుచుండి మానుటయు, సమాన పుణ్యములని వేదముల నెరింగిన పెద్దలు జెప్పుదురు.

తపముల దానంబుల బ్ర
హ్మపురి నివాసంబు దప్ప దనరాదు జనా
ధిప మాంసము నమలని పు
ణ్యపురుషునకు సులభమందు రానెల వార్యుల్ ॥

(భారతము - ఆనుశాసనిక పర్వము)

తపస్సుచేతను, దానముచేతను, బ్రహ్మలోకము తప్పక సిద్ధించుననన సాధ్యము గాదు గాని, మాంసముందినక మానిన పుణ్యాత్మున కాలోకము గలుగుట సులభమని పెద్దలనియెదరు అని యీలాటి ధర్మము లనేకములు

భీష్ములవారు ధర్మరాజులవారికి బోధించియున్నారు. కాబట్టి ప్రాణిహింస గాని, దానిని భక్షించు స్వభావము గాని యుత్కృష్టమైన మానవజన్మమునకు విధింపలేదు. వేయేల పశుపక్షులలో గూడ నుత్తమజంతువులకు మాంసాహారము గనుబడలేదు. శ్రేష్ఠ జన్మము గల గోవు, జింక, గజము, అశ్వము మొదలైన మృగములు గూడ తృణ, పత్ర, ధాన్యముల మాత్రము భుజించును గాని, నికృష్ట జన్మముగల కుక్కలు, నక్కలు, పులులు మొదలగు నీచ జంతువుల వలె మాంసము దినవు గదా ! ఆలాగుననే పక్షివర్గమందును హంసయు, కోవెలయు, శుకము మొదలగు శ్రేష్ఠ పక్షులీ నీచవృత్తి నవలంబింపవు. వాటి యందు గూడ కాకి, గ్రద్ద, బోరువ మొదలైన నికృష్ట పక్షులు మాత్రమీ నీచవృత్తి నవలంబించుచున్నవి. ఇట్లుండగా శ్రేష్ఠమైన మనుజ జన్మమెత్తి దానియందు పవిత్రమైన వేదాంత విచారము జేయువారు గూడ యోచింపక ఈ క్రూరకృత్యము జేయుచున్నారే ! యెంతాశ్చర్యము !

## జీవ హింసా భేదములు

ప్రశ్న ॥ ఓ స్వామీ ! జీవుడు లేని వస్తువొకటైనను లేదుగదా! తోట కూర, వంకాయ మొదలైన యనేక శాకాదులయందు జీవుడు లేడా ? అప్పుడు వాటిని మాత్రము భక్షించువారికి జీవహింస లేదా ?

ఉత్తరము ॥ ఓ సద్గుణశీలా ! వాటియందుకూడ జీవమున్నది కాని తారతమ్యము గలదు. ఫలమూలాది భక్షణము శాస్త్రములలో దప్పని చెప్పలేదు. కనుక శాస్త్రమే ప్రమాణము. ఇదియును గాక ఫలమూలాదులయందు జీవశక్తి యున్నప్పటికి నవి జడములు. వాటికి జీవజంతువులకు వలె మనస్సు, బుద్ధి, చిత్తము మొదలైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు లేవు. ఇంద్రియము లెప్పుడు లేవో అప్పుడు సుఖ దుఃఖములు గలుగుట కవకాశము లేదు. సస్యమనగా ఫలపత్రముల విషయమై యిచ్చట జెప్పినదేగాని, మహాశయులగు బోసుగారి సైన్సు జెప్పెడి వృక్షాదులకు సంబంధించినది కాదు. మరియు నీలాగున జెప్పనిచో నీలాటివారికి మనస్సున బట్టదు. కావున నిట్లు జెప్పినాను.

దృష్టాంతమేమన, ఒక్కరిని వైద్యులు మూర్ఛనొందజేసి శస్త్రక్రియల

జేయు సమయమున వానికి దుఃఖము దెలియదు గదా ? అప్పుడు వానియందు జీవము లేకుండా బోలేదు. లేక శరీరమందున్న నఖ కేశముల ఛేదించునప్పుడు దుఃఖము గనబడలేదు. నఖ కేశములకు గూడ సస్యములవలె నుత్పత్తి నాశములు, గలుగుచున్నవి. ఆలాగుననే సస్యములయొక్క స్థితి. జంతువులు అట్లు గాదు. మనుజులయందు నేలాగున నింద్రియాది సుఖములున్నవో, ఆలాగుననే వాటికి నున్నవి. వాటికి గూడ రతిక్రీడా సుఖము, పుత్రవాత్సల్యము, మరణభీతి, సుఖాభిలాష మొదలైనవి గలవు. ఇదియునుంగాక ఆ జంతువులు మనుష్యులవలె స్త్రీ పురుష సంయోగముచే నుత్పత్తి యగును గాని, సస్యముల వలె నుద్భిజ్జములు గావు. సస్యవర్గములు ముఖ్యముగా సూర్యశక్తిచే వృద్ధి యగుచున్నవి. ఇతర సహాయము ( భూమి, జల, వాయువులు) స్వల్ప స్వల్పముగా నుండును. సూర్యునియందున్న శక్తి సస్యాదుల యందధికముగా నున్న కారణముచే వాటిని భక్షించువారి కధికమైన జ్ఞానము కలుగును, ఎట్లన సూర్యుండు తమస్సును నాశము జేయునట్లు, శాక భక్షణముచే గలుగుశక్తి యజ్ఞానమను దమోగుణమును నాశము జేయును. ఇదియును గాక సస్యజీవశక్తికిని, జీవులజీవశక్తికిని, పరమాణు పర్వతభేదము గలదు. ఒక వృక్షము యొక్క శాఖోపశాఖలు లక్షలభాగములుగా జేసి నాటినయెడల నవియన్నియు వృద్ధియగును, ఆలాగుననే వేరులుకూడ ననేకభాగముల జేసినను వాటినుండి యది గొప్ప వృక్షమగును. ఆలాగున జంతువులయొక్క కరచరణముల ఖండించినను వాటినుండి మృగములు వృద్ధియగునా, కావు. ప్రాణిహింసాహారముచే గలుగు పాపమిప్పుడు గనుబడక పోయినను, అది మరియొక గొప్ప పాపమునకు గారణమగును. ఎట్లనగా, ఏయొక్క వస్తువును భుజించెదరో, దానియందుండు సారము రక్తమై శరీరముగా బరిణమించును. ఆ శరీరము ననుసరించి సత్త్వరజస్తమో గుణములతో మనస్సు పనిచేయును. సత్త్వ గుణముచే జ్ఞానమును, రజోగుణముచే కర్మమును, తమోగుణముచే అజ్ఞానమును గలుగును.

దీనికొక దృష్టాంతమును జెప్పెదను. మహారణ్యమందు సంచరించు గజమును బట్టి రెండు మూడు వత్సరములు దానికి బుద్ధి నేర్పినయెడల, ఆ మహాబలముగల మృగము మనుష్యున కధీనమై చెప్పిన పనులన్నియు జేయుచున్నది

గదా ! అట్లోక చిన్నజంతువైన పులిని స్వాధీనము జేయదరమా? దీనియందున్న రహస్యమేమనగా ఏనుగు గొప్పజంతువైనను సాత్త్వికాంశమైన పత్ర, తృణము లాహారముగా గలది గనుక గ్రాహ్యాశక్తిగల బుద్ధియున్ను, మహాశాంత గుణమును గలిగియున్నది. వ్యాఘ్రమునకు క్రూరమైన మాంస భక్షణముచే, దాని క్రూరస్వభావ మెంతమాత్ర మెప్పటికిని మార్పు గాదు. కాబట్టి మోక్షమునకు శాంతమే ప్రధానమై యుండవలయును. కనుక ముముక్షువులు నిశ్చయముగా సాత్త్వికాహారమునే భుజింపవలయును. లేనియెడల మనస్సెంతమాత్రము స్వాధీనమందు నిలువదు. ఇది బహురహస్య విషయము.

ఇదియుం గాక మాంసము స్త్రీ పురుషుల యొక్క శుక్ల శోణితములచే నుత్పత్తి యైనది. ఆ కారణముచే మిక్కిలి యశుచియై యున్నది. దీనియొక్క రహస్యమును గొంచెము చెప్పెదను శ్రద్ధతో వినుము. ఒక స్త్రీ ఋతువైన నాలుగు రోజుల వరకు, ఆమెను ముట్టినవారు గూడ స్నానము జేయవలసియున్నది. కారణమేమన, ఋతుకాలమందు రక్తము స్రవించు మహాదోషము గలదు. స్పర్శించిన వారు గూడ స్నానము జేయునంత దోషమున్నయెడల ఆరక్తమును పానము జేయువారి యశుచి యేమని జెప్పవచ్చును! అనగా ఋతుకాలమందుండు రక్తమును, పురుషుని రేతస్సునుంజేరి పిండోత్పత్తి యగును. ఈ విధి మనుజులకున్నట్లు జంతువులకు కూడ గలదు. ఇది సాధారణ గోవు, ఎనుము, మేక మొదలైన జంతువులకు గర్భకాలమందు యోనిద్వారమందు బహిర్ముఖముగా గనబడుచున్నది. ఈ కారణముచే, మనోమాలిన్యము గలిగించు వస్తువుల భుజించు వారికి ధ్యానమందు మనసు నిలువదు. దీనిని బట్టియే మధు మాంసాదులు భక్షించువారు రాజయోగి గాదనిచెప్పి వీరికి రాక్షసభోగి యని పూర్వము నామమేర్పాటు జేయబడెను. రాక్షసులందుగూడ, రావణ కుంభకర్ణాదులు మహా తపోధనులే. అణిమాద్యష్టసిద్ధుల బొందినవారే, ముల్లోకముల జయించినవారే, నవకోటి శివాలయముల బ్రతిష్ఠించి పూజించినవారే. ఇట్లున్న వారిని శ్రీరామ తారక పరబ్రహ్మ కరుణామూర్తి యెందుకు వంశముతోటి వినాశనము జేయవలెను ? ఈ సంగతి గొంచెము విచారింతము. పరమ భక్తులైన యాంజనేయులు లంకకు బోయి వచ్చి లంకా

పట్టణముయొక్క వైభవమును శ్రీరాములవారితో విన్నవించెను. ( అనగా రాక్షసులయొక్క ప్రతి గృహమందును జరుగు వేదపారాయణము, హోమములు, శివార్చన, ధ్యాన, జపములను జెప్పుట కలవిగాదు. వారందరును పరమ శివభక్తులని వారి ప్రభావము నుడివెను. ) శ్రీరామచంద్రుడిట్లుండు పరమభక్తులను నేనెట్లు సంహరింతునని ధనుస్సును బారవైచెను. భక్తవత్సలుడగు శ్రీరామచంద్రునియొక్క యపారమైన దయనుజూచి సుగ్రీవుడు రాక్షస సంహారము గావలయునను మనోభిప్రాయముతో ఆంజనేయులవారి యాననమును వీక్షించెను. అంత నా బుద్ధిమంతుడు దానిని గ్రహించి శ్రీరాములవారితో రాక్షసులయొక్క యాహార విషయమై చెప్పబూనెను. ''ఓ మహాప్రభూ! వారు జీవకారుణ్యశూన్యులు. మహాక్రూర కృత్యములైన ప్రాణిహింసచే భోజనము గడుపువారు. సత్యాచారములు లేనివార'' ని చెప్పినతోడనే దుష్టనిగ్రహ శిష్టపరిపాలకుండగు శ్రీరామమూర్తి ''ఆహా ప్రాణిహింసకులైన దుష్టుల ననేకాస్త్రములచే నున్మూల నాశము జేసెద'' నని పలికి ధనుస్సును గరమందు సంతోషముతో ధరించెను.

ఈ విషయ మెందుకిచ్చుట ప్రస్తావించెదననగా ఇప్పుడున్న శుష్కవేదాంతులలో గొందరు శాస్త్ర పాండిత్యము గలవారును, మరికొందరు బరమేశ్వర లింగమును భక్తితో గంఠమందు ధరించిన వారును, వేరుకొందరు యంత్రములను బూజించువారును, ఇంక గొందరు జటాముండన, కాషాయ, భస్మ, రుద్రాక్ష ధారులై యున్నప్పటికిని జీవకారుణ్య మొకటిమాత్రము లేనికారణముచే వీరికి జగదీశ్వరునియొక్క కరణాకటాక్షము గలుగుటకు వీలులేదు. వీరు నిశ్చయముగా ఘోరసంసారమందు బడుదురు. యమదూతలు వీరలను విడనాడరు. ఇట్లున్న వారు రాగులు గాని యోగులు గానేకారు. వీరు దాము నాశము బొందుటయేగాక ఇతరులైన ముముక్షువులను గూడ నాశము జేయుదురు. ఎట్లనగా ప్లేగు, కలరా మొదలైన యంటుజాడ్యములబొందిన వారిని సమీపించిన నుభయులును మరణమును బొందురీతిగా నుండును. కనుక ముముక్షువులు వీరిదాపునకు వచ్చునప్పుడు నిండుజాగ్రతతో నుండవలయును. వీరిలో గొందరు గొన్ని వేదాంతయుక్తులు బాగుగ నేర్చియుండవచ్చును. వీరు విద్యలేని కొందరు వైరాగ్యభక్తితో గూడి సన్మార్గులైన పుణ్యాత్ముల దగ్గరకుబోయి

శుష్క వేదాంతముచే గుతర్క వివాదము చేసి వారినిష్ఠను భంగపరచెదరు. వీరి వివాదమేమనగా ! జపము, తపము, ధ్యానములెందుకు? ఫలమేమి ? ఎవరు చెప్పినది? ఏ శాస్త్రమందున్నది? ఏల వివాహము జేయరాదు? మధుమాంసాది వస్తువుల నెందుకీశ్వరుడు సృజించినది? తినుటకు గదా! ఏమి నేను జ్ఞానిని గదా?నేనంతయున్ను భుజించునది చూడ లేదా ? నాబోటి వారికి మోక్షము రాదా? నాగురువైన ఫలాని మల్లయ్యగారును, వారి గురువైన దొమ్మరకొండ బొమ్మయ్యగారును, కాక్షితదీక్షితులు గారును, వీరందరున్ను మోక్షము బొందలేదా? ఈలాగున ననేక విధములుగా వృద్ధురాలగు వేశ్యాస్త్రీ వేశ్యావృత్తికి శక్తి లేకుండినను ధనాభిలాషచే గర చరణ నేత్రముఖములచే ననేక విధములుగా గ్రావు నాట్యము చేయునట్లు వీరును లజ్జలేకయే రాజయోగినని చెప్పి వైరాగ్యముతో గూడిన జిజ్ఞాసులను నాశము జేయుచున్నారు. ( అనగా విత్తాపహారులై శిష్యుల నెక్కువగా చేర్చుటకాలాగు చేష్టల జేయుచున్నారు. ) ఇట్లనుటచే సాధుదూషణమని స్వప్నమందైనను దలంపకుండుదురుగాక ! లోకముయొక్క పరిస్థితి దుఃఖకరమై యుండుటచే నిట్లు జెప్పవలసి వచ్చినందున చాలా విచారపడుచున్నాను.

---

## మద్యమాంస వర్జనము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! మద్య మాంసాది భక్షణము లేనివారు జ్ఞానులని చెప్పుచున్నారే, ఇప్పుడు లోకమందుండు శూద్రులలో కొందరున్ను, వైశ్యులు, బ్రాహ్మణులు మొదలైనవారు ఆలాటి భక్షణము లేనప్పటికిన్ని రాగద్వేషములు నశించి శాంతులై భక్తులై కనబడుట లేదే ! అప్పుడు మాంసము దినువారికంటె వీరికేమి యెక్కువ గుణములు గలవు ?

ఉత్తరము ॥ ఓ భక్తసత్తమా ! ఈ విషయమై నీవు బాగుగా యోచింపలేదు. ఆహారశుద్ధి యొకటి మాత్రము చాలదు. దానికి సరియైన మనోనిర్మలత్వముగూడ నుండవలయును. ఆహారము గొంత సహాయము గాని మరియేమియు జేయ సాధ్యము గాదు. ఆహార శుద్ధిచే స్థూలదేహము పవిత్రమౌనే గాని మనోమయ (సూక్ష్మ) దేహపరిశుద్ధి గలుగనేరదు. మోక్షముకొరకు మనోనైర్మల్యము

వసరము. కనుక బ్రహ్మచర్యము గురు, దేవ, పూజాయుక్తమైన సాత్త్వికాహారము, ప్రాణాయామాది యోగములచే స్థూల దేహ శుద్ధి గలుగును, దైవభక్తి, ప్రణవాది మంత్రజపము, సత్యసంభాషణము, ఏకాంతవాసము, మనోనిగ్రహాది సాధనములచే మనోమయ దేహము పవిత్రమగును. ఈ రెండు ఎవరికి పరిశుద్ధముగానుండునో వారికి మాత్రమే జ్ఞానము గలుగును. ఈ రెండును పరిశుద్ధముగా నుండవలయును. ఏలాగనగా, ఒక లాంతరునందు లోపలనుండు గ్లాసును, బుడ్డి రెండును శుభ్రమై యుండిన యెడల మాత్రము దీపము ప్రకాశించును. పొగ లాంతరయద్దమందు గప్పియున్నప్పటికిని, అద్దము నిర్మలమై బుడ్డిపొగచే నిండి యుండినను దీపము ప్రకాశింపదుగదా ! కనుక స్థూల సూక్ష్మదేహములు రెండును పవిత్రమై యున్న మాత్రమే పూర్ణవిజ్ఞాన బోధ ముదయించును. ఈ కారణముచే యోగము, జ్ఞానము అని రెండు మార్గములు మహర్షులచే నేర్పరుపబడినవి. యోగాభ్యాసముచే కాయశుద్ధియున్ను, జ్ఞానాభ్యాసముచే నాత్మశుద్ధియున్ను గలుగును. అప్పుడు మాత్రమే యొకడు పరిపూర్ణజ్ఞాని యగును.

**ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగం జ్ఞానం చ రాఘవ ।**
**యోగః తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥**

ఓ రాఘవా । మనోనాశముకొఱకు రెండుమార్గములు గలవు. అవి జ్ఞానము, యోగము. యోగముచే మనోనిగ్రహము, జ్ఞానముచే సాక్షాత్ దర్శనమును గలుగును అని వాసిష్ఠము.

**నాస్తి ధ్యానం వినా జ్ఞానం నాస్తిధ్యాన మయోగినః ।**
**ధ్యానం జ్ఞానం చ యస్యాస్తి తీర్ణస్తేన భవార్ణవః ॥**

ధ్యానము లేనివారికి జ్ఞానము లేదు. యోగాభ్యాసము లేనివారికి స్థిరమైన ధ్యానము గుదురదు. ధ్యానమును, జ్ఞానమును నెవనికి కలవో వాడు జననమరణాత్మకమైన ఘోరసంసారమును సుఖముగా దాటును అనిస్కాందము. ఎట్లనగా, నౌక యోడచే నది దాటుటకై తెడ్లను చుక్కానియు రెండును లేనియెడల సాధ్యము గాదు. తెడ్లు మాత్రమున్న పడవ జక్కగా బోదు. తెడ్లులేక

చుక్కాని మాత్రముచే బోవుటకు సాధ్యము గాదు. లేక ఒక పక్షికి నాకాశమందు సుఖముగా సంచరించుటకై రెండు రెక్కలును, తోకయును గలిగి యుండవలయును. లేనియెడల సాధ్యము గాదు. ఈ మూటిలో నేదియైన నొకటి భంగమైన క్రింద బడిపోవును గదా? ఆలాగుననే జీవుడను పక్షికి మోక్షాకాశమందు సంచరించుటకై వైరాగ్యమను రెక్కయొకటియు, జ్ఞానమను మరియొకరెక్కయు, యోగమనెడి పుచ్ఛమున్ను సంపూర్ణముగా నుండవలయును. సమస్త మహర్షులకీ మూడు నున్నట్లు గన్పట్టుచున్నది. ఈమూటిలో నేదిగాని యొకటి లేనియెడల సంసార సాగరమున బడి పరితపించును.

---

## మాంసవర్జిత సుఖము

ప్రశ్న ॥ మాంసముచే వృద్ధి బొందిన ఈశరీరమునకు దానిని విడిచిన రోగము వచ్చునని కొందరు జెప్పునది నిజమా ?

ఉత్తరము ॥ ఓ సద్గుణశాలీ। యీ శరీరము మొట్టమొదట మాంసముచే వృద్ధి బొందలేదు. సాధారణముగా నైదుసంవత్సరముల వరకు పాలచే వృద్ధినొంది పిమ్మట అన్నముచే గదా జీవించుచున్నది. అప్పు డాయుక్తి సరిగాదు. అది యట్లుండనిమ్ము; ఇప్పుడు ప్రత్యక్షానుభవముచే శాస్త్రజ్ఞులు యంత్రమందు వస్తువులను శోధించునప్పుడు మాంసముకంటె గోధుమరొట్టె, కందిపప్పు, ఉర్లగడ్డలెక్కువ పోషణశక్తి గలవని కనిపెట్టియున్నారు. ఇది ప్రత్యక్షముగా నిప్పుడు జూడవచ్చును. మాంసభక్షణము విడిచిన రోగము వచ్చుననియు, భంగి అభిని మొదలగు లాహిరివస్తువుల త్యజించినవారికి శరీరబాధ గలుగుననియు శుష్కవేదాంతులు జెప్పుమాటలు సత్యము గాదు. దొంగలకధిపతియైన యొకరికి బ్రతిదినమున్ను మాంసము, సారాయి, చుట్ట, పొడి, తాంబూలము మొదలైన దురాచారము లుండినను వానిని బట్టి జైలులోవేసినప్పుడవి లేక చనిపోవునా ? ఈ దుర్వృత్తు లెక్కడబోయినవి? ఇట్లుండు మాటలన్నియు కుతర్కములు గాని మరియేమియును గాదు. వాస్తవముగా నీశుష్కవేదాంతుల కిదంతయు దప్పుమార్గమని మనసుకు నిశ్చయముగా దెలియును. దుర్యుక్తిచే మూలముక్కల యందుండి పామరులకు బోధించుదురు గాని బయటకు వచ్చి చెప్పుటకు

సాధ్యము గాదు. వీరెట్లున్న వారనగా, లోభులైన కొందరు వకీళ్ళు ధనాపేక్షచే నసత్యమైన కేసునుబట్టి వాస్తవముగా సత్యము గాదని తెలిసినను అనేకములైన కుయుక్తులచే దమవాదమును స్థాపించుటకై పలాని నెంబరు పుస్తకమందు, ఫలానిరూలు ప్రకారం ఇది సరియని చెప్పు రీతిగా వీరును నచ్చుటచ్చుటనుండి యాలాటి కవులు జెప్పెడి పద్యములనేర్చి నుడువుచుండ వచ్చును గాని యది యంతయు శాస్త్రసమ్మతము గాదు. మనోనిగ్రహము లేక ఇంద్రియ లోలురైన వారిని పెద్దలని తలంచువారెట్లున్న వారలనగా నొక పగటి వేషధారి రాజువేషమును ధరించి నేను గంధర్వనగరమందున్న వంధ్యాపుత్రులను మహాశూరులైన రాజులను శశవిషాణ మహాధనుస్సుచే హరించిన ధీరుడనుగదా, యనిన మాటలవిని వీడు మహాశూరుడని తలచు మానవులెవరు గలరో వారుగదా వీరిని పెద్దలని తలంతురు.

## క్రయమాంస భక్షణ వర్ణనము

ప్రశ్న ॥ సరి, ప్రాణిహింస మహాపాపమని స్థిరమైనది. ఎవరో హింసించి విక్రయము జేయుదానిని కొని తినినవిషయములో దోషము లేదు గదా ?

ఉత్తరము ॥ అది సరి గాదోయి ! తినుటకు మనుజులున్న కారణముచే, హింసించు వారుందురు గాని లేనియెడల హింసించుట కెవరున్ను గనబడరు. అపుడు తినువారే హింసకు గారణమగుచున్నారు. వారి కధికమైన పాప మాపాదించును. చంపువారికి స్వల్పమైన పాపమని శాంతి పర్వమందు జెప్పియున్నది. అది యుక్తి యుక్తముగా నున్నది. ఒక కసాయివా డై దురూపాయలిచ్చి కొనిన మేకను హింసించి యమ్మినపుడు త్వరలో ఖర్చై రెండుమూడు రూపాయలు లాభమువచ్చిన యెడల మరురోజు రెంటిని జంపుటకు గారణమగునుగదా ? మొట్టమొదటిదిన మెవరు గొనక నష్టము వచ్చిన యెడల మరుదిన మాకష్టమైన పాపకృత్యము జరుగనే జరుగదు గదా ?

దీనికి మరియొక దృష్టాంతము గలదు. ఒక గ్రామమం దొక ప్రభువు గలడు. మరియొక గ్రామమందాలాటి గొప్పవాడుండెను. ఉభయులకు జేతి క్రింద నలుగురు భృత్యులు గలరు. ప్రభువు లిరువురికి వైరము గలిగి యొకరి భృత్యులు తరుణముజూచి యొకరి ప్రభువును గొట్టిచంపిరి. ఆ సంగతి

గవర్నమెంటువారికిదెలిసి చంపినవారిని విచారించినపుడు జరిగిన సంగతి నంతయు వాస్తవముగా జెప్పిరి. మీరేల ఘోరకృత్యము జేసితిరని యడుగగా, వారు ''అయ్యా మేము ఫలాని ప్రభువువద్ద జీవించువారము. వారు జెప్పినపనులు జేయనియెడల మాకన్నమునకు జరుగుటకు వీలులేదు. కనుక వారి యభిప్రాయము ప్రకారము జేసినా'' మని చెప్పిరి. ఈ విషయమందు యోచించి న్యాయాధిపతి చంపుటకు గారణభూతుడైన ప్రభువునకు ఘోర కఠిన శిక్షయున్ను, చంపిన భృత్యులకు స్వల్పశిక్షయున్ను విధించిరి. ఆలాగుననే మాంసమును దినువారు హింసకు గారణభూతులు గనుక వారికి గొప్పపాపమును హింసించు వారికి స్వల్పపాపమును గలుగును. పాపమట్లుండనిమ్ము, నీచభోజనముచే మనసు తమోగుణముతో గూడి తర్వాత అనేక పాపకృత్యములకు గారణమై నాశము బొందునని శ్రీభగవద్గీతయందు జెప్పియున్నది.

**ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే ।**
**సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥**

అనగా మధుమాంసాది దుర్విషయముల గోరువారికి దానియందే యాసక్తి యెక్కువగా నుండును. అట్టి దురాశయొక్క ఆసక్తివలన బహువిధమగు కోరికలు బుట్టును. కోరికలవలన గోపముద్భవించును. క్రోధమువలన నవివేకమైన యజ్ఞాన ముదయమగును. అజ్ఞానమువలన స్మరణ భ్రంశము గలుగును. స్మరణభ్రంశము వలన జ్ఞానము నశించును. జ్ఞానము నాశమైనతోడనే తానును నాశము బొందును. కాబట్టి దుర్విషయమం దల్పచింతయైన నుండరాదని శ్రీకృష్ణ భగవానులు జెప్పిరి.

**శ్రుతి ॥ అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్ ।**
**కలుషీకృతచిత్తానాం ధర్మస్సమ్యఙ్న భాసతే ॥**

ఆహారదోషముచే సర్వదా చిత్తమునకు గల్మషము గలుగును. కల్మషచిత్తముగలవారికి ధర్మరహస్యమైన జ్ఞానము ప్రకాశింపదు.

శ్రుతి ॥ ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః ।
స్మృతిలాభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః ॥

అనగా సాత్త్వికమైన శుద్ధాహారముచే మన శ్శుద్ధియు, మనశ్శుద్ధిచే దృఢమైన ప్రజ్ఞయు గల్గును. దృఢప్రజ్ఞచే సర్వగ్రంథులు నిశ్శేషముగా నాశముబొందును అని సన్యాస ముచ్చయము.



## మేకలు, కోళ్ళవలన ఉపయోగము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! మేకలు, కోళ్ళు మొదలైనవి మనుష్యునికి నుపయోగము లేనియెడల నెందు కీశ్వరుడు సృష్టించవలెను?

ఉత్తరము ॥ ఓ పాపరహితుడా ? మనుష్యుల నేల సృష్టించవలెనని యోచించరాదా ? మనుష్యునివలెనే యాజంతువులును దమపూర్ణత్వము బొందుటకై యొక క్రింది జన్మమందుండునేకాని, వాటిని దినుటకై పుట్టించలేదు. ఆ జంతువులచే మనుజులకెంతో యుపకారము గలదు. మొట్టమొదట మేకలమందచే గృషి యెంత వృద్ధి యగును. ఆయన్నముచే ననంతకోటి జీవించుచున్నవి గదా ! మరియు నవి పాలిచ్చి మనుష్యుల కెంత యుపకారము జేయుచున్నవి ! మూడవది వాటి మెత్తని రోమములచే ననేక విధములగు కంబళ్ళు నరులకుపయోగకరమైయున్నవి. మానవులకు దినుటకై యన్నమును, త్రాగుటకై పాలును, కట్టుటకై వస్త్రమును ఆ సాధువులైన జంతువులిచ్చి రక్షించుచున్నవి గదా ! క్రూరులైన నరులేమి పరోపకారము జేయుచున్నారు ? వీరిచే లోకమున కెంత యనర్థము. ఈ కారణముచే భూదేవి పాపులైన నరులభారము సహింపక ప్రార్థించు నప్పుడు రామకృష్ణా వతారముల నెత్తి దుష్టసంహరణ, శిష్టపరిపాలనము జేయు నట్లు పద్మ పురాణమందు జెప్పియున్నది. ఏలాగనగా, మహాపర్వతములు, గొప్ప గొప్ప వృక్షములు, నదులు, విశాలమైన సముద్రములు, ఆవ గింజంతభారము లేదుగాని ప్రాణి హింసకులైన క్రూరుల మోయ సాధ్యము గాదని దుఃఖముతో మొరలిడుచున్నది.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదా౽౽త్మానం సృజామ్యహమ్ ॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

అర్జునా ! ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియు గలుగుచున్నదో యప్పుడప్పుడు నే నవతరించెదను. ఎందుకనగా ఎచ్చటెచ్చట బ్రాణిహింసకులైన క్రూరు లభివృద్ధి యగుదురో యప్పుడచట వారిని సంహారము జేసి సన్మార్గులైన సాధువులను రక్షించి ధర్మమును స్థాపించుటకు వేరుమార్గము లేదు.

ప్రశ్న ॥ మేకలచే మనుజుల కుపయోగము సరిగాని, కోళ్ళు మొదలైన పక్షులచే నేమి యుపయోగము ? వాటి నెందుకు భుజింపరాదు ?

ఉత్తరము ॥ అయ్యయ్యో, ఆజంతువులును మనవలెనే భార్యా, పుత్ర, గృహాదులతో గూడి సుఖించి సంతోషముగా బాటలబాడి కాలము గడుపుటేగాక మనుజుల కెంతో యుపకారము జేయుచున్నవి. ఆదికాలమందు గడియారము మొదలైన సమయము దెలుపు యంత్రములు లేని కారణముచే కోళ్ళను సాకిరి. అవి సరిగా రాత్రి మూడవ యామ మైనంతలో బారా జవానువలె గూత వేసి మనలను బిలుచుచున్నవే. అట్లొకసారి పిలిచినది వినలేదేమో యని సంశయించి కొంచము నిదానించి కూతలు వేయుచున్నవి. అట్లు రెండుమూడుమార్లు మనతో నుదయమైనది వారివారి పనుల జూచుకొనుటకై పోవచ్చునని చెప్పుచున్నవే ! ఇదియును గాక గృహసమీపమున బడిపోయిన యన్నము మొదలైనవి తిని పరిశుభ్రము జేసి మనకు రోగములు రాకుండ దినివేయుచున్నవి ! ఇంతియే గాక ననేక విషపురుగుల నింటికి రాకుండ దినివేయుచున్నవి. ఇంటి సమీపమున నన్నము మొదలైన వస్తువులు బడి క్రుళ్ళి దానినుండి వచ్చు గాలిచే మనుజులకు రోగము వచ్చునని శాస్త్రజ్ఞులు జెప్పుచున్నారు. ఈ పక్షులు గూడ కుక్కలవలె మనరక్షణకు గాని తినుటకొఱకు గాదు. కుక్కను సాకిన దానిని మాత్ర మేల దినరాదు ?

## మత్స్యోపకారము

ప్రశ్న ॥ కోళ్లచే నుపకారము జెప్పినది సరిగాని, మత్స్యములచే నేమి యుపయోగము ? వాటి నెందుకు దినగూడదు ?

ఉత్తరము ॥ ఓ నాయనా ! అవియును మనుష్యులవలె పిల్లలతో గూడ సంసారకృత్యముల జేయుచున్నవి. వాటిచే మనుజులకు ముఖ్యోపకారమై యున్నది. నీటియందుండు అనేక విషవస్తువులను, బాచి మొదలైన వానిని నీరు జెడకుండా భుజించి జలమును నిర్మలముజేసి మనలను రక్షించు చున్నవి.చేపలు లేని యెడల జలమందు జేరు అనేక విధములైన దోషములచే జనులకు రోగము కలుగును. దీనికొఱకే కప్పలనుగూడ నీశ్వరుండు సృష్టించినది. వానిని మాత్రమేల దినరాదు. అవియును జలజంతువులేగదా ? నీవు వేయు ప్రశ్నలు కుతర్కములుగాని సరియైనవి కావు. మనుష్యుల కాహారముగా జంతువులను సృష్టించిన యెడల మనుష్యుని దినుటకై పులిని నిర్మించెనని చెప్పరాదా ? నాయనా! మనుష్యునివలె యావజ్జీవులకు సంసారవృత్తి గలదు గాని జ్ఞాన మొకటి మాత్రము లేదు. తక్కిన విషయములలో భేదము లేదు.

**ఆహారనిద్రా భయమైథునం చ**
**సామన్యమేతత్పశుభిర్నరాణామ్ ।**
**జ్ఞానం నరాణా మధికో విశేషః**
**జ్ఞానేన హీనః పశుభి స్సమానః ॥**

ఆహారము, నిద్ర, భయము, విషయభోగము మొదలైనవి మనుష్యులకును మృగములకును సమముగానుండును. తనవలెనే సర్వమను జ్ఞానమొకటి లేదు. ఈ జ్ఞానమెవరికిలేదో వారు ద్విపాద పశువులుగాని మనుజులు గారని యుత్తరగీత బోధించుచున్నది. వాటికిని మనవలె భాషాజ్ఞానము గలదు. ఒకకోడి పిల్లలజేసి యున్నప్పుడు కాకులు, గ్రద్దలు మొదలగు జంతువులు వచ్చునప్పుడా తల్లికోడి కోయని యొక దీనశబ్దము జేసినయెడల పిల్లలచ్చటచ్చటకు పరుగెత్తిపోయి యపాయము లేనిచోట దాగియుండును. ఈ యుపద్రవ జంతువులు బోయినప్పుడు తల్లికోడి, కు, కు అని పిలుచునప్పుడన్నియు దగ్గరకు

బరుగెత్తి వచ్చునది కనుపడలేదా ! ఈ విధముననే సమస్త ప్రాణులకును సంభాషణ జ్ఞానము గలదు. లేనియెడల నెట్లు దెలియును ? ఆకాశమందు మనస్సంయమము జేయశక్తిగల యోగికి సమస్త ప్రాణులయొక్క భాష గోచరించునని పాతంజల యోగసూత్రమందు జెప్పియున్నది. అంత దూరమెందుకు బోవలె ? అక్కరలేదు. ఈ దేశమున దగ్గరనున్న నీవంటి మనుజుడనైన నేను మలయాళ భాషగాని, సింహళభాషగాని చెప్పినయెడల నిచ్చట నొకరికిన్ని దెలియదు గదా ! అట్లున్నప్పుడు మనుజుని కంటే యెంతో గ్రిందిజన్మమందుండు జంతువుల భాష దెలియసాధ్యమా? తెలియక వాటికి భాష లేదని చెప్పవచ్చునా ? అంధునికి సూర్యుడు గనుబడకపోయినను నేత్రము లున్నవారికి లేకుండునా ! అయ్యో దీనజంతువులను బలాత్కారముగా వధించు టెంత పాపము. కనుక సర్వ ప్రాణులయందు గారుణ్యమునుంచి యన్నిటిలోను మంచిది గ్రహించి వాటి యందుండు దోషము లెన్నకుము. ఇది ముఖ్యోపదేశము. శుష్కవేదాంతుల పామర వచనముల జెవియందు జొరనీయకుము. కరణానిధియగు భగవంతుని భక్తితో ధ్యానింపుము. విషయములలో బోవు మనసును బోనీయక దానియందు తుచ్ఛబుద్ధి గలిగి బ్రహ్మధ్యాన నిష్ఠయందుండుము సుమా !

ప్రథమ పాదము సంపూర్ణము.

ఓం తత్ సత్



# శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము

## ద్వితీయపాదము

## గురుశిష్యుల యోగ్యత

ప్రశ్న ॥ ఓ స్వామీ ! ఆత్మజ్ఞాన సిద్ధికొఱకై శమదమాది గుణములు గలిగిన శిష్యసామర్థ్యము జాలునా ? లేక గురుసహాయము గూడనుండ వలయునా? అని నాకు గొప్ప సందేహము గలదు. దానిని కరుణతో దెలిపి నన్ను ధన్యునిగా జేయుము మహాత్మా !

ఉత్తరము ॥ ఓ సద్గుణశీలుడవైన సోదరుడా ! సాధన చతుష్టయసంపత్తి సంపూర్ణముగా గల శిష్యుడును, శ్రుతిసార మెరింగిన బ్రహ్మనిష్ఠుడగు గురువు నుండినయెడల మాత్ర మీ బ్రహ్మవిద్య ప్రకాశించును గాని యుభయులలో నెవరైనను బూర్తిగాలేనియెడల ప్రకాశింప సాధ్యము గాదు. ఎట్లనగా, కృషియొక్క పూర్ణఫలసిద్ధికొఱకై శుద్ధమైన భూమియు ( రాళ్లు, కంపలు, చవుడు, మొదలగు దోషములులేని సత్తువగల స్థలము) పరిపక్వమైన విత్తనముండిననేగాని లేనిచో ఫలించుటకు సాధ్యము గాదు. భూమి మృదువై సమస్త గుణములతో గూడినను బీజము లేతదైన యెడల ఫలమీయ సాధ్యము గాదు. ఆలాగుననే విత్తనము పరిపక్వమైనను భూమి యందు చవిటి దోషములుండిన నిరుపయోగము. చవిటిమట్టి యనగా, విషయవాసనతో గూడిన మనస్సు. రాళ్ళనగా, అహంకార మమకారములు. కంపలనగా దుర్గుణములు. ఇవి యుండగూడదు. ఇది

యంతయు పూర్తిగానుండినను వైరాగ్య మనెడు కల్ల (కంచె) లేనియెడల కామ క్రోధము లను జంతువర్గములు నాశము జేయును. పరిపక్వబీజ మనగా, తపోనిష్ఠచే శమదమాది గుణములతో గూడి యాత్మజ్ఞాన స్వానుభవము గల బ్రహ్మనిష్ఠుడైన గురువు. అపక్వవిత్తనమనగా, వైరాగ్యాదిగుణములు లేక పూర్ణస్వానుభవ సిద్ధిలేనివారు. లేక టెలిగ్రాము (తంతి) కొట్టువారున్నను, మరు ఆఫీసులో దీనిని గ్రహించు సామర్థ్యముగలవాడుండిన మాత్రముననే దానియందు జెప్పువిషయము గ్రాహ్యమగును గాని లేనియెడల సాధ్యము గాదు. అనగా, ఇచ్చువారును, పుచ్చుకొనువారును ఉభయులు సమర్థులు గావలయును. లేక రోగి వైద్యుడు జెప్పినంత పథ్యము దప్పక నుండువాడును, రోగము దెలిసిన వైద్యునివద్ద సరియైన యౌషధముండిన రోగము గుదురునుగాని దివ్యౌషధమిచ్చినను, ఆహారపథ్యములు సరిగా లేనియెడల మందు ఫలమియ్యజాలదు. ఆహారాది పథ్యములయందు జాగరూకుడైనను, ఔషధము సరిలేని యెడల ఆరోగ్యము గలుగదు గదా !

శ్రుతి॥ తద్విజ్ఞానార్థం (శాంతో దాంత) స్సగురుమేవాభిగచ్ఛే
త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥

శిష్యుడు శాంతుడై, దాంతుడై, ఆత్మజ్ఞానముకొఱకు పూజార్థ వస్తువులను కరమందు ధరించి శ్రుతిసార మెఱింగినవాడై బ్రహ్మనిష్ఠుడైన గురువును ఆశ్రయింప వలయునని ముండకోపనిషత్తు చెప్పుచున్నది. దీనిచే గురుశిష్య లుభయులును యోగ్యులూగా నుండవలయునని తేట తెల్లమగుచున్నది.

## గురు లక్షణము

శ్రుతి ॥ అవిద్యా హృదయ గ్రంథి బంధమోక్షో భవేద్యతః ।
తమేవ గురు రిత్యాహు ర్గురుశబ్దార్థ వేదినః ॥

ఏ మహానుభావునిచే, అవిద్యాహృదయగ్రంథి బంధమోక్షము గలుగునో వారిని గురువని గురుశబ్దార్థ మెరింగిన పెద్దలు జెప్పుచున్నారు.

శ్రుతి॥ **గుశబ్దస్త్వంధకారః స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః।**
**అంధకార నిరోధిత్వా ద్గురురిత్యభిధీయతే॥**

'గు' అను శబ్దము అంధకారమునకు పేరు, 'రు' అనగా దానిని నాశముజేయు తేజస్సు, అనగా బ్రహ్మోపదేశముతో అజ్ఞానాంధకారమైన చీకటిని నాశవముజేసి స్వయంప్రకాశమగు పరబ్రహ్మమును కరతలామలకమువలె జేయువారు గురుశబ్దమున కర్థమని అద్వయతారకోపనిషత్తు చెప్పుచున్నది.

**గుకారశ్చాంధకారో హి రుకారస్తేజ ఉచ్యతే।**
**అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః॥**

గుకార మంధకారము, (అజ్ఞానము) రుకారము దానిని నాశము జేయు తేజస్సు (అనగా జ్ఞానము) అనబడును, అజ్ఞానమను తమస్సును మ్రింగువాడే గురువు. వాడే బ్రహ్మము; సంశయము లేదు.

**గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః।**
**గుణరూప విహీనత్వా ద్గురురిత్యభిధీయతే॥**

గుకారము గుణాతీతము, రూపాతీతము రుకారము. నామరూపగుణ రహిత అవస్థయగు బ్రహ్మమును, దెలుపువారే గురువని పెద్దలచే జెప్పబడును.

**చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మ జ్ఞానవాన్ శుచిః।**
**మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే॥**

చాతుర్యము గలవాడై, వివేకియై, ఆధ్యాత్మజ్ఞాన సంపన్నుడై, బహిరంతర శుద్ధి గలవాడై, ఎవని మనస్సు పవిత్రమైయుండునో వానికి మాత్రము గురుశబ్దము శోభించును గాని, శిశ్నోదర పోషణ పరాయణ పరులైన శుష్కవేదాంతులకు ఆపద మందదు.

**గురవో నిర్మలా శ్శాంతాః సాధవో మితభాషిణః।**
**కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః॥**

అత్యంత, నిర్మల హృదయముగలవారై, పరమశాంతులై, సాధన చతుష్టయ సంపత్తి గుణములతో గూడిన సాధువులై, మితభాషణము గలవారై,

కామక్రోధాదులను అరిషడ్వర్గములు లేనివారై, సన్మార్గ ప్రవర్తకులై చక్షుఃశ్రవణాది దశేంద్రియములను జయించినవారు మాత్రము గురువు లగుటకర్హులు గాని, ఇంద్రియలోలుర కధికారము లేదని గురోర్గురువైన శ్రీపరమేశ్వరుండు గురుగీతయందు పార్వతీదేవి కుపదేశించియున్నారు.

ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః ।
యోగజ్ఞో యోగనిష్ఠశ్చ సదా యోగాత్మకశ్శుచిః ॥

ఆచార్యుండు వేదసంపన్నుడై, పరమభక్తుడై, వివాదహీనుడై, యోగము నెఱిగినవాడై, యోగనిష్ఠయందున్నవాడై, సదాయోగాత్మస్వరూపుడై, బహిరంతర శుద్ధిగలవాడై యుండవలయును.

ఏతేషాం దేశికానాం చ లక్షణం శృణు సువ్రత! ।
అహింస స్సత్యశౌచాది విశ్వజీవ దయాపరః ॥

క్షమావాన్ శాంతచిత్తశ్చ నిగ్రహోనుగ్రహే క్షమః ।
సదాచారయుతో దక్షో జపధ్యాన పరాయణః ॥

జ్ఞానదీక్షాసమాయుక్తో గురుభక్తి విశారదః ।
జ్ఞానయోగక్రియాచర్యా చతుష్పాదాంత శాస్త్రవిత్ ॥

దంభాచార వినిర్ముక్తః క్షుద్రకర్మవివర్జితః ।
శిష్యాణాం గుణదోషేషు విజ్ఞానీ చ జితేంద్రియః ॥

రాగద్వేషవినిర్ముక్తః కృపయా చ సమన్వితః ।
సమయానాం చ సర్వేషాం జ్ఞానసారపరిగ్రహీ ॥

శివానుభూతి సంయుక్తః సంశయచ్ఛిదసంశయః ।
క్షయకుష్ఠాదిరహితః వీతరాగశ్చ సుందరః ॥

నిర్మలో నిరహంకారో నిశ్శంకో నిర్వికల్పకః ।
తమోవిహీనః శాస్త్రజ్ఞః పరమార్థ విచింతకః ॥

ఏవంలక్షణసంయుక్తో హ్యాచార్య వర ఉచ్యతే ।

ఇట్లు ఆచార్యునియొక్క లక్షణము. ఓ సువ్రతా ! నిదానముగా వినుము. త్రికరణములచే హింసజేయనివాడును, సత్య శౌచాదులు గలవాడును, సమస్త జీవరాసులయం దపార పారావారమగు దయగలవాడును, క్షమతో గూడిన వాడును, శాంతమైన చిత్తము గలవాడును, నిగ్రహానుగ్రహశక్తులు గలవాడును, సదాచారుడును, సమస్త విషయములయందు సమర్థుడును, జపధ్యాన పరాయణుడును, జ్ఞానదీక్షను ధరించినవాడును, గురుభక్తియందు ప్రాణమును త్యజించువాడును. జ్ఞానము, యోగము, చర్య, క్రియ, అను నాలుగుపాదాంతముల పర్యంతము శాస్త్ర (కర్మ, భక్తి, యోగ, జ్ఞాన) మెఱింగినవాడును, డంభాచారము లేనివాడును, క్షుద్రకర్మ (నీచదేవతోపాసన) లేనివాడును, శిష్యుల గుణదోషములలో విశేష జ్ఞానముగలవాడును, సర్వేంద్రియ నిగ్రహము గలవాడును, రాగద్వేషాదులు లేనివాడును, కృపాసాగరుడును, సర్వదా జ్ఞానసారమును గ్రహించు స్వభావము గలవాడును, పరబ్రహ్మస్వానుభవము గలవాడును, సర్వ సంశయములును ఛేదించిన నిస్సంశయుడును, క్షయకుష్ఠాదిరోగములు లేనివాడును, వైరాగ్యముతో గూడిన వాడును, సుందరుడును, మమకారము నశించిన వాడును, అహంకారము పోయినవాడును, శంక యుండనివాడును, వికల్పశూన్యుడును, అజ్ఞానము నాశము బొందినవాడును, శాస్త్రసార మెరింగినవాడును, పరమార్థ తత్త్వమైన బ్రహ్మమును విశేషముగా చింతచేయు స్వభావము గలవాడును, ఈలాటి యనేక సుగుణములు గలవాడు ఆచార్యుడు (గురువు) అని గ్రహింపవలయును. లేక నీచాచారముగలవారై, దుర్బోధనము జేయువారై ప్రాణి హింసకులైన క్రూరులు పెద్దలు గారని, అచింతియ విశ్వవనతార్కికాగమము జెప్పుచున్నది. ఇదంతయు గురులక్షణము.



## శిష్య లక్షణము

ఓ సుగుణ సంపన్నుడవైన సోదరుడా ! ఇప్పుడు శిష్యుని లక్షణముల జెప్ప బూనెదను. దీనిని మిగుల శ్రద్ధతో వినవలయును. మోక్షమునకు శిష్యుని శ్రద్ధాభక్తియే ముఖ్యసాధనము గాని మరియొక విధముచే గానేరదు.

ఉపదేశ క్రమో రామ వ్యవస్థా మాత్రపాలనమ్ ।
జ్ఞానస్య కారణం శుద్ధా శిష్యప్రజ్ఞైవ కేవలా ॥

ఓ శ్రీరాముడా ! ఉపదేశము వ్యవస్థాపాలనము కొఱకు మాత్రమే. జ్ఞానసిద్ధికి శిష్యుని శుద్ధమైన ప్రజ్ఞాబలమే ముఖ్యకారణమైయున్నది. కనుక, శిష్యునికి విషయవైరాగ్యము, మహాప్రజ్ఞయు నుండవలయును అని వాసిష్ఠము జెప్పుచున్నది. ఎవని శిరముపై శ్రీ గురుపాదోదకము బడలేదో, వారి తాపత్రయాగ్ని చల్లార సాధ్యము గాదు. ఎవరు గురోరుచ్ఛిష్టము భుజించలేదో, వారికి సంసారవ్యాధి శాంతము గానేరదు. ఎవరి శరీరముపై గురుపాదధూళి పడలేదో, వారి సంసార దుఃఖవ్రణము మానుటకు మార్గము లేదు. ఎవరు గురుకృప కొఱకై శరీరముతో పాటుపడలేదో, వారికి ఇంద్రియ నిగ్రహము సాధ్యము గాదు.

అజ్ఞానమూలహరణం జన్మకర్మ నివారణమ్ ।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ ॥
గురుపాదోదకం పానం గురోరుచ్ఛిష్ట భోజనమ్ ।

అనాదియైన యజ్ఞానమును మూలముతో నాశము జేయునదియు, జనన మరణములకు గారణమైన కర్మమును నివారణ జేయునదియునగు గురుపాదోదకము జ్ఞానవైరాగ్యసిద్ధికొఱకవశ్యముగా పానము జేయవలయును. గురు పాదతీర్థము, గురూచ్ఛిష్ట భోజనము శిష్యులకు మోక్షఫల ప్రాప్తికరమై యున్నవి.

గురుపదాంభోజముల్ గొలువక గల్గునే
ప్రవిమల వైరాగ్య భాగ్యమహిమ
గురుపాదతీర్థంబు గ్రోలక కల్గునే
జ్ఞానవిజ్ఞాన యోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్న గల్గునే
ప్రతిలేని చిత్తోపరతిసుఖంబు

గురుతత్త్వమాత్మ గన్గొనకున్న గల్గునే
నిరతిశయంబైన పరమపదము

అని సీతారామాంజనేయ సంవాదము జెప్పుచున్నది.

శ్రుతి ॥ తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ ।
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ ॥

ఆ విద్వాంసుడు, బాగుగా పరిపక్వమైన చిత్తముగలవాడును, విధి ప్రకారము శరణాగతి బొందినవాడును, అగు శిష్యునికి ఏ విజ్ఞానముచే సత్యమైన యక్షరపురుషుని గనుగొనునో యాబ్రహ్మవిద్యను సత్యముగా నుపదేశించెను ముండకోపనిషత్తు.

చాతుర్వర్ణ్యే తు సంజాతః శాస్త్రజ్ఞాన నిరూపకః ।
భక్తిజ్ఞాన విరాగేణ బుద్ధిమాన్ నీతిమాన్ సదా ॥
పురుషార్థ ప్రవక్తా చ సదా నిర్ణయ బుద్ధిమాన్ ।
శుశ్రూషాయాం చ కుశలో గురుకార్యే ప్రయత్నవాన్ ॥
సంతతం గురు శుశ్రూషా వాగుల్లంఘన భీరుకః ।
ఏతల్లక్షణసంపన్నః స శిష్యః పరికీర్తితః ॥
అమద్యపాస్తు యే శూద్రాః శౌచాచార క్రియాదరాః ।
శివభక్తాశ్చ హ్యేతేషాం దీక్షా కార్యాఽన్యథా న హి ॥
సర్వేషామేవశిష్యాణామధికం శతగుణం శృణు ।
భక్తిర్విశ్వాసమద్రోహో గుర్వాజ్ఞాపాలనస్థితిః ॥
శ్రద్ధా శాంతిః క్షమా సత్యం తథా శౌచం తపః శ్రుతమ్ ।
కృతజ్ఞతా ద్వాదశకం యస్య శిష్యస్య విద్యతే ॥
శిష్యాణాం చ ప్రధానశ్చ నాన్యే తే హి ప్రధానకాః ।

చతుర్వర్ణములయందు జన్మించిన వారెవరైనను సరే శాస్త్రజ్ఞాన నిరూపకుండునను, భక్తిజ్ఞాన విరాగవములచే సూక్ష్మబుద్ధి గలవాడునను, నీతిమంతుడును, పురుషార్థమైన మోక్షమునకు సర్వదా ప్రయత్న శీలుడును, సదా స్థిర బుద్ధిగలవాడును, గురు శుశ్రూష యందాసక్తిగలవాడును, సర్వదా గురు కార్యము కొఱకు పాటుపడువాడును, గురువచనోల్లంఘనమందు భయము గల వాడును, ఈలాటి లక్షణములు గలవాడు శిష్యుడని చెప్పుదురు. మద్య మాంసాది భోజనము లేనివారును, శౌచాచార క్రియలయందు ఆదరముగల వారును, ఈశ్వర భక్తియందు నిపుణులైనవారును శూద్రులైనను వారికి బ్రహ్మవిద్యాదీక్ష జేయవచ్చును. లేనివారికి గూడదు. శిష్యులందరికిని నూరు గుణము లధికమైనది వినుము. భక్తి, విశ్వాసము, అద్రోహము, గురునాజ్ఞను పూర్తిచేయుటకై ప్రయత్నించుట, శ్రద్ధ, పరమశాంతము, భూమివలె క్షమ, సత్యము, బహిరంతరశుద్ధి, తపస్సు, శాస్త్ర శ్రవణము, కృతజ్ఞత, ఈద్వాదశగుణము లెవరికి గలవో వారు శిష్యులలో ప్రధానులు. లేనివారు అప్రధానులు అని పరాక్యమందు జెప్పియున్నది.

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయార్జవమ్ ।**
**క్షమా ధృతిర్మితాహారః శౌచం చేతి యమా దశ ॥**

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, దయ, ఆర్జవము, క్షమ, ధృతి, మితాహారము, శౌచము అను నీ పదియును యమమనబడును.

**తపస్సంతోషమాస్తిక్యం దానమీశ్వరపూజనమ్ ।**
**వేదాంతశ్రవణం చైవ హ్రీర్మతిశ్చ జపో వ్రతమ్ ॥**

తపస్సు, సంతోషము, ఆస్తిక్యము, దానము, ఈశ్వరపూజనము, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము అను నీ పదియును నియమమనబడును.

---

## సూత సంహిత

విధ్యుక్తకర్మసంయుక్తః కామసంకల్పవర్జితః ।
యమైశ్చ నియమైర్యుక్తః సర్వసంగవివర్జితః ॥

కృతవిద్యో జితక్రోధః సత్యధర్మపరాయణః ।
గురుశుశ్రూషణరతః పితృమాతృపరాయణః ॥
స్వాశ్రమస్థః సదాచారో విద్వద్భిశ్చ సుశిక్షితః ॥

విధిప్రకారమైన కర్మము జేయువాడును, కామ సంకల్పము లేని వాడును, యమ నియమములతో గూడినవాడును, సంసారసంగవివర్జితుండును, శిక్షింపబడిన విద్యతో గూడినవాడును, కామ క్రోధములను జయించినవాడును, సత్యధర్మపరాయణుడును, గురుసేవయం దాసక్తిగల వాడును, తల్లిదండ్రులను బూజించువాడును, ఆశ్రమమందు స్థిరమైన వాడును, సదాచారము గలవాడును, మహాత్ములచే శిక్షింపబడినవాడుగా నుండవలయును.

మోక్షస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః ।
నిరాశా చ నిరీహా చ నిత్యమేకాంతశీలతా ॥

మోక్షమునకు మొట్టమొదట నుండవలసినది మితభాషణము, పరిగ్రహవివర్జనము, ఆశ లేకుండుట, కోరికలను నాశము సేయుట, సర్వదా యేకాంతమందుండుట అని వివేక చూడామణి చెప్పుచున్నది.

సత్సంగో వాసనాత్యాగోఽధ్యాత్మ విద్యావిచారణమ్ ।
ప్రాణస్పందనిరోధశ్చేత్యుపాయాశ్చేతసో జయే ॥

మనసు నశించి పరబ్రహ్మస్థితి గలుగుటకై నాలుగు సాధనములు ముముక్షువుల కత్యావశ్యకములు. దానిలో మొట్టమొదటిది సత్సంగము, రెండవది విషయవాసనాత్యాగము, మూడవది యధ్యాత్మవిద్యావిచారము, నాల్గవది ధ్యానయోగాభ్యాసము. ఇవి శిష్యునికి ముఖ్యముగా నుండవలసిన విధులు.

ఓ సాధన చతుష్టయ సంపన్నుడవైన సోదరుడా! నీవధికమైన ప్రశ్నల యందు గాలము గడుపక, శీఘ్రముగా స్వరూప స్థితినిబొంది శాశ్వతానంద నిర్వాణ సుఖమందుండుము వత్సా !

కేచిదాగమజాలేన కేచిన్నిగమసంకులైః ।
కేచిత్తర్కేణ ముహ్యంతి నైవ జానంతి తారకమ్ ॥

కొందరు ఆగమ శాస్త్ర మను వలయందు జిక్కియు, కొందరు వేద శాస్త్రవముల చదివియు, కాలవము వ్యర్థపుచ్చుచును, మరికొందరు పరమాణువాదమైన తర్కశాస్త్రముల నవలంబించియు, ఆత్మచింతజేయక మోహితులై సంసారసాగర తరణోపాయము దెలియక దుఃఖమునకు బాత్రులై నాశము బొందుచున్నారు. కనుక నిక ప్రశ్నల నిలుపుము. గురు, దైవ, భక్తితో గూడి కొంతకాలవము జనబాహుళ్యవములేని నిర్మల ప్రదేశవము జేరి, అవస్థాత్రయసాక్షియై పంచకోశ విలక్షణుడైన నీయొక్క స్వరూప స్థితిని ధ్యానించి బ్రహ్మానంద నిర్వాణ సుఖమందుండుము.



## స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము

పరమభక్తురాలైన నారాయణమ్మ యడిగిన ప్రశ్న.

ప్రశ్న॥ ఓ స్వామీ ! ఈ ఘోరసంసారసాగరమందు అజ్ఞాన మను నక్రముచే పట్టుబడి పరితపించు నన్ను భవదీయ కరుణాకటాక్షవీక్షణమను చక్రముచే దానిని ఖండించి, కృతార్థ యగునట్లు జేసి జననమరణ భవరోగమునుండి రక్షింపుము. నేను సుఖదుఃఖముల కాలయమైన యీ శరీర మను పంజరము (గూటి) లో జిక్కుబడిన పక్షివలె క్షుత్పిపాసాది షడూర్ముల చేతను, జరా మరణాది షడ్వికారమయమైన దేహ దుఃఖము చేతను, బాధనోర్వలేక నాయొక్క స్వరూపస్థితిని దెలుసుకొని విముక్తి నొందుటకై యనేక పండితులను వేడుకొనినప్పటికిని, వారు నాపై దయలేనివారై స్త్రీలు బ్రహ్మజ్ఞానమున కర్హులు గారనియు, అంతియే గాక పాపజన్ము లనియు, ఇదియుంగాక శౌచహీను లనియు, జెప్పి నా మనోభిలాష నెరవేర్చకపోయిరి. ఇది శాస్త్ర సమ్మతమా ! అంతట నేను జలము నశించిన చోటనుండు మత్స్యము వలెను, దావాగ్ని మధ్యమందు జీవరక్షణార్థము బరితపించు లేడివలెను సంసారాగ్నిచే బరితపించుచున్న దానను. నాపై సర్వజీవులను రక్షించు కరుణాసముద్రుండైన యాభగవంతునికైనా దయ రాలేదే ?

ఉత్తరము॥ ఓ పరమపవిత్రమైన ప్రియసోదరీ ! నీయొక్క వైరాగ్యాది మాటల విన్నంతమాత్రముననే నాకత్యంత సంతోషమైనది. ఇకమీద భవరోగము

నీకు రాదు. దయాసముద్రుండైన శ్రీ పరమేశ్వరుండు మనల రక్షించును. పరితపింపకుము. నేటివరకు నీ ప్రారబ్ధముచే దుఃఖించితివని శాంతవచనములచే హృదయానందము గలుగజేసి యిట్లనియె.

తల్లీ! అధ్యాత్మ జ్ఞానమను మహాధనమునకు సమస్తమైన స్త్రీ పురుషులు స్వతంత్రులే. అది వారివారి హృదయస్థమే గాని మరి యేమియును గాదు. నేత్రములచే జూచుటకున్ను, జిహ్వచే రసము గ్రహించుటకును, పాదములచే సంచరించుటకున్ను, వారివారి కేలాగున యధికారము గలదో, ఆలాగుననే వారందరున్ను మనసుచే ధ్యానించి శాశ్వతానంద మోక్షసుఖమును బొంద వచ్చును. ఇది మద్గురు స్వాముల దివ్యశ్రీపాదపద్మముల సాక్షిగా సత్యము. నేత్రరోగములు లేని వారందరును ఏలాగున సూర్యుని దర్శింతురో, ఆలాగుననే యీశ్వర కరుణ యనెడు దివ్యాంజనముచే నజ్ఞాన తిమిరము దొలగిన వారందరును పరమాత్మను దర్శింతురు. ఇది నిర్మలమైన వేదముయొక్క నిశ్చయాభిప్రాయము. సజ్జన సమ్మతము. ఇంక నీయొక్క విచారముకొఱకై వేదశాస్త్రాభిప్రాయము గొంత జెప్పెద. సావధాన చిత్తము గలదానవై ఆకర్ణింపుము.

1. కరుణామూర్తియైన శ్రీకైలాసవాసియగు పరమేశ్వరుడు సమస్తమైన వేద వేదాంతరహస్యములను జగజ్జననియగు పార్వతీదేవి కుపదేశించినట్లు శాస్త్రమందు గన్పట్టుచున్నది. ఆలాగుననే పరమాత్ముడైన శ్రీమన్నారాయణుండు భూదేవికి బోధించునట్లు వైష్ణవాగమాద్యనేక పురాణములయందు జెప్పియున్నది. దీనిని బట్టి యోచించిన యెడల స్త్రీలు బ్రహ్మవిద్య కధికారులు గానిచో, ఆ దయామూర్తు లేల జెప్పుదురు ?

2. చతుష్షష్టికలా స్వరూపిణియగు శ్రీ భారతి స్త్రీ గాదా ?

**''యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవైస్సదా పూజితా''**

అని శాస్త్రమందు గన్పట్టుచున్నది.

3. యాజ్ఞవల్క్యమహర్షి బృహదారణ్యకోపనిషత్తులో, తన భార్యయైన మైత్రేయికిన్ని, శ్రీ కపిలాచార్యుండు సాంఖ్యశాస్త్రమందు దన తల్లియైన దేవహూతికిని బ్రహ్మతత్త్వమును బోధించిన విషయము లోకమంతయు

విదితము గదా ! మతంగ మహర్షి యను ఋషిపుంగవుడు శబరిని జ్ఞానవతిని జేసిన విషయము రామాయణ ప్రసిద్ధము గదా ! చూడాల యను మహాయోగిని తన భర్తయైన శిఖిధ్వజ మహారాజుకు బ్రహ్మతత్త్వోపదేశము జేసినట్లు వాసిష్ఠమందు గన్పట్టుచున్నది. సులభ యను నొక గొప్పయోగిని జీవన్ముక్తుడైన జనకమహారాజును గూడ ననేక విధములుగా శోధించిన కథ వినలేదా ? ఇదియునుం గాక, శ్రీ భక్తవిజయమందు సక్కుబాయి, మీరాబాయి మొదలగు అనేక స్త్రీ రత్నములు, మహాత్ములైన కథ లోకవిఖ్యాతమై యున్నది. వైష్ణవ భక్తాగ్రేసరులైన పండ్రెండు మంది ఆళ్వారుల కథలుగల దివ్యప్రబంధమందు ఆన్డాళ్ అను మహతి యొక్క విషయము లోకమంతయును దెలిసినది గదా! ఆలాగుననే, శివభక్త దురంధరులైన అరవై ముగ్గురు నాయనారులలో మహిళానాయకీయమ్మ గారు, కారక్కాలమ్మగారు మొదలైన వారు మహాపరమ పవిత్రలే. ఈ కథ పెరియపురాణమందు గనందగును. అంతదూర మెందుకు బోవలె ? మన శ్రీ తరిగొండ వెంగమాంబ యను మహాయోగిని మహిమను జెప్పనలవి యగునా? దిగంత విశ్రాంత కీర్తిగల శ్రీ భగవాన్ రామకృష్ణ పరమహంస దేవుని గురువు ఒక పరమయోగిని అను విషయము నాకు బాగుగా దెలిసినదియే.

లోకవిఖ్యాతుడైన శ్రీ వివేకానందస్వామి శిష్యకోట్లలో శ్రీ సోదరి నివేదితయను స్త్రీ రత్నము పరమ పవిత్రయైన మహాయోగిని. ఈమె ఉత్తర హిందూస్థానములో ననేక చోట్లలో స్త్రీలకొరకై యోగమంఠములు, విద్యామందిరముల స్థాపించిన పుణ్యవతి. ఈమె సమాధిబొంది య్యేదు సంవత్సరములైనది. ఈ పుణ్యశీల ఆంగ్లేయభాషయందనేక గ్రంథముల రచించియున్నది.

ఇంక కాయకీయాభ్యాస విషయమై సెండు తారాబాయికి సమమైన పురుషుడు గలడా !

గానవిద్యయందు ప్రత్యక్ష శారదయైన గోహర్‌జాన్ అను స్త్రీ రత్నము కంటె భూలోకమందతిశయమైన విద్వాంసు లెవరు గలరు ? అధ్యాత్మ జ్ఞాన విషయమై శ్రీ అనిబిసెంటమ్మ గారెంత గొప్పవారు, ఈమె భగవద్గీతాది అనేక

గ్రంథములకు ఆంగ్లేయభాషయందు భాష్యము రచించినది. వీరికనేక వేద బ్రాహ్మణులు గూడ శిష్యులు గలరు.

స్త్రీలకు బ్రహ్మ విద్యయం దధికారము లేదని చెప్పువారు వీరికి జ్ఞానము గలిగిన యెడల, తమ విషయభోగములకు భంగము గలుగునను సందేహముతో జెప్పియుండవచ్చును గాని, శాస్త్రసమ్మతము గాదు.

స్త్రీలకు రోగము వచ్చునప్పుడు ఔషధము పుచ్చుకొనుట కధికారమున్న యెడల, మహా బాధాకరమగు ఈ యజ్ఞానవ్యాధిని తొలగించుకొనుటకు జ్ఞాన మవలంబింపవచ్చును.

ఈ విషయము జెప్పుట కనేక దృష్టాంతములు గలవు కాని గ్రంథ విస్తారభీతిచే నిలుపడమైనది, ఈ బ్రహ్మవిద్య నభ్యసించు వారికి సాధన చతుష్టయ సంపత్తి గుణములు మాత్రము పూర్తిగా నుండవలయును. లేని యెడల నిష్ప్రయోజనము.

మరియు పరిశుద్ధురాలవగు సోదరీ ! దేహబుద్ధితో జూచినను పురుషుని కంటె స్త్రీలకు జ్ఞానము ముఖ్యముగా నుండవలెను. ఏలన మనమందరమును బుద్ధివచ్చు వరకు తల్లివద్ద నుండుటచే తల్లియొక్క గుణములే బిడ్డలకు దప్పక గలుగును గదా ? తండ్రి దగ్గర బుద్ధి వచ్చిన తరువాతనే ఏమైన గుణములు నేర్చుటకు సాధ్యమగును. తల్లి భక్తురాలైనచో చిన్న కాలమందుండి బిడ్డలకు జీవకారుణ్యము, దైవభక్తి, పుణ్యకర్మము, సాత్త్వికాహారము, భగవత్ సంకీర్తనములు అన్నియున్ను సులభముగా నేర్పించును. అదియునుంగాక చిన్నకాలమున బిడ్డలను మంచి మంచి కీర్తనములున్ను, వేదాంత తత్త్వములను పాడి శాంతపరచుటే గాని, యిప్పుడు బిడ్డలకొరకు పాడెడు నీచపుమాట లుండవుగదా ! మరియు, పురుషుల సౌఖ్యమంతయును, స్త్రీల శిరమునందుడునే గాని పురుషునిచే నేమియును సాధ్యము గాదు. స్త్రీ మంచిదైనచో, పురుషునియొక్క జన్మసాఫల్యము సులభముగా జేకూరునని శాస్త్రము జెప్పుచున్నది. లేనిచో, పురుషునకు దానికన్న గొప్ప ఘోరనరకము మరియొకటి యుండదు. చిన్న కాలమందుండి బిడ్డలకు మంచి నడతలను నేర్పినచో, అవి యెప్పటికిన్ని నశింపవు. ఒక గుమ్మడితీగ దేనిని

ఆశ్రయించునో, దాని నుండి వేరుపరప సాధ్యముగానట్లు చిన్న కాలమందుండు స్వభావము మార్చుట కష్టతరము.

మరియొక్క గొప్పరహస్యము గలదు. అదియేమన, స్త్రీలు గర్భముతో గూడియుండు కాలమున వారి విచారము ననుసరించి, సంతానము దప్పక గలుగును. విచారమొక్క మూసవంటిది. మనస్సు కరిగిన కంచువంటిది. కరిగిన కంచుకు ప్రత్యేకరూపము లేదు. మూసయొక్క యాకృతి యెట్లుండునో దానియందు బోయంబడిన కంచు ఆ యాకృతిని ధరించునట్లు గర్భిణీస్త్రీ విచారము ననుసరించి బిడ్డలుద్భవింతురు. దీనికి ప్రహ్లాదుడున్ను, అభిమన్యుడును సాక్షులు. ప్రహ్లాదు డసుర బీజమైనను తల్లి గర్భమందుండు కాలమున శ్రీనారదమహర్షియొక్క శుశ్రూష చేసి వారి యుపదేశ ప్రకారము పరమాత్మను ధ్యానించుటచే భాగవతోత్తముడై జన్మించెను. శ్రీమత్ భాగవతమున ఈ సంగతి విశదముగ గనందగును. ఆలాగుననే, అభిమన్యుడు గర్భమందుండు కాలమున అర్జునుడు పద్మవ్యూహములో బ్రవేశించి వెనుకకు వచ్చే మార్గము జెప్పుటకు ముందుగా గరుణామయుండు శ్రీ కృష్ణస్వామి యడ్డగించినట్లు పురాణకథ గలదు. గర్భిణీ స్త్రీలను భయపెట్టరాదనియు, భయంకరకృత్యముల జూపరాదనియు, భయోద్భూతమగు మాటలు భర్తగూడ జెప్పరాదనియు, శాంతమగు ఆహారము బెట్టవలయుననియు, మంచి మంచి సత్కథలను వినిపించ వలయుననియు, దైవభక్తితో నుండవలయుననియు శాస్త్రము జెప్పుటకిదే కారణము. ఆదికాలమున అందరున్ను పరమభక్తులై జ్ఞాననిష్ఠయందు స్త్రీలుండు కారణముచే, శిశువులు గూడ మహాజ్ఞానవంతులై కలుగుటకు గారణమైనది. గర్భకాలమున స్త్రీలు పరమాత్మ ధ్యాననిష్ఠతో గూడియుండినచో, అదే రీతిగా పుత్రులు గూడ జ్ఞానులై జన్మించుదురు. ఇది సమస్త శాస్త్రముల సమ్మతము. అయ్యో ! మన తండ్రులు మన తల్లులను, భగవద్భక్తి సలుపుటకును, పరమాత్మ ధ్యానము జేయుటకును గొంచెము దయచూపి మార్గమిచ్చినచో మనమందరమును, జ్ఞానమూర్తులమై జన్మించియుందుము గదా? ఆ స్థితి గలుగని కారణముచే నీ కష్టమునకు గారణమైనది. కాబట్టి యిక మీదనైనను పురుషులు తమ భార్యలను జట్కాబండికి గట్టుట కొరకు డబ్బిచ్చికొన్న గుఱ్ఱము వలె దమ తుచ్ఛభోగములకు మాత్రము

గొనినదని ఘోరపాపబుద్ధిని మాని వారిచే గూడ జప ధ్యాననిష్ఠలను జేయించి సత్పుత్రులను గని శాశ్వత సుఖమూర్తులై యుండుట కొరకు గరుణామూర్తియగు పరమేశ్వరుని నేను ప్రార్థించుచున్నాను. ఈ సంగతి శ్రీ వివేకానందస్వాములవా రప్పుడప్పుడును జెప్పుచునే యుండిరి. తనకు సిద్ధించిన సమస్త జ్ఞానములును తన తల్లి వలన సిద్ధించిన వనియు, తన తల్లి పుత్రసంతానములేక శ్రీ కాశియందు బహుకాలము పరమశివుని ధ్యానించుచుండెననియు, అచ్చట నుండి వచ్చిన తరువాత తాను జన్మించితి ననియు జెప్పిరి.

ఈ విషయమై దివ్యజ్ఞానదీపిక యందొక్క వ్యాసమును నేను జదివి యుంటివి. అదేమన, ఇంగ్లాండు రాజ్యములో నొక్క దరిద్ర స్త్రీకొక్క కుమారు డుండెను. ఆ బాలుడు చిన్న కాలమునందుండి యితర బాలురను గొట్టుట, కొరుకుట, ప్రాణులను జంపుట మొదలగు క్రూరకృత్యముల జేయుచుండెను, కొంచెము ప్రాయము వచ్చిన తరువాత కత్తి చేతిలో నుంచుకొని సర్వదా సమయము దొరకునప్పు డితరుల మేకలను, గోవులు మొదలగు జంతువులను, వ్యర్థముగా జంపుటయు ఆఖరికి మనుష్యులను గూడ నేకాంతముగా దొరికినచో, తల నరుకుటకే ప్రారంభించెను. ఈ పని యంతయు నిష్కారణముగా జేయుటచే వానికి మరణదండన కోర్టువారు విధింపక గొప్ప గొప్ప శాస్త్రజ్ఞులతో దీని కారణమును గనుగొనుటకై యేర్పాటు చేసిరి. ఆ శాస్త్రజ్ఞులు జెప్పినది యనేక విధములుగా నుండుటచే సరియగు నమ్మకము దొరకలేదు. తరువాత నొక మహాగొప్పబుద్ధిశాలి, దుర్మార్గుడైన వీని తల్లిని విచారించెను. మీ కుమారుడిట్లుండుటకు గారణము నీకేమైనా దెలియునా ? నీవు గర్భకాలమం దేయేపనుల జేసితివి ? అని యడిగెను, అప్పుడా స్త్రీ తాను పరమ దరిద్రురాల ననియు, గోహత్య జేయుస్థలము శుద్ధిపరచుచు ఆ కూలిచే జీవించుదానననియు, గోవులను మేకలను జంపునపుడు కర చరణముల బట్టుకొనుటయు, చర్మమువుదీయుటలో బాలుగొనుటయు, ఆలాటి పనియంతయు మహాసంతోషమనియు, రాత్రియంతయు, రేపెన్ని జంతువుల జంపునో అది యెట్లుండునో యని సర్వదా విచారించుటే తన పనియని చెప్పెను. అప్పుడా మహాశాస్త్రజ్ఞుడగు డాక్టరు శిశువు గర్భమందుండు కాలమున స్త్రీ యొక్క

సంకల్పము ననుసరించినది పుత్రుడగువాని వృత్తియని తీర్మానించెను. ఈ విధి మనుజులకు మాత్రమే గాక, జంతువులకు కూడ గలదు. కొన్ని స్థలములలో ఆడు గుఱ్ఱమునకు ఋతుకాలము ( విషయోద్రేక సమయము) కనిపెట్టి యొక గొప్ప సమస్త లక్షణములు గల మగగుఱ్ఱమును, ఆయాడు గుఱ్ఱమువద్ద నిలుపుటయు, ముఖము నాకించుటయు మొదలగు విషయ చేష్టలను జేయించి ఆడు గుఱ్ఱముయొక్క కన్ను గట్టివేసి యా మంచి మగ గుఱ్ఱమును దూరముగా దీసుకొనిపోయి, మరియొక సామాన్య మగ గుఱ్ఱమును దెచ్చి యాడు గుఱ్ఱముపై విడిచిన తరువాత యామగ గుఱ్ఱమును బట్టి దూరముగ దీసుకొనిపోయి ముందు చూపిన గొప్ప లక్షణవంతమగు గుఱ్ఱమును దెచ్చి యెదుట నిలిపి యాడు గుఱ్ఱము కన్ను కట్టు తీసివేసి మగ గుఱ్ఱమును గొంత సేపచ్చటనే యుంచి తరువాత దానిని అది నివసించు తావుకు జేర్చుదురు. ఇట్లెందుకు జేయవలెనంటే, గర్భోత్పత్తి కాలమున ఆడుగుఱ్ఱము ఏ మగ గుఱ్ఱమును జూచి తలచుచుండునో, ఆ గుఱ్ఱము వంటి లక్షణములుగల శిశువును బ్రసవించుట స్వాభావికమైనందున శ్రేష్ఠతమమైన గుఱ్ఱమును బడయుట కట్లు జేయుదురు. దీనియందుండు రహస్యమేమన. ఆడుగుఱ్ఱముయొక్క భావన మెట్లుండునో యట్లుండు శిశువు బుట్టును. ఇట్లు మృగమునకు గూడ నుండునపుడు, అధికబుద్ధిగల మనుష్యుల కార్యము జెప్పవలెనా ! కనుక ఏ విధముగా జూచినను పురుషులకంటె ఎక్కువ స్త్రీలకు జ్ఞానమత్యావశ్యకము. స్త్రీలు గర్భకాలమందు దురాచారులై యుండినచో వారికప్పుడు బుట్టినవారు క్రూరస్వభావులైమెలగుదురు. ఆలాగుననే సదాచారులై దైవభక్తి పరులై యుండినచో సత్సంతానములు గలిగి తల్లిదండ్రులను గూడ గడతేర్చెదరు.

## బ్రహ్మధ్యానమునకు కాలసమయముల జూడపనిలేదు

ప్రశ్న॥ అయ్యా, నాయనా! నన్ను బహుదినములనుండి యొక గొప్ప సంశయము బాధించుచునే యున్నది. అది సాధారణమైన వారినడుగందగినది కాదు. తమతో గాక, మరియెవరితో నేనా సంగతి మనవిజేసి సంశయ నివృత్తి జేసుకొనగలను ? అది యేమన, నేనాడుదాన నైనందున ఋతుకాలమందు బ్రతిదినము రీతిగా బరబ్రహ్మధ్యానము జేయవచ్చునా ? లేదా?

ఉత్తరము॥ అమ్మా! తల్లీ! యీ ప్రశ్న మిక్కిలి యుపయోగకరమైనది. ఈ సంశయ మనేకులకు గలదు. ఇది గొప్ప సంగతి; ఈ విషయము దేహబుద్ధిగలవారిని నిండా బాధించునే గాని, ఆత్మబుద్ధి గలవారికీ సంశయముండనే యుండదు. పరబ్రహ్మ నిష్ఠ సర్వదా యుండవలయును. ఆత్మ సదా శుద్ధ, బుద్ధ, ముక్తమైయుండును. దానికి దేహేంద్రియములతో నేయొక్క సంబంధమును లేదు. కనుక, కాలభేద విచారము జేయకనే బ్రహ్మనిష్ఠ జేయవలయును. కాని శాస్త్రమందు కొంతవిరోధము జెప్పియుండవచ్చును. శాస్త్రము కర్మ కాండమనియు, జ్ఞానకాండమనియు నిరుతెగలు. కర్మకాండవిధి ననుసరించిన కార్యములు ఋతుకాలమున జేయరాదు. అవి యజ్ఞాది క్రతువులు. ఋతుకాలమందు బ్రహ్మనిష్ఠలగు స్త్రీలు దేవతార్చన, గ్రంథపారాయణము, తంబుర మొదలగు వాద్యములతో భజనచేయుట, కృష్ణాజినాది ఆసనములలో గూర్చుండుట, తులసి రుద్రాక్షాది మాలలతో జపమాచరించుట మొదలగు కొన్ని కర్మకాండక్రియలు జేయరాదు. చేసినచో శాస్త్ర విరోధము. బ్రహ్మధ్యానము మాత్రము తప్పక జేయవచ్చును. ఏలయన, పరమాత్మ సర్వదా తానై తన హృదయమందుండును. అది అఖండము, సర్వవ్యాపి, సర్వత్ర శుద్ధము అయియున్నది. విగ్రహాది పూజలవిషయమై చెప్పినవన్నియు ఖండములు కనుక దేహమున కన్యములు. ఆలాటి వస్తువులు ఋతుకాలములో ముట్టుట మంచిది కాదు. అవి యంతయున్ను నిజస్వరూప మెరిగినవారికి అనావశ్యకము. ఆత్మ ఋతుకాలమందును, ఇతర కాలములయందు గూడ తానై తనయందుండునది. అది సజాతీయవిజాతీయస్వగత భేదరహితము. కనుక సర్వావస్థలలో, సర్వకాలములయందు ధ్యానింపవచ్చును. ఋతుకాలమందు ధ్యానము జేయగూడదని చెప్పినచో నొక గొప్ప యపాయమునకు మార్గము కలుగును. అదేమన శ్రీకృష్ణభగవంతుడు గీత యందెనిమిదవ యధ్యాయములో మరణసమయమున నేయే విచారములుండునో, జీవుడా స్థితిని తప్పక పొందునని చెప్పెను. కనుక బహుకాలము బ్రహ్మనిష్ఠయందుండినను మరణకాలమున ధ్యానము లేనిచో గొప్ప ఫలము గలుగుట కవకాశము లేదు. కాబట్టి యింతకాలము కష్టపడి ఋతుకాలములో ప్రాణము పోయినచో నా సమయమున ధ్యానమందు

లేనియెడల నేమి ప్రయోజనము ? కావున నిరంతరము స్వరూప ధ్యానము విడువరాదు. ఏ సమయమందు ప్రాణము పోవునో, తెలియుట కష్టము కనుకనే వేదాంతశాస్త్రమందు అశుచితో నుండిగాని సర్వదా ధ్యానము మరువరాదని చెప్పు రహస్యము. అశుచి కాలమందు గూడ ధ్యానించుట యిప్పుడే యలవాటు జేయవలయును. మరణ సమయమందు శుచియై నిష్ఠయందుండి ప్రాణముల విడుచుట నిండా దుస్తరము ? కాబట్టి యశుచికాలమందును ధ్యానించుట యభ్యసించినచో నప్పుడు సంశయముండదు. లేక శుచికాలమందు మాత్రము ధ్యానించి, శీలించినచో మరణసమయమందు అయ్యో ! స్నాన, శౌచాదులజేయక ఎట్లు పరమాత్మను ధ్యానింపవచ్చునని సందేహము గలుగును. అప్పుడు స్నాన, శౌచాదిక్రియలకు దగు సౌకర్యము గలుగునని నమ్మరాదు. శరీరాదులం దెంత మాలిన్యముండినను ఆత్మకవి యంటవు. దుర్గంధజలమందు, ప్రతిబింబించిన సూర్యున కా దుర్వాసన యంటునని తలంచు టెంతబుద్ధిహీనత, ఆలాగుననే దేహి దేహములయొక్క స్థితి, అమ్మా తల్లీ యీ విషయమై శాస్త్రమందు జెప్పిన సంగతుల గొన్ని జెప్పెదను వినుము.

**యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః ।**
**క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥**

ఓ యర్జునా ! ఒక్క సూర్యుడు లోకమంతయు బ్రకాశము జేయుచుండినను, లోకము దనయందెట్లుండదో అట్లే యాత్మ యన్ని జీవరాసులలోను ప్రకాశించుచుండినను ఆ శరీరాది దోషము లాత్మనంటవు.

**క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవ మంతరం జ్ఞానచక్షుషా ।**
**భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్ ॥**

ఈ రీతిగా క్షేత్రక్షేత్రజ్ఞుల భేదాభేదములను జ్ఞానదృష్టిచే నెవరు దెలుసుకొందురో, మరియు భూతములయొక్క ప్రకృతినుండి మోక్షమున కుపాయమగు ధ్యానాదుల నెవరు సూక్ష్మదృష్టిచే నెరుంగుదురో వారు నిస్సంశయముగ ముక్తినొందుదురు అని భగవంతు డుపదేశించియున్నాడు.

**తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।**
**పశ్యత్యకృతిబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥**

ఇట్లుండగా నెవడు నిరుపాధికమును, నిస్సంగమును అగు ఒక్క యాత్మనే కారణముగా జూచునో, వాడు మనస్సును పరిశోధన జేయుని కారణముచే మలినబుద్ధి గలవాడు. తమోగుణముచే దేహాత్మ బుద్ధిగల మూఢుడు. వీడాత్మతత్త్వమును యథార్థముగా నెరుంగజాలడు అని భగవద్వచనము.

దేహోఽహమిత్యేవ జడస్య బుద్ధి
ర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః ।
వివేకవిజ్ఞానవతో మహాత్మనో
బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాత్మని ॥

తమోగుణముచే జడబుద్ధిగలవానికి, దేహమే తానను బుద్ధి దృఢపడి యుండును. కొంచెము చదివి నిర్మల బుద్ధిగలవానికి, జీవుడు తానను బుద్ధి బలపడియుండును. ఆత్మానాత్మ విచారముచే బ్రహ్మబోధ గల మహాత్మునకు నిత్యశుద్ధముక్తుడగు బ్రహ్మమే తానను బుద్ధి సర్వదా యాత్మయందు ప్రకాశించుచుండును అని వివేక చూడామణి.

సా కాల సూత్రపదవీ సా మహావీచివాగురా ।
సాఽసిపత్ర వనశ్రేణీ దేహోఽహ మితి యా మతిః ॥

దేహమే తాననెడు యేయొక్క బుద్ధిగలదో, అదిమే కాలసూత్రనరక పదవి. ఆ దేహబుద్ధియే ఘోరమగు సంసారసాగరము. ఆ దేహము తాననెడు బుద్ధియే అసివనమని శాస్త్రమందు జెప్పు నరకసమూహము. కనుక కంఠగత ప్రాణమగు కష్టము తటస్థించినను దేహబుద్ధి యను విచారమును విడిచి సాక్షి యగు బోధమే తానను బుద్ధి సర్వదా విడువరాదని సిద్ధగీతయందు జనకుల కుపదేశించిరి.

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥

ఓ యర్జునా ! మరణకాలమునం దేయే భావమును స్మరించి జీవులు దేహమును విడుచుదురో, ఆయా అవస్థను దప్పక పొందుదురు. కారణమేమనన,

తత్పూర్వమం దే భావన తన హృదయమున భాసితమైయుండునో, మృతిసమయమున నదియే గలుగును. కనుక సర్వదా పరమేశ్వరధ్యానము మరువరాదు అని భావము.

**తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర ॥**

ఓ యర్జునా ! సర్వకాలముల సర్వావస్థలయందు పరమాత్ముడగు నారాయణుని ధ్యానించుచుండవలెను. ఇట్లు జెప్పుటచే కాల సమయముల జూడ నక్కర లేదు. మరియు, అన్ని మంత్రములకన్న అజప గాయత్రి ముఖ్యమైనది. ఈ యజపామంత్రము జీవులు ఋతుకాలమందుగాని, రతికాలమందు గాని, సర్వదా దినమొక్కింటికి 21 వేల ఆరునూర్లు జపించుచునే యున్నారు. ఈ రహస్యము ముఖ్యముగా బ్రహ్మవేత్తలందరికిని దెలియందగినది.

**సకారేణ బహిర్యాతి హకారేణ విశేత్పునః ।**
**హంసహంసేతి యన్మంత్రం జీవో జపతి సర్వదా ॥**

హృదయకమలమందుండి సకారముచే బహిర్భాగమునకు బోయి, మరల హకారముతో నంతర్భాగమున బ్రవేశించి, సోఽహం, సోఽహం, అని సర్వదా జీవబ్రహ్మైక్య మహామంత్రజపము జరుగుచునే యుండును. ఈ రహస్యము దెలియకనే బద్ధులగుచున్నారు.

**అత్యంత మలినో దేహో దేహీ త్వత్యంత నిర్మలః ।**
**ఉభయోరంతరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే ॥**

పంచభూత సమ్మేళనమై మలమూత్ర క్రిమికీటక సంకులమైన యీ దేహ మెవరిదైనను సరే సర్వదా యశుచియే. శుద్ధమై ముక్తమై యుండెడు ఆత్మ సర్వదా పరిశుద్ధముగనే యున్నది. ఈ రెంటియొక్క రహస్యము తెలిసినచో, శౌచ విధి యెవనికొరకు జెప్పినదని గోచరమగును. ఒకవేళ శౌచాచారాది క్రియలు దేహమందు జరిపినను హృదయము శుద్ధిచేయుట యెవరితరము ? హృదయమునుండి గదా సమస్తమంత్రములు గాని ధ్యానములుగాని, వేదాధ్యయనములు గాని జరుగుచున్నవి. అచ్చోటు గడుగువారెవరైనను గలరా ?

ఎంగిలి పాత్రను పై భాగము శుద్ధముగా గడిగి, లోపల బహుదినములనుండి యుండు ఎంగిలిని కడుగక దుర్వాసనతో నుండునపుడు, ఆ పాత్రము శుద్ధమని చెప్పుటెంత వెఱ్ఱితనము ?

**సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరం స్మృతమ్ ।**
**యోఽర్థే శుచిః స తు శుచిః న మృద్వారి శుచిశ్శుచిః ॥**

సమస్త శౌచాది క్రియలలో మనఃపారిశుధ్యము గొప్ప శుద్ధియని మహర్షులు దలంచుదురు. ఎవడు నిర్మలాత్ముడై యుండునో, వాడెంత యశుద్ధముగా నుండినను మహాశుచిగలవాడే. ఆత్మశుద్ధిలేనివాడు మృజ్జలాదులచే నెన్ని విధముల శుద్ధిజేసినను మహా యశుద్ధుడని చాణక్యస్మృతి.

**వాచాం శౌచం చ మనసః శౌచమింద్రియ నిగ్రహః ।**
**సర్వభూత దయా శౌచ మేతచ్ఛౌచం పరార్థినామ్ ॥**

పరమార్థచింత జేయువారికి నుండవలసిన శౌచము హితోపదేశము జెప్పుచున్నది. 1. వాక్శుద్ధి. అనగా సత్యముగాను, భూతహితముగాను, మధురముగాను బలుకుట. 2. మనశ్శుద్ధి. అనగా చెడ్డతలంపు లేకుండుట (విషయవాసనా రహితమైయుండుట.) 3. చక్షురాదీంద్రియశుద్ధి. అనగా నేత్రాదీంద్రియములు వాటి వాటి విషయములగు చెడ్డవృత్తులలో ప్రవేశింపకుండుట. 4. సమస్త ప్రాణులయందు గారుణ్య ముండుట. ఇవియే నిజమగు శుద్ధి.

**జ్ఞానశౌచం పరిత్యజ్య బాహ్యే యో రమతే నరః ।**
**స మూఢః కాంచనం త్యక్త్వా లోష్టం గృహ్ణాతి సువ్రత! ॥**

పై జెప్పిన జ్ఞానశౌచమునుపేక్షించి బాహ్యశౌచమందు మగ్నులైనవారు, అనగా పై గుణములు లేక త్రిసంధ్యాస్నానములు, ద్వాదశోర్ధ్వపుండ్రములు, షోడశవిభూతి త్రిపుండ్రములు, తులసి రుద్రాక్షాదిమాలలు, మడినవస్త్రములు మొదలగు బాహ్యాచారక్రియల గ్రహించియుండువారి వివేక మెట్లుండు ననగా, చేతియందుండు సువర్ణమును పారవేసి గాజురాతిని స్వీకరించినట్లుండును.

**రత్యంతరే మూత్ర పురీషయోర్వా**
**చండాలవేశ్మన్యథవా శ్మశానే ।**
**కృతప్రయత్నోఽప్యకృత ప్రయత్నః**
**సదా స్మరేత్ కేశవనామధేయమ్ ॥**

రతికాలమందు గాని, మలమూత్ర విసర్జన సమయమందు గాని, మాలపల్లెయందు గాని, శ్మశానభూమియందుండి గాని స్నాన సంధ్యాది కృత్యములచే శుచితో గూడి గాని, లేక కాలు చేతులు కడుగకనే గాని, సర్వేశ్వర స్మరణధ్యాన కీర్తనముల జేయవచ్చునని వైశ్వానరస్మృతి చెప్పుచున్నది.

**నో దేశ కాలనియమః శౌచాశౌచ విన్నిర్ణయః ।**
**పరం సంకీర్తనాదేవ రామరామేతి ముచ్యతే ॥**

పరమాత్మ ధ్యానమునకు దేశకాల నియమము లేదు, దేశమనగా పుణ్యస్థలము గాని లేక అశుద్ధమగు మలినభూమి యందుండి గాని, కాలమనగా నుదయాస్తమానాది సమయములందు గాని అనగా సర్వదా ధ్యానము జేయవచ్చుననుట. లేక ఋతుకాలము, సూతక కాలము, మొదలైన కాలభేదమున్ను నియమము అనగా స్నానం, మడి, ఆసనాదులు లేకనే ధ్యానము జేయవచ్చును. ఆలాగుననే శుద్ధితోగూడిగాని, యశుద్ధముగా నుండినప్పుడుగాని ధ్యానము జేయువచ్చును. శ్రీరామరామ అను పరమాత్మ్రష్టమగు సంకీర్తనము ఏ సమయమందుజేసినను బంధమునుండి విముక్తు డగును.

**శుచిర్వాఽప్యశుచిర్వాపి యో జపేత్ ప్రణవం సదా।**
**స న లిప్యతి పాపేన పద్మపత్ర మివాంభసా ॥**

శుచితో గూడిగాని, అశుచియందుండునప్పుడు గాని, యెవడు పరమాత్మను ధ్యానించునో వాడు తామరా కేలాగున నీటిలో దడవకుండునో యాలాగున సంసారమాలిన్యముచే స్పర్శింపబడడు అని యోగచూడామణ్యుపనిషత్. మరియు, నీ విషయమై మూఢులు సర్వదా తెలిసికొనుటకై సంధ్యావందనమున నీరహస్య మంత్రమును బఠించవలయునని విధించియున్నది.

**అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।**
**యస్స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః ॥**

స్నానాదిక్రియలచే శుద్ధుడై గాని, స్నాన సంధ్యాదులజేయక యశుద్ధుడైగాని, లేక అన్ని యవస్థలను బొందియుండి గాని, అనగా అశౌచము గాని, సూతకము గాని, మలమూత్ర విసర్జనము జేసిగాని, స్త్రీయైనచో బ్రసవించియుండునప్పుడు గాని, ఇంటికి దూరముగా నుండునప్పుడు గాని పరమాత్మధ్యానము జేయవచ్చును. అట్లు ధ్యానించువారాధ్యాన పవిత్రతచే నశుచియైనవారైనను నప్పుడే అంతశ్శుద్ధియును, బాహ్యశుద్ధియును గలిగినవారగుదురు.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥**

ఓ యర్జునా; నీవు లోకమందెన్నెన్ని ధర్మములు గలవో వాటినన్నిటిని విడిచిపెట్టి, పరమాత్ముడగు నన్నొక్కరిని శరణుబొందుము. నేను నిన్నన్ని పాపములనుండి విముక్తునిగా జేసెదను. దుఃఖింపకుము. అనగా, కర్మకాండమున జెప్పిన ధర్మము లేకాంత భక్తితో ధ్యానించెడి బ్రహ్మనిష్ఠుల కనావశ్యకము. కర్మకాండానుష్ఠానములచే గలుగు ఫలము స్వల్పము, జ్ఞానకాండానుష్ఠానమగు పరమాత్మ ధ్యానముచే గలుగు ఫలము గొప్పది. నూరు రూపాయలు లాభము వచ్చునప్పుడొక్కదమ్మిడి యప్పు వచ్చిన నేమిదోషము ,అని శ్రీ వాసుదేవులు భగవద్గీతావసానమున మహాగోప్యమగు శ్లోకమును నుపదేశించిరి. దీనిని శ్రీరామానుజాచార్యులవారు వేదసారమనియు, శ్రీకృష్ణమతమనియు, చరమశ్లోకమనియు బోధించిరి.

**విధినాఽవిధినా వాఽపి భక్త్యాఽయే మాముపాసతే ।**
**తేభ్యః ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోఽహం న సంశయః ॥**

ఎవరనన్యభక్తితో విధిప్రకారముగాని, విధినతిక్రమించిగాని సర్వేశ్వరుడు అగునన్ను (పరమశివుని) ధ్యానించుదురో, అటువంటి భక్తులకు నేనేప్రసన్నుడనై వారు గోరిన ఫలముల నిచ్చెదను. దీనియందు సంశయము లేదని శ్రీ శివ గీతయందు బరమశివుడు ప్రతిజ్ఞజేసి యున్నారు.

**దేహోఽహం మానపాశేన దృఢం బద్ధోఽసి సర్వతః ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నిష్కృత్య సుఖీభవ ॥**

ఓ పరమ పరిశుద్ధురాలగు సోదరీ ! దేహమే తానను మాయాపాశముచే గట్టిగ సర్వదా బద్ధురాలవైనావు. ఇప్పుడు దేహ విలక్షణమై, సాక్షియై, బోధరూపమగు కత్తిచేత ఆ పాశమును నరికి విముక్తినొందుదువుగాక, అనగా దేహమే తాననెడు భావనయే బంధము. ప్రజ్ఞానమను బోధమే తాననెడి స్థిరబుద్ధియే జీవన్ముక్తియని శ్రీ వసిష్ఠులవారు శ్రీ రామచంద్రుల కుపదేశించిరి. పైజెప్పినదంతయును పరమార్థ తత్త్వవేత్తలగురించి చెప్పినది. అట్లు చెప్పుటచే శుచి ఆచారాదు లవశ్యములు కావని భావము గాదు. స్నానశౌచాచారములు తప్పక యుండవలెను. శుచి లేకుండ నుండరాదు. అది తమోగుణ స్వభావము గనుక శుచి యాచారములు బ్రహ్మనిష్ఠుల కత్యావశ్యకము. ''ఆచారహీనం న పునంతి వేదాః'' ఆచారహీనుని వేదములు బవిత్రునిగా జేయజాలవు, కనుక శిష్టాచారముతో వర్తించుట నిండా మేలైనది.

**బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః ।**
**నారీ వా వృషలో వాఽపి పక్వో బ్రహ్మ విచారయేత్ ॥**

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, యతి, స్త్రీ, శూద్రుడు, వీరలలో నెవరికైనను మనః పరిపక్వమున్న యెడల, బ్రహ్మవిచారము జేయవచ్చునని రమణగీత.

**యోగాధికారిణస్సర్వే ప్రాణినస్సర్వదా యతః ।**
**బాలో వృద్ధో వ్యాధియుక్తో యువా స్త్రీ శూద్రజన్మభృత్ ॥**

సంసారదుఃఖ నివృత్తి కొఱకందరున్ను జ్ఞానమున కధికారులే, ( అనగా బాలుడు, వృద్ధుడు, వ్యాధిగ్రస్తుడు, యౌవనస్థుడు, స్త్రీ, శూద్రుడు) వీరందరును సమానాధికారులే అని సనత్కుమార సంహిత.

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేపి యాంతి పరాం గతిమ్ ॥**

ఓ పార్థా ! నీచయోనియందు జన్మించిన వారెవరు గలరో వారున్ను, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నన్ను ధ్యానించి జ్ఞానవంతులై శాశ్వతానందమగు పరమపదము నొందుచున్నారు అని భగవద్గీత.

**మైత్రేయీ సులభా శార్ఙ్గీ శాండిలీ చ తపస్వినీ ।**
**ఏతే చాన్యేచ బహవో నీచయోని గతా అపి ॥**

**జ్ఞాననిష్ఠాం పరాంప్రాప్తాః-** అని యోగశాస్త్రములందు గన్పడుచున్నది.

**సంకల్ప వాసనాజాలై ప్స్వైరేవాయాతి బన్ధనమ్ ।**
**జనో లాలామయైర్బన్దైః కోశకార క్రిమిర్యథా ॥**

మనుజులు తమ మనస్సంకల్పవాసనలచే దమకు తామే సంసార మహాబంధము గల్పించుకొని దానియందు బట్టువడి జనన మరణ దుఃఖములకు బాత్రులగుచున్నారు. ఎట్లనగా, పట్టుపురుగు తనయం దుత్పత్తియగు నూలుచే గూడుగట్టి బద్ధపడి యందులోనే మరణించుచున్నది.

**కృశోఽతి దుఃఖబద్ధోఽహం హస్తపాదాది మానహమ్ ।**
**ఇతి భావన రూపేణ వ్యవహారేణ బధ్యతే ॥**

నేనతి కృశుడను, బహు దుఃఖబద్ధుడను, కరచరణముల తోటి సంసక్తుడనై యేమియు జేయుటకు సాధ్యము గానివాడను; నేను శూద్రుడ, వైశ్యుడ, క్షత్రియుడ, బ్రాహ్మణుడ, స్త్రీ, అను అనాత్మయైన దేహమం దాత్మబుద్ధితో గూడి మృగప్రాయులై స్వస్వరూపమైన తన స్థితిని దెలియక బద్ధులగుచున్నారు.

**నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కోఽస్యాత్మనః స్థితః ।**
**ఇతి భావన రూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥**

నిత్య శుద్ధ స్వయంప్రకాశుడైన నేను దుఃఖిని కాను; జననము లేని వాడనైన నాకు దేహమెట్లు గలుగును? సచ్చిదానంద లక్షణములుగల యాత్మనైన నాకు బంధ మెక్కడిది ? ఈలాటి విచార భావరూప వ్యవహారములచే ముక్తుడగుచున్నాడు అని వాసిష్ఠము.

**ఆత్మానాత్మ విచారేణ మునిర్ముచ్యేత బన్ధనాత్।**
**తద్వినా జన్మకోట్యాపి బన్ధచ్ఛేదో న సిద్ధ్యతి ॥**

ఆత్మానాత్మ విచారముచే మౌనశీలుడు సంసారబంధము నుండి ముక్తుడగుచున్నాడు; ఈ యాత్మానాత్మ విచారముజేయక కోటిజన్మములు శాస్త్రపాఠములు వల్లించుచుండినను బన్ధనివృత్తి గానేరదు.

**అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా।**
**కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మన్త్రైః కిమౌషధైః ॥**

అజ్ఞానమను కృష్ణసర్పముచే గాటునొందిన వానికి బ్రహ్మజ్ఞానామృతమను ఔషధం వినాచతుర్వేదములును, షట్‌శాస్త్రములును, అనేకవిధమంత్రములును, బహువిధకల్పములునునిరుపయోగములు. అట్టి బ్రహ్మజ్ఞానమునను జెప్పబోవుచున్నాను. ఏకాగ్రచిత్తముతో వినుము. ఇది వేద వేదాంత రహస్యము. బహుజన్మ పుణ్యకర్మలయొక్క ఫలము. దీని కొఱకు ఋషీశ్వరు లనేకసంవత్సరములు ఘోరతపముల జేసిరి. నీవు ఉత్తమాధికారము గలదానవై యున్నావు. కనుక, దీనియొక్క మర్మమిప్పుడు జెప్పెదను. జ్ఞాన గురువైన శ్రీదక్షిణామూర్తిని హృదయమందు భక్తితో ధ్యానించి, బహిర్ముఖమైయుండు ఇంద్రియముల నంతర్ముఖముగా జేసి మనసును బుద్ధితో నైక్యపరచి నిశ్చలముగా నుండుము. నేనడుగు చోద్యమునకు ఉత్తరము జెప్పుము.

నీకంఠమందుండు హారము లెవరివి ? ఉ॥ అవి నావి. చో ॥ అప్పుడు నీవు వేఱు నీభూషణములు వేఱైయుండ లేదా ? ఉ॥ అవును. చో ॥ ఇప్పుడు ప్రత్యక్షముగా రెండై యుండలేదా ? ఉ॥ అవును. రెండుగానున్నవి. చో॥ నీ దేహమెవరిది ? ఉ॥ నాది. చో॥ అప్పుడు నీవు వేరు, దేహము వేరై యుండలేదా ? ఉ॥ అవును. చో॥ కరచరణములు మొదలగు కర్మేంద్రియములును, జ్ఞానేంద్రియములును ఎవరివి ? ఉ॥ కన్నులు చేతులు మొదలగు ఇంద్రియము లన్నియు నావి. చో॥ అవి యన్నియు నీవని నీకెట్లు దెలియును ? ఉ॥ మనసుచే దెలిసికొనెదను. చో॥ మీ మనసు మంచిది. మీ మనసు చంచలము, మీ మనసుచే దెలిసికొంటినను సంగతి నెట్లు గ్రహించితివి ? ఉ॥ మనసు మొదలైన యింద్రియముల కధిపతియైన బుద్ధి యొకటి యుండు కారణముచే దాని ద్వారా

దేహం మొదలగు ప్రపంచమంతయు దెలుసుకొనుచున్నాను. చో ॥ అది సరే; బుద్ధి యొక్క శక్తిచే సర్వమును గ్రాహ్యమగునని నీవెట్లెఱింగితివి ? ఉ ॥ దానికిపై ఆత్మయైన నేనుండుటనే దెలిసికొంటిని. చో ॥ నీ వే యాత్మయను సంగతి నీ కెట్లు దెలియును ? ఉ॥ దానికిపై మఱియొకటి లేదు. ఆత్మ స్వయంప్రకాశమైనది గనుక దెలియుచున్నది. చో॥ ఇదివరకు నాది, నాది, అని రెండువస్తువుల గనబరచుచు, ఇప్పుడు నీవొకరు మాత్రమై దానికి గారణము మరియేమియు లేదనియు, అది స్వయంప్రకాశమనియు చెప్పుచున్నావే అదే నీయొక్క నిజస్వరూపము. ఉ॥ అవును. నేను సర్వసాక్షి, స్వయంప్రకాశము, సంశయము లేదు. చో॥ కనుక, నారీమణీ! ఈ విషయమై నేను జెప్పుసంగతిని బాగుగ వినుము. దానినే ప్రత్యగాత్మ ( లేక జీవుడు) అని చెప్పుదురు. ఆ వాచ్యార్థమైన త్వంపదమగు ప్రత్యగాత్మకున్ను, లక్ష్యార్థమైన తత్పదమగు పరమాత్మకున్ను ఐక్యమైనది అసి పదార్థము, కనుక త్వంపదమగు జీవుడైన నీకున్ను, తత్పదమగు పరమాత్మకున్ను ఐక్యము గలదు. అదే జీవబ్రహ్మైక్యమైన మహావాక్యము యొక్క యర్థము. కనుక నీవు, నేను, యీ జగత్తు, అను భ్రాంతిని విడిచి సర్వభూతాంతర్యామియై ప్రకాశించు పరంజ్యోతియే నీవని స్థిరముగా నమ్ముము. ఈ దేహాది ప్రపంచమంతయును మరుమరీచికలవలె మిథ్య. ఈ స్థితియందు స్వయముగా నిలుచుటకు గష్టముండినయెడల సిద్ధాసన మందాసీనవై, ప్రణవ మంత్రమును ( ఓమ్) సహాయముగా గైకొని, ధ్యానించి యీ మహామంత్రస్వరూపమైన పరమాత్మ పరబ్రహ్మ నీవని యనుసంధానము జేయుము. ఇదే వేదాంత రహస్యము. దీనికే బ్రహ్మోపదేశమని పేరు. దానినే నీకు బోధించినది. ఇది సత్యముగా నమ్ముము. సంశయ ముండగూడదు. ఈ స్థితియందు గొంతకాలముండి, బ్రహ్మానంద మనుభవించి, తదనంతరము సంసార మహాజాలమందు జిక్కుపడిన ముముక్షువులైన జీవుల మనః పరిపక్వముల ననుసరించి కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను జాతివర్ణాశ్రమ స్త్రీ పురుష భేదము లేకయే లోకమందరికి నుపదేశింపుము.

నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదమ్ ।
నిరాకర్తు మశక్తత్వా త్తదస్మీతి సుఖీభవ ॥

ఈ లోకము నేను గాను, దేహము గాను, ఇంద్రియములు గాను, ప్రాణములు గాను, మనస్సును గాను, బుద్ధియును గాను, కాను కానని నిరాకరించి త్యజించుటకు సాధ్యము గాక, శేషించిన యేయొక్క పదము గలదో, ఆ పరబ్రహ్మమే నేనని సుఖముగా నుండుము. యుక్తులచేతను, అనుభవముచేతను, శ్రుతులచేతను ఇతరము లన్నియు ద్రోసివేయబడును గాని బ్రహ్మపదార్థము ద్రోయబడదు. అది త్రోసివేయబడకుండుటకు కారణము దెలిసికొని అదియే నేనని నిశ్చయించుటయే మోక్షము.

**ఆత్మానం సంతతం బ్రహ్మ విద్ధి చైకం నిరంతరమ్ ।**
**అహం ధ్యాతా పరం ధ్యేయ మఖండం ఖండసే కథమ్ ॥**

బ్రహ్మము జీవాత్మకంటె వేరుగా భావించగూడదని చెప్పుచున్నారు. ఎల్లప్పుడు నెడతెగనివాడును, అద్వితీయుడునగు బ్రహ్మను నిన్నుగా దెలిసికొనుము. నేను ధ్యానము జేయువాడను. ఈశ్వరుడు ధ్యానము జేయదగినవాడు నను భావనచేత అఖండుడైన బ్రహ్మము నేల వేరుజేసెదవు ? నీవు బ్రహ్మరూపుడవై యుండగా ధ్యాతృధ్యేయకల్పన న్యాయముగానుండదు అని వాసిష్ఠము.

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥**

లోకమునకంటె దేహము, దేహమునకంటే యింద్రియములు, ఇంద్రియములకంటే మనసు, మనసుకంటే బుద్ధి, బుద్ధికంటే పరమైనది పరమాత్మ. అదే పరబ్రహ్మము. ఒక దానికంటెనొకటి యధికమై పరమైన పరమాత్మయందు నిలిచిపోవుచున్నది. అది యన్నిటికిని గారణము; దానికి గారణము మరియొకటి లేదు అని భగవద్గీత.

**శ్రుతి ॥ ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥**

దేహముకంటె యింద్రియములు సూక్ష్మములు. ఇంద్రియములకంటే సూక్ష్మతరములు విషయములు. విషయములకంటే సూక్ష్మము మనసు.

మనసుకంటే సూక్ష్మము బుద్ధి, బుద్ధికంటే యతి సూక్ష్మమై యుండును మహత్తైన తత్త్వము. (అహంకారము) కనుక ఒకటికంటె ఒకటి యుత్తరోత్తరముగా గొప్పవి.

శ్రుతి ॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।
పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః ॥

మహత్తత్త్వముకంటే సూక్ష్మము అవ్యక్తము, అవ్యక్తముకంటే ( ప్రకృతి) సూక్ష్మము పురుషుడు ( ఆత్మ), పురుషునికంటె పరమై యేమియును లేదు. అదే పరమైన కాష్ఠ, అదే పరమగతి (అనగా, పరమపదము). కాష్ఠయనగా, నిష్ఠాపర్యవసానము. దీనికే కైవల్యము, మోక్షము, అమనస్కము, అచల పరిపూర్ణము, సహజానంద రాజయోగమని యనేక పర్యాయ నామధేయములు గలవు.

శ్రుతి ॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

ఆత్మ సర్వభూతములలోను అతి సూక్ష్మమైయుండు కారణముచే మందమతులకు బ్రకాశింపదు. సూక్ష్మదర్శులచే విషయ విరక్తమై అతిసూక్ష్మమైన కుశాగ్రబుద్ధిచే దర్శింపబడును. అనగా నింద్రియలోలురైన శుష్కవేదాంతులకు ఆత్మను దర్శింప సాధ్యము గాదని కఠవల్ల్యుపనిషత్తు విశదముగా జెప్పుచున్నది.

## జాతిభేద రహస్యము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! దీనదయాపరా ! స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము లేదని చెప్పునట్లు, శూద్రాదులకు గూడ ఆజ్ఞ లేదని కొందరు చెప్పునది నిజముగా నుండునా?

ఉత్తరము ॥ ఓ బ్రహ్మనిష్ఠురాలవగు ప్రియసోదరీ ! ఇది దుస్తరముగు సమస్య. దీనిని బరిష్కరించుట బహుప్రయాసము. ఈ ప్రశ్న మనాదిగా జరుగుచునే యున్నది. శాస్త్రములయందు గొన్ని స్థలములలో దేహసంబంధమై జాతివర్ణాశ్రమములు గనబడుచున్నవి. కొన్ని స్థలములలో గుణసంబంధమై గూడ

కవందగును. దేహసంబంధమై చెప్పునప్పుడు పూర్వపక్షముగాను, అప్రధానముగా నుండును. గుణ సంబంధమై చెప్పునప్పు డుత్తర పక్షముగాను, ప్రధానముగా నుండును. కనుక పూర్వపక్ష ముత్తర పక్షముచే నిశ్చయముగ బాధింపబడును. ప్రధానమునకున్ను, అప్రధానమునకున్ను చెరుకుపాలునకున్ను పిప్పికిన్ని గల తారతమ్యము గలదు. లేక మజ్జిగకున్ను నవనీతమునకున్ను గల భేదముండును.

ఈ జాతిభేదమెప్పుడు గలిగినది ? దేనికొరకు బుట్టినది? ఎవరిచే నేర్పరుప బడినది ? అని చెప్పుటకై యిప్పు డెవరికిన్ని సాధ్యము గాదు. ఋషివర్గములలో నీభేదము గనుపింపదు. దానింబట్టి యోచింపగా నిశ్చయముగ గుణమును బట్టియే యుండవలెను. ఈశ్వర సృష్టియందుండునని చెప్పినచో సర్వసముడును, నిష్పక్షపాతియునగు ఆ పరమదయాళువగు ఈశ్వరుని దూషించి దుర్గతి జెందుటేగాని, మరియేమిన్ని గలుగదు. ఈశ్వరసృష్టియందు భేదముండినచో నిశ్చయముగా ప్రత్యేక మొక్క చిహ్నముండును. ఆలాటి చిహ్నములు మానవ కోటులలో లేనందున నీ సంకల్పము లేనేలేదు. చతుష్పాద జంతువులలో జూచినచో గోవు, గజము, అశ్వము, అజము, లేడి, ఒంటె మొదలగు అనేక చతుష్పాదములు గల జంతువులుండినను పృథక్ చిహ్నములు జన్మనా గలవు. ఆలాగుననే పక్షివర్గములలోగూడ శుక, పిక, బక, మయూర, కుక్కుట, హంసవులు మొదలుగాగల పక్షివర్గములకనేక చిహ్నములు స్వయముగా గలవు. ఆరీతిగానే వృక్షవర్గములలోను, మత్స్యవర్గములలోను అనేక భేదములుగా సృష్టించిన సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు మనుష్యవర్గములలో నేదైన నొక్క భేదముండినచో ప్రత్యేక చిహ్నము నేర్పరుపగూడదా ? ఒక్క వస్తువును జెప్పునప్పుడు లక్షణ మడుగుట న్యాయశాస్త్ర సిద్ధాంతము. బ్రాహ్మణత్వమునకు బ్రహ్మజ్ఞానమే గురుతని వేదసమ్మతము. ఇప్పుడు జాతి వర్ణముల నిజస్థితి దెలియనందున ఘోరమగు దుఃఖమునకు గారణమాయెను. ఈ యొక్క గొప్పదోషమే మన భరతఖండమును దుఃఖసాగరమందు ముంచుచున్నదని నేను దలంచుచున్నాను. ఇట్లు తీవ్రముగా జెప్పుటచే మిశ్రభోజన వివాహాదులతో నుండవలయునని నా తలంపు గాదు. అది నేనెప్పటికిని గోరను గాని, ఆత్మకోటుల వృద్ధికొరకు సర్వ స్వతంత్రముండవలెనని నేను నమ్ముచున్నాను. ఈ స్థితి

భారతీయుల కెంత కాలముువరకు గలుగదో యంతవరకును బానిసతనము దప్పదు. ఒక్కరి క్రింద ఒక్కరుండవలయునని తలం పొక్కరి కుండినచో మరియొక్కని క్రింద వాడుండవలసియుండుట ప్రకృతియొక్క తప్పని నిశ్చయము.

ఇట్లు చెప్పుటచే ఉచ్చస్థానము నందుండు వారిని నీచస్థితికి దీసుకొని రావలయునని విచారము గాదు. నీచస్థితియందుండువారు పురోభివృద్ధికి మార్గము దొరకక కష్టపడుచుండుట యెల్లరకు దెలిసియే యున్నదిగదా ! వారిని ఉచ్చస్థానమునకు బ్రయత్న పూర్వకముగా జేపట్టితీసికొని పోవలయునని యభిప్రాయము. ధనవంతులను దరిద్రులుగా జేయుట దోషమేకాని దరిద్రులను ధనవంతులుగా జేయుట శ్రేయస్కరము. ఆలాగుననే జ్ఞానధనము సంపాదించుట కొరకత్యాశ గలవారిని యావద్బలముతో గ్రిందికి ద్రొక్కుట పరమసంకటము. ఈ ఘోరకృత్య మెవరి హృదయమును బ్రద్దలుగా జేయదు ? ఈ కారణముచే ననేక పుణ్యపురుషుల నేత్రములనుండి దుఃఖోష్ణనీరము సర్వదా కారుచునేయున్నది. ఈ దుఃఖపూరితమగు విషమువృష్టిచే లోకము తపించుచున్నది. హా ! ఘోరకృత్యము ! ఒక తండ్రి ధనమునకు పుత్రులందరును సమానాధి కారులై యుండగా, బలవంతులగు పుత్రులు దుర్బలులగు సోదరులకు ధనాధికారము లేదని చెప్పుటెంత మహాపాతకము ? ఆలాగుననే మన తండ్రి యగు సర్వేశ్వరుని యొక్క జ్ఞాన ధనమునకు సర్వులున్ను సమాన భాగస్వాములే. అనేక జీవకోటుల పురోభివృద్ధిని అడ్డగించుటెంత దైవద్రోహము ? బిడ్డలు వృద్ధిగాంచుట తండ్రి కెంత ఆహ్లాదకరమో, ఈశ్వరునికి జీవులు బూర్ణత్వము నొందుటంత సంతోషకరము. బిడ్డల యభివృద్ధికి హాని జేయువారిపై దండ్రికెంత కోపమో, జీవుల యభివృద్ధిని ధ్వంసము గావించువారిపై ఈశ్వరుని కంతకోపము తప్పక గలుగును. కనుకనే దైవసేవకన్న లోకసేవ గొప్పదని మహర్షులు జెప్పు రహస్యము. అందుకే భూలోకమందుండు అన్ని మతములలోను దనవలెనే యితరుని గూడ జూడవలయునని నిర్బంధ పూర్వకముగ శాసించునది.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

ఓ యర్జునా ! ఎవడు సమస్త భూతములను దనవలెనే సుఖ దుఃఖముల యందు సమముగా జూచునో యట్టి యోగి, నాకందరికంటె నెక్కువ ప్రీతిపాత్రుడు. అనగా తన కేలాగున సుఖముచే ప్రీతియు, దుఃఖముచే సంకటము గలుగునో అట్లు సమస్త ప్రాణులకుండునని భావము. అనగా ప్రాణుల దుఃఖనివృత్తికిని, సుఖప్రాప్తికిని పనిజేయు వాడందరికంటె ( తపస్వి, యోగి, జ్ఞాని) భగవంతునికి ప్రియుడని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు దెలిపెను.

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।**
**యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥**

ఓ యర్జునా ! నేనన్ని భూతములయందును గించిత్తయినను భేదము లేక సమముగానే యున్నాను. కాన నాకొక్కడు ప్రియుడు గాని, ఒక్కడు ద్వేషింపదగినవాడు గాని లేడు. ఎవరు నన్ను భక్తితో సేవింతురో వారెవరైనను, సరే యట్టి భక్తులు నాయందు సర్వదా యుందురు. నేనున్ను సర్వదా వారియందే యుందును. అనగా నాకు జాతి గాని, ఆశ్రమము గాని, స్త్రీ గాని, పురుషుడు గాని ఈలాటి భేదము లేదని భావము. యచ్ఛబ్ద ప్రయోగముచే నెవ్వరైనను సరే భక్తిగలవారు భగవదనుగ్రహమునకు పాత్రులు గావచ్చునని భావము. దీనికి గోపికాస్త్రీలే దృష్టాంతము.

**మహర్షయః స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥**

భృగువు మొదలగు సప్తమహర్షులు, వారికంటెను బూర్వులగు సనకాదియోగులు, మనువులు, వీరందరును నా సంబంధమగు భావము గలవారై నాసంకల్పమాత్రమున బుట్టిరి. లోకమునందలి ఈ ప్రజలందరు వారివలన బుట్టిరి అని శ్రీభగవద్వచనముండుటచే నీ విషయమై సంశయమెందుకు గలుగవలయును ? అనగా నీశ్వరాంశము భృగువు మొదలగు సప్తఋషులు, సనకసనందనాదియోగులు, వైవస్వతాదిమనువులు. వారి సంతానముమే మనమందరమని శ్రీ నారాయణ వచనము. దాని నతిక్రమించుట కెవరితరము?

శ్రీ జగద్గురువు శంకరాచార్య భగవత్పాదులకు గూడ ఆదిలో జాతిభేదముండినట్లును, అట్లు భేదము గూడదని శ్రీపరమశివుడు శ్రీకాశీక్షేత్రమందు చండాల వేషధారియై శ్రీశంకరాచార్యులవారితో వాదించి యభేద ముపదేశించినట్లును మనీషాపంచకముచే దెలియవచ్చుచున్నది.

సత్యాచార్యస్య గమనే కదాచి న్ముక్తిదాయకమ్ ।
కాశీక్షేత్రం ప్రతి సహ గౌర్యా మార్గే తు శంకరమ్ ॥
అంత్యవేషధరం దృష్ట్వా గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్ ।
శంకర స్సోఽపి చండాల స్తం పునః ప్రాహ శంకరమ్ ॥

ఈ లోకమునందు పరమదయాశాలియై షడ్గుణైశ్వర్య సంపన్నుడైన పరమ శివుడు దుఃఖము లనెడి జలజంతువుల కాలయమైన, సంసారమనెడి సముద్రమునందు మునిగిన జీవకోటుల నుద్ధరించుటకు గోరుచుండెడివాడై చండాలవేషధారియై యొకానొకప్పుడు శ్రీకాశీపట్టణమునకుపోవు శ్రీశంకరాచార్యుల సమీపమునకు రాగా, ఆ చండాల వేషధారియైన పరమశివమూర్తిని జూచి ఆవలకు దొలగిపొమ్మని శ్రీశంకారాచార్యులవారు పలికిరి. వారితో కృతక చండాలుడైన యీశ్వరుండిట్లు చెప్పుచున్నాడు.

అన్నమయా దన్నమయ మథవా చైతన్యమేవ చైతన్యాత్ ।
యతివర దూరీ కర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛ గచ్ఛేతి ॥

ఓ యతివర్యుడా ! ఈ ప్రశ్నలకు దగిన యుత్తరము జెప్పుము. అన్నరసమయమైన శరీరమునుండి, అన్న వికారమైన శరీరమును దూరముగా దొలగించుటకు గోరుచున్నావా ? లేక చైతన్యరూపమైన ప్రత్యగాత్మను, చైతన్యరూపమైన ప్రత్యగాత్మనుండి దూరముగా దొలగించుట గోరుచున్నావా? చెప్పుము. అనగా అన్నమయ శరీర మశుద్ధమైనచో, నీ శరీరము గూడా యన్నమయమైనది కనుక నదిన్ని యశుద్ధమే. లేక, చైతన్య రూపమగు ఆత్మతో దొలగుటకై చెప్పినచో ఆత్మ సర్వవ్యాపి గనుక, ఆత్మ చైతన్యములేని స్థల మెచ్చట గలదు ? అని సమరసము బోధించి యంతర్ధానుడాయెను. ఈ విషయమై యిక శ్రుతిస్మృతుల యభిప్రాయము జెప్పెదను.

**అంత్యజాతిః ద్విజాతిశ్చ ఏక ఏవ సహోదరౌ।**
**ఏకయోని ప్రసూతత్వాత్ ఏకశాఖేన జాయతే॥**

అంత్యజాతియందు జాతమైనను సరే, లేక అగ్రజాతియందు జన్మించినను సరే, వీరిద్దరున్ను సహోదరులే. ఏలననగా, అందరును ఏకమగు బ్రహ్మయోనియందు జన్మించుటచేతను, ఏకమైన యీశ్వరునియందుండి జాతమైన కారణముచేతను సహోదరులే. ఇది వేద ప్రమాణమగు ఉపనిషద్వచనము. ఏకయోని యనగా ''మమ యోనిర్మహత్ బ్రహ్మ తస్మిన్‌గర్భం దధామ్యహం'' అని గీతా ప్రమాణము. మరియు శ్రీశంకర భగవత్పాదాచార్యులు సర్వసిద్ధాంత సంగ్రహములో శ్రీవ్యాసమతమని యీ రీతిగా వ్రాసి యున్నారు. ఇది గదా నిజమగు స్థితి ! ఒకవేళ వారి కాలమందు గాని, ఋషుల కాలమందు గాని బ్రాహ్మణేతరులలో వారిని అడుగ సమర్థులైన యితరులు లేనప్పటికిన్ని కాలాంతరమందు ఇతర వర్ణములలో బుద్ధిమంతులు జన్మించినపుడు అసత్యమైన దేహాదులకు సంబంధించిన జాతివర్ణముల స్థాపించినచో అప్పుడెంత యపకీర్తి గలుగునని వారు మొదటనే యోచించి యీ రీతిగా దమ సమత్వబుద్ధిని వ్రాసిరి. మరియు, ఆత్మానుభవముగల యీ దయామూర్తులు అనుభవమునకున్ను, వేద ప్రమాణమునకు విరుద్ధమైన మార్గముపదేశింతురా ? పరమ దయాళువులును, ఈశ్వరాంశ సంభూతులును, కారుణ్యమూర్తులును అగు ఆ మహాత్ములయంద జ్ఞానజాతమగు కల్పితభేదముండునా ?

**బ్రహ్మ క్షత్రియ విట్ఛూద్రాం శ్చతుర్వర్ణాన్ గుణాత్మకాన్।**
**విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః॥**

బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములవారును వారి వారి గుణకర్మముల ననుసరించి విభాగింపబడిరి. వారిలో తెల్లని వర్ణము గలవాడు బ్రాహ్మణుడును, ఎరుపువర్ణము గలవాడు క్షత్రియుడును, పసుపు వర్ణము గలవాడు వైశ్యుడును, నలుపు వర్ణము గలవాడు శూద్రుడనియు తెలియందగినది. ఇచ్చోట వర్ణము లనగా రంగులు. అనగా శరీరవర్ణమని చెప్పినచో సర్వవిధముల దోషము గలుగును. అనగా శూద్రులలో తెలుపు వారును, బ్రాహ్మణులలో

నలుపువారును గలరు. అప్పుడు విరుద్ధార్థమగును. గనుక నిచ్చోట సత్త్వగుణము తెలుపు, రజోగుణ మెరుపు, తమోగుణము నలుపుగాను శాస్త్రసమ్మతము. అనగా సత్త్వగుణముగలవా డేకులమందు జన్మించినను బ్రాహ్మణుడే. రజోగుణము గలవాడు క్షత్రియుడు, గుణమిశ్రమము గలవాడు వైశ్యుడు, తమోగుణము గలవాడు శూద్రుడు. ఈ గుణముల ననుసరించి జాతిభేదములు స్థిరపరచుటలో నేయాక్షేపణ యుండదు.

**విస్తృత్య ధర్మశాస్త్రే హి తేషాం కర్మ సమీరితమ్ ।**
**ఏకస్మిన్నేవ వర్ణే తు చాతుర్వర్ణ్యం గుణాత్మకమ్ ॥**

ఈ నాలుగు వర్ణములవారి జన్మనా స్వభావకర్మములు ధర్మశాస్త్రము నందు బ్రసిద్ధము. ఒక్కొక్క జాతియందు వారి గుణకర్మముల ననుసరించి నాలుగు వర్ణములు గలవు.

**మోక్షధర్మేఽధికారిత్వ సిద్ధయే మునిరభ్యధాత్ ।**
**స కర్మ దేవతాయోగ జ్ఞానకాండే ష్వనుక్రమాత్ ॥**

శ్రీ వ్యాసముని మోక్షముకొరకు కర్మ, భక్తి, యోగ, జ్ఞానములను క్రమముగా విధించెను.

**ప్రవర్తయతి తత్ కర్మ పరిపాక క్రమం విదన్ ।**
**ఋజవ శ్శుద్ధవర్ణాభాః క్షమావంతో దయాళవః!**
**స్వధర్మనిరతా యే స్యు స్తే ద్విజేషు ద్విజాతయః ॥**

వారిలో వారివారి కర్మపరిపాకవము ననుసరించి, యొక్కొక్కరు బ్రవర్తించెదరు. మనసా, కర్మణా, వాచా ఏకరీతిగా బ్రవర్తించువారును, సాత్త్విక గుణము గలవారును, క్షమావంతులును, దయాళుత్వము గలవారును, బ్రాహ్మణ ధర్మమగు వేదాధ్యయన తపోధ్యానాది బ్రహ్మవిద్యయందు ప్రవర్తించు వారెవరుగలరో వారు బ్రాహ్మణులయందు బ్రాహ్మణులు.

**కామభోగ ప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః ।**
**త్యక్త స్వధర్మ రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః ॥**

బ్రాహ్మణులలో కామపరవశులై, భోగాసక్తులై, కఠిన స్వభావము గలవారై, క్రోధులై, సాహసులై పై జెప్పిన బ్రహ్మ కర్మము విడిచిన వారై, రజోగుణము గలవారు క్షత్రియులు.

**గోషు వృత్తిం సమాధాయ పీతాః కృష్యుపజీవినః ।**
**న స్వకర్మ కరిష్యంతి తే ద్విజా వైశ్యతాం గతాః ॥**

పై వారిలో గోపరిపాలన వ్యవసాయములచే జీవించువారును, పసుపు వర్ణము గలవారును, తపస్సు, వేదాధ్యయనాది బ్రహ్మకర్మముల జేయని వారు వైశ్యులైరి.

**హింసాఽనృతప్రియాః ఖుద్రా స్సర్వకర్మోపజీవినః ।**
**కృష్ణాః శౌచపరిభ్రష్టా స్తే ద్విజాః శూద్రతాం గతాః ॥**

మనసా, కర్మణా, వాచా ప్రాణిహింసకులై, అసత్య భాషణప్రియులై, నీచదేవతోపాసకులై, వ్యవస్థలేక అన్ని పనులజేసి జీవించువారై తమోగుణము గలవారై, శౌచాచారాదులు లేని వారలు బ్రాహ్మణులలో శూద్రులైరి. అనగా బ్రాహ్మణులలో బ్రాహ్మణుడు, బ్రాహ్మణులలో క్షత్రియుడు, బ్రాహ్మణులలో వైశ్యుడు, బ్రాహ్మణులలో శూద్రుడు గలడు. అక్కారణి శూద్రులలో శూద్రుడు, శూద్రులలో వైశ్యుడు, శూద్రులలో క్షత్రియుడు, శూద్రులలో బ్రాహ్మణుడు గలడు. ఇట్లే నాలుగు వర్ణముల వారిలోను, పై నుదాహరించిన గుణముల ననుసరించి వర్ణములు కలవే గాని మరి యేవిధముచేతను లేవని యర్థము. ఈ యర్థమునే శ్రీకృష్ణభగవంతులు గీతయందు 18 వ అధ్యాయమున ప్రతిపాదించిరి.

**బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప ।**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః ॥**

ఓ యర్జునా ! ఒక్కొక్క జీవుల పరిపక్వము ననుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణముల వారిని వారివారి సత్య, దాన, తపో, యోగాది గుణములను బట్టి విభజించెను. దీనిని గీతయందు 18 అ॥ 42, 43, 44 శ్లోకములయందు కనందగును. ఇది భగవద్వాక్యము.

**చండాల దేహే పశ్వాది స్థావరే బ్రహ్మవిగ్రహే ।**
**అన్యేషు తారతమ్యేన స్థితేషు న తథాఽస్మ్యహమ్ ॥**

నేను చండాల శరీరమందును, పశువులు మొదలుగా గల స్థావరముల యందును, తృణమునుండి బ్రహ్మపర్యంతముగల సమస్త వస్తువుల యందును, సమముగా నున్నాను అని వరాహోపనిషత్, మరియు మహాభారత వనపర్వము.

**న యోనిర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః ।**
**కారణాని ద్విజత్వస్య వృత్తమేవ తు కారణమ్ ॥**

బ్రాహ్మణత్వమునకు గారణము బ్రాహ్మణస్త్రీయందు జన్మించుట గాదు. ఉపనయనాది సంస్కారవములు గాదు. వేదాధ్యయనవము గాదు. బ్రాహ్మణసంతతి గాదు. మరి యేమన సత్యధర్మాది వృత్తియే.

**సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా ।**
**దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః ॥**

ఓ సర్పమా ! సత్యము, దానము, క్షమ, ఓర్పు, సదాచారము, పరుల కష్టము జూచి తాను కష్టపడుట, తపస్సు, జీవకారుణ్యము మొదలగు గుణము లెవనియందు గనబడునో వాడు బ్రాహ్మణుడని వేద సమ్మతము.

**శూద్రే తు యద్భవేల్లక్ష్యం ద్విజే తచ్చ న విద్యతే ।**
**నైవ శూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః ॥**

పై జెప్పిన గుణములు శూద్రునియందుండినచో వాడు శూద్రుడని తలంపరాదు. అనగా వాడు బ్రాహ్మణోత్తవముడని వేద సమ్మతవము. పై నుదాహరించిన గుణములు బ్రాహ్మణజన్మమందు జన్మించినవాడైనను లేనిచో వాడు బ్రాహ్మణుడు గాడు. మరి వాడు శూద్రుడే.

**యత్రైతల్లక్ష్యతే సర్ప ! వృత్తం స బ్రాహ్మణః స్మృతః ।**
**యత్ర నైతద్భవేత్సర్ప ! తం శూద్ర మితి నిర్దిశేత్ ॥**

ఓ సర్పమా ! సత్య దాన తపములను పై జెప్పిన సాధు వృత్తులెవనియందు

గనుపించునో, వాడు బ్రాహ్మణుడని నిస్సంశయముగా దలంచవలెను. ఈ బ్రహ్మవృత్తులు లేనివాడు శూద్రుడే. సంశయము లేదు.

**భజన్ భక్త్యా విహీనో యః స చండాలోఽభిధీయతే।**
**చండాలోఽపి భజన్ భక్త్యా బ్రాహ్మణేభ్యోఽధికో మమ ॥**

ఎవడు భక్తిజ్ఞాన విహీనుడై యుండునో, వాడు బ్రాహ్మణ జన్మమందు జాతుడైనను చండాలుడని బ్రహ్మవేత్తలచే జెప్పబడును. చండాల కులమందు జన్మించినవాడైనను భక్తిజ్ఞానములతో గూడినవాడు బ్రాహ్మణుల కన్న శ్రేష్ఠుడని శ్రీ గణేశ భగవంతుడు గణేశ గీతయం దుదాహరించెను.

**జ్ఞాన యజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాంఽత్యజోఽపి వా।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

చండాలుడు గాని, బ్రాహ్మణుడు గాని, జ్ఞానమను తెప్పచే జనన మరణ దుఃఖరూపమగు ఘోరసంసార సాగరమును తరించి ముక్తి యనెడు పరమ పదమును బొందును.

**జ్ఞానం సర్వాంతరం భాతి కూటస్థాత్మ స్వరూపకమ్।**
**ప్రజ్ఞామాత్ర మిదం సూక్ష్మం కోఽపి జానాతి పుణ్యకృత్॥**

సమస్తప్రాణికోటుల హృదయమందు, ప్రజ్ఞామాత్రమై ప్రకాశించు కూటస్థాత్మ స్వరూపమై సూక్ష్మమైన జ్ఞానము ప్రకాశించుచున్నది. పుణ్య కర్మమును జేయువాడెవడో ఒక్కడు దాని నెఱుంగుచున్నాడు, అనగా పుణ్యాత్ములందరికిని వేద్యమని ఋభుగీత.

**బ్రహ్మభేదేన జానాతి స ముక్తిం నైవ పద్యతే।**
**సమానం సర్వజంతూనాం బ్రహ్మసూత్రేణ కథ్యతే ॥**

ఎవడు పరమాత్మను భేదబుద్ధితో జూచునో, వాడు మోక్షము నొందజాలడు. బ్రహ్మము సర్వజంతువులయందును సమానముగ నున్నదనియు ఆ బ్రహ్మమే యన్ని యాత్మలనియు బ్రహ్మసూత్రముచే శ్రీబాదరాయణ మునీంద్రుడు దెలిపెను.

శ్రుతి ॥ యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి
యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి ॥

ఏ యొక్క పరమాత్మయందుండి సమస్త జీవకోటులు జన్మించుచున్నవో, జన్మించిన సమస్తప్రాణులు నేయొక్క ఈశ్వర కరుణచే జీవించుచున్నవో, మరల ఏయొక్క పరబ్రహ్మమందైక్యము నొందుచున్నవో, అదే పరబ్రహ్మమని తెలిసికొన్నచో, ముక్తుడగునని తైత్తిరీయ శ్రుతి.

జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః ।
వేదపాఠాత్తు విప్రస్స్యాత్ బ్రహ్మజ్ఞానాత్తు బ్రాహ్మణః ॥

ఎవడైనను జననముచే శూద్రుడును, ఆత్మసంస్కారాది కర్మముచే ద్విజుడును, వేదాధ్యయనముచే విప్రుడును, బ్రహ్మజ్ఞానము కలుగునప్పుడు బ్రాహ్మణుడును అగుచున్నాడు.

శూద్రోఽపి శీలసంపన్నో గుణవాన్ బ్రాహ్మణో భవేత్ ।
బ్రాహ్మణోఽపి క్రియాహీనః శూద్రాత్ప్రత్యవరో భవేత్ ॥

శూద్రజన్మమందు జన్మించినవాడైనను, శమదమాది సద్గుణ సంపన్నుడై యుండినచో వాడు బ్రాహ్మణుడే. బ్రాహ్మణ కులమందు బుట్టిన వాడైనను, సదాచార సద్గుణ దూరుడైనచో శూద్రుని కన్న నీచుడని తలంపవలయును.

మద్భక్తం శూద్రసామాన్యా దవమన్యంతి యే నరాః ।
నరకేష్వవతిష్ఠంతి వర్షకోటి నరాధమాః ॥

ఏ మానవులు శూద్రజన్మమందు జన్మించిన, నాయొక్క భక్తుని శూద్ర సామాన్యముగాదలచి యవమానించెదరో యానరాధములు, కోటివర్షములవరకు నరకమందు బడియుందురు.

చండాలమపి మద్భక్తం నావమన్యేత బుద్ధిమాన్ ।
అవమానాత్పతత్యేవ రౌరవే నరకే చ సః ॥

చండాలజన్మమందు బుట్టినవాడైనను, నాయొక్క భక్తి గలిగి

యుండువానిని బుద్ధిమంతుడగువా డవమానము జేయగూడదు. అట్లు చండాలుని యవమానము జేసినచో రౌరవాది నరకమందు బతితు డగును.

న శూద్రా భగవద్భక్తా విప్రా భాగవతాస్స్మృతాః ।
సర్వవర్ణేషు తే శూద్రా యే హ్యభక్తా జనార్దనే ॥

శూద్రయోనియందు జన్మించినవారైనను భగవద్భక్తులు శూద్రులు గారు. మరియెవరన, భాగవతోత్తములగు విప్రోత్తములని వేద సమ్మతము. పరమదయాళు వగు దేవునియందు భక్తిలేనివా రేవర్ణమందు జన్మించిన వారైనను వారే శూద్రులని శ్రుతి నిశ్చయము అని శ్రీకృష్ణభగవంతులు భారతమం దానతిచ్చిరి.

భక్తిరష్ట విధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే ।
స విప్రేంద్రో మునిశ్శ్రీమాన్ స యతిః స చ పండితః ॥
తస్మై దేయం తతో గ్రాహ్యం స చ పూజ్యో యథాహ్యహమ్ ॥

అష్టవిధములగు భగవద్భక్తి మ్లేచ్ఛునియం దుండినచో, వాడే సన్న్యాసి, వాడే బ్రాహ్మణోత్తముడు, వాడే మునీశ్వరుడు, వాడే శ్రీమంతుడు, వాడే పండితుడు. వాని కొరకు సమస్తవిద్యల నివ్వవచ్చును. వాని యందుండి వేద బ్రాహ్మణుడు గూడ నుపదేశము బొందవచ్చును. భగవంతుడగు నన్నెట్లు బూజించెదరో యారీతిగా వాడును పూజార్హుడు అని శ్రీమన్నారాయణుని వచనము. (వామన పురాణము)

మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యే నరాః ।
పద్మకోటి శతేనాపి న క్షమామి వసుంధరే ॥

మద్భక్తుడు శ్వపచుడైనను వాని నిందజేసిన వానిని పద్మకోటి శతమైనను నేను దండింపక మానను.

శ్వపచోఽపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః ।
విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః ॥

ఓ రాజా ! శ్వపచుండైనను భగవద్భక్తి గలవాడైనచో వాడు బ్రాహ్మణాధికుడే. యతియైనను భగవద్భక్తి లేనిచో వాడే చండాలాధముడు.

**న జాతిః కారణం తాత ! గుణాః కల్యాణకారణమ్ ।**
**వృత్తిస్థ మపి చండాలం తం దేవా బ్రాహ్మణం విదుః ॥**

ఓ నాయనా ! గొప్పవంశమందు జన్మించిన కారణముచే నొక్కడు గొప్పవాడని తలంపరాదు. నిర్మలములగు గుణములే కల్యాణకారణము. సద్గుణశీలుడు చండాలుడైనను దేవతలు వానిని బ్రాహ్మణు డని తలంచెదరు.

**శ్వపచ శ్శివభక్తశ్చ ఉత్తమోత్తమ జన్మభాక్ ।**
**శివభక్తి విహీనాశ్చ బ్రాహ్మణాః శ్వపచాధమాః ।**
**శివభక్త స్సదా పూజ్యః శ్వపచో బ్రాహ్మణోత్తమః ॥**

చండాలుడైనను శ్రీపరమశివునియందు భక్తిగలవాడైనచో, వాడుత్తమోత్తమ జన్మముగలవాడు. శివభక్తి లేనిచో బ్రాహ్మణులైనను చండాలాధములకు సమానము.

శ్రుతి॥ **యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగాః సహస్రశః**
**ప్రభవంతే సరూపాః, తథా௨క్షరా ద్వివిధా స్సోమ్య !**
**భావాః ప్రజాయన్తే తత్ర చై వాపి యన్తి ॥**

ఏలాగున మండుచుండు అగ్నిహోత్రమునుండి, అగ్ని రూపములగు మిణుగురులు వేలకొలది యుద్భవించుచున్నవో, ఆలాగుననే యక్షరుడగు పరమాత్మయందుండి తన యంశములగు జీవకోటులు వివిధ భావముతో జన్మించినను అవి యన్నియును బరమాత్మాంశములే. అనగా అగ్ని నల్లమందు ప్రభేదముచే వర్ణభేదములు రక్తనీలములుగా మారినను, వాస్తవముగ నగ్నియంతయు నొకటే యగునట్లే జీవరాసులును నీశ్వరాంశములే, లేక తెల్లని నూలు అనేక విధములగు రంగు లద్దునపుడు నామరూపములు వేరు వేరుగా గనుపించినను, రంగు తీసివేసినచో తెల్లనినూలే. అట్లు జీవకోటుల గుణములను దొలగించి చూచినచో నొకే బ్రహ్మముగా కనబడును అని ముండకోపనిషత్తు.

**న చర్మణో న రక్తస్య మాంసస్య చ న చాస్థినః ।**
**న జాతి రాత్మనో జాతి ర్వ్యవహార ప్రకల్పితా ॥**

సర్వభూతస్థమగు ఆత్మకు జాతిభేదము లేదు. మరి చర్మమునకును ,రక్తమునకును, మాంసమునకును అస్థికిని లేదు. జాతి సాధారణ వ్యవహారకల్పితమే గాని మరియేమిన్ని కాదని తేజోబిందూపనిషత్తు. మరియు మహాభారతమునం దన్యజాతియందున్న వారు గూడ మోక్షమును బొందవచ్చునని చెప్పి ముక్తులైన వారి పేర్లు సమరసముగ వర్ణింపబడెను.

జైగీషవ్యో యథా విప్రో యథా చైవాసితాదయః।
క్షత్రియా జనకాద్యాస్తు తులాధారాదయో విశః॥

ధర్మవ్యాధాదయ స్సప్త శూద్రాః చైలవకాదయః।
మైత్రేయీ, సులభా, శార్ఙ్గీ శాండిలీ చ తపస్వినీ॥

ఏ తే చాన్యేచ బహవో నీచయోనిగతా అపి।
జ్ఞాననిష్ఠాం పరాం ప్రాప్తాః॥

జైగీషవ్యుడగు బ్రాహ్మణుడును, అట్లే యసితాదులును, జనకాదులగు క్షత్రియులును, తులాధారుదులగు వైశ్యులున్ను, ధర్మవ్యాధుడు మొదలగు ఏడ్గురు శూద్రులును, స్త్రీలలో మైత్రేయి, సులభ, శార్ఙ్గి, శాండిలి, తపస్విని మొదలగు ఆడువారును, ఈలాగున అంత్యజాతులైన యనేకులును పరమైన జ్ఞాననిష్ఠను బొంది ముక్తులైరి. మరియు మనుస్మృతియందు గూడ జెప్పినది విన్నావా ?

ఋశ్యశృంగో మృగాజ్జాతః కౌశికో గాధినందనః।
జంబుకో జంబుకోత్పన్నః గౌతమో గౌతసంభవః॥

వాల్మీకి ర్వల్మికోత్పన్నః అగస్త్యః కుంభసంభవః।
వ్యాసో లుబ్ధక సంభూతో వసిష్ఠస్తూర్వశీసుతః॥

నారదో రజకీపుత్రో కౌండిన్యో ముండకీసుతః।
మతంగస్య మతంగీస్యాత్ మాండవ్యో మండుకీసుతః॥

సాంఖ్యో సస్పర సంభూతో గార్గేయో గర్దభీసుతః।
శునకీ గర్భసంభూతాః శౌనకాది మహర్షయః॥

మహర్షుల కాలమందు గుణముల ననుసరించి జాతి గల దనుట కిదే దృష్టాంతము. ఎట్లన ఋశ్యశృంగ మహాఋషి లేడియందును, విశ్వామిత్ర మునీశ్వరుండు క్షత్రియకులమందును, జంబుకముని నక్కయందును, గౌతమ మహర్షి కుందేటియందును, వాల్మీకి మహర్షి పుట్టయందును, అగస్త్యమహర్షి భాండమందును, బాదరాయణ తపోనిధి (శ్రీవేదవ్యాసులు) చంబడి స్త్రీయందును, శ్రీవసిష్ఠులు వేశ్యయందును, శ్రీనారదులు చాకలియందును, కౌండిన్యమహర్షి ముండమోపియందును, మతంగమహర్షి మాదిగ స్త్రీయందును, మాండవ్యముని కప్పయందును, సాంఖ్యమహర్షి చండాల స్త్రీయందును, గార్గేయ మహర్షి గాడిదయందును, శౌనకాది మహర్షి శ్రేష్ఠులు ఆడుకుక్కయందును అవతరించిరి. వీరందరున్ను పరమ తపోనిధులు. ఇట్లుండగా జాతిభేదము దేహసంబంధమై యెట్లుండును? పై చెప్పిన కొందరు మహర్షులు జంతువులనుండి పుట్టిరని చెప్పు దానిలో అవి మృగములు కాదనియు, ఆది మానవుల పేర్లనియు చెప్పు భిన్నాభిప్రాయులు గలరు.

**జన్మనా జాయతే జంతుః సంస్కారా ద్ద్విజ ఉచ్యతే ।**
**వేదపారాయణా ద్విప్రో బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః ॥**

జన్మముచే నందరును జంతుసమానులే. మరల సంస్కారముచే ద్విజుడౌను. వేదపారాయణమువల్ల విప్రత్వము గలుగును. బ్రహ్మజ్ఞానము గలిగినపుడు బ్రాహ్మణుడని చెప్పుట కర్హుడగును.

**ద్విజవత్ క్షత్రియస్యోక్తః ప్రాణాయామో మహామునే ।**
**విరక్తానాం ప్రబుద్ధానాం వైశ్యానాం చ తథైవ చ ।**
**శూద్రాణాం చ తథా స్త్రీణాం ప్రాణసంయమనం మునే ॥**

ఓ మునిసత్తమా! బ్రాహ్మణులకెంత యధికారము యోగశాస్త్రమందు గలదో, అంత యధికారము క్షత్రియునకున్ను, ప్రబుద్ధులును విరక్తులునునగు వైశ్యులకున్ను, శూద్రులకున్ను, స్త్రీలకున్ను గలదని యోగసారము.

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥**

ఓ యర్జునా ! అంత్యజాతియందు జన్మించిన వారిలో నెవరైననుసరే యట్టివారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులు మొదలుగా గల వారందరీ గీతాపారాయణము జేసి, దీనియందు జెప్పంబడిన ప్రకార మనుష్ఠించినచో నిస్సంశయముగా మోక్షము నొందుదురు అని శ్రీభగవంతులు ఉపదేశించిరి.

ఓ నిర్మల విచారగుణశాలినివగు తల్లీ ! సాక్షాన్నారాయణుని యొక్క వచన మిట్లుండగా నేల సంశయించెదవు ?

మరియు మహాభారతమున ఆనుశాసనికపర్వ మధ్యాయము నూటనలభై మూడులో శ్రీ శివుడు శ్రీ పార్వతీదేవికి వర్ణారోహణా వరోహణములు గుణమువలననే గలుగు నని విశదముగా బోధించెను.

**జ్ఞానవిజ్ఞానసంపన్నః సంస్కృతో వేదపారగః ।**
**విప్రో భవతి ధర్మాత్మా క్షత్రియః స్వేన కర్మణా ॥**

మానవజన్మ మందు జన్మించిన వారెవరైనను సరే జ్ఞానవిజ్ఞాన సంపన్నుడై, మలినగుణములను బరిత్యజించినవాడై వేద పారంగతుడైనవాడు బ్రాహ్మణుడు. పై నుదాహరించిన గుణములతో గూడిన వాడై, ధర్మాత్ముడైన క్షత్రియుడైనను వాడున్ను బ్రాహ్మణుడే.

**ఏతైః కర్మ ఫలైర్దేవి న్యూనజాతి కులోద్భవః ।**
**శూద్రోఽ ప్యాగమ సంపన్నో ద్విజో భవతి సంస్కృతః ॥**

ఓ పార్వతీ ! పై జెప్పిన పుణ్యకర్మములే బ్రాహ్మణత్వమునకు గారణము. వేరువిధముగా జాతి పుట్టుట లేదు. పరిశుద్ధ హృదయముగలవాడై, జ్ఞాన సంపన్నుడైనచో శూద్రుడు గూడా బ్రాహ్మణుడే.

**బ్రాహ్మణో వాఽప్యసద్వృత్తః సర్వసంకర భోజనః ।**
**బ్రాహ్మణ్యం తు సముత్సృజ్య శూద్రో భవతి తాదృశః ॥**

బ్రాహ్మణ జన్మమందు జన్మించినను సదాచారదూరుడై, సంకరభోజనము జేయువాడైనచో, బ్రాహ్మణ్యము పోయి పై జెప్పిన రీతి ననుసరించి శూద్రత్వము నొందును.

**సత్కర్మభిః శుచిర్దేవి శుద్ధాత్మా విజితేంద్రియః।**
**శూద్రోఽపి ద్విజవత్సేవ్య ఇతి బ్రహ్మానుశాసనమ్ ॥**

ఓ పార్వతీదేవీ ! శుద్ధములగు సాత్త్విక కర్మలతో గూడినవాడై, పరిశుద్ధాత్ముడై, జితేంద్రియుడైనవాడు శూద్రకులములో జన్మించినను బ్రాహ్మణునివలె నందరిచే సేవింప దగినవాడని బ్రహ్మశాసనము. (వేదనిశ్చయము.)

**స్వభావం కర్మ చ శుభం యత్ర శూద్రేఽపి తిష్ఠతి।**
**విశిష్టః స ద్విజాతేర్వై విజ్ఞేయ ఇతి మే మతిః ॥**

స్వభావముగా శుద్ధమగు పుణ్యకర్మము ననుష్ఠించు గుణము గలవాడు శూద్రుడైనను బ్రాహ్మణునికంటె విశిష్టుడని నా నిశ్చయాభిప్రాయము. అనగా పరమశివుని మత మిదియని యర్థము.

**యది శైలసమం పాపం విస్తీర్ణం యోజనాన్ బహూన్।**
**భిద్యతే ధ్యానయోగేన నాన్యో భేదః కథంచన ॥**

అనేక యోజన విస్తీర్ణమై యాకాశమువరకు బెరిగిన కొండవలె పాప సంఘముండినను, అది పరమాత్మధ్యానముచే భస్మమై ధూళియైపోవును. పాపనాశమునకు ధ్యానయోగము దప్ప మరే మార్గము లేదని యోగకల్పద్రుమము జెప్పుచున్నది.

**సంసారార్ణవమగ్నానాం జడానా మవివేకినామ్।**
**అగతీనాం గతిః సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

ఓ సోదరీ ! జనన మరణ సంసార దుఃఖసాగరమునందు మగ్నులైన ప్రాణులకును, జ్ఞానము లేనివారికిని, ఏ యొక్కగతి లేనివారికిని, సర్వులకును సాక్షాత్పరమాత్మధ్యానమే గతి యని మహర్షుల మతము.

**ముహూర్తమపి యోగచ్ఛే న్నాసాగ్రే మనసా సహ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మ శతార్జితమ్ ॥**

ఎవడొక్క ముహూర్తమాత్రమైన నేకాగ్రచిత్తముతో బరమాత్మను ధ్యానము జేయునో వాడనేక శతవర్షములలో జేసిన పాపములు వెంటనే నశించునని శ్రీ పరమాత్ము డుత్తరగీతయందు చెప్పెను.

**అహం బ్రహ్మేతి మాం ధ్యాయేదేకాగ్రం మనసా కృతమ్ ।**
**సర్వం తరతి పాప్మానం కల్పకోటి శతైః కృతమ్ ॥**

ఎవడు మనస్సు నేకాగ్రముగా జేసి పరమాత్ముడగు శ్రీమన్నారాయణుని యాత్మగా ధ్యానించునో, వాడు నూరు కల్పకోట్లయందు జేసిన పాపమును బోగొట్టుకొని మోక్షము నొందును అని శ్రీవాసుదేవుల అమృతవచనము.

తల్లీ ! మనలో నెవరు ఘోరమైన పాపము జేసియున్నారో వారే మొట్టమొదట పరబ్రహ్మ ధ్యాన భక్తిప్రార్థనల జేయవలయును. ఎట్లన నెవరికి రోగమధికముగ నుండునో వారేగదా శీఘ్రముగా ఔషధసేవ జేయవలయును. రోగము శమించి సౌఖ్యము నొందిన తరువాత మందు తినవలసినదని చెప్పుటెంత బుద్ధిహీనత ? మందు భుజింపగా నెట్లు రోగము కుదురునో, ఆలాగుననే తెలిసి గాని, తెలియక గాని చేసిన పాపకార్యములచే కష్టస్థితిలో నుండువారీశ్వరుని ధ్యానించ వలయును. ధ్యానము జేయనిచో పాపమెట్లు నశించును ?

**ప్రశ్న ॥ బ్రాహ్మణో౽స్య ముఖమాసీ ద్బాహూ రాజన్యః కృతః ।**
**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత ॥**

అని పురుషసూక్త శ్రుతిని తమ రొప్పవలసినది కదా ?

అనగా విరాట్ పురుషముఖమునుండి బ్రాహ్మణుడును, బాహువులనుండి క్షత్రియుడును, ఊరువులనుండి వైశ్యుడును, పాదములనుండి శూద్రుడును జన్మించినారనియు, ముఖమునుండి యొక్కొక్కరు గ్రింద క్రింద భాగము నుండి జన్మించుటచే దక్కువ తక్కువవారనియు చెప్పుటలో నేమి దోషము? ఇది వేదశ్రుతి కదా ?

ఉత్తరము ॥ ఈ శ్రుతిమాత్రము వేదవచనమైనది కనుక శిరసా వహించెదనుగాని అర్థము జేయువారు వారివారి ఇష్టానుసారముగా జెప్పుదురు.

దానిలో మాత్రము విచారము గలదు. ఈ శ్రుతికి నిజార్థమార్యసమాజస్థులు వ్రాసియున్నారు. అది మన కావశ్యకము లేదు. మన సనాతనమత ప్రకారము గుణములచే జూచునపుడు బ్రహ్మజ్ఞానులు ముఖమునుండియు, ప్రజాపరిపాలన శక్తిగలవారు బాహువులనుండియు, వ్యాపార స్వభావము గలవా రూరువుల నుండియు, సేవకవృత్తి జేయువారు పాదములనుండియు జన్మించినవారని చెప్పుటలో నేమి విరోధము గలదు ? సేవకవృత్తియనగా గ్రామతలారినుండి రాజ ప్రతినిధివరకు గలవారు సేవకులే. వీరిలో గూడ బ్రహ్మజ్ఞాను లుండవచ్చును. '' బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్'' అను శ్రుతి ననుసరించి ముఖము నుండి బ్రాహ్మణులు జన్మించిరనియు, కనుక ముఖము, వక్షస్థలము, ఊరువు, పాదము, ఇవి యొకదాని కొకటి క్రింది క్రింది భాగ మగుటచే జాతిలో గూడ, తక్కువ తక్కువ స్థితి గలదని చెప్పినచో మంచిది, బ్రహ్మకులమని చెప్పువారు నిశ్చయముగా వైశ్యులే కావలెను. ఏలన బ్రహ్మదేవుడు నారాయణుని నాభికమలమునం దుద్భవించిన కారణముచే నాభిస్థల మూరువులో జేరినది. మఱియు గంగాదేవి విష్ణు పాదమునుండి కలిగినకారణముచే గంగయు శూద్రురాలే. మఱియు సప్తఋషులున్ను మనువులున్ను సనకాది యోగులున్ను భగవన్మానస పుత్రులని శాస్త్రనిర్ణయము. కనుక హృదయము వక్షస్థలమునకు సంబంధించినది. అప్పుడువారు క్షత్రియులే కావలెను. సమస్త మానవులు వారివల్ల కలిగిరని శాస్త్రములు జెప్పుటచే నందరున్నూ క్షత్రియులే యగుదురు.

**మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥**

మఱియు '' బ్రాహ్మణో స్య ముఖమాసీత్ '' అను శ్రుతియం దేకవచన ప్రయోగముండుటచే నొక్క బ్రాహ్మణుడున్ను, ఒక్క క్షత్రియుడున్ను, ఒక్క వైశ్యుడున్ను ఒక్క శూద్రుడున్ను గలిగిరని యర్థము జెప్పుదురు. అప్పుడు వీరికి స్త్రీలెచ్చటనుండి గలిగిరను ప్రశ్న వెడలును. మఱియు శ్వపచ, కిరాత, చండాలాది జాతుల నెవరు సృష్టించి రను రెండవ ప్రశ్నగూడ బయలు దేరును. మఱియు అనాదిగా నుండు నాస్తికులు, సాంఖ్యులు, జైనులు, బౌద్ధులు, జూదులు. పార్సులు

వీరిని సృష్టించిన దేవుడెవడని మూడవప్రశ్న కవకాశము దొరకును. మరియు ఈశ్వరుడు అనంతుడా లేక సాంతుడా, నిరాకారుడా, లేక సాకారుడా అని సమాధానము చెప్పుటకు దుస్తరమగు నాల్గవ ప్రశ్న కవకాశముండును. ఇకను సృష్టి సాదియా, అనాదియా అని కఠిన సమస్య యగు ఐదవ ప్రశ్న ఒకటి యున్నది. మఱియు క్రైస్తవులు, తురుష్కులు, నీగ్రోలు మొదలుగాగల యెన్నియెూ జాతులు భూలోకమందు గలవు. వీరిని సృష్టించినది హిందూశాస్త్రమున జెప్పెడి దేవుడు గాక మఱియొక ఈశ్వరుడుండవలెను. కనుక నీలాటి యర్థశూన్యమగు పామరుల మాటలను విని చెడిపోవుటయేగాక మనదేశము గూడ హీనస్థితికి వచ్చినది.

జాతివర్ణాశ్రమస్థితి హిందూదేశ చరిత్రయందు జెప్పియుండుట సరిగానున్నది. అనగా భారతదేశమున ఆదికాలమున ఆర్యులు వచ్చినపుడు వారొకజాతియే . వారిలో విద్య జెప్పుటకొఱకును. దేవపూజ జేయుట కొఱకును గొందరిని నియమించిరి. మరియు శత్రువులను నిరోధించుటకొఱకు బలముగలవారిని, ధైర్యము గలవారిని కొంతమందిని నియమించిరి. దేహబలమున మనశ్శక్తియున్నూ, చాలనివారిని వ్యాపార కృత్యములకు నియమించిరి. తెలివి సంపూర్ణముగా లేనివారిని కృషిచేయుటకున్ను. ఇతరపనులు జేయుటకున్ను, నిశ్చయించి అందరున్ను సహోదరభావముతో జీవించిరి అని చెప్పియున్నది. క్రమముగా ఈ తెగలవారే నాలుగు వర్ణములైరి. కనుకనే యిప్పుడున్ను, ఆర్యులలో జాతి భేదము లేదు. స్మృతులున్ను, పురాణములున్ను మధ్యకాలమున వ్రాసినవి. అప్పటి కీనాలుగు తెగలవారున్ను బలపడి యుండవచ్చును. అదియునుం గాక కొన్ని మనోవిరోధములు గూడ గలిగినట్లు దోచుచున్నది. ఆదిమార్యులు నాలుగుభాగములు జేసినది యప్పుడుండు జనుల పరిపక్వత ననుసరించియు, అప్పుడుండు స్థితి ననుసరించియు నుండవచ్చును. ఇప్పుడు జాతినిమిత్తము సహోదర స్నేహమంతరించి మార్జాల మూషికములవలె విషమస్థితికి వచ్చినది. కనుక నీలాటి పాపవిచారము వదలిపెట్టి యందరున్ను సహోదర భావము గలవారై మానవుల బుద్ధి వికాసము ననుసరించి పైమెట్టెక్కు వారికి సాధ్యమైనంత సహాయము జేసినచో మనదేశ మిహపర సౌఖ్యములతో గూడినదై యుండును.

అప్పుడు సమస్తజనులును నిత్యసుఖు లగుదురు. శరీరము యొక్క నలుపు, ఎరుపు, తెలుపు, మొదలుగాగల వర్ణభేదములు శీతోష్ణముల ననుసరించిన్ని, ఆహార వ్యవహారములనుబట్టి మారుచుండును. ఎండ విశేషము దగులుటచేతను, సారరహితమైన యాహారము దినుటచేతను, శరీర చర్మము నలుపుగా మారును. పురుషునియొక్క శిరస్సు బోడిగొట్టునపుడు జుట్టుండు భాగమునందుండు దెలుపితర భాగములయందుండదు. కారణమేమన జుట్టుండు భాగమున నెండవిశేషముగా దగులదు. కావున సదా యెండయందు కూలిపని జేసి సత్తువ లేని యన్నమును దినుటచే శరీరచర్మము నల్లగా నున్న వారిని హీనజాతులని తలంపక వారిపై దయగలవారై మన దేశము నున్నతస్థితికి దెచ్చుదురుగాక! దీనికి బరమదయాళుడగు జగదీశ్వరుడు మనల నాశీర్వదించుగాక! ' చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ' అని భగవద్వచనము.

మరియొక విధమున భగవంతుడు జ్ఞానస్వరూపుడు గదా! అప్పుడు దన యంశములగు జీవులు గూడ తనస్వరూపములే గదా! చక్కెరచే జేయంబడిన మిఠాయిబొమ్మ యొక్క యేభాగము జూచినను జక్కెర మయమే గాని మరియేమియు నుండదుగదా!

ప్రశ్న ॥ పుణ్యాధిక్యముచే బ్రాహ్మణుడై జన్మించునని చెప్పు శాస్త్రమును దమ రొప్పరా ?

ఉత్తరము ॥ పుణ్యాధిక్యముచేత బ్రాహ్మణుడై జన్మించునని చెప్పు శాస్త్రము నాకు సమ్మతమే కాని, ప్రస్తుత బ్రాహ్మణశబ్దముచే వ్యవహరించువారి నెట్లొప్పుటకు వీలుండును? ఏలన పుణ్యము యొక్క ఫలమారోగ్యము, జ్ఞానము, ఐశ్వర్యముఅనియు శాస్త్రసమ్మతము. కనుక బ్రాహ్మణులలో, పాపఫలమగు దారిద్ర్యము, రోగము, అజ్ఞానము నుండరాదు. శూద్రులలో జ్ఞానము, ఐశ్వర్యము, ఆరోగ్యము నుండగూడదు. అట్లు కనుపించుట లేదు. ఇట్లుండగా నిరాధారమైన మాటను నమ్ముటలో మనసొప్పునా ?

పాపం వినా శరీరస్య దుఃఖం నాస్తి పదేపదే ।
యత్కించి ద్దృశ్యతే దుఃఖం సర్వం పాప సముద్భవమ్ ॥

**స్థూలం చైవాథ సూక్ష్మం చ దుఃఖం పాపసముద్భవమ్ ।**
**అపాపం చ యదా స్యాద్వై శరీరం సుఖభాజనమ్ ॥**

దీనికర్థము దీనిలో మరియొక స్థలమందు కనందగును. మరియు గోవునందుండి పులియున్ను, పులియందుండి గోవున్ను, ఏనుగునందుండి గజమున్ను, గజమందుండి యశ్వమున్ను పుట్టుట లేదు. ఆలాగుననే పనస చెట్టునుండి పొన్నచెట్టున్ను, మామిడిచెట్టునుండి ముష్టిచెట్టును, వేపచెట్టు నుండి చీనిచెట్టును పుట్టుట లేదు. ఇది ప్రకృతి నియమము. ఆలాగుననే బ్రాహ్మణాది జాతులు నిజమైనచో, బ్రాహ్మణులయందు బుట్టువారు శ్రుతిప్రకారము జన్మనా బ్రహ్మజ్ఞానులున్ను, సదాచార తపోనిష్ఠ శిష్టాచారులుగానే యుండవలెను. శూద్రులయందు జన్మించువారు నికృష్టాచారగుణములు గలవారును, జ్ఞాన హీనులుగా నుండవలెను. అట్లు కనిపించుట లేదు. కనుక నిది సమ్మతము గాదు, ఇందుచే బీజాంకురవాద మిచ్చుట సరిపడదు. ఇట్లు చెప్పుటచే జాతి భేదము లేదని యర్థము గాదు. జాతిభేదము నిశ్చయముగా గలదు. ఎట్లన నొకమామిడి చెట్టునుండి యన్ని కాయలను గోసినచో, ఆ కాయలను నాలుగుభాగములుగా జేయవచ్చును. ఒకరకము పండ్లు, రెండవది ముదిరిన కాయలు, మూడవది లేతకాయలు, నాల్గవది కసుపిందెలు, వీటికి గుణము లని పేర్లు. ఒకటి తీపు, ఒకటి మధ్యము, ఒకటి పులుపు, ఒకటి చేదు, వగరున్నూ అనగా సత్త్వ, రజ, స్తమోగుణములున్ను గుణమిశ్రమున్ను అని భావము.

'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః' అని భగవద్వచనము. ఇప్పుడు గూడ శ్రుతిప్రకార మనుష్ఠాన నిష్ఠయందుండు తపోనిధి యగు ఒక్కరిని చూచినచో బ్రాహ్మణస్వభావము దెలుసు కొనవచ్చును. కనుక విచారశీలుర కింత చాలును.

ప్రశ్న ॥ నాకు శాస్త్రమున్ను, యుక్తియున్ను సెలవిచ్చినది చాలును. వర్ణాశ్రమ విషయమై తమ నిశ్చయాభిప్రాయ మెట్లుండునో దానిని కపటము లేక ఈ దీనురాలిపై దయయుంచి చెప్పుటకై ప్రార్థించుదానను.

ఉత్తరము ॥ భక్తిపరవశురాలవగు సోదరీ ! నాయొక్క నమ్మకమును జెప్పెద.

(1) అంత్యజాతియందు జన్మించినవారైనను, పరమభక్తులై శమదమాది సద్గుణములతో గూడినవారై, బ్రహ్మనిష్ఠులై యుండినచో వారిని నేను బ్రహ్మఋషి సత్తములని తలచెదను. (2) బ్రాహ్మణజాతియందు జన్మించి నికృష్టాచారులై దుర్గుణ పూరితులై, జ్ఞానహీనులై యుండినచో వారే చండాలురని నానమ్మకము. (3) గృహస్థాశ్రమమునందుండి (సంసారము నందుండి) విషయ వాంఛా శూన్యుడై, దయాపరుడై, జ్ఞానసంపన్నుడై ఒక్కడుండినచో వాడు పరమహంస పరివ్రాజక యతీశ్వరుండని నా విచారము. (4) సన్న్యాసాశ్రమము స్వీకరించినవాడైనను, నిర్వాసనాస్థితి గలుగక, జ్ఞాననిష్ఠ లేనిచో వాడు గృహస్థుడు (పెద్దసంసారి) అని నాతలంపు. ఇదే వర్ణాశ్రమ విషయమై నాయభిప్రాయము.

**సన్న్యాసం నిర్మలం జ్ఞానం న తు కాషాయముండనమ్ ।**
**నివృత్తరాగస్య గృహం తపోవనమ్ । అని శాస్త్రము ।**
**యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి ।**
**అన్యత్తృణ మివ త్యాజ్య మప్యుక్తం పద్మజన్మనా ॥**

యుక్తి యుక్తమైయుండు వచనము పిల్లవాడు జెప్పినను బ్రహ్మవచనమువలె గ్రహించదగినది. యుక్తియుక్తముగాని వచనము బ్రహ్మదేవుడు జెప్పినను తృణీకరించదగినది. ఏలన మహాత్ములగు గొప్పవారు యుక్తి యుక్తానుభవముతోను, లోక సమ్మతముగాను, జీవుల శ్రేయస్కరమునకు గాను జెప్పుదురే గాని విరుద్ధముగా జెప్పరు. విరుద్ధముగా గనుపించు వచనము లీశ్వర సమ్మతమునున్ను, మహర్షుల యేర్పాటులున్ను గావు అని గ్రహించుటకై శ్రీవసిష్ఠభగవంతులు వాసిష్ఠమం దిట్లానతిచ్చిరి.

ప్రశ్న ॥ అయ్యా ! ఇప్పుడు శూద్రులకంటే బ్రాహ్మణులకు శాంత మున్ను, జ్ఞానమున్ను, అధికముగా గనుపించుచున్నదే! దానికి గారణమేమి ?

ఉత్తరము ॥ శూద్రాదులకంటే, బ్రాహ్మణులలో శాంతము జ్ఞానమున్ను గొందరి కధికముగా నుండవచ్చును. దానికి, కారణము వారికి చిన్న కాలమందుండి సాత్త్వికమగు శాకాదిభక్షణమున్ను, స్నాన శౌచములున్ను, కొంచెము నిష్ఠానుష్ఠాన ముండుటచే, మనః పారి శుద్ధ్యము గలుగుట కవకాశము గలదు. ఈలాగుననే మత్స్యమాంసాది భక్షణము లేకయు, స్నానశౌచాది గుణములు గలిగి దైవనిష్ఠజేయు

శూద్రాదులకు గూడ శాంతము, జ్ఞానము, దయాళుత్వము గనిపించుచున్నవి. శాంత గుణమునకు సాత్త్వికాహారము నిండాసహాయము. పాపకరమగు మాంస భక్షకులకు మనశ్శాంతి గలుగుట దుస్తరము. ఇక నీ విషయమై చెప్పుట కనేకములు గలవు. బుద్ధిమంతులైనచో నింతే చాలును. బుద్ధిహీనుల కెంతజెప్పినను నేమి ప్రయోజనము ? అగ్ని యొక్క మిణుగురు దొరికినచో శ్రద్ధతో వృద్ధిజేయు నుపాయము దెలుసుకొన్నచో కట్టెల సహాయముచే గొండంత జేయవచ్చును. నిప్పులో కట్టెలు స్త్రీగాని, పురుషుడుగాని, శూద్రుడు గాని, బ్రాహ్మణుడు గాని, మరియెవరు గాని వేసినను అగ్ని వృద్ధి యగునట్లు హృదయమందుండు జ్ఞానాగ్నిలో వాసనారహితమగు ఇంద్రియ సంయమ మనుకట్టె లెవరు వేసెదరో వారందరికిని బ్రహ్మ జ్ఞానాగ్ని ప్రకాశించును. నిప్పు కుప్పంత దొరికినను కట్టెలు వేయనిచో బూడిదయైపోవును గదా ! ఇక జాతివిషయమై సంశయము గలవారు వేద ప్రమాణమగు వజ్రసూచికోపనిషత్తును జూడందగును.

ద్వితీయపాదము సంపూర్ణము.



# శ్రీ శుష్క వేదాంత తమోభాస్కరము

## తృతీయపాదము



## రాజయోగి లక్షణము

ప్రశ్న॥ అయ్యా! స్వామీ! మహానుభావా! తమ ప్రక్కనుండి అంతయు వినుచున్న సచ్చిదానంద ప్రసాదైన నాకొక గొప్ప సంశయము గలుగుచున్నది. ఏమనగా నిప్పుడుండు పెద్దలలో గొందరు-

ఘనతం దారక సాంఖ్యయోగములచే గష్టింపగానేల నె
మ్మనముం బట్టగ నేల నింద్రియములన్ మర్దింపగా నేల జ
క్కనగా ముందట గానిపించు ఘటముం గన్నట్లు బ్రహ్మంబుగా
దను దా గాంచిన నంతలో నిఖిలముం దానై వెలుంగుం దగన్.

అని చెప్పు సీతారామాంజనేయము జూడగా తాము జెప్పురీతి ధ్యాన నిష్ఠాది శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులేల ?

ఉత్తరము = ఓ పరమశాంతుడవైన ప్రియసోదరా! ఈ పద్యము యొక్క యర్థ మపారమై యున్నది. మంచి ప్రశ్న జేసినావు. సార్వభౌమ అను పేరు చక్రవర్తికి దగును గాని, వీథిలో భిక్షమెత్తి జీవించువానికి దగునా ? ఆలాగుననే యీ పద్యము కేవల పరబ్రహ్మమును బొంది యపరోక్షానుభవముగల మహానుభావునిబట్టి చెప్పబడినది. కాని, తదితరులైన విషయలోలురకు గాదు. వీని లక్షణము సదా

పరబ్రహ్మానందముతో దన్ను మరచి యీ విశ్వమంతయును దానై యాత్మారాముడై క్రీడించువానికి గాని విషయవీథిలో సంచరించుచు నింద్రియ సుఖము లనుభవించువానికి జెప్పినది గాదు. ఈ కారణముచే బూర్వాచార్య లభ్యాసి యనియు, ఆరూఢుడనియు రెండు భాగముల జేసిరి. ఎట్లనగా. ఉద్యోగము చేయువాడు, పించను (పెన్షను) సంపాదించిన వాడు వీరిద్దరికిని నెంతభేదము గలదో యంత భేద మభ్యాసికి ఆరూఢునకు గలదు. పెన్షనుదీయువా డుద్యోగమునకు బోవ నక్కరలేదు. తన యిష్టప్రకారముండవచ్చును. దీని నిజూచి యుద్యోగమందున్న వాడు గాని, లేక స్కూలులో జదువు విద్యార్థిగాని, యుండినయెడల వారి గతి యేమి యగును ? వాడిప్పుడు స్వతంత్రుడైనది చాలా కాలము సమయము దప్పక సత్యముగా నుద్యోగముజేసి మంచివాడని పేరు సంపాదించినందున ప్రేమకొలకు పించను నిచ్చుచున్నారు గాని మరియొకటి గాదు. ఆలాగుననే. ఆరూఢుండనేక కాలము దపోధ్యాన నిష్ఠచే గృతార్థుడైన మహానుభావుని విషయమై చెప్పిన పద్యమది. లేక మహారోగమందున్నవా డౌషధ సేవ జేసి, పథ్యమందుండక రోగము లేనివానివలె దినుట, త్రాగుట మొదలగు విషయములలో దిగిన వాడేగతి బొందగలడు?

**ఆరురుక్షో ర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే ।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥**

జ్ఞానమును బొందుటకై తలంచిన మననశీలునకు నిష్కామ కర్మములైన తపోధ్యాన యోగాదులు ముఖ్యసాధనము, యోగమును బొందిన యారూఢునికి గర్మ నివర్తియై శమము గారణమని శ్రీ కృష్ణభగవంతులు జెప్పియున్నారు. దీనియందు రెండు పదము లతి రహస్యముగా నున్నవి. పూర్వపదమందు మునియైనవాడు గూడ తపోధ్యానము విడువగూడదని చెప్పబడినది. ఉత్తర పదము శమమని ప్రయోగించి యున్నది. శమమనగా అంతరింద్రియ నిగ్రహము.

అనగా, నారూఢుడు గూడ సదా యింద్రియ నిగ్రహముతో గూడి స్వరూప ధ్యాన మందుండవలయునని విధించియున్నది. అంతరింద్రియ నిగ్రహమున్న యెడల, బహిరింద్రియములు చలింప సాధ్యము గాదు. ఈ

కారణముచే నపక్వులైన మనుష్యులు విపరీతార్థము జేయగూడదని తలంచి సీతారామాంజనేయము చెప్పుచున్నది.

**రాజగుహ్యమైన రాజయోగంబును**
**శ్రద్ధధాను లగుచు జనము లెల్ల,**
**సంశ్రయింపలేక సంసార వనధిలో**
**మునుగుచుండుదురు విమూఢు లగుచు .**
**ఈ రాజయోగమార్గం**
**బీరేడు జగంబులందు నెవ్వరెఱుగ రా**
**త్మారామలసదపాంగా**
**పార కృపాయుక్తులైన భక్తులు దక్కన్ .**

ఈ రాజయోగ మెంతరహస్యమైనను, అంతర్యామి స్వరూపుడగు నీరామునియం దపార భక్తి గలిగి యాతని దయారసమునకు బాత్రులై యుండువారలకు గరతలామలకముగా దెలియును. ఇతరు లెవ్వరు నట్లెరుంగలేరు. కావున, నీ యోగము సిద్ధించుటకు భక్తి ప్రధానము.

**తారక యోగము దెలియగ**
**నేరక వేదాంతవాక్య నికురుంబముచే,**
**నూరక వాదించుచు జెడు**
**వారికి మోక్షంబు గలదె వాయుకుమారా !**

ఓ వాయుపుత్రా ! తారక యోగము మహోపకారము జేయునదియై యుండ, దీనిని దెలుసుకొని యభ్యసింపలేక ఊరక కొన్ని వేదాంతవాక్యముల నేర్చుకొని వాదముల జేయుచు జెడువారికి మోక్షము దొరుకునా ?

**రాజయోగంబె బూని నిరంతరంబు**
**పట్టుగా నభ్యసింపంగ బ్రాలుమాలి ,**
**కొన్ని వేదాంత యుక్తుల గూడబెట్టి**
**పలుక నేర్చిన బ్రహ్మానుభవము గలదె ?**

దారుణ గాఢాంధకారం బడంగునే
వసుధపై గృత దీప వార్త వలన
నాకొన్న మనుజుని యాకలి దీరునే
ఘన సరసాన్న వర్ణనము వలన
నెఱి పేదవాని పేదఱికంబు వోవునే
ద్రవ్య ప్రభావ గీర్తనము వలన
రోగపీడితుని బల్ రోగంబు దీరునే
కలితౌషధ ప్రసంగంబు వలన
జండిపడి బుద్ధిలో వెలి నిండి మిగుల
దట్టమైనట్టి యజ్ఞాన తమము దెగునె
తర్కిత విచిత్ర శబ్ద బోధంబు వలన
ఫలితయోగానుభవదృష్టి వలన గాక !
గాలంబు లేనిచో జాలకాగ్రణి చేత
పాఠీనజాలముల్ పట్టువడునె
సరియురి లేనిచో శకునాంతకునిచేత
జొక్కంపు పక్షులు జిక్కువడునె
యోగంబు లేనిచో నొగి మావటీనిచే
గజరాజములు నరికట్టువడునె
తగుకోల లేనిచో మృగయా వినోదిచే
ఘోరమృగంబులు గొట్టువడునె
రాజితానంద తారక రాజయోగ
పావనసమాధి లేనిచో బరమశుష్క
తర్క వేదాంత వాద తత్పరులచేత
నింద్రియ మనంబులు వినిగ్రహింపబడునె ?

అని ప్రథమాశ్వాసము.

**వైరాగ్యం బింతటికిని**
**గారణ మానందకరము గావున నది చే**
**కూఱిన సమస్తమును సమ**
**కూఱుం దనుదాన పరమగుహ్యా మిది సుతా !**

ఓ పుత్రా! పై జెప్పిన జీవన్ముక్తి స్థితిని సంపాదించుటకు వైరాగ్యమే ప్రధాన సాధనము, బ్రహ్మానందమున కిదియే ముఖ్యకారణము. కావున నిది దృఢమైనచో నప్రయత్నముగనే బోధోపరతులు స్వయముగా వచ్చి చేరును. కావున వైరాగ్య మొకటి నిండా ప్రయత్న పూర్వకముగా సంపాదింప వలసినది. ఈ విషయము పరమ రహస్యము. ఇది లేనివారికి మోక్షపద మందదు.

**చిత్తేంద్రియోపరమము మ**
**హత్తరమిది యెల్లవారి కబ్బదు వినుమా,**
**యుత్తమదశ గలిగిన వి**
**ద్వత్తము డతిదుర్లభుడు సదా మన్మయుడున్.**

చిత్తేంద్రియశాంతి ( అనగా నుపరతి) అందరికిని దొరకదు. ఇది మిగుల గొప్పది. ఈ యుపరతి యెవ్వరికినుండునో యట్టివాడు దుర్లభుడు. అట్టివానికిని నాకును ( అనగా శ్రీరాములకు) పరబ్రహ్మమునకు గొంచెమైనను భేదము లేదు. వానిని బ్రతివారును బరమేశ్వరునివలె బూజింపవలయును.

**కొందఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు**
**గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి ,**
**నుపరతి సుఖంబు గానక విపులవిషయ**
**రాగలోలత జెడుదు రూరక మహాత్మ !**

ఓ గొప్పబుద్ధిగల యాంజనేయా ! కొందఱు మేము బరబ్రహ్మము నెఱుంగుదుమని గర్వించి తగిన మనోనిగ్రహము లేకపోవుటచే నుపరతి సుఖమును జెందలేక విపుల విషయ రాగలోలురై యూరక చెడిపోవుచున్నారు.

**జ్ఞానవిజ్ఞాన యుతుడయ్యు సంతతంబు**
**నాత్మభావన లేకున్న నతని యింద్రి**
**యంబులు మనంబు తమకు వశంబు జేసి**
**విషయసుఖముల జవిజూపి వెతల బెట్టు .**

మఱియు, పరోక్షాపరోక్షజ్ఞానములు గల పురుషుడైనను చిత్తమును నిగ్రహించి సర్వకాలవముయందును నిర్వికల్పసమాధి నిష్ఠుడై యుండ వలయును. అట్లుండక పోయిన ననాదియగు విషయాభిలాష ( లేక విషయములే సుఖకరములు) అను తలంపు దొలగదు. దీనిని బట్టి యింద్రియములును, మనస్సును వానికి స్వాధీనములు గావు. అందుచే వాడు మిగుల గష్టపడును. కావున నెట్టివానికైన నుపరతి సుఖంబు నొందుట ( లేక సంపాదించుట) యావశ్యకము.

**విను మొక రహస్య మెఱిగింతు వేయు నేల**
**నే మహా ప్రాజ్ఞునకు మానసేంద్రియములు,**
**పంచినట్లాజ్ఞ లోనిచ్చి పనులు జేయు**
**నతడు నాత్మస్థిత ప్రజ్ఞుడగు బుధేంద్ర .**

విద్వాంసులలో శ్రేష్ఠుడా ! ఇంత జెప్పనేటికి ? పరిపూర్ణాభిప్రాయమును సంక్షేపముగా వివరించెదను. ఏజ్ఞానికి వశములై మనంబును, ఇంద్రియములును బ్రవర్తించుచుండునో వాడే స్థిత ప్రజ్ఞుడు. ఇట్లనేక పవిత్రములైన పద్యములు సీతారామాంజనేయ సంవాదంబున గలవు. అమనస్కమందీరీతిగా జెప్పుటచే దీనిని బాగుగా యోచించవలయును. ఇప్పుడున్న శుష్కవేదాంతులవలె భ్రష్టత్వము గాగూడదని తలంచి కరుణతో జెప్పిన విషయమే యిది. కనుక విషయవైరాగ్యము, బహిరంతరింద్రియ నిగ్రహము, జీవకారుణ్యము, దైవభక్తి, సద్గురుసేవ లేనివారి సమస్త యత్నములును నిష్ప్రయోజనములు. వారు కోటిజన్మము లెత్తినప్పటికిని మోక్షపదము బొందుటకు సాధ్యము గాదు.



## విషయ బంధకము

ప్రశ్న ॥ రాజయోగానందమందున్న వాడింద్రియవిషయముల యందు బ్రవర్తించుచున్న బద్ధు డగునా ?

ఉత్తరము ॥ రాజయోగానందమందున్న మహాత్ములు విషయసుఖమునకు రానే రారు. ఇంద్రియ నిగ్రహము లేనివానికి యోగము సిద్ధింపదని శ్రీకృష్ణభగవంతునియొక్క ముఖ్యాభిప్రాయము. అంతఃపురమందు రాణితో గూడి రమించి రాజ్యభోగముల ననుభవించు రాజు వీథిలో భిక్షమెత్తి జీవించుటకై తిరుగునా? ఇదేనా రాజుయొక్క లక్షణము? అనగా, నవద్వారములతో గూడిన యీ శరీరమను పట్టణమునం దింద్రియములను బ్రజలతో గూడి బుద్ధి యను మంత్రితో సహా మోక్షసామ్రాజ్యమేలుచు ముక్తికాంత యను విరక్తితో రమించి బ్రహ్మానందామృత సాగరమందు మగ్నులై యోలలాడుచుండు యోగి యల్పసుఖ బహుక్లేశమయమైన విషయానంద మను భిక్షమెత్తి జీవించునా? అట్లున్నవాడు రాజు గాడు, వీడు కేవలము దరిద్రుడు. లేక మందార మకరందము భుజించి తృప్తి జెందెడు భ్రమరము దానిని వదలి పేడపురుగువలె దుర్గంధమగు మలమూత్రములయందు సంచరించునా?

**మకరందం పిబన్ భృంగో గంధం నాపేక్షతే యథా ।**
**ధ్యానాసక్తం తథా చిత్తం విషయాన్నహి కాంక్షతే ॥**

మందార మకరందమును గ్రోలు భృంగము దుర్గంధమెట్లు గోరదో, తద్వత్తుగా ధ్యానానందము బొందిన చిత్తము విషయానంద మపేక్షింపదు అని హఠయోగ ప్రదీపిక జెప్పుచున్నది.

**విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విసజ్జతే ।**
**మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥**

విషయముల నాశించిన చిత్తము విషయములలో లీనమగును. ఆలాగుననే, పరమాత్మయైన నన్ను ధ్యానించు చిత్తము నాయందైక్యమగును. ఇట్లేకాదశ స్కంధమందు కృష్ణభగవానులు శ్రీ యుద్ధవులకు బోధించియున్నారు.

కనుక, విషయాదులందు మనసును బ్రవేశింపనీయక ఆత్మధ్యానమందు నిలుపవలయును. ప్రవేశించినయెడల, అపేక్షచే బనసపండు మదనమునకు బ్రవేశించిన మక్షికమువలె బద్ధు డగుచున్నాడు.

శ్రుతి ॥ మనసైవ మనశ్ఛిత్వా పాశం పరమబంధనమ్ ।
భవాదుత్తారయాత్మానం నాసావన్యేన తార్యతే ॥

మనసుచేతనే పరమపాశమైన సంసారబంధమగు మనసును ఛేదించి విషయసాగరమందుండి యాత్మనాత్మచేతనే యుద్ధరింపవలయును. మరియొక విధముగా తరించుటకు వీలులేదని మహోపనిషత్తు.

ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥

తన యాత్మనాత్మచేతనే యుద్ధరింపవలయును. ఆత్మను నాశము జేయరాదు. తన మనసు శుద్ధమైనచో యదే బంధువు. తన మనసు మలినముతో గూడినచో యదియే గొప్పశత్రువని తెలియవలయును. అనగా విషయ సంబంధమైన మనసుచే దుఃఖమును, నిర్విషయమైన మనసుచే సుఖమును అనుభవించును.

బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥

ఏ మనసుచేత దేహేంద్రియాదులను జయించునో ఆ మనసే వానికాత్మబంధువు. ఇంద్రియనిగ్రహము లేని మనసు వానికి శత్రువువలె నేర్పడును. అనగా మనసెవని కధీనముగా నున్నదో, వాని కామనసే మహోపరమోపకారి. లేనివాని కామనసే గొప్ప యపకారి యగును అని శ్రీ కృష్ణ స్వామి యుపదేశము.

చిత్తం కారణమర్థానాం తస్మిన్ సతి జగత్త్రయమ్।
తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః ॥

మనసే సమస్తమైన యనర్థములకు గారణము. ఆ మనసు బహిర్ముఖమైనయెడల ముల్లోకములును గలవు. దానిని నాశముజేసిన వారికి త్రిలోకములు గూడ నశించును. కనుక ప్రయత్న పూర్వకముగా నిగ్రహము జేయవలయును.

వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా ।
మలినా జన్మ హేతుస్స్యాత్ శుద్ధా జన్మ వినాశినీ ॥

జీవులకు శుద్ధమనియు, అశుద్ధమనియు, వాసన (వృత్తు)లు ద్వివిధములు. మలినవాసన యైన యెడల విషయమందు బ్రవేశించి యనేక జనన మరణ దుఃఖసాగరములకు పాత్రుడగును. శుద్ధవాసనా వశమగునటుల మనసును ద్రిప్పిన యెడల శాశ్వతానంద మోక్షము నొందును.

శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్ ।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥

మంచిచెడుగు లను రెండుమార్గములచే బ్రవహించెడు వాసన యను నది గొప్ప పురుష యత్నముచే మంచిమార్గమునందు నడుపవలయును. అనగా కర్షకు డేలాగున కాలువజలము కట్ట తెగిపోవునపుడు దాని నడ్డగించి పైరుకు బెట్టునో ఆలాగున దుర్విషయమందు బోవు మనోవృత్తులను సన్మార్గమందు ద్రిప్పినవాడు ధన్యుడగును అని వాసిష్ఠము.

శ్రుతి ॥ యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥

ఏ యొక్క విజ్ఞాని యైనవానికి సదా మనోనిగ్రహము గలదో వానికి సమస్తేంద్రియములును నిపుణుడైన సారథికి మంచి యశ్వములవలె వశమై యుండును. అనగా మనోనిగ్రహము గలవానికి మాత్రమే యింద్రియములు స్వాధీనమై యుండును.

శ్రుతి ॥ యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥

ఎవడవివేకియై ధ్యాననిష్ఠల జేయక మనోనిగ్రహము నొందలేదో వాని యొక్క యింద్రియములు సారథికి దుష్టాశ్వములవలె స్వాధీనములు గావు. అనగా దుష్టమగు గుఱ్ఱమునెక్కి సవారిజేయ దెలియనివాడు ఆ గుఱ్ఱము పోవు దారియందు బోయినయెడల కంపలు ,చెట్లు, రాళ్లు మొదలగువానియందుబడి బహుదుఃఖమునకు పాత్రుడగును గదా !

**శ్రుతి ॥ యస్తు విజ్ఞానవాణ్ భవతి సమనస్కః సదాశుచిః ।**
**స తు తత్పదమవాప్నోతి యస్మాద్భూయో న జాయతే ॥**

ఏవంహాత్మడు సర్వదా మనోనిగ్రహమంతోగాడి బహిరంతరశుద్ధిగలవాడై యుండునో, వాడుమాత్రమే నాశరహితమైన పరమపదము నొందుచున్నాడు. తర్వాత దానినుండి పునరావృత్తియైన జననమునకు రాడు.

**శ్రుతి ॥ యస్త్వవిజ్ఞానవాణ్ భవత్యమనస్కః సదా శుచిః ।**
**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥**

ఎవ్వడు మూఢుడై మనోనిగ్రహము జేయక సంసారవిషయమందు సర్వదా యశుచియైన విషయ వాసనయందుండునో వాడామోక్షపదము బొందుట కర్హుడు గాడు. జనన మరణమను భవసాగరమందు బతితుడగును.

**శ్రుతి ॥ విజ్ఞాన సారథిర్యస్తు మనఃప్రగ్రహావాన్నరః ।**
**సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥**

ఏ యొక్క ' నరుడు బుద్ధిని వివేకియైన సారథిగాను, మనస్సును ప్రగ్రహ (కళ్ళెము)తో సమానముజేసి చిత్తమను గుఱ్ఱమందెక్కునో వాడు సుఖముగా సంసార సాగర మార్గము యొక్క పారమును దాటును. ఆ స్థానమే విష్ణుపదమైన పరమపదము. దానికే మోక్షమని పేరు. ఇట్లు కాఠకోపనిషత్తు. కనుక, రాజయోగానంద మందుండువాడు నీచమైన విషయ సుఖముల నాశింపడు. విషయసుఖములయందు బ్రవేశించినవాడు బద్ధుడగును.

ఓ పరిశుద్ధాత్ముడైన ప్రియ సోదరుడా ! ఇంకను శ్రద్ధాభక్తులు గలవాడవై యాకర్ణింపుము.

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥**

అభ్యాస, యోగ, ధ్యాన, వైరాగ్యములచే మనసును స్వాధీనము జేసుకొనుటకు సాధ్యముగానివానికి యోగానుభవము సిద్ధింపదని నాయొక్క నిశ్చయాభిప్రాయము. కాని ప్రతిదినము క్రమక్రమముగా వైరాగ్య ధ్యానాభ్యాస ప్రయత్నముచే మనస్సు స్వాధీన మగును. అప్పుడు వాడు ముక్తుడగును.

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి ॥**

ఇంద్రియములు పూర్వసంస్కారముచే ప్రపంచ విషయములపై బోవునపుడు పోనీక అడ్డుపరచి ధ్యానమందు నిలుపవలయును. అట్లు పోయిన యెడల సముద్రమందు గొప్పగాలికి లోబడిన నావవలె వీని ప్రజ్ఞను నాశము జేయును.

**నాస్తి బుద్ధిరయుక్తస్య చాయుక్తస్య భావనా ।**
**న చాభావయతశ్శాంతిరశాన్తస్య కుతస్సుఖమ్ ॥**

మనస్సు ధ్యానమందు నిలుప సాధ్యముగానివాని కాత్మ జ్ఞానమైన బుద్ధి ప్రకాశింపదు. ఆ బుద్ధి లేనివానికి పరబ్రహ్మ భావము సిద్ధింపదు. బ్రహ్మభావన లేనివానికి మనశ్శాంతి కానేరదు. మనశ్శాంతి లేనియెడల శాశ్వతానంద మోక్ష మెక్కడిది ?

**యతతోఽహ్యపి కౌన్తేయ ! పురుషస్య విపశ్చితః ।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥**

ఓ కౌన్తేయా ! బలవంతమైన యింద్రియములు బ్రహ్మప్రాప్తికొఱకు ధ్యానాభ్యాసము జేయుచుండెడి పండితులయొక్క మనస్సును గూడ బలాత్కారముగా విషయముల కొఱకాకర్షించును. అనగా నభ్యాసవైరాగ్యములతో గూడిన జ్ఞానియొక్క మనస్సును గూడ విషయము కొఱకాకర్షించునని చెప్పునప్పుడు వైరాగ్య ధ్యానములు లేని తదితరుల కార్యమేమి చెప్పవచ్చును ?

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

కాన నట్టి యింద్రియముల నన్నిటిని స్వాధీనముజేసి నాయం దాసక్తి (ధ్యానమందు సదా యిష్టము) గలిగి పరమాత్మభక్తితో నుండవలయును. ఎవరి కింద్రియములు విషయమందు బోక స్వాధీనమై యుండునో వానికి మాత్రమే స్థిరమైన బ్రహ్మజ్ఞానము గలుగును. అనగా శిశ్నోదరపరులకు సాధ్యము గాదనుట.

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

ఇట్లు మునియైనవా డింద్రియ సుఖములగు విషయములనుండి తాబేలు తన యవయవములు లోనికి ముడుచుకొనునట్లు చక్షురాదీంద్రియములను వశీకరించుచో వానియొక్క జ్ఞానము స్థిరముగా నిలుచును.

**యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥**

చంచలమై యస్థిరమగు మన స్సెయే యింద్రియ విషయములయందు సంచరించునో, ఆ విషయములనుండి మరలించి యాత్మ ధ్యానమందు వశమగునటుల జేయవలయును. అనగా పూర్వజన్మ వాసనావశమై విషయముల యందు మనసు ప్రవేశించిన యెడల జ్ఞానవైరాగ్యములచే మరలించి స్వస్వరూప స్థితియందు నిలుపవలయును. లేనిచో బహువిధకష్టములకు బాత్రులగుదురు. ఎట్లనగా, నొక పశువు వాసనావశముచేత పైరు మేయుటకు బొలమునకు బోవునపుడు మేపువాడు పోనీక యడ్డగించునట్లు మనస్సను పశువు విషయభూమికయందు బ్రవేశించినపుడు బుద్ధిచే మరలించవలయును. లేనియెడల కృషివాడు దొడ్డియందుదోలిన యెడల నచ్చట నీళ్ళు కసవు లేక పశువు కష్టపడునట్లు విషయభోగముచే నల్పసుఖము, తదనంతరము బహువిధ దుఃఖమునకు బాత్రుడగును. ఆ శ్రీవాసుదేవుల యుపదేశము గమనించ వలయును.

**సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్।**
**అనంతం బ్రహ్మనిష్ఠానా మితి వేదాన్త డిండిమః ॥**

విషయానంద మందుమగ్నులైన జనుల కల్పమైన సుఖమునను, అంతములేని క్లేశమును గలుగును. బ్రహ్మనిష్ఠులైన మహనీయుల సుఖమంతము లేనిదై శాశ్వతమైయుండును అని వేదాంత డిండిమము ఘోషించుచున్నది.

**పురుషార్థత్రయావిష్టాః పురుషాః పశవో ధ్రువమ్।**
**మోక్షార్థీ పురుషః శ్రేష్ఠ ఇతి వేదాంత డిండిమః ॥**

ధర్మార్థకామములను పురుషార్థత్రయము నాశించు పురుషులు కేవలము పశుప్రాయులు, మోక్షార్థియైన పురుషు డొకడు మాత్రమే యందరికంటే శ్రేష్ఠుడు అని వేదాంత డిండిమము జెప్పుచున్నది.

**ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం చరతీంద్రియమ్।**
**తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్ ॥**

సమస్తమైన యింద్రియములలో నొకటిమాత్రమైనను విషయమందు బ్రవేశించిన యెడల భిన్నమైన ఘటమునుండి జలము కారిపోవునట్లు వీని యొక్క ప్రజ్ఞ నశించును. అనగా ఒక ఇంద్రియము చలించిన నాశము బొందునని చెప్పిన యెడల తదితరములన్నియు చలించినప్పుడు వారి యవస్థ యేమని చెప్పవచ్చును? అని మనుస్మృతి.

## విషయాదుల వలన తృప్తి

ప్రశ్న ॥ అయ్యా! స్వామీ! కొందఱు వేదాంతులు విషయమందుబోవు మనస్సును నిగ్రహింప నక్కరలేదు. ఆ మనసు విషయముల ననుభవించి తనకు దానే నిలిచిపోవునని చెప్పుదురు. విషయాశ కలిగినప్పు డనుభవింపక మనసును అడ్డగించిన యెడల ఆ మనసు ధ్యానమందు నిలువక విషయమునే సదా కోరుచుండును గదా! ఎట్లనగా, ఆకలి యున్న వాడన్నము భుజించి తృప్తుడైన తర్వాత నేలాగున మరల అన్నమును గోరడో ఆలాగునగదా విషయములయొక్క స్థితియును గూడ.

ఉత్తరము ॥ ఓ బుద్ధిమంతుడైన సోదరా ! ఇట్లు చెప్పువారికిగదా శుష్కవేదాంతులని వేదవేదాంత మెఱింగిన మహనీయులొక నూతన నామధేయము గలిగించిరి. ఈయుక్తి సరికాదు. ఏలననగా, అన్నము భుజించి జీర్ణమైన వెంటనే మరల నాకలిబాధ కలిగి యన్నమునే కోరుచున్నది. ఆలాగుననే విషయముల భోగించి కొంతసేపు తాళిన తర్వాత తిరుగా ఆ విషయములనే కోరుచున్నది. ఇట్లున్నవానికెప్పటికిని నిర్విషయ స్థితి గలుగదు. విషయముల ననుభవించి తృప్తుడైన యెడల జీవులు బ్రహ్మసృష్టి మొదలు నేటివరకనేక కోటిజన్మములం దనేక విషయము లనుభవించి యుందురుగదా ! ఏల ఇప్పటికి ఆశ మానలేదు ? అనుభవించి నంత మాత్రముచేత ఆశ వృద్ధియగును గాని నశింపదు. దొంగపని జేయువానికి దినదినమునకు ఆశ వృద్ధి యగును. తొలిదినమున దొరికిన దానితో దృప్తిపడడు గదా ! అట్లు జెప్పువారి మాట లేలాగున నుండుననగా హోమగుండాగ్ని ఘృతముచే జల్లారుననియు, మలినవస్త్రము బురద నీటియం దుతికిన శుభ్రమగుననియు, కల్లుపాత్రము సారాయితో గడిగిన వాసన పోవుననియు, ఋణస్థుడు మరియొకచోట నప్పు తీసిన ఋణవిముక్తుడగుననియు, స్త్రీ సంబంధరోగము గలిగిన పురుషుండా యాడుదాని యందు సదా రమించిన యెడల శీఘ్రముగా రోగము నివారణ మగునని చెప్పినట్లుండును.

**న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవ హి వర్ధతే ॥**

కామమెప్పటికిన్ని భోగముచే వృద్ధి బొందునే గాని శమింపదు. హోమాగ్ని హవిస్సుచే నంతకంతకు వృద్ధియగును గాని, శాంతము గానేరదు గదా! ఇది శ్రీ శుకబ్రహ్మర్షులవారి ముఖ్యాభిప్రాయము. భాగవత ఏకాదశస్కంధమందు జెప్పియున్నారు.

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥**

రజోగుణమువల్ల బుట్టిన కామము (విషయాశ) క్రోధముగా

బరిణమించును. ఈ కామమునకు దృప్తి కానేరదు. కావున నది మహాపాప స్వరూపమైనది. ఇటువంటి కామమే మనుజులకు మహాశత్రువని తెలిసికొనుము.

**ధూమేనాఽఽవ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేన చ।**
**యథోల్బేనాఽఽవృతో గర్భ స్తథా తేనేదమావృతమ్॥**

అగ్నిహోత్రము పొగచేతను, దర్పణము ధూళిచేతను, పిండము మావిచేతను నావరింపబడినట్లు ఈ యాత్మజ్ఞానము గూడ కామముచే నావరింపబడినది.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।**
**కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణాఽనలేన చ॥**

ఓ యర్జునా! జ్ఞానియగువానికి నిత్య శత్రువున్ను, ఎంత పూరించినను నిండనిదియు, ఎప్పటికి దృప్తిలేనిదియు, కోరికలే స్వరూపముగాగల యీ కామము జ్ఞానము నావరించుకొని నాశము జేయుచున్నది.

**తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥**

కాబట్టి ఓ యర్జునా! నీవు మొట్టమొదట నింద్రియములను విషయములందు బోనీక స్వాధీనముజేసుకొని మోక్షకారణమగు జ్ఞానమును, విజ్ఞానమును నశింపజేసెడి యీ మహాపాప స్వరూపమగు కామమును విడువుము. జ్ఞానమనగా శాస్త్రముచేతను గురువులచేతను సిద్ధించునది. విజ్ఞానమనగా, స్వానుభవజ్ఞానము. వీని నన్నిటిని విషయవాసన నాశము జేయును.

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥**

బాహ్యములగు ఇంద్రియసుఖ విషయమందాసక్తిలేని యంతఃకరణము గలవాడై తన యాత్మలో నెట్టి ధ్యానసుఖమును బొందునో, అట్టి నాశము లేని సుఖమును బ్రహ్మమునందు నిశ్చలమైన యంతఃకరణము గలవాడు బొందగలడు

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।**
**ఆద్యంతవన్తః కౌన్తేయ ! న తేషు రమతే బుధః ॥**

ఓ కౌన్తేయా ! ఇంద్రియాది విషయ సంయోగముచే గలుగు సుఖములు బహుదుఃఖములకు గారణమగును. ఆ సుఖమున కాద్యంతములు గలవు. కాబట్టి వివేకియైన జ్ఞాని యట్టి నిస్సారమైన సుఖములందు రమింపడు. కనుక విషయసుఖమందు బ్రవేశింపగూడదు. ప్రవేశించిన యెడల గాలియందు బెట్టిన కర్పూరమువలెను, నీటియందు దడిపిన యుప్పుబస్తాలవలెను తనజ్ఞానము స్వరూపమే లేనిదైపోవును. కనుక కామమను విత్తనము భోగానుభవమను కృషి జేసినయెడల వృద్ధి యగునే గాని నశింపదు.

ఆ కామబీజములను వేయించిన యెడల ఉన్మూలముగా నశించును.

**అగ్నిదగ్ధం యథా బీజం శాఖా పల్లవ వర్జితమ్ ।**
**జ్ఞానదగ్ధం తథా యోగి పునర్జన్మ న విద్యతే ॥**

అగ్నిచే దగ్ధమైన బీజము లేలాగున మొలకలెత్తి తరుశాఖా పుష్పఫలములు గానేరవో, అలాగుననే జ్ఞానాగ్నియందు దహించిన కర్మ బీజములచే సంసారవృక్షము నశించి యోగియైనవాడు పునర్జన్మ రహితుడగు చున్నాడు.



## కర్మ రాహిత్య నిరూపణము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! పుణ్యకర్మమువలన స్వర్గభోగ మనుభవించి పునర్జన్మమున ధనవంతుడై యుండుననియు, పాపకర్మముచే నరక మనుభవించి దరిద్రుడై పుట్టుననియు శాస్త్రము జెప్పుచున్నదే ! కాబట్టి ముముక్షువైనవాడే యొక్క కర్మము జేయగూడదని కొందరు పెద్దలు జెప్పుదురే యది నిజమా !

ఉత్తరము ॥ ఓ బుద్ధిమంతుడవైన సుశీలుడా ! ఈ కర్మ విషయము బహురహస్యమైనది. ఇదియే శ్రీ భగవద్గీతయందు కరుణా సముద్రుడగు శ్రీ కృష్ణభగవాను లుపదేశించిన యతి రహస్యము. ఈ కర్మయొక్క రహస్యము దెలియక మనుజులు బద్ధు లగుచున్నారు. '' కర్మ కర్మణా నశ్యతి'' అని శ్రుతి

చెప్పుచున్నది. అనగా కర్మము గర్మముచేతనే నశింపబడును. ఎట్లనగా విషమంటిన వానికి మరియొక విషముచేతను, ఒక అస్త్రమును దానికి విరోధియైన మరియొక యస్త్రము చేతను, అనగా నాగాస్త్రమును గరుడాస్త్రము చేతను, ఇనుము నినుము చేతను (అనగా ఇను మాకురాయిచే బిండియగును), మలినము మలినముచేతను అనగా మలినవస్త్రము మలినమైన మరియొక చవిటిమట్టిచేతను, మృతశరీరము గట్టెలచేతను నెట్లు నశించునో ఆలాగుననే సకామముచే బద్ధుడైన జీవుడు నిష్కామ కర్మముచే విముక్తుడగును. లేనియెడల ముక్తినొంద దరము గాదని కైవల్యనవనీతము విశదపరచుచున్నది. ఈ విషయమై యింకను శ్రీ శంకర భగవత్పాదాచార్యులు వివేక చూడామణియందు జెప్పినది చూడందగును.

**జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా**
**తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వ మస్మాత్పరమ్ ।**
**ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి**
**ర్ముక్తిర్నో శతకోటిజన్మసు కృతైః పుణ్యైర్వినా లభ్యతే ॥**

అనేక విధములైన జంతువులలో నరజన్మము గడుదుర్లభమైనది. ఆ నరజన్మమందు బురుషజన్మ మతిశ్రేష్ఠము. ఆ పురుషులలో బ్రాహ్మణజన్మము మిగుల నుత్కృష్టమైనది. ఆ బ్రాహ్మణజన్మమందు వైదికధర్మ మార్గావలంబుడు శ్రేష్ఠుడు. వానికంటే యుక్తాయుక్త విచార బుద్ధిగలవా డతిశయుడు. వానికంటే ఆత్మానాత్మవిచారము గలుగుట శ్రేష్ఠము. దానికంటె బ్రహ్మానుభవస్థితి మిగుల ప్రశస్తము. కాని యీ సంసార విముక్తి యనేక జన్మముల యందీశ్వరార్పణ బుద్ధిచే జేయు పుణ్యకర్మలచే సిద్ధించును. వేఱువిధముగా లభ్యము గాదని చెప్పుటవలన సత్కర్మముల ద్యజించినవారికి జ్ఞానము గలుగుటకై మార్గము లేదు. పరిపూర్ణజ్ఞానము గలుగకముందు కర్మను విడిచినవారికి జన్మము నిష్ప్రయోజన మగును. ఎట్లనగా నవమాసములు పూర్తిగాక మునుపే ప్రసవించిన శిశువు జీవించునా ? లేక ముదరనికాయ, పండు కుపయోగమగునా ? లేదు గదా ! ఆలాగుననే యపరోక్షజ్ఞాన పర్యంతము గర్మ జేయనివాడు భ్రష్టుడగును.

శ్రుతి॥ **సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే**
**నృణాం మోక్షేచ్ఛా జాయతే ॥**

అనగా ననేక జన్మములందు చేసిన నిష్కామపుణ్యకర్మ పరిపక్వత వల్లనే నరులకు మోక్షేచ్ఛ యుదయ మగును గాని లేనియెడల సాధ్యము గాదు.

**యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।**
**యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥**

యజ్ఞవము, దానవము, తపస్సు మొదలగు కర్మముల నెప్పటికిని విడువరాదు. వాటిని శ్రద్ధాభక్తులతో తప్పక చేయుచుండవలయును. ఎందుకనగా, యజ్ఞ, దాన, తపములు పండితులకు జిత్తశుద్ధి గలిగించును.

**ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।**
**కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్ ॥**

ఓ పార్థా ! ఈ పై జెప్పిన యజ్ఞదానతపములను కర్మము లీశ్వరార్పణ బుద్ధిచే ఫలము గోరక, విధిప్రకారము శ్రద్ధాభక్తులతో జేయవలయునని నాయొక్క ముఖ్యాభిప్రాయము.

**నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।**
**మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥**

అవశ్యముగా జేయుటకై విధించిన యజ్ఞ దాన తపములను విడువరాదు. అవివేకముచే నా కర్మ త్యాగము జేయుట తామస స్వభావమని చెప్పబడుచున్నది. నియతస్య అను పదమునకు విధించిన దానికి అని యర్థము. మోహాదను ప్రయోగమునకు జ్ఞానహీనతవల్ల (ప్రమాదముచే) అని తాత్పర్యము.

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥**

ఎవడు దుఃఖమను విచారముతో (అనగా, శరీరాయాసమని తలంచి) యజ్ఞ, దాన, తపో వ్రతములను పరిత్యజించునో, ఆ త్యాగము రాజస స్వభావము గాని, జ్ఞాననిష్ఠులైన మహనీయుల లక్షణము గాదు. కర్మత్యాగి యైన వానికి జ్ఞాననిష్ఠచే సిద్ధియగు మోక్షము లభించదు. అనగా, అయ్యో! యజ్ఞ దానముల కెంత ధనవ్యయము, తపోవ్రతముల కెంత శరీరకష్టము అని చింతించు అలస

పురుషునికి జ్ఞానము సిద్ధింపదు. రాజస స్వభావముగా, కొందరు దురహంకారులైన రాజులు మదోన్మత్తులై వెనుక ముందు జూడక గొన్ని పనుల నహంకారముతో జేయుదురు. దానికే రాజసమని పేరు. రాజస త్యాగమనగా, కొందఱు రాజు లహంకారముతో విధి ప్రకారము జేయవలసిన యజ్ఞ దానము మొదలగు సత్కర్మముల జేయక లోకమునకు గీడు గలిగించుటయే రాజసత్యాగము.

న కర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

ఏ పురుషుడు యజ్ఞ, దాన, తపః, పూజార్చనాది పుణ్యకర్మములను జేయడో వానికి జ్ఞానయోగముచే కలుగు మోక్షమును బొంద సాధ్యము గాదు. అనగా నీ కర్మములను విడిచినవాడు భ్రష్టుడగునని తాత్పర్యము. ఇదిప్పుడనుభవము గదా, విధి కృతమైన యజ్ఞ దాన తపములను గర్మలనాచరించక సన్న్యాసులు గర్మరహితులుగదా యని చెప్పుచు బంచీకరణ తత్త్వములలో నేవో కొన్ని నేర్చి పరిపూర్ణజ్ఞానము లేక శాస్త్ర నిషిద్ధములైన వస్తువుల ( అనగా అభిని, గంజాయి త్రాగుట మొదలగు దుష్కర్మముల) నవలంబించి జన్మమును వ్యర్థపరచుచున్నారు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥

కావున నీవు యజ్ఞ దాన తపములను గర్మములను విధిప్రకారము జేయుము. కర్మము జేయకుండుట కంటే కర్మమును జేయుచుండుట మేలు. కర్మము జేయకుండుటవలన నీకు శరీర సంరక్షణము గూడ జరుగదు. కనుక కర్మము జేయుట వలన నిహలోక సుఖమును, బరలోకసుఖమును గూడ బొందవచ్చును. లేనియెడల నిహలోకమునం దన్నాదులకు గష్టము గలిగి పరలోక సౌఖ్యమైన మోక్షము నొందక జన్మము వ్యర్థమగును. కావున భుక్తియు, ముక్తియు సిద్ధించుటకై కర్మ కారణమై యున్నది. ఇదిప్పుడు బ్రత్యక్షానుభవమైయున్నది. కొందరు సంసారమును విడిచి సత్కర్మములను జేయక దేహయాత్రకు గూడ గష్టపడుచున్నారు. వీరి కిహలోకమునం దల్పసుఖమైన భోజన వస్త్రభార్యాది

సుఖమునను లేక మోక్ష సుఖము కొఱకు ధ్యాననిష్ఠయుం జేయక యుభయభ్రష్టులగుచున్నారు.

**సన్న్యాసస్తు మహాబాహో ! దుఃఖమాప్తుమయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥**

ఓ మహాబాహో ! కర్మానుష్ఠానము సంపూర్ణముగా జేయనివానికి గర్మ సన్న్యాసమను మోక్షము బొందుట బహుకష్టతరము. విధిప్రకారము తపో ధ్యానములను చేసిన మౌని శీఘ్రముగ సుఖము, బ్రహ్మపదము నొందును. ఎట్లనగా, నొక్కరికి క్రింద తరగతి యందు జదువవలసిన గ్రంథమును జదువక పై తరగతి యందున్న గ్రంథము జదువుట కెంతకష్టముగా నుండునో యంత కష్టముండును.

**కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।**
**యోగినః కర్మ కుర్వంతి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥**

యోగాభ్యాసము చేయు యోగులు గూడ శరీరము చేతను, మనసుచేతను, బుద్ధి చేతను, ఇంద్రియముల చేతను, ఫలాసక్తిని విడచి చిత్తశుద్ధి కొఱకీశ్వరార్పణబుద్ధితో శ్రద్ధాయుక్తులై యజ్ఞ, దాన, తపో, వ్రత, పూజాది కార్యములను జేయుచున్నారు. యోగులు గూడ సర్వదా త్రికరణశుద్ధి కొఱకు గర్మలను జేయునపుడు తదితరుల కథ నేమి చెప్పవచ్చును ? ఎట్లనగా రోగము లేనివాడు గూడా పథ్యముగా నుండవలసినపుడు రోగముచే బాధనొందువా డౌషధ పథ్యములు విడువవచ్చునా ?

**యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥**

కర్మఫలము నీశ్వరార్పణము జేసి విధి ప్రకారము తప్పక గర్మము జేయు వానికి గర్మఫల మందదు. వాడీశ్వరానుగ్రహముచే శాశ్వతానంద మోక్షమును బొందును. ఫలాపేక్షతో గూడి కర్మము జేసినవారికి కర్మ ఫలానుభవము కొఱకు తదనుసారమైన జన్మము గలుగును. ఇచ్చట కర్మముయొక్క రహస్యము

శ్రీకృష్ణస్వామి బోధించెను. తపో, జప, ధ్యాన, దానాది కర్మములచేత మాత్రమే మనశ్శుద్ధి గలుగును. అది లేనియెడల చిత్తశుద్ధి గానేరదు. ఈశ్వరార్పణ బుద్ధితో జేయు కర్మఫలానుభవము కొఱకు దేవ, మానవ జన్మములెత్త నక్కరలేదు. ఇదే కర్మముయొక్క గొప్ప రహస్యము. ఇది భగవద్గీత యొక్క రహస్యార్థము.

**అవిద్యాం శ్రేష్ఠయా శ్రేష్ఠః క్షాళయన్నేవ తిష్ఠతి ।**
**మలం మలేనాపహరేత్ యుక్తిజ్ఞో రజకో యథా ॥**

బుద్ధిమంతుడైన చాకలివాడేలాగున భూమియొక్క మలమైన చవిటి మన్నుచే వస్త్రముయొక్క మలినమును బోగొట్టునో ఆలాగుననే యవిద్యాసంబంధమైన కర్మమును; విద్యాసంబంధమైన శ్రేష్ఠకర్మముచే బోగొట్టవలయునని శ్రీ వసిష్ఠ మునీంద్రునియొక్క యభిప్రాయము. కనుక, ముముక్షువైన ప్రియసోదరా ! శిశ్నోదర పరాయణులైన మూఢవేదాంతుల వచనము చెవియందు బ్రవేశింపనీయక ధ్యాననిష్ఠను నీయొక్క స్వరూపస్థితినొందు పర్యంతము త్యజింపరాదు. త్యజించినయెడల గురుద్రోహమునకు బాత్రుడవగుదువు. ఇదియే గొప్ప గురుశుశ్రూష.

కర్షకుడు పొలమునందు తృణాదులను శుభ్రముగా దీసివేయమని కూలీలకు జెప్పగా, కృషి ఫలితమున కుపయోగపడు పైరులను గూడా పెఱికి వేయు మూఢులు గలరా? ఆలాగుననే దుష్కర్మ రాహిత్యము జేయుమని విధి చోదితమై యుండగా, మోక్షమార్గమున కుపయోగపడు యజ్ఞ, దాన, తపో, ధ్యానములు విడుచువారు గలరా ? అట్టివారే మూఢులైన శుష్కవేదాంతులు.

## విధి నిషేధముల రహస్యము

ప్రశ్న॥ ఓ స్వామీ ! విధి నిషేధములు లేనివాడగు అచల పరిపూర్ణ రాజయోగి యను వచనమునందున్న రహస్యము నాకు దయచేసి నన్ను నిస్సంశయునిగా జేయుము తండ్రీ!

ఉత్తరము ॥ ఓ కుశాగ్రబుద్ధిగల సోదరా ! విధి నిషేధముల యతి క్రమము లోకాతీతుడై, నిగ్రహానుగ్రహ శక్తులుగలవాడై, ద్వంద్వాతీతుడై, మహా

మహనీయుడైన యోగికి జెప్పినదికాని తదితరులకు జెప్పినది కాదు. అట్లున్నప్పటికిన్ని లోకాతీతమైన జ్ఞానముగల యోగీశ్వరుడు గూడ పామరుల వలె కర్తృత్వాది బంధములను విడిచి కర్మము జేయవలయునని శ్రీకృష్ణభగవానుల యొక్క యభిప్రాయము. దీనిని దెలియక కొందరు శుష్కవేదాంతులు సర్వమును జేయవచ్చును. సర్వమును భుజింపవచ్చును అని చెప్పు అర్థము గాదు.

దీనికొక కథ గలదు. ఒక మహాయోగీశ్వరుడు సర్వశక్తి గలవాడు. ఆయనయొక్క స్థితిని దెలియక శిష్యవర్గములలో గొందరు ఆయనవలె నాచరించుటకై ప్రారంభించిరి. వీరి మూఢత్వమును చూచి వారు నల్గురు శిష్యులతో గూడి దేశాంతరమునకు బ్రయాణమైరి. మార్గ మధ్యమందు మనుజ నివాసము లేని కారణముచే జలము గూడ దొరకుటకు గష్టమైన సమయములో నొక యాంధ్రవాడు దటస్థించెను. వానిని వారు దాహమున కోర్వ సాధ్యములేక జలమడిగినపుడు ''నావద్ద జలములేదు. కల్లు మాత్రమున్న'' దని చెప్పినంతనే గురువైనవారు సరి, యేమిచేయుదునని కల్లునే తృప్తిగా పుచ్చుకొని శిష్యులతో నేమియు బలుకక నడవసాగిరి. శిష్యులు గూడ దాహపీడితులైన కారణముచే స్వాములవారే పుచ్చుకొనినపుడు మనము మాత్రమేల కల్లు ద్రాగగూడదని యందరున్ను దృప్తిగా బుచ్చుకొనిరి.

ఇదంతయును జూచుచున్న గురువు మరికొంతదూరము పోయిన తరువాత జలము దొరకక గష్టపడు సమయమందు సమీపములో రెండుమూడు కమ్మర యిండ్లుమాత్రము దటస్థపడెను. వారిని జలమునకై యాచించగా, ఆ సమయములో వారు కంచుకరగి యచ్చుబోయుటకు జేత బట్టియుండి యిచ్చట నిదే జలము గాని మఱి వేఱు జలము జిక్కదని చెప్పిరి. సరి అదే పోయుమని చెప్పి గురువగ్ని మయముగా నుండు కరిగిన కంచును క్షీరమువలె బొట్టనిండుకు సుఖముగా త్రాగి శిష్యులను ద్రాగుడని సెలవిచ్చిరి. అగ్నిమయమగు కరిగిన కంచు జూడగానే వారు భయభ్రాంతులై యూరకుండిరి. అప్పుడు గురువైన వారు దీనికి సాధ్యము లేనివారు దానికిని అర్హులు గారని చెప్పి భ్రష్టులగా జేసి శపించిరి. వీరు కర్ణాటక దేశ సర్వజ్ఞయోగుల వారని కొందరి యభిప్రాయము. ఈలాగున ననేక కథలు గలవు. గ్రంథ విస్తరభీతిచే వ్రాయలేదు.

యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥

ఉత్తము డనిపించుకొనినవా డేయే కర్మముల జేయునో, తక్కిన వారును వాటినే యవలంబింతురు. అట్టి యుత్తముడు దేనిని ప్రమాణముగా దీసికొనునో, లోకులందరు దానినే ప్రమాణముగా గైకొనుటకు సమ్మతింతురు. కనుకనే, ''యథా రాజా తథా ప్రజాః'' అని చెప్పురీతి ఇప్పుడున్న కొందరు గ్రామాధికారులు సన్మార్గులై యుండినచోట్లలో, నా యూరియందందరును సద్గుణశాలురై కనబడుచున్నారు. తద్వతుగా కొందరు గ్రామాధిపతులు మూర్ఖులై యుండు చోట నా గ్రామ వాసులందరును దురాచారము గలవారై కన్పడుచున్నారు. కనుక ఆ గ్రామాధిపతియైన వాడు వారందరు జేసిన పాపమునకు బాత్రుడగుచున్నాడు. ఆలాగుననే మంచివాడు పుణ్యకర్మములకును బాత్రుడగును. కాబట్టి గ్రామాధికారులు నిండా శ్రద్ధతో నుండవలయును. తద్వతుగా ''యథా గురు స్తథా శిష్యః'' గురువెట్లుండునో శిష్యుడును నారీతిగానే యుండునని యర్థము. ఇది ప్రత్యక్షముగా గనబడుచున్నది. కొందరు శుష్కవేదాంతులు జేయు నీచ కర్ములైన మధుమాంసాది వృత్తులు శిష్యులు నుపయోగించుట గన్పట్టుచున్నది. కనుక నికమీదనైనను నీలాటి దురాచారములను శిష్యులకు బోధించి లోకమును పాడుజేయకుండుట కొఱకై కరుణామూర్తియైన భగవంతుడు వీరికి మంచి బుద్ధినిచ్చి రక్షించుగాక !

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

ఓ పార్థా ! నేనొకప్పుడైనను గర్మమునందు సోమరితనము లేనివాడనై యుందును. నాకు మూడు లోకములలోను గొంచెమైనను జేయవలసినదియు పొందదగినది గాని లేదు. ఐనను నేను రామకృష్ణాద్యవతారములనెత్తి పామరులవలె సుకర్మములను వారి శ్రేయస్సుకొఱకై చేయుచునే యుందును.

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ ! సర్వశః

ఓ పార్థా ! సోమరితనము లేనివాడనగు నేను ఒక సమయమున కర్మల జేయకనే యున్నయెడల మనుజులందరు అన్ని విషయములలో నామార్గమునే యవలంబింతురు.

**ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ॥**

నేను కర్మము జేయనేని జనులు దాము నుగర్మము చేయక నశింతురు.

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్ ॥**

భారతా! అజ్ఞానులు కర్మమునందాసక్తులై యెట్లు యథాశాస్త్రముగా జేయుచున్నారో, అట్లే జ్ఞానికూడ లోకరక్షణార్థమై ఫలాపేక్ష లేక కర్మములను జేయవలయును. ఇట్టి శ్రీ కృష్ణస్వామి యభిప్రాయము దెలియక కొందఱు రాజయోగులు వైరాగ్యాది గుణములతో గూడి జపధ్యానాది పూజలను జేయువారిని సమీపించి వారికి జ్ఞానము గలిగెనో లేదో కనిపెట్టక ''లజ్జ లేనివారై, బుద్ధిహీనులై, పరమమూఢస్వభావముతో, ఏమో జపము జేయు చున్నారు. ఎవరిని ధ్యానించెదరు? ఎందుకుగా పటములకు, విగ్రహములకు బూజ జేయవలయును? అవి మనుజులు నిర్మించినవి కావా ?'' అని బోధహీనులై పశుప్రాయస్వభావముతో కుతర్కవాదము చేసి వారి భక్తివిశ్వాసములను భంగము జేయుచు ఘోరనరకమునకు బాత్రులగుచున్నారు. ఈ కారణముచే భగవాౝ కరుణానిధి యిట్లు జెప్పుచున్నారు.

**న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।**
**జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరౝ ॥**

ఆత్మ జ్ఞానముగలవాడైనను జప, ధ్యాన, తపః, పూజావ్రత పారాయణములందు ఆసక్తులై సంసారమందున్న వారి బుద్ధిని చలింపజేయరాదు. తనకు బూర్వజన్మ పుణ్య పరిపాకముచే జ్ఞానము గలిగినను, బ్రస్తుతకర్మఫలము దన కావశ్యకము కాకుండినను దానును నిష్కాముడై జప ధ్యాన పూజార్చనాది పుణ్యకర్మములను శ్రద్ధాభక్తులతో జేయుచు వారిచేతను గూడ నన్ని కర్మములను వారి శ్రేయస్సుకొఱకై చేయించుచుండవలయును. సంసార మందున్న వారికి

జపధ్యాన పూజార్చనాది పుణ్యకర్మములు లేనియెడల మనోనైర్మల్యము గలుగదు. మనో నిర్మలత్వ మెప్పుడు లేదో విషయవిరక్తి గలుగజాలదు. విషయ విరక్తి లేనప్పుడు వైరాగ్యాది సాధన చతుష్టయ సంపత్తి సిద్ధి గానేరదు. సాధన చతుష్టయసంపత్తి యెప్పుడు సంపూర్ణముగా లేదో వారికి మాయా విముక్తియై మోక్షము గలుగదు. ఇది శ్రీ వసిష్ఠులవారికి తండ్రియైన చతుర్ముఖ బ్రహ్మ యుపదేశించినది.

**తత్ర క్రియాకాండపరా స్త్వయా పుత్ర మహాధియా।**
**ఉపదేశ్యాః క్రియాకాండం క్రమేణ క్రమశాలినా ॥**

ఓ వత్సా ! నీవు భరతఖండమునకు వెళ్ళి అచ్చటనున్న జనులకు ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారుల ననుసరించి కర్మ, భక్తి యోగముల నుపదేశింపుము.

**విరక్తచిత్తాశ్చ తథా మహాప్రజ్ఞా విరాగిణః।**
**ఉపదేశ్యాస్త్వయా సాధో జ్ఞానేనానందదాయినా ॥**

ఓ సాధో ! సమస్తమైన విషయములయందు విరక్తులై, మహాప్రజ్ఞా స్వభావముగలవారై వైరాగ్యపరులైన వారికి మాత్రము పరబ్రహ్మానందము గలుగుటకై జీవబ్రహ్మైక్య జ్ఞానము నీవు ఉపదేశింపుము.

ఇది గదా సరియైన మార్గము ! ఒక డాక్టరాస్పత్రి యందుండు యొక్కొక్కరి రోగము, వారి శరీర గుణము గనిపెట్టి దానికి దగువైన యౌషధ పథ్యము లేర్పాటు జేయక అందరికి నొకటే ప్రకార మాహారమిచ్చి వారితో ''ఓరీ! మీరు రోగులు గారు, మీకు శరీరమెక్కడిది ? నిత్యశుద్ధ ముక్తులు గదా ! జననమరణము లేనివారు గదా ! '' యని చెప్పి తనవలె వారికిని రోగము లేదని విచారించువాడెంత మేధావియని చెప్పవచ్చును ? ఆలాగుననే సంసారమందు నానావిధాజ్ఞానరోగములచే బరితపించువారికి, వారివారి మనఃపక్వము ననుసరించి కర్మోపాసన యోగధ్యానము లుపదేశింపక విచారశూన్యులై యేమియుం దెలియక జపధ్యానములను జేయువారని ఖండించిన వారిసంగతి నేమని జెప్పవచ్చును ?

**అజ్ఞస్య చార్ధ బుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్।**
**మహానరకజాలేషు స తేన వినియోజితః ॥**

అజ్ఞుడై యింద్రియాది విషయములయందు విరక్తి లేనివారి కీశ్వరో పాసనాది మార్గముల నుపదేశింపక నీవే బ్రహ్మమని మహావాక్యముపదేశించిన యెడల వాడు గురువుచే మహానరకమందు ప్రవేశింప జేయబడినవాడగును. ఇది గొప్ప యపకారము గాని యుపకారము గానేరదు.

ఆదౌ శమదమప్రాయై ర్గుణైశ్శిష్యం విశోధయేత్।
పశ్చాత్సర్వగతం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్॥

మొట్టమొదట ముముక్షు వగువాడు గురువువద్దకు వచ్చునపుడు శమదమాది సాధన చతుష్టయ గుణములను శోధించి సర్వగుణ సంపన్నుడై యుండిన యెడల సర్వాంతర్యామియైన శుద్ధ పరబ్రహ్మమే నీవని మహావాక్యోపదేశము జేయవచ్చును. లేనివారికి మనఃపరిపక్వత కొఱకు యోగధ్యానములు బోధించుట శ్రేష్ఠము.

ప్రబుద్ధబుద్ధేః ప్రక్షీణ భోగేచ్ఛస్య నిరాశిషః।
నాస్త్యవిద్యామలమితి త్వాదృశస్యైవ గోచరః॥

కుశాగ్రము వలె సూక్ష్మమైన బుద్ధిగలిగి సమస్తమైన భోగేచ్ఛ నశించిన వాడును, అనగా నిహలోకమునందు స్రక్చందన వనితాదిభోగములను, పరలోకమునందు దేవాఽమృతాఽప్సరః స్త్రీ విషయాది భోగములందును గుక్కమలమువలె నికృష్టబుద్ధిగలవాడును, దేహసంరక్షణమునకు గూడ నాశ లేనివాడును, అవిద్యామల విక్షేప రహితుడును, శ్రీరామచంద్రునివలె పరమపవిత్రుడైన వానికి మాత్రము బ్రహ్మజ్ఞానము గోచర మగును గాని తదితరులకు సాధ్యము గాదని శ్రీ వసిష్ఠమునీంద్రుని యొక్క యాశయము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥

పరిశుద్ధమైన బుద్ధితో గూడినవాడై, మహాధైర్యమైన ధృతిచే మనసు నాత్మయందు సంయమముజేసి శబ్ద, స్పర్శ, రూప, రసాదులైన విషయములను విడిచి రాగద్వేషములను వదలవలయును.

వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః ॥

ఏకాంత ప్రదేశమందుండువాడై, ధ్యాననిష్ఠ పూర్తి కొఱకు భంగము రాకుండుటకై సాత్త్వికమైన యల్పాహారముతో గూడినవాడై వాక్కును, మనస్సును, శరీరమును, ఇంద్రియములను వశీకరించి సర్వకాల సర్వావస్థలయందు ధ్యానయోగ మందాసక్తుడై మహావైరాగ్యముతో గూడిన వానికి మాత్రము జ్ఞానము సిద్ధించును అని గీతాభిప్రాయము.

ధ్యాననిష్ఠస్తు లఘ్వాశీ వైరాగ్యం పరమాశ్రితః ।
అహంకారవిహీనశ్చ యతవాక్కాయ మానసః ॥

సర్వేంద్రియాణి సంయమ్య వివిక్తం స్థలమాశ్రితః ।
బలదర్పవిహీనశ్చ కామక్రోధవివర్జితః ॥

శాంతశ్చ నిర్మలశ్చాపి పరిగ్రహవివర్జితః ।
కల్పతే బ్రహ్మభూయాయ బ్రహ్మధ్యానస్య వైభవాత్ ॥

సదా యాత్మధ్యానమందున్నవాడై, అల్పాహారము గలవాడై, పరమవైరాగ్యముతో గూడినవాడై, మనోవాక్కాయ సంయమియై, చక్షుశ్శ్రవణాది సర్వేంద్రియముల నధీనము జేసికొని విజన ప్రదేశమందున్నవాడై, బలదర్పములైన యరిషడ్వర్గములను నాశము జేసినవాడై, కామక్రోధాదులైన యష్టరాగములను హరించినవాడై, పరమశాంతుడై, వాసనారహితమైన మనస్సుగలవాడై, పరిగ్రహ వివర్జితుడై, బ్రహ్మధ్యాన వైభవముచే నున్నవాడు పరబ్రహ్మమును బొందగలడు అని పద్మపురాణము చెప్పుచున్నది.

వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః ।
భావయే దేకమాత్మానం త మనంత మనన్యధీః ॥

ఏకాంత నిర్మల ప్రదేశమునందాసీనుడై, మహావిరాగియై సర్వేంద్రియములను జయించినవాడై, ఏకాగ్ర చిత్తముగలవాడై, ఏకాకియై అనంతమైన పరమాత్మ నభేదభావన జేయవలయును అని యాత్మబోధము జెప్పుచున్నది.

**యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥**

ఆత్మధ్యానముజేయు స్వభావముగల యోగి సర్వదా విజనప్రదేశము నందేకాకియై, చిత్తమును, ఇంద్రియములను, దేహమును నియమించుకొని పరిగ్రహ వర్జితుడై యంతఃకరణమును సదా సమాధియందుంచవలెను.

**ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥**

మనస్సును మిక్కిలి శాంతము జేసి భయరహితుడై, మనసా, కర్మణా, బ్రహ్మచర్య వ్రతమందున్నవాడై, మనసు నాత్మయందునిలిపి పరమాత్మయే ముఖ్యప్రయోజనమని నిశ్చయించి సమాహితుడై కూర్చుండవలెను.

**యుంజన్నేవం సదాఒఒత్మానం యోగీ నియతమానసః ।**
**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

పైన జెప్పినరీతిగా సర్వదా సమాధి స్థితుడై మనసును లయముజేసిన యోగి సర్వేంద్రియ నిగ్రహము గలవాడై మోక్షమే పరమావధిగా గలదియు, నా యధీనమగు సర్వోపద్రవరహితమైన శాశ్వతానందమోక్ష మనెడు శాంతిని బొందును.

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

ఎవ్వడు శాస్త్రమునందు జెప్పబడిన తపోధ్యానార్చన పూజాదుల నతిక్రమించి స్వేచ్ఛగా నిరీశ్వరుడై సంచరించునో, వాడు తత్త్వజ్ఞానమును బొందజాలడు. ఇహలోకసుఖము గూడ ననుభవింపడు. పరలోక సౌఖ్యమున్ను సిద్ధింపదు.

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥**

కావున ఓ అర్జునా ! ఈ పని జేయవలెను, ఈ పని జ్ఞానియైనవాడు చేయరాదను విషయమై నీకు శాస్త్రమే ప్రమాణము. కాబట్టి శాస్త్రమునందు జెప్పబడిన యజ్ఞ, దాన, తపములను కర్మములయందుండు ఫలమును విడిచి దాని ఫలము మోక్షమని తెలుసుకొని విధిప్రకార మాచరింపుము. ఇది శ్రీ కృష్ణ స్వామియొక్క మహోపదేశము.

న గచ్ఛతి వినా పానం వ్యాధిరౌషధశబ్దతః ।
వినాఽపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే ॥

రోగముగలవా డౌషధము సేవించి పథ్యముగా ఉండిననే గాని లేనిచో రోగశాంతి గానేరదు. ఔషధమౌషధమని కోటిసార్లు వచించినను రోగము గుదురదుగదా! ఆలాగుననే మాయామహారోగముతో గూడినవాడు, బ్రహ్మాస్మి బ్రహ్మాస్మిఅని కోటి పర్యాయములు జపించినను అపరోక్షానుభవము గానేరదు. పరిపూర్ణ స్థితికొఱకై శమదమాది గుణములతో గూడి శ్రవణ, మనన, నిది ధ్యాసనముల నిశ్చయముగా చేయవలయును. లేని యెడల ప్రకృతి వికృతులు వీనిని విడిచి పోవజాలవు.

అకృత్వా శత్రుసంహార మగత్వాఽఖిలభూశ్రియమ్ ।
రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితు మర్హతి ॥

రణరంగమునందు ధీరుడై శత్రుసంహారముజేసి మహామండలాధి పత్యము బొందక నేను రాజు, నేను రాజనిన మాత్రమున రాజౌనా ? కాడుకదా! ఆలాగుననే యింద్రియముల ను సైన్యములను, మనశ్చిత్తాహంకారబుద్ధు లను మంత్రి ప్రభృతులను సంహరింపక మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తుడైన రాజయోగి కానేరడు.

శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతి ।
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి ॥

ఎవ్వడు దేహరక్షణమును గోరువాడై పరమాత్మను దర్శించుటకై యిచ్ఛగించుచున్నాడో వాడు కొయ్యయను బుద్ధిచే గొప్ప మొసలిని పట్టుకొని

నదిని దాటబోవువానివలె నుండును. అనగా ఒక నదియందు గొప్ప మకరమొకటుండెను. ఆ నదిలోదిగు మనుష్యులను దినుట దానికి స్వభావమ్మైయుండెను. అట్లున్న మొసలిని జూచి యిదిమంచి పడవగానుండునని నిశ్చయించి దానిపైనెక్కి నది దాటుట సులభమని చింతించు మూఢునివలెనే విషయసుఖమందుండి మోక్షము నొందవచ్చునని చెప్పు రాజయోగియొక్క యభిప్రాయమ్మై యున్నది.

**మోహ ఏవ మహామృత్యు ర్ముముక్షోర్వపురాదిషు।**
**మోహో వినిర్జితో యేన స ముక్తి పదమర్హతి ॥**

మోక్షేచ్ఛగలవానికి శరీరాదుల యందున్న రాగమే మహా మృత్యువు. ఎవనిచే దేహాదులయందున్న రాగము జయించబడునో వాడే ముక్తి పదమున కర్హుడు గాని లేశమైన నాశ యున్నవానికి సాధ్యము గాదు.

**మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు।**
**యం జిత్వా మునయో యాంతి తద్విష్ణోః పరమం పదమ్ ॥**

శరీర భార్యాసుతాదులందున్న మహాశత్రుస్వరూపమగు రాగమును నిశ్శేషముగా విడువుము. మునులే మృత్యుస్వరూపమగు రాగమును జయించి పరమపదమైన విష్ణుపదమును బొందుచున్నారు. అన్నిటికి బ్రహ్మచర్యము ముఖ్యముగా నుండవలయును. లేనివారికి మనోధైర్యము, ఇంద్రియ నిగ్రహము గలుగనేరవు. కాబట్టి దీనిని బాగుగ వినుము.



## బ్రహ్మచర్య వ్రతము

బ్రహ్మచర్యమనగా :- ఇది ఎనిమిది విధములు, మనుష్యులయొక్క ధర్మార్థ కామ మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థములకిదే ముఖ్యకారణ మగుటచే, పతంజలి యోగ సూత్రమందు ''బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః'' అని చెప్పబడెను. అనగా బ్రహ్మచర్య వ్రతముచే బ్రహ్మవర్చస్సు, అమానుష ప్రజ్ఞ, జితేంద్రియత్వము సిద్ధించునని పతంజలి మహర్షి యొక్క యభిప్రాయము. బ్రహ్మచర్య శక్తిచే గదా

భీష్మాచార్యులు సాక్షాత్ నారాయణావతారమైన శ్రీ పరశురాముల వారిని యుద్ధమందు సులభముగా జయించినది. ఈ బ్రహ్మచర్యమహిమచే గదా శ్రీయాంజనేయులవారు రావణాది సమూహములను ధ్వంసము జేసిరి. ఈబ్రహ్మచర్యబలముచే పర్వతాకారములైన గజయూథముల నొకకుక్క ప్రమాణముగల సింహము బిండిపిండిగా జేయుచున్నది. అనగా సింహమున కేక ప్రసవమని చెప్పుదురు. దానికి మూడుసంవత్సరముల కొకతూరి మాత్రము విషయ సంగమము గలదట. కనుకనే దానికంత మహత్తైన శక్తి గలదు. ఇహలోక సుఖము గాని, పరలోక సుఖము గాని గోరువా రవశ్యముగా బ్రహ్మచర్యవ్రతమం దుండవలయును. బ్రహ్మచర్యమనగా గ్రహస్థుండు ఋతు కాలమందు శుభ దినముజూచి ధర్మపత్నితో జేరుట. తదితరాశ్రమములలో నున్న మూడు తెగలవారి కిది సర్వదా యుండవలయును. ఋతుకాలమనగా, భార్య ఋతువైన నాలుగుదినములైన పిమ్మట పదునొకండు దినములలో నేకాదశి, సంక్రమము, అమావాస్య, ఆదివారము, జన్మనక్షత్రము మొదలైన అనేక పుణ్యదినములను వర్జింపవలయును. ఈలాగున నుండువారికి గలుగు సంతానము లాయురారోగ్యములతో గూడి మహాబుద్ధిమంతులై పరాక్రమస్వభావముతో గూడినవారై దైవభక్తి, ఆత్మజ్ఞానము గల్గి సత్యధర్మ పరాయణులై యుందురు. భార్య ఋతువై పదిహేనుదినములు గడచిన తర్వాత తన సోదరివలె నుంచవలయును. గర్భాధానము జేసిన తర్వాత ప్రసవించిన మూడు సంవత్సరముల వరకును దనతల్లివలె జూడవలెనని శాస్త్రము చెప్పుచున్నది. మరియు బిడ్డలు చనుబాలు ద్రాగి నిలుపు పర్యంతము విషయ ప్రవర్తన గూడదు. ఇంకను స్త్రీకి గాని, పురుషునికిగాని, యేలాటి రోగములుండినను బ్రహ్మచర్యవ్రత ముండవలయును. లేనియెడల సంతానములు రోగులై, అల్పాయుస్సు గలవారై, బలహీనులై, జ్ఞానము లేనివారై కలుగుదురు. ఏలాగనగా లేతవిత్తనము నాటిన వృక్ష మెట్లనుపయోగ మగుచున్నదో, ఆలాగుననే వీరియొక్క స్థితి గూడ నుండును. లేక ఒకడు భుజించెడి యాహారము నలుగురు భుజించిన యెడల నెట్లుండునో తద్వత్తుగా నుండును. ఈ బ్రహ్మచర్య శక్తిచే యోగులు వజ్రకాయులై, యమానుష ప్రజ్ఞయున్ను, గంభీరస్వభావమును, సర్వేంద్రియ సంయమశక్తియున్ను, శీతోష్ణాది సహనశక్తియు గలవారైరి.

బ్రహ్మచర్య మెనిమిది విధములు. దానియందు మూడు ప్రధానములు. 1. మనసుచే స్మరణము గాని, 2. ఆ విషయమై దానియందాసక్తితో సంభాషణము గాని, 3. ఆ విషయోద్దేశముతో స్త్రీలయొక్క స్పర్శము గాని చేయగూడదు. బ్రహ్మచర్య వ్రతము పూర్ణముగానున్న వారి శక్తికిన్ని, లేనివారి శక్తికిన్ని అజ గజముల తారతమ్యము గలదు. లేక గొప్ప ఫిరంగిగుండెంతదూరము బారునో, దానికెంత శక్తి గలదో, బాలురాడుకొను గాలితుపాకి యొక్క శక్తియెంత గలదో, యంత తారతమ్యము విషయవిరక్తునికిన్ని, విషయలోలునికిన్ని గలదు. శ్రీ శంక రాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు, శ్రీ వివేకానంద స్వాములు, శ్రీదయానందసర్వస్వతీ స్వాములవారు మొదలైనవారి యపారపారావార ప్రజ్ఞకు ముఖ్యకారణ మిదే. వీరిలో శ్రీ రామానుజస్వాములు వివాహము జేసికొనినను సంతానోత్పత్తికి ముందుగా సన్న్యసించినారు.

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యం చ మత్ప్రియత్వం చ లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్యమహిమచే బూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, బలము, వీర్యము (అనగా పరాక్రమము), అపారప్రజ్ఞ, శ్రీ, మహత్తైనయశస్సు, గొప్పపుణ్యము, భగవత్ప్రీతి, యిదంతయును సులభముగాను, సుఖముగాను జేకూరును అని మనుస్మృతి.

**ఏవం సంరక్షయేద్బిందుం మృత్యుం జయతి యోగవిత్ ।**
**మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్ ॥**

యోగియైనవాడు బిందువును సంరక్షించి జననమరణములను దాటుచున్నాడు. బిందువు యొక్క స్ఖలనముచే మరణమును, బిందుధారణముచే జీవితమును జీవులకు గలుగుచున్నది.

**చిత్తాయత్తం నృణాం శుక్రం శుక్రాయత్తం చ జీవితమ్ ।**
**తస్మాచ్ఛుక్రం మనశ్చైవ రక్షణీయం ప్రయత్నతః ॥**

నరులకు శుక్లము చిత్తమున కధీనమై యున్నది. జీవితము శుక్లమున

కఠీనమైయున్నది. కనుక బుద్ధిమంతులు శుక్లమును, మనస్సును ప్రయత్నముచే రక్షింపవలయును అని హఠయోగ ప్రదీపిక.

## జ్ఞానులు విధి ననుసరించుట

ప్రశ్న ॥ అయ్యా స్వామీ ! తమరు సెలవిచ్చినదంతయు బ్రహ్మప్రాప్తికి మంచిదిగానున్నను, తమ మాటల వినునపుడు ద్వైత భావముగా నుండును గాని యద్వైతముగా గనుబడలేదే ? అద్వైతియైన వారికొకటి జేయవచ్చును. ఒకటి జేయకూడదను నియమమున్నదా ? వాడేకఛత్రాధిపతివలె నిర్భయుడు గదా ? ''నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః '' అని శుకపంచకమందు గన్పట్టుచున్నదే. ఇంక నీశావాస్యోపనిషత్తు గూడ జెప్పుచున్నదే.

శ్రుతి ॥ యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః ।
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః ॥

జ్ఞానవంతునికెప్పుడు సర్వప్రాణులున్ను ఆత్మగా గనుపడెనో ? అప్పుడు బ్రహ్మైక్యమున జూచుచున్న వానికి మోహమేది ? శోకమెక్కడిది ? ఎవడు తనయాత్మయందు సర్వభూతములను, తనయాత్మను సర్వభూతముల యందును జ్ఞానదృష్టిచే నేకముగా జూచునో యప్పుడు వానికి మోహమేది ? శోకమెక్కడిది ?

ఉత్తరము ॥ ఓ నాయనా ! దీని యర్థము మహాగొప్పది. అనగా నంతయును దానై యుండునపుడు తనకన్య మేమియు లేదు. కనుక పామరుడు దన శరీరము నెట్లు జూచునో యాలాగుననే జ్ఞానియైన వాడిదంతయు దానై యుండు కారణముచే దనవలె నీలోకమంతయును జూచును అని యర్థము గాని, అంతయు దినవచ్చును, త్రాగవచ్చును, అనునర్థము గాదు. అంతయును తానై యున్నప్పుడు దేనిని భుజించును ? ఎవరిని కోపించును ? స్త్రీ యెక్కడిది ? అను భావము గాని మూఢులవలె నజ్ఞానముచే దలక్రిందుగా నర్థము జేయరాదు. నదీతీరమందున్న వృక్షముయొక్క ఛాయ జలమందు బ్రతిబింబితముగా నుండునపుడు, తలక్రిందుగా, మూలము మీదై కనుబడునట్లజ్ఞానమును

నదీతీరమందున్న వారికంతయు విపరీతార్థముగా దోచును కాని నిజావస్థ దెలియదు. ఏకచ్ఛత్రాధిపతివలె జ్ఞాని నిర్భయుడు గదా యని నీవడిగినావే ? ఏకచ్ఛత్రాధిపతి యైనవారిని శిక్షించువా రెవరును లేరని తలంచి యధర్మమైన పనిని జేయునా ? నిజమైన చక్రవర్తియు గూడ స్వతంత్రుడు గాడు, ఎట్లనగా, వాడు మంత్రిప్రభృతులతోను, గురువుతోను, ఆస్థానపండితులతోను, మన్వాది ధర్మశాస్త్రముల ననుసరించి ప్రతిపనిని జేయును గాని స్వతంత్రుడై సర్వశక్తి యున్నప్పటికిని స్వయముగా నొకపనియునైనను జేయుడు. ఆలాగుననే జ్ఞానియును అంతయు దానని నిజబోధ గలిగియుండినను గురువాక్యము, వేదాంత శాస్త్రము, సజ్జనులు మొదలైనవారి యభిప్రాయము ననుసరించి యేపనినైనను జేయునే గాని స్వేచ్ఛగా నధర్మమైన పనులేవియు జేయడు. ఇక్కాలమందు రాజయోగులమని చెప్పు కొందఱి దురాచారకారణముచే పవిత్రమై దివ్యమైన యద్వైతమతమునకు హాని వచ్చినది. ఈ మతము శ్రీ జగద్గురు శంకర భగవత్పాదాచార్యుల కాలమందు సద్గుణనిధులైన మహనీయులచే ననుష్ఠించబడి దివ్యపదవిని బొందినది. రానురాను శిశ్నోదర పోషణ పరాయణుల చేతిలో జిక్కినందున వారు తపోధ్యాన, శ్రవణ మనన నిదిధ్యాసనాదులు జేయక శుష్క వేదాంతులై లోకమును పాడుచేయునప్పు డీశ్వర నియమముచే శ్రీ రామానుజ శ్రీ మధ్వాచార్యులను మహనీయు లవతరించి ద్వైత, విశిష్టాద్వైతాది మతములను స్థాపించిరి. ఈ విషయమై యిప్పుడున్న రాజయోగులలో గొందఱున్ను, అవధూతలలో గొందఱున్ను చేయు నికృష్టాచారము జూచునపుడిది నిండా యుపయోగకరమై యున్నది. ఏలననగా బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై అద్వైత బ్రహ్మానుభవము కొఱకు దగువైన ధ్యాననిష్ఠానిదిధ్యాసనముల జేయక ఆత్మసుఖమును బొందలేరు. ఈశ్వరోపాసనాదులు లేకుండుటచే హృదయ శుద్ధియును, మాయావిముక్తియున్ను గలుగక నిప్పుడున్న వా రుభయభ్రష్టులై నాశము బొందుచున్నారు. కాబట్టి యిప్పుడున్న వారికి మనః పరిశుద్ధత కొఱకు దైవోపాసనతో గూడిన ద్వైత విశిష్టాద్వైతమతములు మంచివి.

శ్రుతి ॥ అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।
ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్ ॥

వయోధుం డనుభవములేక పరబ్రహ్మానుభవము గలవానివలె సంతోషించుచున్నాడు. ఇది యెట్లున్నదనగా, చెఱువు కట్టయందున్న వృక్షాగ్రఫలము నీటియందు ప్రతిఫలించుచుండగా, దానినిజూచి తాను భుజించినట్లు సంతోషించు వెఱ్ఱివానివలె నుండును ఇప్పుడున్న రాజయోగుల స్థితి. అనగా, ఆదికాలమందున్న మహాత్ములు దపోధ్యానములచే బవిత్రులై బ్రహ్మానందమునుబొందిరి. ఇప్పుడున్న గురుపీఠస్థులు ఆలాగుననే జేయుట కాలస్యపరులై నేను రాజయోగినని చెప్పుచున్నారు. ఇది యెట్లున్నదనగా, నొకరు బహుప్రయాసతో గొప్ప గొప్ప పాఠముల చదివి హైకోర్టు జడ్జీ యధికారముగల వారైరి. వారి మరణానంతరము వారి కుమారు డేమియు జదువక సోమరియై వీథులలో సంచరించుచు మా తండ్రి పీఠమున కధికారము గలవాడనని చెప్పిన వాని కథవలె నున్నది.



## ప్రస్తుత రాజయోగుల స్వభావము

ప్రశ్న ॥ ఇప్పుడున్న యోగులందరున్ను నా స్వానుభవమని చెప్పుచున్నారే? దాని రహస్యము దయచేయుము మహాత్మా !

ఉత్తరము ॥ తన స్వానుభవముమాత్రము నమ్మరాదు. అది సరియో లేక తప్పో ఎట్లు తెలియును ? ఒకరికి పిత్తాధిక్యముచే బైత్య మధికమైనప్పుడీభూమి చుట్టుచున్నట్లు దోచును. లేక పచ్చని దర్పణము బెట్టుకొనినవానికి లోకమంతయు బచ్చగా గనుబడును. (అనగా నద్దము యొక్క ఛాయవలె లోకమంతయు గనుపించుట.) ఆలాగుననే యెఱ్ఱవర్ణముగల యద్దముతో జూచువారి కంతయు నెఱ్ఱగా నుండును. లేక రైలుబండియందు గమనశక్తి యధికముగా నున్నయెడల బ్రక్కననుండు స్థిరములైన వృక్షాదులు, గ్రామములు పరుగిడునట్లు గన్పడును. ఇదంతయు దన స్వానుభవమునకు విరోధమై యుండును. కనుక నీ విషయమందు స్వానుభవము సరికాదు గదా ! ఆలాగుననే జ్వరాదిరోగములు గలవానికి మధురమైన వస్తువులు చేదుగా నుండును. ఆ మధురవస్తువులు రోగము లేనివారికి జేదౌనా ? కనుక దన స్వానుభవము మాత్రముచే బాప కర్మముల జేసి నేను బద్ధుడ గానని చెప్పుట చాలా గొప్పతప్పు. కనుక శాస్త్రము, సద్గురూపదేశము,

తన యనుభవము ఈ మూడున్ను సరియై యుండిన యెడల నొప్పదగును. ఇందుకే సద్గురు ముఖమునుండి బ్రహ్మవిద్య గ్రహింపవలయునని శ్రుతులు మొరలిడుచున్నవి.

**గురుశాస్త్రోక్తమార్గేణ స్వానుభూత్యా చ చిద్ఘనే।**
**బ్రహ్మైవాహమితి జ్ఞాత్వా వీతశోకో భవేన్మునిః ॥**

గురువాక్యము, శాస్త్రనిశ్చయము, స్వానుభూతితో గూడి పరబ్రహ్మ మందు ''బ్రహ్మాస్మి'' అని భావన జేసి మౌనశీలుడు వీతశోకుడై ముక్తిని బొందుచున్నాడు.

**శ్రుతి ॥ శాస్త్రదృష్టిర్గురోర్వాక్యం తృతీయశ్చాత్మనిశ్చయః।**
**త్రిధైవ యో విజానాతి స ముక్తో నాత్ర సంశయః ॥**

మొట్టమొదట సద్గురువు జెప్పువిషయము శాస్త్రసమ్మతముగా నుండునా? గురువాక్యము దన యనుభవమునకు సరిపోయినదా, శాస్త్రము గూడ నిజమైనదా అని విచారణజేసి యవి మూడున్ను సరియై యుండిన యెడల వాడు జీవన్ముక్తుడే. సంశయము లేదు అని శ్రుతుల యభిప్రాయము.

**యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి।**
**అన్యత్తృణమివ త్యాజ్య మప్యుక్తం పద్మజన్మనా ॥**

బాలుడు చెప్పినప్పటికిన్ని, ఆ వచనము యుక్తియుక్తమైయున్న యెడల శిరసా వహింపవలయును. యుక్తియుక్తము గాని వచనము బ్రహ్మదేవునిచే చెప్పబడినదైనను తృణమువలె దూరముగా త్యజింపవలయును అని శ్రీ వసిష్ఠతపోనిధు లుపదేశించియున్నారు. కాబట్టి యిప్పుడున్న రాజయోగులలో గొందఱు నికృష్టమైన దురాచారపరులై యంతయు జేయుచున్నప్పటికిన్ని నేను బద్ధుడ గాను, ఇది నా స్వానుభవమని చెప్పుమాట లబద్ధము.

**గురోర్ముఖేన జ్ఞాతవ్యం అన్యథా గ్రంథకోటిభిః।**
**అన్యథా లభితం నాస్తి సత్యం సత్యం పునః పునః ॥**

కనుకనే స్వానుభవవముగల గురుముఖమునుండి జ్ఞానము గ్రహింప వలయునుగాని కోటిగ్రంథముల జదివినను సిద్ధింపదు. మరి యే మార్గము చేతగాని సిద్ధింపదు. ఇది సత్యము. పునః సత్యమని మహర్షులు జెప్పుచున్నారు. ఇంక జ్ఞానియొక్క లక్షణమును శ్రీ భగవద్గీత పదుమూడవ అధ్యాయము, 8వ శ్లోకమునుండి ఐదు శ్లోకములచే చెప్పుచున్నది.

అమానిత్వమదమ్భిత్వ మహింసా క్షాంతిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః ॥

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ ।
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥

అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టాऽనిష్టోపపత్తిషు ॥

మయిచాऽనన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ ।
వివిక్తదేశ సేవిత్వ మరతిర్జనసంసది ॥

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోऽన్యథా ॥

అమానిత్వము ( అనగా నాత్మప్రశంస లేకుండుట), అదంభము, అహింస, ఓర్పు, అవక్రత, గురుసేవ, బాహ్యాభ్యంతర శుద్ధి, సన్మార్గమందు స్థిరమైన నిష్ఠ, మనో నిగ్రహము, విషయములందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మము, మృత్యువు, ముదిమి, రోగము వీనివిషయమై దుఃఖదోషములను జింతించుట, పుత్రుడు, భార్య, గృహము మొదలగువానియందాసక్తి లేకుండుట, నిత్యమును ఇష్టానిష్టములు గలిగినప్పుడు సమచిత్తముగా నుండుట, పరమేశ్వరుని యందు సర్వకాల సర్వావస్థలయం దనన్యభక్తితో నుండుట, నిర్మలమైన యేకాంతస్థలమునందు వాసము జేయుట, సంసార జనసంగమం దుండుట కిష్టము లేకుండుట, అధ్యాత్మజ్ఞానమే నిత్యమని నిశ్చయించి సదా దానియందు స్థిరమై యుండుట, మోక్షమే సర్వోత్కృష్టమని చింతించుట, ఈ పైజెప్పిన

యిరవై గుణములు గలవాడే జ్ఞానియనబడును. దీనికన్యమైన దంతయును నజ్ఞానమని చెప్పబడును. అనగా నీగుణముల కన్యమైన వృత్తులు జ్ఞానియందు కనబడగూడదు. దీని కన్యమైన వృత్తులున్న వారి కింకను జ్ఞానము గుదురలేదని నిశ్చయింపవచ్చును. ఇంకను 16వ అధ్యాయమందు దైవసంపత్తు గలవానికి మోక్షము సిద్ధించుననియు, అసురసంపత్తుగలవాడు బద్ధుడగుననియు శ్రీ కృష్ణస్వాములవారు సెలవిచ్చి యున్నారు.

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా।
అనగా దీని యర్థము పై నుదాహరించినదే .
**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥**
**అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతిరపైశునమ్।**
**దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥**
**తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా।**
**భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥**

నిర్భయత్వము, చిత్తశుద్ధి, ఆత్మజ్ఞానోపాయమైన నిష్ఠ, దానము, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞాదిహోమము, అధ్యయనము (ప్రణవాది మంత్రజపము), శరీరాది త్రివిధతపము, ఆర్జవము (కపటము లేకుండుట), త్రికరణములచే బ్రాణిపీడావర్జనము, సత్యము, కోపము లేకుండుట, ఔదార్యము, మహాశాంతము, పరోక్షమున బరుల దోషము లెన్నకుండుట, సర్వప్రాణులయందు దయ, లోభము లేకుండుట, మృదువైన స్వభావము గలవాడై యుండుట, అకార్యమందు లజ్జ, చపలత్వము లేకుండుట, అప్రాగల్భ్యము, ఓరిమి, ధైర్యము, బాహ్యాభ్యంతరశుద్ధి, ఒక ప్రాణియందును ద్రోహచింతన లేకుండుట, అభిమానము లేకుండుట అను ఈ యిరువదారు గుణములును దైవ సంపత్తుగలవానికి స్వభావముగా నుండును. దీనికన్యమైన ప్రాణిహింస, మధుమాంసాది నీచభోజనములు, ఇంద్రియ నిగ్రహము లేకుండుట, శౌచాచార రాహిత్యములైన నీచవృత్తుల జేయుట యసురజన్మ

గలవారి స్వభావగుణములు. వీరికి ముక్తిపదము సాధ్యము గాదు. వీరి గుణములు గీత 16వ అధ్యాయమందు విస్తారముగా గనందగును. ఇంక బరమహంస స్థితినిబొందిన మహనీయుడు గూడ నీలాగుండవలయునని శ్రుతి చెప్పుచున్నది.

శ్రుతి ॥ భిక్షాటనం జపో ధ్యానం స్నానం శౌచం శివార్చనమ్ ।
కర్తవ్యాని షడేతాని యతీనాం నృపదండవత్ ॥

భిక్షాన్నము, ప్రణవాది మంత్రజపము, అధ్యాత్మధ్యానము, స్నానము, బహిరంతరశౌచము, దేవతార్చనము ఈ యారున్ను యతీశ్వరులకు గూడ రాజదండనమువలె గర్తవ్యము. మునీశ్వరులకు గూడా నుండవలయునని చెప్పినప్పుడు, తదితరుల కథ యేమని చెప్పవచ్చును ?

శ్రుతి॥ అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం తపశ్శమః ।
క్షమా దయా చ సంతోషో వ్రతాన్యస్య విశేషతః ॥

అహింస, సత్యము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము, శమము (అంతరింద్రియ నిగ్రహము), క్షమ, సర్వజీవరాసులయందు దయ, సర్వదా సంతోషము, ఇవన్నియున్ను సన్న్యాసులైనవారికి గొప్ప వ్రతముగా నుండవలయును.

శ్రుతి ॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యః ప్రత్యాహృత్య మనశ్చలమ్ ।
ప్రత్యగాత్మని సంస్థాప్య ధ్యానం కుర్యాద్యతిస్సదా ॥

ఇంద్రియాది విషయములనుండి ఇంద్రియములను వశీకరించి చంచలము లేని మనసును పరమాత్మయందు స్థిరముగా జేర్చి యతియైనవాడు సర్వదా స్వస్వరూపమును ధ్యానము జేయవలయును.

శ్రుతి ॥ శ్రద్ధా ధ్యానం తపశ్శౌచం విత్తం యస్య చతుష్టయమ్ ।
స్మరణం చాద్వితీయస్య తం దేవా బ్రాహ్మణం విదుః ॥

ఆత్మధ్యాన పూర్తికొఱ కత్యంత శ్రద్ధయు, ధ్యానము, తపస్సు, శౌచము ఈ నాలుగు ధనములను, అద్వితీయబ్రహ్మభావన యనునవి యెవనికి గలవో వానిని బ్రాహ్మణుడని దేవతలు దలంతురు.

శ్రుతి ॥ త్యక్త్వా లోకాంశ్చ వేదాంశ్చ విషయానింద్రియాణి చ ।
ఆత్మన్యేవ స్థితో యస్తు ప్రాప్నోతి పరమం పదమ్ ॥

లోకవాంఛయు, శాస్త్రాభిలాషయు, ఇంద్రియ విషయములను విడిచి యాత్మధ్యానమందు స్థిరముగా నెవ్వడుండునో వాడు సుఖముగా శీఘ్రకాలములో బరమపదము బొందును.

సర్వసంగపరిత్యాగః సర్వద్వంద్వసహిష్ణుతా ।
సర్వభూత సమత్వం చ మోక్షస్య విధి పుత్రక ॥

సర్వసంగపరిత్యాగము, శీతోష్ణాది ద్వంద్వసహనము, సర్వభూత సమత్వము, మోక్షము బొందువానికి విధించినవి వత్సా.

జీవితం యస్య ధర్మార్థం ధర్మో జ్ఞానార్థమేవ చ ।
జ్ఞానం చ ధ్యానయోగార్థం సోఽచిరాన్ముచ్యతే నరః ॥

ఎవ్వని జీవితమంతయు ధర్మమార్గమునందు బ్రవర్తించునో, ఆ ధర్మమార్గముచే జ్ఞానసిద్ధి గలుగును. జ్ఞానసిద్ధిచే ధ్యానయోగము గల్గును. ధ్యానయోగముచే నా నరుడు శీఘ్రముగా ముక్తిపదము నొందును.

శ్రుతి ॥ పతత్యసౌ ధ్రువం భిక్షు ర్యస్య భిక్షోర్ద్వయం భవేత్ ।
ధీపూర్వం రేత ఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవచ ॥

ఏ యొక్క సన్న్యాసియైన వాని కీరెండు దోషములు గలవో వాడు నిశ్చయముగా బతితుడగును. అవేమనగా నొకటి మనః పూర్వకముగా రేతస్సు విసర్జనము. రెండవది స్వదేహ పోషణము కొఱకు ద్రవ్య సంపాదనము. ఇవి రెండును జ్ఞానికి నుండగూడదు అని సన్న్యాస సముచ్చయము.

## విషయాదులచే మనస్సు తృప్తిజెందకుండుట

ప్రశ్న ॥ ఓ స్వామీ ! ఇప్పుడున్న రాజయోగులలో గొందరు మనస్సేయొక్క వస్తువును, గోరుచున్నదో దానినప్పు డనుభవించి తృప్తి జేయవలయును. తర్వాత నాబుద్ధి రాదని చెప్పు మాటలు నిజమా ?

ఉత్తరము ॥ నాయనా ! హోమాగ్ని నేతిచే వృద్ధియగును గాని శాంతము గానేరదు గదా ! అలాగుననే యింద్రియ విషయాగ్ని భోగమును నేతిచే వృద్ధియగును గాని శాంతము గానేరదు. అగ్ని యేలాగున జలముచే జల్లారుచున్నదో యాలాగుననే కామాగ్ని జ్ఞాన మనెడు జలముచే శాంతి నొందును.

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ ॥**

అన్ని యింద్రియములకును శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులను విషయములు గలవు. వాటియందు రాగద్వేషములు నివసించియున్నవి. అట్టి రాగద్వేషముల కధీనమెప్పటికిని గాకూడదు. ఆ రాగద్వేషములుగదా వీరికి జ్ఞాన ప్రతిబంధకములగు గొప్ప శత్రువులు, ''జహి శత్రుం మహాబాహో , కామరూపం దురాసదం '' ఓ మహాబాహో ! దుఃఖములు గలుగజేయు కామరూపమగు మహా శత్రువును సంహరింపుము అని శ్రీ కృష్ణస్వామి యుపదేశము.



## అచలభావ రహస్యము

ప్రశ్న ॥ ప్రారబ్ధ ముండిన యెడల గదా విషయముల కొఱకు మనసు పోవుచున్నది. ఆ ప్రారబ్ధమును దప్పించుకొనుట కెవరికి సాధ్యము గాదని శ్రుతి చెప్పుచున్నదే. '' ప్రారబ్ధం భోగతో నశ్యేత్''. ఇట్లున్న స్థితి యందు దమరు దానికి విరోధముగా జెప్పుట సరియా ?

ఉత్తరము ॥ ఓ బుధజనవిధేయుడా ! ఈ కర్మముయొక్క రహస్యము దెలియక గదా జీవులు సంసార సాగరమునుండి మోక్షమును దరిజేరక కష్టపడుచున్నారు. ప్రారబ్ధ వచనము సాధారణ మనుజులకు జెప్పినది గాదుసుమా! అది యజగరవృత్తియందుండు జడభరతాది మహనీయులకు జెల్లును గాని విషయములకు లోబడి భోగము లనుభవించువారికి జెప్పినది కాదు. అనగా, పులులవలె ప్రాణుల హింసించి తినుటయు, అసురులవలె త్రాగుటయు, రాక్షసులవలె మత్తు వస్తువులను భుజించుటయు ఇవన్నియు బ్రారబ్ధము గాదు.

తన మూఢత్వముచే గలుగుచున్నవే గాని మరియేమియునుం గాదు. లేనియెడల దొంగ పని జేయువాడును, పరస్త్రీ గమనము జేయువాడును, మనుజుల జంపువాడును ఈ మొదలగువారిది ప్రారబ్ధకర్మయని చెప్పగూడదా ? ఇట్లున్న వారి నెందుకు శిక్షింపవలెను ?

ఆలాగుననే యీ దురాచారముజేసి రాజయోగుల మని చెప్పువారిని యమధర్మరాజు శిక్షింపక విడుచునా ? సమస్త కర్మములను విడిచి సర్వసంగ విముక్తుడై యే యొక్క పనియునుంజేయక సదా పరబ్రహ్మానుభవముతో గూడిన మహనీయులకు దారిద్ర్యము, రోగము, సుఖము, ఆరోగ్యము మొదలైనవి గలుగుటయే ప్రారబ్ధ మనబడును. లేక కొండచిలువవలె తనంతటు తటస్థించు సుఖదుఃఖముల ననుభవించి తృప్తుడై యుండుటయే ప్రారబ్ధ మనబడును.

ఒకరు జ్ఞానియైన యెడల నీచకృత్యములు గాని, దుర్విషయ వాంఛ గాని, క్రూరకృత్యములు గాని యుండుటకు వీలు లేదు. ఎందుకనగా ఒకరికి జ్ఞానము, అనేక జన్మములయందు జేసిన తపము, వ్రతము, దానము, దైవోపాసనాది మహా పుణ్యములచే గలుగును గాని వేఱుమార్గము లేదని యందరికిని దెలిసిన విషయమే గదా ! అప్పుడు జ్ఞానికి గూడ తపము, వ్రతము, ధ్యానము, దానముల యొక్క పూర్వజన్మ కర్మఫలమైన ప్రారబ్ధము నీచస్వభావ మెట్లగును ? ప్రారబ్ధకర్మ మనగా దీనికి ముందు జేసిన కర్మము యొక్క ఫలమిప్పు డనుభవించుట గదా ! అప్పుడు టెంకాయ చెట్టు బెట్టిన ఇప్పుడు మామిడికాయ గాచునా ? నువ్వుల జల్లిన సజ్జలు పండునా ? గోవు యొక్క వత్సము పులియగునా ? చీనీపండు విత్తనము బెట్టిన ముష్టిపండు బండునా ? ఈలాగుననే జ్ఞాని పూర్వమందు జేసిన తపోయోగధ్యానముచే గలుగు ప్రారబ్ధముచే నిప్పుడున్న తపము, యోగము, ధ్యానాదులయందు మనసు పోవునేగాని నీచభోజనము, ప్రాణి హింసాది క్రూర కర్మములయందు బోవుటకు వీలు లేదు. ఈ విచారము తప్పు.

**జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః ।**
**నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥**

అనేక జన్మములయందు జేసిన తపోధ్యాన యోగాదులచే నొకానొక

జన్మమునందు నరులకు సమస్త పాపములు నశించి భక్తియం దాసక్తి గలుగును అని నారదమహర్షి యొక్క యభిప్రాయము. ''బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే '' అని భగవద్గీత.

**ప్రక్షీణాశేషపాపానాం జ్ఞానే ధ్యానే భవేన్మతిః।**
**పాపోపహతబుద్ధీనాం తద్వార్తాఽపి సుదుర్లభా ॥**

**''జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః।''**

పురుషులకు సమస్తమైన పాపము నాశము బొందునపుడు జ్ఞాన ముదయమగునని శాస్త్రము జెప్పుచున్నది.

ఇంకొక రహస్యము జెప్పెదను. జాగ్రత్తతో వినుము. ఒక తీయని మామిడి కాయలో లేత కాలమందు జేదుమగరున్ను, మధ్యకాలమందు పులుపున్ను పరిపక్వ కాలమందు తేనెకు సమానమైన మాధుర్యము గన్పడుచున్నది. ఈ మూడవస్థలకు దమోగుణము రజోగుణము సత్త్వగుణములని పేర్లు. చేదుకాలమందు బులుపు, మాధుర్యములు లేవు. పండు కాలమందు మధురము మాత్రము శేషించి పులుపు చేదులు గనపడవు. ఆలాగుననే పులుపు కాలమందు చేదు మధురము లుండవు గదా ! అప్పుడొకరికి జ్ఞానము గలిగిన తర్వాత తమో రజోగుణములుండవు. తమో రజోగుణము లుండినపుడు సత్త్వగుణమైన జ్ఞాన ముదయించుటకు వీలు లేదు. అనగా మామిడిపండునుండి చేదు పులుపు రాకూడదు. అట్లు పులుపు చేదు వచ్చిన యెడల యెండకు వాడి పడిపోయినది లేతకాయు గాని ముదిరిన పండు గాదు. ఆలాగుననే రాజయోగినని చెప్పుకొను వారిలో రాగ రోగములైన వృత్తులు గనబడినయెడల వాడు వేషధారి, కపటుడు, మోసగాడని తలంపవలయును. తమో గుణస్వభావములు, నీచవస్తువులైన మధుమాంసాదులు భుజించుట కభిలాష, స్త్రీ విషయమందత్యాశ, సోమరితనము, చంచలత్వము, కామము, కోపము, కుతర్కము, అతినిద్ర మొదలైనవి. రజోగుణస్వభావములు యశస్సు కొఱకు పాటుపడుట, తానందరికి గొప్పవాడగుటకు బ్రయత్నించుట, పరిష్కారము, ధైర్యము, శౌర్యము, ఉప్పు, పులుపు, అతి మధురములైన వస్తువుల భుజించుట కభిలాష. సత్త్వగుణ

స్వభావములు శాంతము, దాంతము, తపము, ఈశ్వరపూజ, జీవకారుణ్యము, సర్వసమత్వము, క్షమ, సత్యము, మితభాషణము, నిర్భయము, పాలు, నెయ్యి, శర్కర మొదలైన యాహారమున్ను, ఫలమూలముల భుజించుట కిచ్ఛించుట.

**రజస్తమశ్చాఽభిభూయ సత్త్వం భవతి భారత।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥**

ఓ భారతా ! సత్త్వగుణము రజస్తమోగుణములను తిరస్కరించి యుండును. రజోగుణము సత్త్వతమోగుణములను అతిక్రమించి యుండును. తమోగుణము సత్త్వరజోగుణములను తిరస్కరించి నిలుచును. అనగా, సత్త్వగుణ మున్నప్పుడు తక్కిన రెండు గుణము లుండవు. ఆలాగుననే ఒక్కొక్కగుణ ముండునపుడు తక్కిన రెండు గుణము లుండవు.

**సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।**
**ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ ॥**

సత్త్వగుణమువలన జ్ఞాన ముద్భవించును. రజోగుణము వలన లోభాదులు బుట్టుచున్నవి. తమోగుణమువలన ప్రమాదము, అజ్ఞానము, మోహము బుట్టుచున్నవి. ఈ త్రిగుణ సంబంధమైన విషయములు గీత చతుర్దశాధ్యాయమందు బాగుగా గనందగును. దీపమున్న చోట చీకటి నిలుచుటకు సాధ్యము గాదు. అంధకార మున్న స్థలమందు ప్రకాశ ముండదు. ఆలాగుననే జ్ఞానియందజ్ఞాన గుణములు నిలువవు. అజ్ఞానియందు జ్ఞానగుణములున్ను గలుగవు. ఇంకను వినుము. గోవులు నివసించు దొడ్డిలో పులులుండవు. పులియుండుచోట గోవులు నిలువవు. గరుత్మంతుడుండు స్థలములో నాగసర్పము నివసింపదు. కృష్ణసర్పములుండు చోట గరుత్మంతుడు లేడుగదా ! ఆలాగుననే దేవతలున్నచోట నసురరాక్షసాదులు నివసించరు. అసుర రాక్షసులున్న చోట దేవ తలు లేనేలేరుగదా ! ఆలాగుననే వ్యాఘ్రమువలె మాంసము భుజించువానియందు కామధేనువుతో సమమైన జ్ఞానధ్యానము లుండవు. అట్లే ఆశ యను కృష్ణసర్పము నివసించు హృదయమందు యోగధ్యానమను గరుత్మంతు డుండడు. తద్వత్తుగా నసురులవలె గల్లు సారాయి త్రాగువాని యందు దేవతలు పానము జేయు జనన,

మరణ రహితమగు అమృత జ్ఞానమున్ను లేదని యందరును వినునట్లు సూర్యుడు ప్రకాశించు చున్నపుడు రాజవీథియం దేనుగుపై నెక్కి భేరిని ఘోషించి చెప్పుము. అప్పుడు మాత్రమే ఈ రాజయోగుల మనిచెప్పు రాక్షసభోగులు శిరసు పైకెత్తకుండుదురు. గరుత్మంతునియొక్క ఛాయను గనునంత మాత్రముననే మహావిషము గల్గిన నాగసర్పము దనఫణము నెట్లణచి తల క్రింద బెట్టుకొనునో, ఆలాగుననే భక్తి వైరాగ్యాది ధ్యాన జ్ఞానములతో గూడిన పుణ్యపురుషుడైన గరుత్మంతుని ఛాయామాత్రముచే విష మైన విషయములందు బ్రవర్తించు గుతర్కవాదుల గర్వమణగిపోవును. లేక ఘోరారణ్యమందు నిర్భయముగా సంచరించు మత్తగజ సమూహము, చిన్న సింహముయొక్క గర్జనము వినినంత మాత్రముననే దిక్కులేక పరుగెత్తిపోవునట్లు సంసారణ్యమందు విషయ భోగముల ననుభవించు మదోన్మత్తులైన శుష్కవేదాంతుల సంఘము వైరాగ్యపురుషుని శబ్దము వినినంతమాత్రముననే దేశము విడిచిపెట్టి వెళ్ళవలయును. కనుక వైరాగ్యమను చక్రాయుధ మెవరి కరమందు సర్వదా స్థిరమై వెలుగుచుండునో వారి కడ్డమై యెవరున్ను నిలువ సాధ్యము గాదు. కాబట్టి లోకమును సన్మార్గము జేయుటకై విచారము గల పుణ్యపురుషులకు విశేషమైన యణిమాద్యష్ట సిద్ధులతో బని లేదు. వైరాగ్యసిద్ధి యొకటి మాత్రము పూర్తిగా నుండిన జాలును.

ప్రశ్న ॥ ఓ స్వామీ, పుణ్యాత్మా ! ఇప్పుడు రాజయోగులమని చెప్పువారిలో కొందరు నేను బట్టబయలు, నే నచలుడను, శుద్ధబ్రహ్మము, నిర్వికారుడను, ఇంద్రియములు వాటివాటి వృత్తులయందు బ్రవర్తించునే గాని నాకును, వాటికిని ఏమి సంబంధమని శిష్యులకు బోధజేసి మధుమాంసాది నీచభోజనములు గురుపూజ మొదలైన పుణ్యకార్యముల యందు జరుపుచున్నారే, దీని రహస్యము నాకు దేటపడ దెలుపుడు.

ఉత్తరము ॥ ఓ పరిశుద్ధుడవైన సోదరా ! ఈలాటి కుయుక్తుల జెప్పువారు గదా దురాచార నిరక్షరకుక్షులు. ఇదియెంత యసంబంద్ధము ! ఈ విషయమై యిప్పుడు నీతో జెప్పబోవు సంగతి యతి సూక్ష్మమైనది. అల్పబుద్ధి గలవారికి గోచరము గానేరదు. కనుక ఏకాగ్రచిత్తము గలవాడవై వినుము. ఇంద్రియములు స్వయముగా శక్తి లేనివి. చక్షురాది జ్ఞానేంద్రియము లైదును, వాక్పాణి మొదలైన

కర్మేంద్రియములును పంచభూత సంబంధములైనవి జడములు. జడమనగా అచేతనము, కనుక వాటికి చేతన సహాయము లేక ఏ యొక్క పనియును జేయ సాధ్యము గాదు. అచేతనమైన మృత్తిక, చేతనుడైన కుమ్మరివాని సహాయముచే పాత్రములుగా పరిణమించును. ఆలాగుననే యచేతనమైన నూలు చేతనుడైన తంతువాయుని ( అనగా సాలెవాని) సహాయముచే వస్త్రములుగా పరిణమించును. అచేతనమైన రాళ్ళు, స్తంభము మొదలైన వానియందు ఇచ్ఛాద్వేషాదులైన వికారములు కనబడలేదు. లేక ఒక యాట కంపెనియందు సూత్రధారి సహాయములేక బొమ్మలు స్వయముగా నాడుట లేదు. ఇదియునుగాక సుషుప్తియందుగాని, మూర్ఛ, మరణము మొదలగువాని యందు గాని సర్వేంద్రియములతో గూడిన శరీర మున్నప్పటికిని వికారములు గనబడ లేదు. నేత్ర మగ్నియొక్క యంశము. కర్ణేంద్రియ మాకాశాంశము. జిహ్వేంద్రియము జలాంశము. ఈలాగున ఇరువదినాలుగు తత్త్వములు పంచ భూతాత్మకమైన జడములని యందరికి దెలిసిన విషయమే కనుక జడములైన యింద్రియము లింద్రియాది భోగముల ననుభవించునని చెప్పుటకును వీలు లేదు. ఇంక నంతర్యామైన పరమాత్మ యనుభవించునని చెప్పుటకును వీలు లేదు. అది నిర్గుణమనియు, నిర్వికల్పమనియు, నిరంజనమనియు, సత్యమనియు, జ్ఞానమనియు, అనంతమనియు శ్రుతులు చెప్పుచున్నవి. అప్పుడు నిర్గుణమైన బ్రహ్మము నుండి గుణములు రాగూడదు. నిర్వికారమైన బ్రహ్మమునుండి వికారాది దోషములు గలుగగూడదు. నిత్య సుఖ స్వరూపమైన యాత్మ కనిత్యమైన యల్పసుఖము బనికిరాదు అప్పుడు నిర్వికారమైన పరబ్రహ్మమునకు వికారాదిదోషములు సంభవింపవు. జడములైన యింద్రియములకు స్వయముగా బ్రవర్తనశక్తియు లేదు. ఈ యుక్తిచే శ్రీమధ్వ, రామానుజాచార్యు లద్వైతమతమును ఖండించి జీవు డొకడు విషయ భోగముల ననుభవించుట కున్నాడని స్థాపించిరి. ఈ ద్వైతవిశిష్టాద్వైత మతము లుద్భవించి యెనిమిదినూర్లు సంవత్సరములు గావచ్చుచున్నది. ఈ కాలము ననుసరించి ఈ మతము మంచిదిగా నున్నది. నీచవృత్తుల నవలంబించినవారి చేతి యందు పవిత్రమైన యద్వైతము దొరకి శుచి, యాచారములు లేక మధుమాంసాదులు భుజించు దురాచారులు లోకమందు

నిండిన కారణముచే పరమ పవిత్రులైన ఋషి పుంగవులచే బొందదగిన యద్వైత బ్రహ్మవిద్య కాక్షేపణలు వచ్చినవి. కాని, సత్యమై, వేద సారమైన యీ యద్వైత మతము శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధియగునే గాని దీనికి హాని రానేరాదు. క్షీరాన్నాది పంచభక్ష్యములను భుజించి తృప్తినొందిన వారితో నితరులు మీ రాకలితో నున్నారని యెంత చెప్పినను వారికి చలనము గలుగునా ? అనగా నద్వైత జ్ఞానానుభవము పూర్ణముగా గలవానికెన్ని దుర్వాదములు వచ్చినప్పటికిన్ని చలనము రాదు. కనుక పై జెప్పిన విషయమై జీవేశ్వర భేదవాద మద్వైత మత సమ్మతమేగాని పారమార్థికమందు లేనేలేదు. అశుద్ధ మాయా ప్రతిబింబుడు జీవుడనియు, శుద్ధమాయా ప్రతిబింబ మీశ్వరుడనియు, ఉపాధులచే భేదము గాని, విచారముచే నుపాధి నశించిన తర్వాత జీవేశ్వరులకు భేదము లేదు. ఎట్లనగా, సముద్రము, నది, చెఱువు, పాత్రము వీటియందున్న జలమొకటిగా నున్నను ఉపాధిచే వేరువేరుగా నున్నట్లు దోచును. వాస్తవముగా నచలమైన బ్రహ్మమొకటియే. తదితరములైన జీవజడము లన్నియు భ్రమయే గాని, మరేమియు గాదు. ఇది పరిశుద్ధ హృదయముగలవారికి, స్వానుభవమునకు వచ్చును గాని తదితరులకు సాధ్యము గాదు. ఎట్లనగా సూర్యుడు సర్వత్ర వ్యాపించియున్నప్పటికిని నిర్మలమైన దర్పణమందు ప్రతిబింబించును గాని రాయి, పలక, మట్టి యీలాటి మలిన వస్తువులందు బ్రతిబింబింపడుగదా ? భ్రమ యనగా చెఱువుకట్టయందు నిశ్చలముగా నుండు వృక్షము నీడ నీటియందలి అలలు మొదలైన చలన శక్తిచే చలించునట్లును, రైలుబండి గమన వేగమునకు ప్రక్క స్థిరములైన వృక్షములు బరుగెత్తునట్లు తోచునట్లును, అచంచలమైన బ్రహ్మము మాయాశక్తిచే చంచలమని తోచుటయే. కనుక ఈ యద్వైత బ్రహ్మానుభవము తపో ధ్యాననిష్ఠాదులచే నింద్రియ నిగ్రహము గలిగి సర్వ మనోవృత్తులు నశించిన మహనీయులచే బొందదగినది గాని వాచా ప్రసంగవేదాంతులచే పొంద సాధ్యము గాదని శ్రీ భగవద్గీత చెప్పుచున్నది.

యే త్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతాః ॥

సర్వేంద్రియములను సంయమము జేసి, సర్వజీవరాసుల యందును సమబుద్ధిగలవారై, శబ్దముచే దెలుపరానిదియు, రూపవిహీనమైనదియు, సర్వవ్యాపియై చింతించుటకు వీలు లేనిదియు, మాయా ప్రపంచమున కధిష్ఠానమైనదియు, చలనము లేనిదియు, నిత్యమైన దియు నగు అక్షర బ్రహ్మమునెవరు ధ్యానించుచున్నారో అట్టి దయాళువులైన సమభావన గలవారు నన్ను సులభముగా బొందుదురు.

క్లేశో௨ధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

అక్షరబ్రహ్మ (అనగా నిర్గుణ) మును ధ్యానించువారైన పరమార్థ దర్శులగు వారికి క్లేశమధికముగా నుండును. అన్ని యింద్రియములందు విరక్తిలేనివారికి బొందుటకు శక్యము గాదని భావము. నిర్గుణ బ్రహ్మోపాసన దేహాభిమానము గలవారికి గష్టమని యర్థము. ఇంద్రియనిగ్రహము, బహిరంతరశుద్ధి, సాధన చతుష్టయ సంపత్తి సంపూర్ణముగా లేనివారి కద్వైత బ్రహ్మోపాసన కధికారము లేదని చెప్పి, వీరికి భక్తి యోగము శ్రీ కృష్ణభగవానులు చెప్పుచున్నారు. గీతయందు ద్వాదశాధ్యాయమున భక్తుని లక్షణము బాగుగా గనందగును.

ఇంక నొక రహస్యమును జెప్పబోవు చున్నాను. రాజయోగులలో గొంద రింద్రియము లొక్కొక్క విషయమందు బోవుచున్నవేగాని వాటికి నాకు నేలాటి సంబంధము లేదని గదా చెప్పుచున్నారు. ఈ విషయమై కొంచెము యోచింతము. కారణము లేనిదే కార్యముండుటకు వీలు లేదు. ఇది లోకమందున్న యందరు మతస్థుల యొక్క పరిపూర్ణాభిప్రాయము. ఎట్లనగా సముద్రమందు జలము లేనియెడల నలలు, బుగ్గలు, నురుగు లుండుటకు మార్గము లేదు. ఆలాగుననే యెవరి కేయేవస్తువులం దభిలాష గలుగుచున్నదో వారి హృదయమందు దాని కనుకూలమైన గుణము లవశ్యముగా నుండవలయును. ఈ గుణములు ప్రస్తుతము నేత్ర గోచరములు గావు. కనుకనే దీనిని గనిపెట్టువిషయమున కనుమాన ప్రమాణ మని పేరు. అనుమాన ప్రమాణ మనగా, పర్వతమందు

బొగ కనుబడిన యెడల దానికి గారణమైన యగ్ని యచ్చోట నిశ్చయముగా నుండవలయునని నిశ్చయించుట. కనుక సమస్తజీవులకు సత్త్వరజస్తమో గుణములను మూడు అప్రత్యక్షమై యున్నవి. వీటిని వారి వృత్తులచే గనిపెట్టవచ్చును. ఒక్కరికి మధు మాంసాది నీచభోజన కృత్యములలో నిష్టముండుటకు గారణమేమనగా, వారి హృదయమందు నీచ భోజనమున కనుకూలమైన తమోగుణ మవశ్యముగా నుండును. అలాగుననే, ఒక్కరికి స్త్రీ విషయమం దాసక్తి యున్నయెడల వారి హృదయమందు దానికి కారణమైన కామశక్తి యుండే తీరవలయును. ఈలాగుననే సత్త్వరజస్తమో గుణముల నూహింపవచ్చును. ఎట్లనగా ఒక్కపాత్రమును శోధించునప్పుడింగువ వాసన యున్నయెడల నాపాత్రమందంతకు ముందింగువ యున్నట్లును. ఆ వాసన యింకను బోలేదనియు నిశ్చయింపవచ్చునుగదా ! అలాగుననే, ఒక పెట్టెను దెరచినప్పుడు దానినుండి సుగంధవాసన యుద్భవించిన యెడల నాపెట్టెయందు సుగంధ వస్తువులు నిశ్చయముగా నుండవలయును. కాబట్టి యెవరెవరికి, ఏయే మనోవృత్తులు గలుగుచున్నవో వారి హృదయమందు నిశ్చయముగా నాలాటి గుణము లుండును. ఎంతవరకు గుణము లుండునో యంతవరకు జ్ఞానము గలుగదు. అదెట్లనగా నాకాశమందు మేఘావరణ మెంతవరకుండునో యంతవరకును సూర్యుడు బ్రకాశించడు గదా ! కనుక రజస్తమోగుణములు నశించి సత్త్వగుణ ముదయుంచుగునపుడు జ్ఞానోదయమునకు గాల మారంభమగును. అప్పుడు వాని వృత్తులన్నియు సత్త్వగుణముగానే యుండును.

ఇంకొక్క యతిసూక్ష్మమైన విషయము జెప్పుచున్నాను. ఇది నిండా మేధావికి గోచరమగును గాని తదితరులకు గోచరింపదు. దీనిని గ్రహించిన యెడల జ్ఞానులను, అజ్ఞానులను గనిపెట్టవచ్చును. ఒక్కరి కొకవస్తువు జూచునపుడు దానిపై నభిలాష గలుగుటకు గారణమేమి ? దీనికొక కారణ ముండవలెను. ఒక సుందర స్త్రీని జూచునపుడు పురుషునికి వికారమును, అలాగుననే సుందరపురుషుని జూచునపుడు స్త్రీలకును ఎందుకు పరస్పరాభిలాష గలుగవలెను? ఒకరికి మధుమాంసాది నీచవస్తువులు భుజించుట కాశ యెందుకు బుట్టవలె ? ఒకరికి వాటియందు విరోధమెందుకు రావలె ? ఒక యౌవనస్థుడై

మహాత్ముడైన యోగి కేకారణముచే నప్సరః స్త్రీ సమానలైన యనేక యువతులు సదా దగ్గర నున్నప్పటి కేలాటి మనోవికారము గలుగక యుండవలయును ? అలాగుననే ఒక మహాయోగిని యగు స్త్రీరత్నమున కనేక సుందర పురుషుల మధ్యనుండినను మనసుకు వికారము బుట్టకుండుటకు గారణమేమి ? దీనికొక రహస్యము గలదు. వస్తువుకు వస్తువుకు పరస్పరాకర్షణశక్తి యొకటి గలదు. తంతి ఆఫీసుల యందున్న మిషన్ యందు విద్యుచ్ఛక్తి ఒకటి గలదు. ఆ శక్తి యితర ఆఫీసునందుండిన మాత్రముననే పరస్పరము విషయము గోచరమగును. ఈ రెండు యంత్రములలో దేనియందు గాని యొకటి చెడిపోయి విద్యుచ్ఛక్తి నశించినయెడల అన్యోన్యము విషయము గోచరము గాదు. ఆలాగుననే స్త్రీయందు కామవికారముండినను పురుషునియందు ఆ దోషము నశించిన యెడల వారి మనసున కేలాటి వికారమున్ను గలుగనేరదు. ఈలాగుననే స్త్రీలకున్ను యూహింపవచ్చును.

దీనికొక దృష్టాంతము. ఒకడు బాలుడై యున్నప్పుడు యౌవనస్త్రీ చెంతనుండినను వికారము గలుగలేదు. యౌవనకాలమందు గలుగుచున్నది, తిరుగా వార్ధక్యమున లేదు. ఈలాగుననే స్త్రీలకున్ను కనబడుచున్నది. దీనికి గారణమిదియే. యోగియైన వాడు యౌవనస్థుడైనను వాని హృదయమందీ కామాది దోషములు క్షయించిపోయినందున పసిబాలునివలె నుండును. చెవియందు మాత్రము శబ్దము వినుటకున్ను, నేత్రముచే దర్శించుటకున్ను, జిహ్వచే రసము గ్రహించుటకున్ను కారణమిదియే. శరీరమంతయు నొకటే ప్రకార మున్నప్పటికిన్ని నాసికచే రసము గ్రహించుటకున్ను, కర్ణముచే చూచుటకున్ను, నేత్రముచే వినుటకున్ను యెందువల్ల సాధ్యము గాదు? దీనికి గారణమేమనగా శబ్ద మాకాశముయొక్క గుణము. ఆ గుణము చెవియందున్న కారణముచే చెవి శబ్దము నాకర్షించుచున్నది. జిహ్వాగ్రమునందు జలగుణమైన రసముండుటచే జిహ్వ రసము నాకర్షించుచున్నది. పృథివీ గుణమైన శక్తి నాసికయందున్న కారణముచే పృథివీ గుణమైన గంధమును నాసిక ఆకర్షించుచున్నది. ఈలాగుననే యన్ని యింద్రియములందు తత్సంబంధగుణములుండిన కారణముచే నానావిషయములను గ్రహింప సాధ్యమగుచున్నది. కనుక నెవరెవరి హృదయమం

దేయేగుణములు గలవో వారివారి కాయావస్తువులయం దిచ్చు పుట్టుచున్నది. కాబట్టి నీచ భోజనము జేయువారు నీచులని చెప్పి బ్రహ్మవిద్య నీచులకు గూడదని శాస్త్రము చెప్పినది. ఈలాగుననే బ్రహ్మజ్ఞానమైన శక్తిని ఆకర్షించుటకై హృదయ మను యంత్రము పరిశుద్ధమై, రాగద్వేష కామ క్రోధ రహితమై, తపోధ్యానశక్తిగలదై యుండినమాత్ర మా బ్రహ్మశక్తి నాకర్షించును. కనుకనే పూర్వీకులైన ఋషిపుంగవులు బరిపక్వము లేని వారికి బ్రహ్మోపదేశము జేయరైరి. సూర్యుం డెల్లెడల ప్రకాశించుచుండునపుడు సూర్యకాంత రత్నము మాత్రము ప్రజ్వలించును గాని, తదితరములైన రాళ్ళు మొదలగునవి ప్రజ్వలించునా? ఆలాగుననే పరమాత్మయైన సూర్యుని శక్తి నాకర్షించుట కొరకై తపోధ్యానముచే బరిశుద్ధమైన హృదయ మను సూర్యకాంతశిల యుండవలయును.

**త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।**
**సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥**

ప్రతివారికి సాత్త్వికి యనియు, రాజసి యనియు, తామసి యనియు స్వభావముగా శ్రద్ధ మూడు విధములుగా గలుగుచున్నది. అది పూర్వజన్మకర్మ రూప వాసన హృదయమందుండు కారణమున గలుగుచున్నది. కనుక ముప్విధములైన శ్రద్ధను వినుము.

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥**

సమస్తమైన ప్రాణుల కంతఃకరణమున కనురూపమైన శ్రద్ధ (విచారము) కలుగుచున్నది. ఎవ్వని యంతఃకరణ మెట్టి స్వభావముగలదో యందు కనురూపమైన యాహారాదులను, పనులను వాడు జేయును. కావున బురుషుడు గాని, స్త్రీ గాని, ఏయే స్వభావముతో గూడియుండునో వారు దానికనురూపమైన కార్యమందు బ్రవర్తించుదురు. ఈ కారణముననే పై జెప్పిన యాకర్షణశక్తి సూచించినది. ఇప్పుడు శ్రీ కృష్ణభగవానులు సాత్త్విక, రాజస, తామస స్వభావముగల వారి యాహారాదుల జెప్పుచున్నారు.

**ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥**

ఆయువు, ఉత్సాహము, బలము, ఆరోగ్యము, ప్రీతి మొదలైనవి వృద్ధిజేయునదియు, మనసున కిష్టమైనదియు, నేతియందు చేయబడినదియు, మధురమైనదియు, రుచిగలదియు, చూచుటకు మనోహరమైనదియు, చిరకాలము శరీరమందు స్థిరముగా నుండునదియు అగు ఆహారము సాత్త్విక స్వభావముగల వారు భుజించుట కిచ్ఛింతురు.

**కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః ।**
**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥**

మిక్కిలిచేదు, పులుపు, ఉప్పు, వేడి, తీక్ష్ణము, కఠినములై శోషించునవియై తాపమును గలిగించుటచే శోకము, చంచలత్వము, విషయాసక్తి గలిగించు ఆహారములు రాజసస్వభావము గలవారికి భుజించుట కిష్టమై యుండును. అతి శబ్దముచే నుప్పు, పులుసు, కార మధికముగా నుండగూడదని యర్థము. ఉప్పు కారము లను క్రూర పదార్థములు భుజించు వారి మనస్సు గూడ క్రూర స్వభావము గలదై యుండును.

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥**

ఒక్క యామమునకు ముందుగా వండినదియు (అనగా నిండా చల్లారినవియు), సారము లేనిదియు (రసముపోయిన పిప్పి మొదలగునవి), చెడువాసన గలదియు (మత్స్యమాంసాది వస్తువులు), నిన్న మొన్నవండిన చల్దిపదార్థములును, ఉచ్ఛిష్టము (అనగా ఒకరు భుజించిన శేషము) పూజార్థము గానిది మొదలైన యాహారములు తామస స్వభావముగలవారి కిష్టమై యుండును. (ఉచ్ఛిష్ట మనగా భర్త ఉచ్ఛిష్టము భార్యకున్ను, గురోరుచ్ఛిష్టము శిష్యునికిన్ని పరమ పవిత్రమైనది. తదితరులకు గూడదని యర్థము) కనుక బాటసారులైన బ్రాహ్మణాది శ్రేష్ఠజనులు దాహమునకు కాఫీ, లేక పాలను వెదకుచున్నారు. నీచస్వభావముగల చండాలాది జనులు కల్లంగడి జూచుచునే నడుచుచున్నారు.

కుక్కకెంత మంచి భోజన మిచ్చినను, మలము మొదలగు దుర్గంధవస్తువు లున్నచోటికి పరుగెత్తుచున్నది. కాబట్టి యిప్పుడున్న రాజయోగులలో భ్రష్టులైన వారి సంగతి నీవే యోచింపవచ్చును.

**సుస్నిగ్ధమధురాహారః చతుర్థాంశవివర్జితః ।**
**భుజ్యతే శివసంప్రీత్యై మితాహార స్స ఉచ్యతే ॥**

మిగుల మెత్తనిదియు, నేతితో గూడినదియు, మధురమైనదియు, అగు ఆహార ముదరమునకు మూడవభాగము వరకు భుజింపవలయును. అనగా గడుపునిండ భుజింపక కాలుభాగము గాలి సంచారముకొఱకు కుంచవలయును. ఇట్లున్న వారి కేలాటి రోగబాధలు గానియుండవు. శివప్రీత్యర్థమై భుజింప వలయునని చెప్పుటకు గారణ మేమనగా, మొట్టమొదట నతిథికి బెట్టి భుజింపవలయును. అతిథి విష్ణుస్వరూపమని శ్రుతులు జెప్పుచున్నవి. లేక, పూజించిననైవేద్యమని కొందరి యభిప్రాయము. మరికొందరు భుజించునప్పుడు స్థిరముగా గూర్చుండి శాంతుడై సంతోషముగా పరమేశ్వరుని ధ్యానించి భుజించ వలయునని యర్థమందురు. వీటికి సాత్త్వికాహారమనియు, మితభోజన మనియు పేర్లు.



## అపథ్యాహారము

**కట్వామ్లతీక్ష్ణలవణోష్ణహరీతశాక**
**సౌవీర తైలతిల సర్షప మద్యమత్స్యాన్ ।**
**ఛాగాదిమాంస దధి తక్ర కుళుత్థకోల**
**పిణ్యాక హింగు లశునాద్యమపథ్యమాహుః ॥**

చేదు, పులుపు, కారము, ఉష్ణపదార్థములు, ఆకుకూర, పులికడుగు, నూనె, నువ్వులు, ఆవాలు, కల్లు, సారాయి, మత్స్యములు, మేక, కోడి మొదలైన జంతువుల మాంసము, పెరుగు, మజ్జిగ, ఉలవలు, రేగుపండ్లు, గానుగ పిండి, ఇంగువ, తెల్లగడ్డ, యఱ్ఱగడ్డ, మొదలైన వపథ్యములు. ( ఇవన్నియు తమోగుణమును వృద్ధిజేయును) గనుక బుద్ధి సూక్ష్మత్వము గలుగదు. వీటిలో గొన్ని కొన్ని

వస్తువులు యోగాభ్యాసులకు మాత్రము విరోధము గాని, తదితరుల కంత విరోధము లేదు. మధు, మాంసం తెల్లగడ్డ, యర్రగడ్డ, ఆవాలు మొదలైనవి సర్వజనుల కాత్మజ్ఞాన ప్రతిబంధమై యున్నవి.

**గోధూమశాలియవషాష్టిక శోభనాన్నం**
**క్షీరాజ్య కండ నవనీత సితా మధూని ।**
**శుంఠీపటోలకఫలాదిక పఞ్చశాకా**
**ముద్గాదిదివ్యముదకం చ యమీంద్ర పథ్యమ్ ॥**

గోధుమలు, వడ్లు, యవలు, శుద్ధమైన యన్నము, నెయ్యి, కలకండ, వెన్న, చక్కెర, తేనె, శొంటి, పొళ్ళ, పంచ శాకము, తిప్పతీగ, ఆకుపచ్చ పెసలు, శుద్ధోదక మనునవి పథ్యములు. ఈ యాహారముచే మనోనిర్మలత, ధైర్యము, ఆరోగ్యము మహావివేక జ్ఞానము, శాంతము, ఇంద్రియ నిగ్రహములను ననేక గుణములు గలవు అని హఠయోగ ప్రదీపిక.

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥**

యుక్తమైన యాహారము, అనగా సాత్త్వికమైన శుద్ధమైన భోజనము, యుక్తమైన విహారము, యుక్తమైన కర్మల యందుండుట, యుక్తమైన నిద్ర (యుక్తమైన వ్యాపారము, అనగా వారివారికి విధించిన స్వకర్మమును, ధ్యాననిష్ఠకు భంగము లేకుండునట్లును, పాతకము లేక యుండు పని) యుక్తమైన జాగ్రత్త ఇవన్నియు నెవరి కున్నవో వారికి సర్వదుఃఖములను నాశముజేయు నిరతిశయానంద శాశ్వత మోక్షముకొఱకై ధ్యానయోగము సిద్ధించును.

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్షపరాయణః ।**
**కామక్రోధాదయో దోషా న భవంతి మితాశనాత్ ॥**

మోక్షాపేక్షగలవాడు నిత్యము మితాశనుడై యుండవలయును. ఎందుకనగా మితాహారముచే గామక్రోధాదులను నరిషడ్వర్గములును, ఆలస్యము, చంచలస్వభావము, మొదలైన సమస్త దోషములును నశించునని సన్న్యాస

సముచ్చయము. మితాహారము, భూతదయ, ఈశ్వరభక్తి, శాస్త్రవిశ్వాసము, శాంతము మొదలైన సద్గుణములు లేనివారికి బ్రహ్మజ్ఞానోపదేశము జేసిన యెడల మహాపాతకము గలుగును. అట్లు చేయువాడు గురోర్గురువైన పరమేశ్వర ద్రోహి యగును.

**అభ్యాసశూరాయ జితేంద్రియాయ**
**శివే గురౌ భక్తిసునిశ్చయాయ।**
**దేయం రహస్యం భవయోగశాస్త్రం**
**యో మూఢదాతా గురుపాతకీ స్యాత్॥**

ప్రతిదినము శ్రద్ధాభక్తితో సమయము దప్పక నభ్యాసము జేయువాడును, సమస్త విషయవిరక్తి గలిగినవాడు. ఈశ్వరునియందును గురువందును దృఢమైన భక్తుడు, ఈలాటి సద్గుణములు గలవానికి వేదసారమైన యీ ధ్యానయోగము జెప్పవలయునేగాని నీచాహారులైన వారికుపదేశించినయెడల వాడు గురుద్రోహమునకు బాత్రుడగును అని శివయోగదీపిక. అనగా ధనాపేక్షతో గాని, శిష్యుల సంపాదనకు గాని గుణము లేనివారికి జెప్పువాడు నరకము బొందును.

**ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।**
**న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥**

ఓ యర్జునా ! నీకుపదేశించిన వేదాంతసారమైన ఈ యాత్మజ్ఞానము తపస్సు లేనివానికి, దైవభక్తిలేనివానికి, ఈశ్వరార్చన చేయక దైవదూషణ జేయువానికి, శుచి, శౌచము, సత్యము లేనివారెవరికిని యెప్పటికి నుపదేశింపగూడదని భగవద్గీతయందు శ్రీ కృష్ణ భగవానులు చెప్పుచున్నారు.

**అభక్తే వంచకే ధూర్తే పాషండే నాస్తికాదిషు।**
**మనసాఽపి న వక్తవ్యా గురుగీతా కదాచన॥**

భక్తి లేనివానికి, వంచకునికి, ధూర్తునికి, పాషండునికి, నాస్తికునికి ఈ దివ్యమైన గురుమంత్రము జెప్పుటకు మనసానైనను దలపరాదు. అనగా నీచ స్వభావుల కెప్పటికి నుపదేశింపరాదని యర్థము అని శ్రీ గురుగీత. ఇంక శ్రీగురోర్గురువైన శ్రీకైలాసవాసియగు మహాదేవుడు నీచస్వభావము గల వారిని గురువుగా స్వీకరింపరాదని శ్రీ గురుగీతయందు విస్తారముగా చెప్పియున్నారు.

## నీచాచారుల వర్ణనము

న వందనీయాస్తే కష్టం దర్శనాద్భ్రాంతికారకాః ।
వర్జయేత్తాన్ గురూన్ దూరే ధీరస్య తు సమాశ్రయేత్ ॥

ఆహా కష్టము ! వారు వందనార్హులు కారు. వారు తమ దర్శనముచే మనోభ్రాంతి గలుగజేయువారు. ఈలాటి నీచ కృత్యముల జేయు గురువుల బహుదూరముగా ద్యజించి ఆత్మధ్యాననిష్ఠయందున్న మహాత్ముని ఆశ్రయింపవలయును.

పాషండినః పాపరతా నాస్తికా భేదబుద్ధయః ।
స్త్రీలంపటా దురాచారాః కృతఘ్నా బకవృత్తయః ॥

ఆ దురాచారు లెవరనగా పాషండులు, (అనగా నీశ్వర పూజాది ధర్మమార్గ వేదనిందకులై దేహపోషణమే ముఖ్య పురుషార్థమని చెప్పువారు) పాపరతులు, అనగా ప్రాణిహింసాది పాపకర్మలజేసి మధుమాంసాదులు భుజించి పాపము లేదని చెప్పు గురువులు, నాస్తిక బుద్ధిగలవారు, భేదబుద్ధి గలవారు, స్త్రీలంపటులు, దురాచారులు అనగా కల్లు, సారాయి, గంజాయి, అభిని మొదలైన వస్తువుల నుపయోగించువారు, కృతఘ్నులు, బకవృత్తితో గూడినవారు, అనగా హృదయమందు దుర్గుణములను బయట చూపక కొంగవలె ధ్యానము జేయువారు.

కర్మభ్రష్టా క్షమానష్టా నింద్య తర్కైశ్చ వాదినః ।
కామినః క్రోధినశ్చైవ హింస్రాశ్చండాః శఠాస్తథా ॥

కర్మభ్రష్టులు, అనగా తపోధ్యాననిష్ఠజేయక యోగులమని చెప్పువారు. క్షమలేనివారు, నీచమైన పనులను జేసి యది తప్పుకాదని కుతర్కవాదము జేయువారు, కామముతో గూడినవారు, కోపము గలవారు, ప్రాణిహింసాది భోజనముచే సంతోషించువారు, నీచాచారము గల క్రూరస్వభావులు, మూఢస్వభావము గల శఠులు.

జ్ఞానలుప్తా న కర్తవ్యా మహాపాపాస్తథా ప్రియే ।
ఏభ్యో భిన్నో గురుః సేవ్య ఏకభక్త్యా విచార్య చ ॥

ఓ ప్రియమైన పార్వతీదేవీ ! ఆత్మజ్ఞాన హీనులైన పాపాత్ములకంటె మహాపాపాత్ములైన యీ నీచస్వభావముగలవారు గురువులగుట కర్మలు గారు. వారి కన్యమైన యాత్మనిష్ఠగల గురుని విచారించి తదేక భక్తితో వారిని సేవించి కృతార్థులు గావలయును.

ఈ కలియుగమందు ఇప్పుడున్న రాజయోగభ్రష్టులైన శుష్కవేదాంతులు రాబోవుచున్నారని తలంచి శ్రీ కరుణామూర్తియైన పరమశివుడు భక్తులు మోసపోగూడదని స్కాందపురాణమందు ఇట్లు చెప్పినారు. ఇట్లున్న వారు గుర్వారాధన జరుపడ మెట్లనగా, గంగమ్మ జాతరకంటే విశేషప్రబలమై యున్నది. ఏమనగా గంగజాతరకు బ్రాణిహింస యొకటే గాని, ఈ మహాభూతములకు నియమించినట్లు కల్లు, సారాయి, రామరసము, గంజాయి అంత ప్రబలముగా గంగమ్మ కుపయోగ పెట్టుట లేదు. వీరి యారాధన సమయమందు వారి సంఘమున కెవరైనా పుణ్యాత్ములు వచ్చిన యెడల వారుపయోగ పెట్టుకొను మద్యమాంసాదులు భుజింపుమని నిర్బంధపరచెదరు. ఆ యధర్మమునకు ధర్మాత్ములు సమ్మతించని యెడల వారందరును జేరి ''మీ కింకా తెగలేదా ? సమత్వము బొందలేదా'' యని పరస్పర ముఖావలోకనముజేసి. పకపక నవ్వుట కారంభించెదరు. ఇదెట్లున్నదనగా, ముగ్గురు దొంగలు దొంగలించుటకు బోవుచు ఒక ధర్మాత్ముని బిలిచినప్పుడు, ఆ సజ్జనోత్తముడీ పాపకృత్యమునకు భయపడి రాక నిలచెను. అప్పుడా తస్కరులు, ''ఓహో ! నీవు మగవాడవు గావా, పౌరుషము లేదే, మహాపిరికివి'' యని పరిహసించినట్లున్నది. ఒక పతివ్రతాశిరోమణియగు నారీరత్నము వేశ్యలసంగమందు జేరుటకై తటస్థించగా సంధ్యాకాలమైనపుడు వారి వేశ్యావృత్తి కారంభించు సమయమున నా సౌందర్యవతియైన పతివ్రతారత్నమును దమవలెనే పరపురుష స్వీకారమునకు నిర్బంధపరచిరి. అందు కామె సిగ్గుపడి తన గొప్ప పతివ్రతా వ్రతభంగమునకు భయపడియుండగా, ఆ వేశ్యలీమెను జూచి ''ఆహా నీకింకను సమబుద్ధి రాలేదా? నీభర్త యొకడు మాత్రమే పురుషుడు. వీరందరు పురుషులు గారా'' యని నవ్వసాగిరి. యోచించగా వీరి స్థితి యీలాగున నున్నది.

## అవధూత లక్షణము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! కొందరవధూత లనుట, నిర్గుణు లనుట, అంతయు జేయవచ్చునని చెప్పుట, తత్త్వము మాత్రము దెలిసిన జాలుననుట అని బహువిధములుగా జెప్పు మాటల యొక్క సారము నాకు దెలుపుము మహాత్మా!

ఉత్తరము ॥ ఓ పరమశాంతుడవైన సోదరా ! అవధూతశబ్దము మిగుల గొప్పది, అవధూతలనగా సమస్త మలినరహితులైన పరమపవిత్రు లని యర్థము. అవధూతలక్షణము సావధానచిత్తుడవై విను‌ము.

**కామైరహతధీర్దాంతో మృదుశ్శుచిరకించనః ।**
**అనీహో మితభుక్శాంత స్థిరో మచ్ఛరణో మునిః ॥**

కోరికలచే గొట్టబడని బుద్ధియొక్క దిట్టతనము గలవాడును, మృదువైన స్వభావము గలవాడును, పరిశుద్ధుడును, సంశయము లేని వాడును, ఆశ లేనివాడును, కోరికలు లేనివాడును, సాత్త్వికాహారమును మితముగా భుజించువాడును, శాంతమైనవాడును, చలనము లేనివాడును, స్థిరమైనవాడును, ఈశ్వరుడే గతియని నమ్మకము గలవాడును, స్వభావముగా మౌనముగలవాడును.

**అప్రమత్తో గభీరాత్మా ధృతిమాఞ్ జితషడ్గుణః ।**
**అమానీ మానదః కల్పో మైత్రః కారుణికః కవిః ॥**

ప్రమాదము లేనివాడును, లోతైన మనసుగలవాడును, ధైర్యము గలవాడును, అరిషడ్వర్గములను జయించినవాడును, అభిమానము లేనివాడును, మానము నిచ్చువాడును, స్వయముగా కల్పనాశక్తిగలవాడును, సర్వమును స్నేహించువాడును, దీనజనులయందు కరుణ గలవాడును, పరమదయాళువును, సర్వజ్ఞుడును.

**కృపాళురకృతద్రోహః తితిక్షుస్సర్వదేహినామ్ ।**
**సత్యసారోఽనవద్యాత్మా సమస్సర్వోపకారకః ॥**

సర్వప్రాణులయందు దయగలవాడును, ఒక ప్రాణికైనను ద్రోహము జేయనివాడును, సర్వజనులు జేయు అపకారముల క్షమించు క్షమగల వాడును,

ప్రాణము ద్యజించియైనను సత్యమును గాపాడువాడును, నిందితము గాని మనసు గలవాడును, సర్వము బ్రహ్మమయముగా జూచువాడును, సర్వజీవరాసుల కుపకారము జేయువాడును - ఈలాటి గుణములు గలవాడు నిజమైన యవధూత యని మహనీయులచే జెప్పబడుచున్నది.

**అవధూత లక్షణం వర్ణైః జ్ఞాతవ్యం భాగవత్తమైః ।**
**వేదవర్ణార్థ తత్త్వజ్ఞై ర్వేద వేదాంతవాదిభిః ॥**

అవధూతలక్షణ మక్షరములచేత నెఱుంగ దగినదని వేద వర్ణార్థ మెఱింగినవారును, వేదవేదాంత ముల బోధించువారునగు భాగవత శ్రేష్ఠులచే జెప్పంబడినది. అవధూత యనగా అ.వ.ధూ.త. అను నాలుగక్షరములు. ఒక్కొక్క యక్షరము నొక్కొక్క లక్షణము జెప్పుచున్నది.

**ఆశాపాశవినిర్ముక్తః ఆదిమధ్యాంత నిర్మలః ।**
**ఆనందే వర్తతే నిత్యం అకారస్తస్య లక్షణమ్ ॥**

ఆశాపాశమైన పిశాచమునుండి విడువబడినవాడును, మనసా కర్మణా వాచా పరిశుద్ధుడును, (అనగా సదా త్రికరణశుద్ధిగలవాడు) మనో వాక్కాయములచే జేయు పనులన్నియును పరమ పవిత్రమై యుండువాడును, సదా బ్రహ్మానందభరితుడై యున్నవాడును, అనగా నెప్పుడున్ను ఇంద్రియాది సుఖములందు రమింపనివాడని యర్థము. ఇది అకారముయొక్క యర్థము.

**వాసనా వర్జితా యేన వక్తవ్యంచ నిరామయమ్ ।**
**వర్తమానేషు వర్తేత వకారస్తస్య లక్షణమ్ ॥**

ఎవనిచే లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసనలను మూడును విడువబడునో, ఎవనికి గోరికెలు లేవో, ఎవడు దుఃఖ వర్జితుడో, ఎవనికి భూతభవిష్యత్కాలములయందు జరుగు సంకల్పములు లేవో ఎవడు వర్తమాన కాల భోగము లనుభవించు చుండునో అట్టి వాడని యర్థము . ఇది వకార లక్షణమని చెప్పబడినది.

**ధూళీధూసరగాత్రాణి ధూతచిత్తో నిరామయః ।**
**ధారణాధ్యాననిర్ముక్తోధూకార స్తస్య లక్షణమ్ ॥**

దుమ్ముతో గూడిన యింద్రియములు గలవాడును, (అనగా ఎండ, గాలి, వాన, వీనికి భయపడక ధ్యానమందుండుట) అనగా ఆత్మధ్యాన మందు మగ్నుడై శరీరమందు బ్రజ్ఞలేక యుండుట, పవిత్రమైన మనసుతో గూడియుండుట, దుఃఖము నతిక్రమించి యుండుట, (అనగా మాయావిముక్తిచే శాశ్వతానంద బ్రహ్మమైయుండుట, ధ్యానధారణ లేకుండుట) అనగా ధ్యానధారణాదుల నతిక్రమించి ధ్యేయాకారమైయుండుట. ఇది ధూకారమైన యవధూత లక్షణము.

**తత్త్వచింతా ధృతా యేన చింతాచేష్టావివర్జితః ।**
**తమోహంకారనిర్ముక్తః తకారస్తస్య లక్షణమ్ ॥**

సర్వదా తత్త్వచింతయైన బ్రహ్మవిచార మందుండుట, ఇతర చింతలు లేకుండుట (అనగా ప్రపంచవిషయము లేకుండుట), అజ్ఞానాహంకారముల నుండి విముక్తుడగుట. ఇది తకారమైన అవధూత లక్షణము. ఈస్థితిలో నున్నవా రవధూత లని చెప్పుట కర్హులు గాని, ప్రపంచ విషయములను నింద్రియ వ్యాపారములం దున్నవారు, ''నేను నిర్గుణిని నిర్గుణిని'' అని వచించి ఇంద్రియ సుఖమైన భంగి, అభినియందు భ్రమించువారు పవిత్రమైన యవధూతలు గారు.

**ఆత్మానం చామృతం హిత్వా అభిన్నం మోక్షమవ్యయమ్ ।**
**గతో హి కుత్సితర్వ్యాంకో వర్తతే నరకం ప్రతి ॥**

ఎవడు శాశ్వతమైన పరమాత్మను భేదము లేనిదియు, నాశము లేనిదియు నగు మోక్షమును వదలి పొట్టనింపుకొను నిమిత్తము వేదాంత శాస్త్రప్రలాపము చేయుచుండునో, అతండు ఘోర నరకము బొందగలడు. అనగా స్వస్వరూపమును బొందుటకు ధ్యాననిష్ఠ చేయక వేదాంత ప్రసంగము జేసి కాలము గడుపువాడు పతితు డగునని యర్థము.

ఇది యవధూతగీత అష్టమాధ్యాయమందు జెప్పబడుచున్నది. ఇది శ్రీ దత్తాత్రేయ మహామునీంద్రునిచే జెప్పంబడిన యుపదేశము. అందరున్ను సదా జాగరూకులై యోచింపవలయును. అవధూత యనియు, సన్న్యాసి యనియు, రాజయోగి యనియు, జ్ఞాని యనియు ముక్తుడనియు పేళ్లు మాత్రము భేదము

గాని, వాస్తవస్థితి కంతయు నొక్కటే. అవధూత యనగా శోధితమైన చిత్తము గలవాడు. అనగా, ప్రకృతి పురుషుల విచారవుచే పంచప్రాణవులు, జ్ఞానేంద్రియవులును, చక్షుశ్రవణాదులైదును, వాక్పాణి మొదలగు కర్మేంద్రియములైదుమ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను తన్మాత్రలైదును, మనోబుద్ధిచిత్తాఽహంకారము లను అంతఃకరణ చతుష్టయముతో గూడిన చతుర్వింశతి తత్త్వములు మాయామయములేగాని నిత్యశుద్ధ స్వయంప్రకాశుడైన నేనది కాదని దానికి సాక్షియై యుండుటయే యవధూతలక్షణము. ఆలాగుననే సన్న్యాస శబ్దము యొక్క యర్థము. సన్న్యాసమనగా, విడివడుటయని యర్థము .దేనినుండి విడివడడమనగా ఇరువదినాలుగు తత్త్వములును, ''నేతినేతీతి '' వాక్యముచే అనగా ''ఇది కాదు, ఇది కాదు '' అని వదలి శేషించిన శుద్ధ బోధస్వరూప మెద్దిగలదో, అదే తానై యుండుట, ఇదే ''బ్రహ్మాస్మి'' యను మహావాక్యార్థము. ఆలాగుననే రాజయోగి యనగా రాజత్ = ప్రకాశించు చున్నది. శుద్ధమైనది, శ్రేష్ఠమైనది యని అర్థము ''యుజ్యతే ఇతి యోగః'' ఐక్యపరచుట యని యర్థము. ఇరువదినాలుగు తత్త్వములనుండి మనసును వశీకరించి పర మాత్మలో నైక్యముచేయుట, ( అనగా జీవ బ్రహ్మైక్యమని యర్థము) ఈలాగుననే జ్ఞానశబ్దమున కర్థము. అజ్ఞానమను ప్రకృతినుండి పుట్టిన యిరువది నాలుగు తత్త్వముల నతిక్రమించి యవస్థాత్రయ సాక్షియై యుండుట జ్ఞానమనబడును. ఇదియే ''ప్రజ్ఞానం బ్రహ్మ'' యను మహా వాక్యార్థము. జీవన్ముక్తునియొక్క యర్థమిదియే. చతుర్వింశతి తత్త్వములతో గూడి జీవుడని భ్రమించుట, భ్రమయే గాని, అందుండి విముక్తుడై స్వస్వరూపి యగుటయే జీవన్ముక్తి యనబడును. ఇదియే ''తత్త్వమసి'' అను మహావాక్యార్థము. ఈ స్థితిని బాగుగా ననుభవానికి దేక పంచీకరణము మాత్రము శోధించి మాట్లాడ నేర్చిన యెడల బ్రహ్మానంద సుఖము బొందరు. రోగము గలవాడు తన రోగమును గనిపెట్టి తగవగౌషధమును దెలిసికొనిన మాత్రముననే తన రోగము గుదురదు గదా! లేక వైద్యశాస్త్రమంత యు జదివినను దానియందు జెప్పిన యౌషధము సేవించి పథ్యముండని యెడ ల రోగము కుదురునా? కుదరదు. ఆలాగుననే వీరి యొక్క స్థితి యుండును. ఒక మహాదరిద్రుడు వీథియందు భిక్షమెత్తి జీవించునపుడు వానిగృహమందక్ష

యమైన యొక నిక్షేపము దొరికిన యెడల తదనంతరము భిక్షమునకు బోక ఆ మహాధనముచే జీవించునట్లు విషయాశ యను వీథియం దల్పసుఖము, బహు దుఃఖకరమగు విషయానందముచే గాలము గడుపువారికి హృదయకమలమందు పరమాత్మయైన శాశ్వత సుఖమగు నిక్షేపము సిద్ధించినపుడు విషయభోగమున కాశింపరు. నేను శశవిషాణముచే జేయంబడిన మహాధనుస్సుచే గంధర్వ నగరాధిపతియు, మహా శూరుడైన వంధ్యాపుత్రుడను రాజును, ఏకబాణముచే సంహరించి పట్టాభిషిక్తుడనైన సార్వభౌముడను గదా యని చెప్పు మాటల నమ్మి యారాజు దర్శనమున కెవరు పరుగెత్తి పోవుచున్నారో, ఆలాటి జ్ఞానహీనులు మాత్రము విషయలోలురగు వారిని పెద్దలని నమ్మి శిష్యత్వము బొందుటకు వెళ్ళుదురు. వీరి రాజయోగ శబ్ద మిప్పుడీస్థితికి వచ్చినది. ఏలాగనగా బొమ్మలాటయందు, చర్మ చిత్రితములైన శ్రీ రామ రావణుల యుద్ధమునకున్ను, నిజమైన శ్రీరామ రావణుల యుద్ధమునకున్ను ఎంత తారతమ్యము గలదో యంత తారతమ్యము విషయ విరక్తులైన తపోధ్యాన యోగయుతో గూడిన మహనీయులకున్ను వీరికిన్ని గలదు.

యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

ఆత్మవేత్త యగువాడు, తనయాత్మయం దానందము గలవాడై, ఆత్మ చేతనే తృప్తి బొందినవాడై, ఆత్మధ్యానముచే సంతోషించినవాడై, యున్నట్టి జ్ఞాననిష్ఠునకు మాత్రము ధ్యానయోగబలములను గర్మముల జేయ నావశ్యకము లేదు. ఎందుకనగా వాడు విషయ సుఖములకన్న మహత్తైన బ్రహ్మానంద మందుండుటచే; ఈ విషయసుఖమును గమనింపడు. వాని లక్షణ మెట్లనగా దివ్యమైన పంచామృతము; క్షీరాన్నము భుజించి తృప్తుడైనవాడు కుక్కలవలె దుర్గంధ వస్తువులయం దభిలాష బెట్టడు గదా !

జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।
న చాస్తి కించిత్కర్తవ్యమస్తిచేన్న స తత్త్వవిత్ ॥

బ్రహ్మజ్ఞానామృతముచే దృప్తుడై కృతకృత్యుడైన యోగికి కించిత్తైనను

విషయాభిలాష గలుగదు. ఒకవేళ కలిగినయెడల వాడు తత్త్వవేత్త గాదని యుత్తరగీతయొక్క యభిప్రాయము.

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః।
అస్తి చేన్న స విజ్ఞాత బ్రహ్మభావో బహిర్ముఖః॥

బ్రహ్మజ్ఞానానుభవము గల మహానుభావునికి నంతకు బూర్వముండిన సమస్త విషయవృత్తులు నాశనమైయుండును. ఎవనికి విషయవృత్తులు నశింపలేదో వాడు బ్రహ్మానుభవముకంటె ఎంతో దూరమందున్నవాడు. ఇది శ్రీ శంకర భగవత్పాదులవారి యభిప్రాయము (వివేక చూడామణి).

## గంజాయి వర్జనము

ప్రశ్న॥ దేవరవారు మధుమాంసాది వస్తువులు వర్జనీయమని చెప్పినది సర్వజన సమ్మతమై యుండునేగాని, ఇప్పుడున్న పెద్దలలో గొంద రభిని, గంజాయి మొదలగునవి వాడుచున్నారు. వారిలో గొందరు నల్లమందు దినుట మాత్రము తప్పు గాని గంజాయివల్ల మనస్సు శాంతపడుననియు, ధ్యానమందు స్థిరముగా నిలుచుననియు, ఆ గంజాయి జ్ఞానికి జ్ఞానపత్రి యనియు, యోగికి యోగపత్రి యనియు, కల్పమనియు, గురుపత్రి యనియు చెప్పి శిష్యులకు గూడ నేర్పించుచున్నారు. కనుక దీని రహస్యమును దెలుపుము స్వామీ!

ఉత్తరము॥ ఓ సుశీల సంపన్నుడా! గంజాయి ద్రాగువారితో నేనున్ను అనేక ప్రశ్నలు జేసినప్పుడు జ్ఞానపత్రి, గురుపత్రి, యోగపత్రి అని నాతో జెప్పక కొందఱు మే మనేక దేశసంచారముల జేయునపుడు నానావిధములగు జలములను ద్రాగుటచే గలుగు దోష నివారణ కొరకు దీనినుపయోగింవక దీరదనియు, మరికొందరు మనసు విషయమందు బ్రవేశింపక దీనిచే ధ్యానమందు నిలుచుననియు ఇంక కొందరు తీర్థములయందు నివసించుటవలన గలుగు శీతబాధ నది తొలగించు ననియు, నిట్లనేకోపాయములు జెప్పుదురు.

ఓ ప్రియసోదరా! గంజాయిచే నెందరో మనుజులు కష్టమునకు బాత్రులైరి. దాని నభ్యసించువారిలో మొట్టమొదట దగ్గు కనుపించనివా రొకరైనను

లేరు. అనేక భక్తుల కాపోగ యుదరకోశమందు గడ్డకట్టి కష్టపడుచుండుట నే జూచియున్నాను. అనేకమంది డ్వాక్టర్లు దీనిచే గలుగు అపాయమును గనిపెట్టి దొరతనమువారికి దెలిపిన కారణముచే నెవరున్ను వాడగూడదని నిశ్చయించి యింత నిర్భంధములు గంజాయి కేర్పాటుజేసియున్నారు. అనగా నీ మత్తువస్తువు లోకమందు నికమీద విక్రయించ గూడదని యేర్పాటు జేయుచున్నారు. గంజాయిని ద్రాగినప్పుడు మనసు శాంతమై యుండునని చెప్పినది నిజము గాని, ఆ శాంతము జ్ఞానముచే గలిగినది గాదు. దాని మత్తుచే మనసు ప్రవర్తించుటకు శక్తిలేక మైకము జెందుచున్నది. యెట్లనగా డ్వాక్టర్లొకరిని ఆపరేషన్ (అనగా శస్త్రక్రియ) జేయునపుడు మూర్ఛమందుచే మైకము గలిగించు నట్లు, ఇది యొక మైకము గాని జ్ఞానము గాదు. కనుకనే కొంతసేపైన తర్వాత యథాస్థితికి వచ్చి మనసు విషయమందు బోవుచున్నది. జ్ఞానముచే శాంతము గలిగిన యెడల బునరావృత్తి కాగూడదు. ఈ గంజాయి ద్రాగువారి బుద్ధి క్రమక్రమముగా క్షీణించి కేవల పామరత్వమునకు వచ్చును. ఎట్లనగా హృదయమందొక పద్మాకారమైన మాంస పేశి గలదు. దానిని హృదయ పద్మమని చెప్పుదురు. దానియందుండియే సమస్తమైన జ్ఞాపకశక్తి గలుగుచున్నది. ఆ పద్మమీలాటి మత్తువస్తువులచే శుష్కించుచున్నది. వికసించిన తామర పుష్పమందు మంచు వ్రాలునపు డేలాగుననది క్షీణించిపోవుచున్నదో, ఆలాగుననే వీరి జ్ఞాపకస్థానమైన హృదయ పద్మము నశించుచున్నది. ఇదియే సర్కారు నిర్భంధము దీనిపై నుండుటకు గారణము గాని జ్ఞానప్రత్రియైన యెడల గవర్నమెంటువారు జనులు జ్ఞానులు కాకూడదని నిర్భంధ పరచడము కాదు. ఇదియును గాక ఆ మత్తువస్తువు లుపయోగించువారి కాసమయము వచ్చునప్పు డొకరోజున చిక్కనియెడల వారికి గలుగు మనః కష్టమింతంతయని చెప్పుట కలవి గాదు. గడియార మేలాగున నొక్కొక్క ఘంట సమయము రాగా ధా, ధా, అని ఘంట వాయించునో యాలాగుననే వీరికా సమయము వచ్చునప్పుడు మనసు బహు చంచలమై చిత్తభ్రమయును గలుగును. కడుపుబ్బును. అన్నము జీర్ణింపదు. తల పైకెత్త సాధ్యము గాదు. ఇట్లనేక దోషములు గలుగుటయే గాక దీనికై బ్రహ్మనిష్ఠయందున్న వారు గూడా, ఆ సమయమందు దొరకనియెడల కేవలము మూఢునివలె

వీథియందు దిరుగుచు చిన్న స్వభావముగల మనుజుల యొద్దకు బోయి యెంతో వినయముతో దమ్మిడి దమ్మిడి యాచించుట యందరి కండ్ల కగుపడు విషయమేగదా ! అట్లు కష్టపడి, ఒక అణా సంపాదించి యాపొగను ద్రాగుటవల్ల గలుగు లాహిరిచే నిద్ర ప్రవేశించి బహుసమయము వృథాగా పోగొట్టి జన్మమును వ్యర్థపరచుచున్నారు. ఇట్లున్నవారెప్పు డాత్మజ్ఞాన విచారవుజేసి జన్మరాహిత్యమును, మోక్షమును బొందుదురు ? ఆహా కష్టము కష్టము ! ఈ కారణముచే పద్మపురాణమిట్లు జెప్పుచున్నది.

**ధూమ్రపం వైష్ణవం దానం యే కుర్వంతి నరా ఇహ ।**
**దాతారో నరకం యాంతి వైష్ణవో గ్రామసూకరః ॥**

ఎవరు గంజా ద్రాగుటకై డబ్బుగాని, భంగాకుగాని దానము జేయుదురో యట్టి దాతలు నరకము బొందుదురు. త్రాగు వాడూరిపందియై జన్మించును అని చెప్పియున్నది. కనుకనే పాత్రమెరింగి దానము జేయవలయునని విధించినది. లేక దానము జేయువాడు గూడ కష్టమునకు బాత్రుడగును. ఎట్లనగా దొంగకు బీగము, కత్తెర వగైరాల సహాయము జేయువారిని గూడా కనిపెట్టి శిక్షింతురుగదా? అంతియేగాక ముముక్షువులకు గంజాయిచే గలుగు నపాయములకు దాతయే కారణము. ఈ కారణముచే ముముక్షువుల ధ్యాననిష్ఠకు భంగము గలుగుచున్నది. ఈ భంగమునకు గారకుడైన దాతయును పాపమునకు బాత్రుడగును. జ్ఞానాభిలాష గలవారికి ప్రాణాయామాభ్యాసముండిన యెడల, ఉదర సంబంధమైన సమస్త వ్యాధులు నశించుటయే కాక సమస్త పాపములు గూడ నశించి మనశ్శాంతి గలిగి శీఘ్రముగా శాశ్వతానంద మోక్షము బొందవచ్చును. ఇంత సులభమైన మార్గ మవలంబింపక ఎందరో మనుష్యులు జన్మమును వ్యర్థపరచుచున్నారు.

ఈ నిషావస్తువు మోక్షమార్గోపాయమని చెప్పుట యెట్లున్నదనగా గంగాతీరమందున్నవార లాపవిత్రమైన జలము శరీరమునకు రోగము గలిగించు ననియు, జలదారినీళ్ళు పరిశుద్ధము లనియు చెప్పుచున్నట్లున్నది. ఇదియునుం గాక ముక్తు లగుటకు గదా జీవులు ప్రయత్నించు చున్నారు. ముక్తులనగా

సమస్తమైన యింద్రియ విషయములనుండి విడుదల బొంది స్వస్వరూప ధ్యానమం దానందించుటయే. ఈ మార్గములను శిష్యులకు బోధించక మహాకష్టతరమైన ఈ మత్తువస్తువు చిత్తశమనోపాయమని యుపదేశించు టెంత ప్రమాద విషయము. ఇట్లుపదేశించువారిని ఆశ్రయించిన వారును కష్టములకు బాత్రులగుదురు. ఎట్లనగా గ్రుడ్డివానితో మరియొక యంధుడు బోయి మార్గము జూపించుటకై వేడికొనినట్లున్నది యీ గురుశిష్యులస్థితి.

ఈ నిషావస్తువు లుపయోగించు వారిలో నొకరికైనను విశాల హృదయము గాని, అమానుషబుద్ధి గాని నిశ్చయముగా గలుగనేరదు. కనుకనే సమస్త ఋషీశ్వరులున్ను,శ్రీ శంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వాచార్యులును, ఈలాటి విషయములన్నిటిని నిషేధించిరి. ఈ ముగ్గురు ఆచార్యులవారి యొక్క పారంపర్యమున గాని, మఠములలో గాని ఈలాటి దురాచారములు గనుపడవు. ద్వైతాద్వైత విశిష్టాద్వైతములైన త్రిమతములయందు జేరినవారే ముఖ్యముగా భరతఖండ మందుండు హిందువులు. వీరికి విరుద్ధముగా నుండు ఈదురాచారకుతు లేయొక్క పరంపరకు చెందినవారో తెలియదు.

మరియు గంజాయి విషయమై కొంచెము చెప్పెద, ఇది యాదికాలమున హిమవత్ప్రాంతము (హరిద్వార,హృషీకేశము) మొదలైన స్థలములయందు యోగధారణ, ఆత్మధ్యానశక్తి లేనివారు గొందరు సాధువులు శీలించుచు వచ్చినది. ఎందుకనగా, ఆదేశములో నమితమైన మంచుచే చలిచేనెప్పుడు వణకుచుందురు. ఆహారమా! గోధుమరొట్టి, పూరి, పాల్‌బూరి, లడ్డు వగైరాలన్నియున్ను నేతిలో జేసినవి. మరియు, పాలు, నేయి, పెరుగు విశేషము. అవి యన్నియును సంపూర్ణముగా దినుటచే జీర్ణము గాదు.

అవి యరుగుటకై గంజాయి త్రాగుట నభ్యసించిరి. గంజాయి గూడనప్పు డిష్టప్రకారము గావలసినవారు దోటలుబెట్టి పెంచవచ్చును. మరియు నా దేశపు వారిప్పుడు గూడ పులుపు, కారము దినువారు గారు. ఈ కారణముచే గొంచెము జీర్ణముకొఱకై భంగి, పత్రి ద్రాగుటభ్యాసము గాని జ్ఞానము గలుగజేయునని భ్రమచే జేసినది గాదు. మన దేశస్థితి యెట్లుండు ననగా నిప్పుతో సమానమగు ఎండయు, పుష్ప సమానముగానుండు మృదువైన యన్నము,

దానిలోవేయు పులుసు, చారు, వూరిబిండి వగైరా అగ్ని ద్రావకమువంటివి. మన రాజ్య మాధర్మమునకు దూరము. ఈ దేశమందు భంగి త్రాగుట మహాతప్పు. శరీరము శుష్కించి నేత్రము లొట్టపోయి రక్తపుష్టి నశించి త్రాగువారు బుద్ధిహీను లగుదురు.

ఆదికాల మీ గంజాయి యూరకే దొరకెడిది. ఇప్పుడా ! రూపాయి యెత్తు అర్ధరూపాయు వెలయ్యెనది. ఈ పత్రి సంపాదించుటలో సాధువులకు దినమంతయు జాలకున్నది. దీనిని ద్రాగువారలు మూడు తరగతులుగ నున్నారు. క్రిందితరగతివారు, పత్రికొరకు యాచనజేసి దినమంతయు వ్యర్థపరచెదరు. వీరికన్న గొంచెము విద్యయు, బుద్ధిగలవారు రెండవతరగతి. వారు వైద్యము, మంత్రవము, యంత్రవము, జ్యోతిషవము మొదలగు పనులజేసి డబ్బు సంపాదించెదరు. ఈ కారణముచే బ్రహ్మనిష్ఠకు సమయము దొరకక జీవితము వ్యర్థమైపోవుచున్నది. ఇక మూడవ తరగతివారు- వీరు కొంచెము శాస్త్రవిచారమున్ను, ధ్యాననిష్ఠయున్ను గలిగి ధర్మ తత్పరులుగా నుందురు. వీరికి యాచింపకనే దొరకును. వీరిమతమేమనగా, గంజాయిని ఆదికాలమున మహర్షులు కల్పముగా సేవించిరి. దానిచే నానందము గలదు గాని యిప్పుడు సంసారులున్ను, ఉపయోగములేని షోదాపిల్లవారు గూడా త్రాగుటచే వెల యధికమైనదని చెప్పుదురు. వీరి మనోబలమెంత గొప్పది ? యోగశక్తి యేమని చెప్పవచ్చును ? ధ్యానమహిమ యెంత మహత్తరము ? వైరాగ్యమను మాట కర్థమేమి? ''నేతినేతి'' అను వేదాంతశ్రవణము గ్లణమునందెంత మారినది ? వాసనా జయము గలిగినదా ! మనస్సు స్వాధీనమైనదా యను విచారము లేదు. ''శివోఽహం'' సోఽహం ''అనంత అనంతానందరూపోఽహం'' అను శ్రుతి యెక్కడపోయినది?

''సచ్చిదానందరూపోఽహ మజోఽహ మమృతోఽస్మ్యహమ్ ।
అచ్యుతోఽహమనంతోఽహం గోవిందోఽహ మహం శివః'' ॥
''పరిపూర్ణస్వరూపోఽహం''

అని వేదము జెప్పువాక్యమెక్కడ? అయ్యో! పాపమింకను

ఆత్మానుభవము గలుగలేదే ! నిత్యమగు సుఖమును జూడలేదే హా ! కష్టము, 'శుద్ధబోధస్వరూపోఽహం' అను వేదాంత వచనమెక్కడ? వీరు జెప్పుమాట లెక్కడ ? గంజాయి ద్రాగునపుడు సుఖముగా నుండుననియు, మనసు ధ్యానమందు నిశ్చలముగా నిలుచుననియు దీనికన్న నధికముజెప్పరు. ఈ మాటలయందే వారేస్థితియందుండు వారలని మనము గ్రహించవచ్చును. అదేమన బత్రి ద్రాగుసమయమున సుఖముండుననియు, మనసు చలనము లేక ధ్యానమందు నిలుచుననియు గదా వీరు జెప్పుట. సరే దానిని త్రాగుటకు ముందు వారు దుఃఖమందుండువారనియు, మనశ్చంచలముతో గూడిన వారనియు, వేరు సాక్షి పనిలేక వారి మాటలలోనే దేలుచున్నది. అట్లుగాక నిట్లు బత్రి ద్రాగ ద్రాగ నెప్పటికైనను మనస్సు స్థిరమగునని చెప్పుట కెవ్వరికిని సాధ్యము గాదు. ఏలన త్రాగువారు ప్రతిదినమును నెక్కువగా ద్రాగుచున్నారు. 90సంవత్సరములు వయస్సు గల ముసలివారుగూడ దగ్గుచే గష్టపడియైనను త్రాగుచునే యున్నారు. ఒక్క యౌషధము సేవించునప్పుడు రోగనివృత్తిగల్గి సంవత్సరమునకుగాని, పదిసంవత్సరములకుగాని, పండ్రెండు సంవత్సరములకుగాని, సౌఖ్యపడవద్దా ? ఆలాగుననే గంజాయి త్రాగువారు మనోనిగ్రహ మెన్ని సంవత్సరములు ద్రాగినచో గలుగునని చెప్పగలరా ? సాధ్యము గాదు. ఏలన వారే ప్రాణము కంఠగతమగువరకు త్రాగుచున్నారే. కావున వారే దృష్టాంతము.

ఇక వారిలో గొందరు ఈలాగున జెప్పెదురు. ఉత్తరదేశములో గొప్పగొప్ప సాధువులు గూడ గంజాయి త్రాగుచున్నారని చెప్పుట యబద్ధము. ఉత్తరదేశమున శ్రీ కాశి, హరిద్వారము, హృషీకేశము మొదలైన స్థలము లలో గొప్పగొప్ప మఠముల యందుగాని, ఆశ్రమముల యందుగాని, పరమహంసలగు సన్న్యాసులుగాని త్రాగుచున్నారా అని యిప్పుడు బోయిచూడ వచ్చును. ఉత్తరదేశమున నిప్పుడు గంజాయి త్రాగువారితో సహబంతి భోజనము జేయకూడదని యేర్పాటు జేయుచున్నారు. ఈ ఏర్పాటు బలమైన తరువాత నాగాలలో నిర్వాణి, నిరంజని, అఖాడావారు, వారియన్ని మఠముల యందును బందుచేసిరి. కాశిలో మండలీశ్వర పరమాత్మానందస్వామిమఠము, మండలి గోవిందానందస్వామి మఠము, మండలి పూర్ణానందస్వామి మఠములో గాని

గంజాయి త్రాగుచున్నారా అని పోయి చూడుడు. ఈ సంగతి నాకు బాగుగా దెలియును.

గంజాయి త్రాగువారికి గలుగు సిద్ధి యేమని దయానందస్వాములవారి నడుగగా వారిట్లు సెలవిచ్చిరి. '' గంజాయి త్రాగువా డొక్కడుండినచో, రాత్రి కాలమున, దగ్గి, దగ్గి సమీపముననున్నవారి కందరికిని, నిద్రలేకుండ చేయును. ఇదే ప్రత్యక్షానుభవమగు సిద్ధి. అచ్చట గూడ దేనికిని పనికిరాని వారలలో దిరుగుచుండువారు మనదేశమున నుండు కొందరివలె పత్రి త్రాగుట నిజము. మరియు, గొప్పవారుకూడ కొందరు ''హుక్కా'' త్రాగుదురు. అది ఒక విధమగు పొగాకు. దానికి వారేమి జెప్పుదురన, ఆ దేశము మహాశీతలమ్మైన కారణముచే జీర్ణము కొరకు త్రాగుచున్నామందురు. పొగాకు, చుట్ట, కావలసినవా రుపయోగము చేయువచ్చును. సాధ్యములేని బాధగలవారు పొడి, తాంబూలముకూడ వాడవచ్చును. ఇవి గూడ లేనిచో నిండా మంచిది. ఏలన, ఒకవేళ దొరకక పోయినచో కష్టము గలుగును. అప్పుడెంత వైరాగ్యము గలవానికి గూడ నితరులను యాచించుటకై బుద్ధి పుట్టును. ఇవన్నియు దురభ్యాసములేగాక , ఆత్మ ప్రతిబంధములు గూడ నగును. '' లఘుత్వ మూలం తు కిమర్థితైవ, గురుత్వమూలం యదయాచనం చ '' అని శ్రీ జగద్గురువు శంకరాచార్యులవారు సెలవిచ్చిరి. అనగా యాచనకంటె అతినీచమైనది ఏమియు లేదనియు, (చిన్నస్థితి) అయాచితము కన్న గొప్పస్థితి మరియొక్కటి లేదని తాత్పర్యము. అనగా సాధువులకు భిక్షాన్నయాచనము వేదమందు గొప్ప పవిత్రమని గలదుగాని, ఇతర యాచన గూడదని యర్థము.

మరియు, గంజాయి త్రాగువారు గొప్ప ఆశ్రమమందు ఉండుటకు గాని, మహాత్ముల దగ్గరనుండి సారము గ్రహించుటకుగాని సాధ్యము లేక పోయినది. ఏమన గంజాయి త్రాగువారు దానిని విడిచియుండుట, చాలా కష్టము. విడువక మహాత్ములయొద్ద నివసించుటకు సాధ్యము గాదు. ఈ విషయములో నాకు చాలా అనుభవము గలదు. మరియు గంజాయిత్రాగు సమయమున కొంత సుఖముండునని చెప్పుమాట నిజముకాని ఆ సుఖమెట్లు గలిగినదని విచారముచేయక యుండుటయే దీనియందు గల అపాయము. అనగా

పత్రియందుండు సుఖము తానా ? లేక, పత్రిత్రాగుచుండు సుఖమును అనుభవించుచుండు వాడు తానా ? అని విమర్శించినచో వస్తుతత్త్వము వెలివడును. గంజాయి యందుండు సుఖము ననుభవించేవాడు తానని చెప్పుటకు వీలు అగును. అట్లు చెప్పినచో ఆత్మయగు తాను మహాదుఃఖి యనియు, నశ్వరమగు దృశ్యము సుఖమనుటయు సిద్ధించును. అప్పుడు అశాశ్వత మగు ప్రపంచము శాశ్వతమనుటయు, శాశ్వతమైన బ్రహ్మ అనిత్యమనుటయు తటస్థించును. అప్పుడు 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అను శ్రుతి కనర్థము గలుగును. మరియు, ఆత్మ సుఖదుఃఖాది వికార రహితుడు, వికారిత్వము ప్రకృతి సంబంధము వికారిత్వాది దోష మాత్మకు వచ్చినచో వికార గుణముగల ఘటమువలె, ఆత్మయున్ను నష్టమగును. ఇది గొప్ప అపచారమునకు తీసుకొనిపోవును. మనస్సంబంధ సుఖముగూడ ఆనందమయ కోశమున జేరినది. ఆనందమయకోశము 5వ కోశము, కోశమనగా కత్తికి ఒరవంటిది. ఈ కోశము గూడా దాటినవాడే ముక్తుడగును. అప్పటికి కోశము లన్నియు దృశ్యములున్ను, తానుమాత్రము దృక్కుగా నిలుచును. మనోమయ కోశములో బ్రహ్మనిష్ఠుడు ప్రవేశించి, విజ్ఞానమయ కోశము దాటుటకు మధ్యనుండు కాలములో మనశ్చంచలత అధికముగా గలుగును. ఈ మనోమయ కోశము దాటినపిమ్మట మనచేతియందుండు కర్రవలె మనస్సు ఎచ్చట పెట్టిన అచ్చటనే నిలుచునట్లు స్థిరపడును. గంజాయి త్రాగి మనోనిరోధము గలదని చెప్పువారు ఇకను మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములను దాటవలెను. అప్పుడే ఆత్మస్వరూపానుభవము గలుగును. దానికి గంజాయి, మహా ప్రతిబంధము. గంజాయి ఈ మనోమయకోశమందే త్రిప్పును. ఈ విషయ మీగ్రంథములో మనోనిగ్రహమున గనందగును. గంజాయిత్రాగుట వలన గలుగు మత్తుచే మనస్సు కొంతసేపు స్పందించును. అప్పుడు ప్రత్యగాత్మ ప్రతిబింబము దానిలో స్వల్పము ప్రకాశించును. అప్పుడు గలుగు ఆనందమే వీరు సుఖమని చెప్పుచున్నారు. ఇది చంచలతలేని నీటిలో గనుపించు సూర్యుని ప్రతిబింబమేగాని, నిజమగు సూర్యుడు గాడు. మరియు సుఖమును రెండు భాగములుగా మహర్షులు విభాగించిరి. వాటికి నిరాలంబసుఖమనియు, సాలంబసుఖమనియు పేర్లు.

నిరాలంబసుఖమనగా దేనితోను సంబంధములేని స్వస్వరూపమగు ఆత్మసుఖము. సాలంబసుఖమనగా ఒక్కవస్తువు నవలంబించి కలిగెడి ఇంద్రియములద్వారా కలుగు సుఖము. ఈ సుఖమునందు చేరినదే గంజాయి సుఖము గూడా, కనుకనే ప్రకృతివలె వికృతి గంజాయి ద్రాగువారికి గూడ గనుపించుట. దీనిని త్రాగువారికి ఒకప్పుడున్న బుద్ధి మరి యొకప్పు డుండకుండుటయే గాక చేయవలసిన పని సకాలములో చేయుట కడ్డుపడును.

**నిరాలంబం సమాశ్రిత్య సాలంబం విజహాతి యః ।**
**స సన్న్యాసీ చ యోగీ చ కైవల్యం పదమశ్నుతే ॥**

ఏ బ్రహ్మనిష్ఠుడు నిరాలంబసుఖమగు ఆత్మనిష్ఠను చక్కగ ఆశ్రయించి, సాలంబ సుఖములను( మనోమయాది ఇంద్రియ సుఖములను) విడుచునో వాడే సన్న్యాసియు, వాడే యోగియు, వాడు మాత్రమే కైవల్యపదమగు ముక్తి ననుభవించును అని నిరాలంబోపనిషత్.

**మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ॥**

ఓ అర్జునా ! పంచతన్మాత్రలవలన బుట్టిన శ్రోత్రాది యింద్రియముల యొక్క శబ్దాది విషయసంయోగములో శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము మొదలగు ద్వంద్వములను గలుగజేయునవి వచ్చుచు బోవుచున్నవి. కావున అవి అనిత్యములు. కాన సహింపుము అనగా త్యజింపుము.

**యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ ।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥**

ఓ పురుష శ్రేష్ఠుడవగు అర్జునా ! పై నుదాహరించిన మాత్రా స్పర్శాదులున్ను, సుఖదుఃఖాది ద్వంద్వములున్ను, సమానముగా జయించినవాడైన ఏ పురుషుని జలింపజేయలేవో వాడు ముక్తిని పొందును. అనగా ఇంద్రియములు ఆత్మనిష్ఠయందుండు ఎవనిని చలింప జేయకుండునో వాడే ముక్తుడని భావము.

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

ప్రపంచములో నుండు శబ్దాది విషయములందు ఆశ లేని మనస్సు గలవాడు మనోనిరోధముచే తన అంతఃకరణమందు ఏ యొక్క ఆత్మ సుఖమును బొందునో అట్టి బ్రహ్మసమాధియం దైక్యము నొందినవాడు నాశరహితమైన చిత్తోపరతిని పొంది సుఖించుచున్నాడు.

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।**
**ఆద్యంతవంతః కౌంతేయ ! న తేషు రమతే బుధః ॥**

ఓ అర్జునా ! విషయములయం దింద్రియములు ప్రవర్తించుట వల్ల గలుగు సుఖములు ఏవిగలవో అవియన్నియున్ను దుఃఖములకు హేతువు లగుచున్నవి. ఏలన అవి ఆరంభమున్ను, సమాప్తియున్ను గలవి. అనగా స్వల్ప సమయము వరకు సుఖముగా నుండిన తరువాత గొప్పదుఃఖమును దెచ్చి ముందు పెట్టును. కాబట్టి వానియందు వాస్తవ మెరింగిన బుద్ధిమంతులు ప్రీతిపడరు. అనగా స్వల్పకాలముండి మరల నశించువస్తువులలో బుద్ధిమంతులు ప్రవర్తింపరు అని శ్రీ భగవద్వచనము.

**సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్।**
**అనంతం బ్రహ్మనిష్ఠానాం ఇతి వేదాంతడిండిమః ॥**

గంజాయి మొదలగు విషయములచే గలుగు సుఖము అత్యల్పము. తరువాత అది నశించునపుడు గలుగు దుఃఖము చాలాగొప్పది. బ్రహ్మనిష్ఠులు తనయందు గలుగు సుఖ మనుభవించుటచే అది అనంతము. ఏమన, అది రాకపోకలు లేనిదగును. అది స్వయమే సుఖాకారము గలిగినది అని శ్రీ శంకరాచార్యులవారు ఆనతిచ్చిరి.

**త్యక్త్వాత్మానం సదానందం విషయాన్ యస్తు సేవతే।**
**పిపాసార్థం సుధాం త్యక్త్వా గరళం పాతుమిచ్ఛతి ॥**

ఎవడు సదా ఆనందమైన ఆత్మధ్యానసుఖమును విడిచి ఇంద్రియాది సుఖములను సేవించునో, వాడు దాహశమనము కొఱకు తనవద్దనుండు అమృతమును పారవేసి విషము సుఖముగా నుండునని తలంచి త్రాగు మూఢునివంటివాడు.

గౌడీ తాడీ చ ఖర్జూరీ పౌస్తికీ విజయా జయా।
షడేతే మదిరాః ప్రోక్తాః॥

బెల్లముచే చేయబడిన సారాయి, తాటికల్లు, ఈతకల్లు, నల్లమందు, గంజాయి, పొగాకు ఇవి ఆరున్ను లాహిరి వస్తువులలో చేరినవి. కనుక బుద్ధిమంతులైన వారు సర్వదా విడువందగినవి అని వైశ్వానర స్మృతి. ఈ గంజాయి త్రాగువారిలో కూడ గొప్ప మహాత్ము లుందురు గాని నిండా అరుదు. మహనీయులుగా నున్నవారు ఒక్కరిని ఏమి అడుగరు. వారిని తెలియక దూషణము జేసినచో గొప్ప పాపము గలుగును. కాని అట్లున్నవారు గంజాయి మోక్షసాధనమని చెప్పరు. మరియేమన ఇదియొక దురభ్యాసము. చిన్నకాలమందుండి శీలించినదని చెప్పుదురు.

ప్రశ్న॥ అయ్యా! గంజాయి యందు సారము లేనిచో ఎంతో బుద్ధిమంతులగు జనులు త్రాగుదురా ?

ఉత్తరము॥ సరే, పత్రి త్రాగువారికన్న ఇంటిలో ఆడువాళ్లను పిల్లలను పస్తుపెట్టి మానము పోగొట్టి డబ్బు వ్యయము చేసి, శరీరమునకు రోగము తెచ్చి, వీథిలో దెబ్బతిని, ఇంటిలో నీరుత్రాగు పాత్రముగూడ అమ్మివేసి కల్లుత్రాగువారు ఎన్నియోరెట్లు అధికముగా గలరు. అప్పుడు గంజాయి త్రాగువారికన్న, వీరే బుద్ధిమంతులని చెప్పరాదా! సారాయి సారమధికమని చెప్పవచ్చునే. కనుకనే గాబోలు, గంజాయి ఒకతులము ఒక రూపాయికి అమ్ముచున్నది. కనుకనే గవర్నమెంటు ఇంత నిర్బంధము దినదినమునకు ఎక్కువగా జేయుచున్నారు. అయ్యో! మనవారెంత బుద్ధిహీనులు. చైనాదేశస్థులు ఆదికాలమున ప్రసిద్ధినొందిన బుద్ధిమంతులు. నల్లమందు తిని తిని క్రమముగా బుద్ధిహీనులై చిన్నస్థితికి వచ్చిరి. అప్పుడు గొప్పగొప్ప డాక్టర్లు నల్లమందు బుద్ధిమాంద్యమని కనిపెట్టి చైనాదేశమం దమ్మకూడదని ఏర్పాటు చేసిరి. ఈ సంగతి ఇంగ్లీషు చదివినవారికి తెలియును. ఆలాగున రెండు సంవత్సరములుగా అమెరికా దేశమున మత్తువస్తువు లేమియున్ను ఉత్పత్తిచేయ రాదనియు అమ్మరాదనియు అమెరికారాష్ట్రపు గవర్నమెంటు వారేర్పాటుచేసిరి. అనగా కల్లు, సారాయి, అభిని, గంజాయి వగైరా లాహిరి వస్తువు లేవియును, అమెరికా

రాజ్యమంతయును ఉపయోగింపకూడదని నిలుపుదలచేసిరి. అయ్యో ! మనదేశ మంత పావనమగు స్థితికెప్పుడు వచ్చును. నాయనా! సాధారణ జనులు, గతానుగతికులు, విచారము చేయరు. గంజాయిచే సమయము ఎంతో వ్యర్థమైపోవుచున్నది. సమయము వ్యర్థము చేయక జాగ్రత్త వహించుటయే వైరాగ్యము గాని గృహము వదలి వ్యర్థముగా తిరుగుట వైరాగ్యమున్ను, సన్న్యాసమున్ను గానేరదు. ఒక్క నిమిషము వ్యర్థమై పోవునప్పుడు దుఃఖము కలిగినవానికి మోక్షము సమీపముగా నున్నదని గ్రహింపుడు.

**గతానుగతికో లోకో న లోకః పారమార్థికః ।**
**సేతౌ సైకతలింగేన వినష్టం తామ్రభాజనమ్ ॥**

ఒకానొకప్పుడు గ్రహణకాలమున సేతుస్నానము కొరకు అనేకులు వెళ్లుచుండిరి. అప్పుడు వారికన్న కొంచెము ముందుగా ఒక మహాత్ముడగు యతీశ్వరుడు పోవుచుండెను. ఆ సన్న్యాసి చేతిలో ఒక రాగి కమండల ముండెను. తాను స్నానము చేయు సమయమందు పాత్రనెవరైన దీసికొని పోయెదరని సంశయించి గుండము త్రవ్వి దానిలో పాత్రనుంచి స్థలము గురుతు కనుగొనుటకై దానిపై కొంత ఇసుకమట్టి ముద్దగాపెట్టి సముద్ర మందు అతడు స్నానము చేయుచుండెను. వీరి వెనుక వచ్చెడిజనులు ఈ సన్న్యాసి మట్టిని కుప్పగా చేయుట చూచిరేగానిపాత్రనుంచుట చూడలేదు. అప్పుడు తరువాత వచ్చేవారందరున్ను, ఈ మహాత్ముడు ఇసుకచే శివలింగ ప్రతిష్ఠ చేసి స్నానము చేయుచున్నాడని ఊహించుకొని ఒక్కొక్కరున్ను మట్టి ముద్ద చేసి పెట్టి స్నానము చేయుచుండిరి. వారందరును ఈలాగున విచారము చేసిరి. ఈ మహాత్ముడు గొప్ప యతీశ్వరుడు. వీరు గ్రహణ సమయమున మృత్తికా శివలింగ ప్రతిష్ఠచేసి స్నానము చేయుటలో ఏదో గొప్ప ఫలమున్నది. శ్రీరాములు గూడ ఇసుకచేతనే గదా శివలింగ ప్రతిష్ఠ రామేశ్వర మందు చేసిరని తలంచిరి. సన్న్యాసి స్నానము చేసి వచ్చిన తరువాత పాత్రము పెట్టిన గురుతు చూచునపుడు ఎచట చూచినను అదేమాదిరి మట్టిముద్దలు కనిపించుటచే పాత్రము దొరకక పోయినది. కనుక సన్న్యాసి ఏ యుద్దేశముతో మట్టిముద్ద చేసి పెట్టెనని జను లూహింపక పోయిరి. ఇప్పుడు

గంజాయి స్థితియు ఆ రీతిగానే యైనది. కనుక భంగి పత్రి త్రాగుటచే సారముండుననియు, వారు బుద్ధిమంతులని తలంచుటయు బుద్ధిహీనత.

ప్రశ్న ॥ అయ్యా స్వామీ ! గంజాయి మొదలగు మత్తువస్తువుల నుపయోగించువారు బుద్ధిమంతులు కాదని సెలవిస్తిరే. వీరిలో కొందరు ఇంగ్లీషు, సంస్కృతము, హిందూస్థాని, తెలుగు, అరవము మొదలైన భాషలలో వివాదము చేయుచున్నారే! వారు మహనీయులు గాని యెడల ఇంత విద్వత్తు ఎట్లు గలుగును?

ఉత్తరము ॥ అనేక భాషలయందు నైపుణ్యముండినను శమదమాది గుణములు లేనియెడల జ్ఞానమెట్లు గలుగును ? ''పోనోగ్రాఫ్ పెట్టె'' ఇంగ్లీషు, హిందూస్థాని, సంస్కృతము, కేరళము మొదలైన అనేకభాషలలో నానావిధములుగా సంగీత స్వరములతో పాడుచున్నది. కాబట్టి ఆ పెట్టె యెంత గొప్ప జ్ఞాని యని చెప్పవచ్చును. దానికి ఎంత ఈశ్వర ప్రసాదముండవచ్చునని తలపవచ్చును. కనుకనే మహాత్ములు శమ దమాది గుణములు లేనివారికి శాస్త్ర పాండిత్యముండినను నిష్ప్రయోజనమని ఖండించిరి.

**వాగ్వైఖరీ శబ్దఝురీ శాస్త్రవ్యాఖ్యాన కౌశలమ్ ।**
**వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే ॥**

శాస్త్రజ్ఞానము మాత్రము గల పండితులయొక్క వాగ్వైఖరియు, కవితా ప్రయోగశక్తియు, శాస్త్రమునకు టీక, తాత్పర్యరచనా కౌశలమున్ను మహావిద్వత్తున్ను భుక్తికొరకే గాని ముక్తికొఱకు కానేరదు.

**శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణమ్ ।**
**అతః ప్రయత్నాజ్జ్ఞాతవ్యం తత్త్వజ్ఞాత్తత్త్వమాత్మనః ॥**

శాస్త్రసమూహము మనశ్చాంచల్యమునకు కారణమైన గొప్ప అరణ్యము వంటిది. అనగా మహారణ్యమందు చిక్కువడిన వానికి భ్రమచే దిక్కు దెలియక కష్టపడురీతిగా శాస్త్రారణ్యమందు జ్ఞాన మార్గము దెలియక కష్టపడడమని తాత్పర్యము.

ఇదియును గాక శబ్దజాలమని చెప్పిరి. జాలమనగా మత్స్యములను బట్టె

వలకు పేరు. వలయందు జిక్కిన చేప దానినుండి విడివడక మరణము పొందునట్లు, శాస్త్రమను వలయందు జిక్కి అహంకారులై జనన మరణములను కష్టమునకు పాత్రులగుదురు. మరియొక అర్థము జాలమనగా, గారడివాని విద్యకుపేరు. గారడివాని విద్యను చూచునప్పుడు బహుచిత్రముగా నుండినను కడకు ఏమియు లేకుండునట్లు శాస్త్రము మాత్రము చదివినవారికి జ్ఞానము లేనియెడల నిష్ప్రయోజనము. కాబట్టి ప్రయత్నముచే తత్త్వవేత్తయైన వాని నాశ్రయించి తన ఆత్మతత్త్వ మెఱుంగుటకై బుద్ధిమంతులు యత్నము చేయవ లయును. మోక్షము కోరు వారికి శాస్త్రమంత అత్యావశ్యకము కాదు. గుణములు మాత్రము బాగుగా నుండవలయును. రోగియైనవాడు, వైద్యశాస్త్రమంతయు చదువనక్కర లేదు. మంచి వైద్యుని ఆశ్రయించి ఔషధము పథ్యముతో సేవించిన యెడల రోగము బాగగును. ఆలాగుననే, అజ్ఞాన మహారోగపీడితుడై నవాడు భవవైద్యుడైన జ్ఞానిని ఆశ్రయించి వారిచే ఉపదేశింపబడిన ప్రకారము ధ్యానము చేసి భక్తివైరాగ్యము లను పథ్యముతో నుండిన యెడల నిత్యసౌఖ్యమను మోక్షము పొందవచ్చును అని వివేక చూడామణి.

**ఆలోచ్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణి సర్వదా ।**
**యోఽహం బ్రహ్మ న జానాతి దర్వీ పాకరసం యథా ॥**

ఎవడు నాలుగు వేదములను, ఆరు శాస్త్రములను, మన్వాది సర్వధర్మశాస్త్ర స్మృతులున్ను పునః పునః చదివి చదివి దాని అర్థము వివరించినను పరమాత్మను ఎరుగనియెడల అనేక పదార్థముల యందు త్రిప్పుచుండెడి గరిటె వాని రుచి నెట్లు తెలియ జాలకున్నదో వీని స్థితియు ఆ గరిటెవలె నుండును.

**యథా ఖరశ్చందనభారవాహీ భారస్య వేత్తా న తు చందనస్య ।**
**తథైవ శాస్త్రాణి బహూన్యధీత్య సారం న జానన్ ఖరవ ద్వహేత్ సః ॥**

ఎట్లు గాడిదె తనవీపుమీద సుగంధమైన చందనము, కస్తూరి, కుంకుమపువ్వు, అత్తరు, పన్నీరు మొదలైనవి మోయుచుండినను వాటియందుండు గుణము దాని కేలాగున తెలియదో, ఆలాగుననే బహువిధములైన అనేక శాస్త్రములు చదివినను సారమైన ఆత్మజ్ఞానము పొందనియెడల వీడున్ను గార్దభమునకు సమానుడే.

**యథాఽమృతేన తృప్తస్య పయసా కిం ప్రయోజనమ్।**
**ఏవం తం పరమం జ్ఞాత్వా వేదే నాస్తి ప్రయోజనమ్॥**

అమృతముచే తృప్తుడైనవాని కెట్లు నీళ్ళచే ప్రయోజనము లేక యుండునో, ఆలాగున పరమమైన పరమాత్మను గురుకృపచే పొందినవానికి వేదశాస్త్రములు నిష్ప్రయోజనములు. ఇట్లు తన భక్తులయందు దయగలిగి కరుణామూర్తియైన శ్రీ కృష్ణపరమాత్మ శాస్త్రజ్ఞానము లేని మహనీయులను వారి అనుభవమునకు విరోధముగా శాస్త్ర గర్వితులు తిరస్కరించునపుడు భయపడకుండుటకై ఉత్తర గీతయందు చెప్పిరి.



## కుయోగుల శిష్యవర్గము

ప్రశ్న ॥ అయ్యా ! ఇప్పుడున్న మధుమాంసముల భుజించు వేదాంతులకు అనేకమంది శిష్యులు పరిచర్య చేయుచున్నారే, వీరు మహనీయులు గాని యెడల ఇంతమంది శిష్యులు ఏలాగు చేరుదురు ?

ఉత్తరము ॥ శిష్యులచే ఒకరు గొప్పవారని చెప్పుటకు వీలులేదు. ఆది కాలమందున్న దొంగల దొరలకున్ను, అనేకులు శిష్యులు ఉన్నట్లు గన్పట్టు చున్నది. కనుక మోక్షమునకు భక్తి అత్యావశ్యకమై యుండవలయును. తైలము లేక దీపమెట్లు ఉండదో, పుష్పము లేక ఫలమెట్లు గలుగదో, ఆలాగుననే పవిత్ర హృదయ మను ప్రమిదె యందు భక్తియను, తైలము నిండుగా ఉన్నవారికి మాత్రము అజ్ఞానాంధకార నాశకమైన పరంజ్యోతి యను జ్ఞానదీపము ప్రకాశించును. ఆలాగుననే భక్తి యను సుగంధపుష్పము లేనియెడల శాశ్వతానంద జ్ఞానఫలము కలుగదు. కనుక అనన్యమైన దైవభక్తితో నుండుము.



## భక్తి లక్షణము

ప్రశ్న ॥ భక్తియనగా ఏమి ? అది ఎన్ని విధములు ? దానియందెట్లుండ వలయును ? దానిని విశదముగా తెలుపుము మహాత్మా !

ఉత్తరము ॥ ఓ ఆర్యోత్తమా ! ఈ భక్తియే మహాగొప్ప వస్తువు. దీనికి సమమై పవిత్రమైన వస్తువు ముల్లోకములయందును లేదు. ఈ భక్తి జగదీశ్వరునియందు అధికమైన ప్రీతిగలవానికి మాత్రము గలుగును. తదితరులకు సిద్ధింపదు. ఈ నిర్మలభక్తిచే శ్రీ నారదోద్ధవ, వ్యాస, శుక, సనక, సనందన, సనత్కుమారాది ఋషిపుంగవులును, శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యాది మహాత్ములును, ప్రహ్లాద, హనుమ దాది భక్తాగ్రేసరులును మోక్షమును పొందిరి. ఇదికాక శ్రీ శఠకోపాది వైష్ణవభక్తులును, శ్రీ సుందరమూర్తి మాణిక్య వాచకాది శివభక్తి ధురంధరులును పరమపదమను శాశ్వత సుఖమును పొందిరి. భక్తియనగా ''అనురక్తిః పరే తత్త్వే భక్తిరిత్యభిధీయతే'' అనగా పరమైన పరమాత్మయందు అమితమైన ప్రీతి భక్తియనంబడును. '' మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'' అని శ్రీ శంకరభగవత్ పాదాచార్యులు చెప్పియున్నారు. అనగా మోక్షమునకుండు అనేక సాధనములలో భక్తి ముఖ్యమైనది అని అర్థము. ఈ భక్తి నవవిధములై భాగవతాది పురాణముల యందు గనుపట్టుచున్నది.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥**

1. శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4. పాదసేవనము, 5. అర్చనము, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మనివేదనము అని నవవిధములు
   1. శ్రవణమనగా అనంత కల్యాణగుణ పరిపూర్ణులై భక్తకోటుల సంరక్షణార్థమై యవతరించిన శ్రీ రామకృష్ణాది దయామూర్తుల దివ్యకథలు వినుట.
2. కీర్తనమనగా, ఆ దయామూర్తులైన వారిని స్తోత్రము చేయుట. (భజనచేయుట)
3. స్మరణమనగా, ఆ పరమ పురుషుని హృదయమందు నిలిపి తదేక ధ్యానమందుండుట.
4. పాదసేవనమనగా, భగవత్ పూజాదుల కొఱకు పూలతోటలు పెట్టుట, కైంకర్యము చేయుట, దేవాలయమునకు వెళ్ళుట.
5. అర్చనమనగా, భగవద్విగ్రహమును తులస్యాది పత్ర పుష్పము లతో అర్చించుట.

6. వందనమనగా, సాష్టాంగ దండ ప్రణామము లాచరించుట.
7. దాస్యమనగా, భగవత్ ప్రీతి కొఱకు పనులు చేయుట, నీవే రక్షకుడవు, తల్లి తండ్రి గురువు దైవము నీవే యని నిశ్చయించుట.
8. సఖ్యమనగా, భగవంతుని ప్రాణముతో సమానముగా స్నేహించుట.
9. ఆత్మనివేదనమనగా, తన శరీర ప్రాణేంద్రియములను సర్వమున్ను భగవంతునికి అర్పించుట, లేక ధ్యానమందున్నప్పుడు సర్వేంద్రియములు భగవంతుని యందు లీనమై తన్ను తాను మరచి తన్మయుడై యుండుట.

శ్రవణమువలన పరీక్షి ద్రాజును, కీర్తనమువలన శ్రీ నారదమహర్షియు స్మరణమువలన శ్రీ శుకబ్రహ్మర్షియు, పాదసేవనము వలన శ్రీ లక్ష్మణ స్వామియు, అర్చనమువల్ల పృథుచక్రవర్తియు, వందనము వల్ల అక్రూరుడును, దాస్యమువలన గరుడ హనుమదాదులును, సఖ్యమువలన అర్జునుడును, ఆత్మనివేదనముచే శ్రీ బలిచక్రవర్తియు పరమపద మను మోక్షమును బొందిరి. ఇంకను అనేకకోట్ల మహాత్ములు భక్తిచే సుఖముగా పరమపదము పొందిరి. శ్రీ కబీరుదాస్, శ్రీరామదాస్, తుకారామస్వామి, ఘోరాకుంభార్, కణ్ణప్పనాయనారు మొదలగు మహాత్ములు భక్తిచే మోక్షము పొందిరి. ఈ భక్తి శ్రీ నారద భక్తిసూత్రమందు పదునొకండు విధములుగా చెప్పబడినది.

**సూత్రము॥ 82. గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతా సక్త్యాత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి రూపా ఏకధాఽప్యేకాదశధా భవతి ॥**

భక్తి ఒకటియైనను అది పదునొకండు విధములు గలదిగా నున్నది. 1. భగవంతుని దివ్యకథలను వినుటయందు ప్రీతి, 2. భగవంతుని దివ్యావతారములను దర్శించుటయందు ప్రీతి, 3. భగవంతుని పూజించుట యందు ప్రీతి, 4. భగవంతుని స్మరించుటయందు ప్రీతి, 5. భగవంతునికి కైంకర్యము చేయుటయందు ప్రీతి, 6. భగవంతునియందు స్నేహభావముంచుట యందు ప్రీతి, 7. భగవంతుని యందు వాత్సల్యముంచుట యందు ప్రీతి, 8. భగవంతుని నాయకునిగా దలంచి భక్తుడు నాయికిగా సేవచేయుట యందు ప్రీతి, 9. సర్వమును భగవంతునికి సమర్పించుట యందు ప్రీతి,

10. భగవత్స్వరూపము నందు లీనమగుటకు సర్వదా ధ్యానించుటయందు ప్రీతి, 11. ఎప్పుడా భగవంతునితో గూడియుందునా యనెడి అత్యంత మమతతో తదేక చింతతో నుండుటయందు ప్రీతి, అనగా ఎప్పుడెప్పుడు ఆ దివ్య పురుషునితో గూడి విహరింతునో యని సర్వదా నిరీక్షించుచుండుట. భాగవతమునందు చెప్పిన నవవిధ భక్తికంటె దీనియందలి పదునొకండగు భక్తి మహాశ్రేష్ఠమైనది. దీనిని ఏకాంతభక్తియనియు, అనన్య భక్తియనియు గీత చెప్పుచున్నది. ఈ రెండును కడు దుర్లభములు. వీరే నిజమైన పరమభక్తులు. వీరివద్ద శ్రీ కరుణామూర్తియగు భగవంతుడు సర్వదా యుండును. దూడ పోవు దారిని గోవు వెళ్ళునట్లు భక్తుల వెంటనే భగవంతుడు తిరుగుచుండును. ఈ భక్తి గీతయందు చతుర్విధములుగా చెప్పబడియున్నది.

చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

ఓ అర్జునా ! ఆర్తుడును, (రోగముచేతను, దారిద్ర్యము చేతను భజించువాడు) జిజ్ఞాసువును, (ఆత్మజ్ఞాన సిద్ధికొఱకు భజించువాడు) అర్థము గోరువాడును, నా తత్త్వమును నిజముగా తెలియుటకు ధ్యానము చేయువాడును (ధర్మార్థ కామములను పురుషార్థత్రయమును వర్జించి పరమ పురుషార్థమైన మోక్షమును మాత్రము గోరువాడు). వీరు నలుగురున్ను పుణ్యాత్ములే. సంశయము లేదు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥

పైన చెప్పిన నలుగురు భక్తులలో జ్ఞానియైనవాడు మిక్కిలి శ్రేష్ఠుడు. ఎందువల్ల ననగా నేను జ్ఞానికి ఆత్మనగుటవలన మిక్కిలి ప్రియుడను, అట్లు, నాకును జ్ఞాని యాత్మయగుట వలన ప్రియుడు. ఈ భక్తి మార్గమున వేలకొలది మనుజులలో ఒకరికి మాత్రము పుణ్యవశము వలన ప్రయత్నించుటకు బుద్ధిగలుగును. అట్లు బుద్ధి గలిగిన అనేకులలో ఒకరుమాత్రము దానిపై నిజముగా పాటుపడుదురు. అట్లు పాటుపడు అనేకులలో ఒకరికి మాత్రము భక్తివైరాగ్యాది

ధ్యానయోగము కుదురును. అట్లు ధ్యానమందు స్థిరత్వము గలిగిన వారిలో ఒకరికి మాత్రము పరమపద మందును. ఎట్లనగా, అనేక జనసంఖ్యలలో ఒకడు మాత్రము చదువుటకై ప్రయత్నించును. అట్లు చదువుచున్న అనేకులలో కొందరు మాత్రము హై స్కూలులో చదువుటకు ప్రయత్నింతురు. హైస్కూలులో చదువు జనసంఖ్యలో కాలేజీలో చదువువారు చాలాతక్కువగా నుందురు. దానికంటె ఎక్కువ క్లాసు చదువువారు మిక్కిలి యరుదు. తద్వత్తుగా ముముక్షువులలో ముక్తులు బహు అరుదై ఉందురు. సర్వసంగత్యాగము గలుగక మోక్షము సిద్ధింపదని ముమ్మాటికిని నమ్ముడు.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

వేలకొలది మనుష్యులలో ఒకానొకడు మోక్షసిద్ధికై ప్రయత్నించును. అట్లు ప్రయత్నించువారియం దనేకులలో ఒకడు మాత్రము నిజమైన వైరాగ్య భక్తితో గూడియుండును. అట్లున్న వారనేకులలో ఒకడు మాత్రము పరమాత్మను ఎరింగి ముక్తుడగును. ఈలాగున కఠవల్ల్యుపనిషత్తునందు కూడా చెప్పియున్నది. భక్తి ఒక్క దానిచే మాత్రము శాశ్వతానంద మోక్షము పొందవచ్చునే కాని మరియొక దానిచే సాధ్యము కాదని గీతాభిప్రాయము.

**నాహం వేదైర్నతపసా న దానేన న చేజ్యయా ।**
**శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥**

**భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున !**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

ఓ అర్జునా ! నీవు ఇప్పుడు చూచు నాయొక్క దివ్యదర్శనము సమస్త వేదశాస్త్రములు చదువుటచే గాని, తపస్సుచే గాని, అనేక విధ దానముల చేతను, అశ్వమేధాది యజ్ఞములచేతను, భక్తిలేనియెడల ఎవరికిని సాధ్యము గాదు. ఓపరంతపా ! నా యొక్క యథార్థస్థితి తెలిసికొనుటకు గాని, ఇట్టి దివ్య రూపముగల విశ్వరూపము దర్శించుటకుగాని, నాలో ఐక్యమగుటకుగాని అనన్యభక్తి యొకటితప్ప తదితరములైన మార్గములచేత సాధ్యము కాదు.

**ఎన్నియెన్ని పూజ లెన్ని జేసిన నేమి**
**భక్తిలేనిపూజ ఫలము లేదు,**
**భక్తి కల్గుపూజ బహుళ కారణమురా**
**విశ్వదాభిరామ వినుర వేమ !**

ఈ భక్తిలక్షణము శ్రీ నారదభక్తి సూత్రములో జెప్పినది కొంచెము ఇక్కడ వ్రాయబడినది.

**అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా ॥ (సూ-10)**

ఆత్మధ్యానమునకు విరోధమైన సమస్త విషయములను విడచి తదేక ధ్యానమందుండుటయే అనన్యభక్తి యనబడును.

**సా త్వస్మిన్ పరమప్రేమరూపా ॥ (సూ-2)**

ఆభక్తి భగవంతుని యందు పరమైన ప్రేమరూపమై యున్నది.

**అమృత స్వరూపా చ ॥ (సూ - 3)**

ఆ భక్తి అమృత స్వరూపముగా నున్నది. అనగా భక్తి యొకటే జనన మరణ ములను దుఃఖములనుండి తొలగించి అమృతమైన మోక్షమును ఇచ్చునది.

**యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవత్యమృతో భవతి తృప్తో భవతి ॥ (సూ-4)**

దేనిని పొంది పురుషుండు సర్వసిద్ధి గలవాడగునో, అమృతమైన ముక్తిపొందునో, సంపూర్ణ తృప్తుడగునో, అదే భక్తి యనంబడును.

**యత్ప్రాప్య,న కించిద్వాఞ్ఛతి, న శోచతి, న ద్వేష్టి, న రమతే, నోత్సాహీ భవతి ॥ (సూ-5)**

ఏ భక్తిని పొందిన పిమ్మట తదితరమేమియు గోరడో, ఎంత దుఃఖము వచ్చినను శోకింపడో, ఎవరియందును ద్వేషముండదో, ఆత్మారాముడౌటచే ఇతర విషయములందు రమింపడో, ఏ యొక్క పనియును చేయుటకు ప్రయత్నింపడో ఇదే పరమ భక్తుని యొక్క లక్షణము.

**తత్తు విషయత్యాగాత్సంగత్యాగాచ్చ ॥ (సూ-35)**

ఆ భక్తి విషయ త్యాగముచేతను, దుర్జన సంసర్గ విసర్జన చేతను గలుగును.

**కస్తరతి కస్తరతి మాయాం యః సంగాం స్త్యజతి,**
**యో మహానుభావం సేవతే, నిర్మమో భవతి ॥ (సూ-46)**

ఎవడు మాయను దాటునో, వాడు సర్వదుఃఖములనుండి విడి వడగలడు. ఎవడు మహాత్ములకు శుశ్రూషచేయునో, వాడు సకలమైన సంసార బంధములనుండి విముక్తుడగును.

**స తరతి, స తరతి, స లోకాంస్తారయతి ॥ (సూ-50)**

ఎవడు మాయ యను సంసారసాగరమును భగవచ్చరణారవింద భక్తియను నావచే దాటునో, వాడే దాటును. వాడు మఱియు లోకమందున్న సమస్త ముముక్షువులను దాటించును.

**అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్ ॥ (సూ-51)**

ప్రేమయను భక్తియొక్క స్వరూపము ఇట్టిదని చెప్పుట కలవి కానిది. అది పలువిధములగు బాహ్యలక్షణములతో గూడియుండును. భగవంతుడు ప్రేమస్వరూపుడు. ఆ ప్రభువు యొక్క ప్రేమ అనిర్వచనీయమైయున్నది. భక్తజన సంరక్షణ కంకణధారి భగవంతుడు.

**స్త్రీ ధననాస్తిక చరిత్రం న శ్రవణీయమ్ ॥ (సూ-63)**

ఈ భక్తులు స్త్రీ విషయమైన మాటలను, ధనసంపాదనమైన వచనములను, నిరీశ్వరవాదులయొక్క కుతర్కవచనములను విననేకూడదు. వినినంత మాత్రముచే భక్తికి హాని వచ్చును.

**నాస్తి తేషు జాతి, విద్యా, రూప, కుల, ధన, క్రియాదిభేదః ॥ (సూ-72)**

భగవద్భక్తిచేయుటకు జాతి, విద్య, రూపము, కులము, ధనము, కార్యములు మొదలైన భేదములు లేవు. (సర్వదా సర్వజనానుష్ఠేయము)

**అహింసాసత్యశౌచ దయాస్తికత్వాది చారిత్రాణి పరిపాలనీయాని ॥ (సూ–78)**

అహింస, సత్యము, బహిరంతరశుద్ధి, సమస్త జీవరాసులయందు గొప్ప దయ, గురుదైవములయందు విశ్వాసము మొదలైన విశిష్టచరిత్రములను భక్తులు సర్వదా రక్షించుటకై పాటుపడవలెను.

**తన్మయాః ॥ (సూ–70)**

భగవద్భక్తులు భగవత్ స్వరూపులై యున్నారు.

**కంఠావరోధ రోమాఞ్చాశ్రుభిః పరస్పరం లపమానాః పావయంతి కులాని పృథివీం చ ॥ (సూ–68)**

భగవంతుని దివ్యకథలను పరస్పరము ప్రశంసించునపుడు గద్గద స్వరమును, (డగ్గుత్తికయును), గగుర్పాటును, అనంద బాష్పములును గలుగు వారు తమవంశమును మరియు ప్రపంచమును పవిత్రము చేయుచున్నారు. ఇది ఉత్తమభక్తుని లక్షణము.

**యో వివిక్తస్థానం సేవతే, యో లోకబంధమున్మూలయతి**
**నిస్త్రైగుణ్యో భవతి, యో యోగక్షేమం త్యజతి ॥ (సూ–47)**

ఎవడు ఏకాంత స్థలమందుండునో, ఎవడు లోకముయొక్క బంధమును నిర్మూలనము చేయునో, ఎవడు సత్త్వరజస్తమములనుండి విడివడునో, ఎవడు తన యొక్క అశనవసనాదుల విషయమైన ఆశను వదలునో వాడు త్తమ భక్తుడని చెప్పబడును.

**తదేవ సాధ్యతాం తదేవ సాధ్యతామ్ ॥ (సూ–42)**

అట్లున్న మహనీయుల సహవాసము ప్రయత్నముచే సాధింపవలయును. ఆ సత్పురుషుల సహవాసము కష్టపడియైనను సంపాదింపవలయును.

**లభ్యతేఽపి తత్కృపయైవ ॥ (సూ–40)**

ఆ మహాత్ములు లభించడము భగవత్కృప లేనియెడల సాధ్యము కాదు. ఈలాటి సూత్రములు అనేకములు ఆ పవిత్రమైన గ్రంథమందు గలవు.

**నృణాం జన్మసహస్రేణ భక్తౌ ప్రీతిర్హి జాయతే ।**
**కలౌ భక్తిః కలౌ భక్తి ర్భక్త్యా కృష్ణః పురః స్థితః ॥**

జనులకు అనేక జన్మములందు చేసిన పుణ్యకర్మ పరిపాకముచేతనే దైవభక్తియందు ప్రీతిబుట్టును. కలియుగమందు భక్తియే గొప్పది. భక్తిచే సాక్షాత్ భగవంతుడు ప్రత్యక్షుడగును.

**న తపోభి ర్నవేదైశ్చ న జ్ఞానేనాపి కర్మణా ।**
**హర్హిర్హి సాధ్యతే భక్త్యా ప్రమాణం తత్ర గోపికాః ॥**

తపములచే గాని, వేదాధ్యయనములచే గాని, జ్ఞానముచే గాని, అనంతకర్మముచేగాని, హరిని పొందుటకు సాధ్యము కాదు. ఆ పరమాత్మను పొందుటకు భక్తి ఒకటియే కారణము. ఇందుకు పరమ పవిత్రలైన గోపికలే ప్రత్యక్ష ప్రమాణము.

**సత్యాది త్రియుగే బోధవైరాగ్యే ముక్తిసాధకే ।**
**కలౌ తు కేవలాభక్తి ర్బ్రహ్మసాయుజ్య కారిణీ ॥**

కృత, త్రేతా, ద్వాపర యుగములలో వైరాగ్య బోధోపరతులు మోక్షసాధనములు. కలియుగమందు కేవల భక్తి మాత్రము బ్రహ్మ సాయుజ్య కారిణియై యున్నది.

**యత్ఫలం నాస్తి తపసా న యోగేన సమాధినా ।**
**తత్ఫలం లభ్యతే సమ్యక్కలౌ కేశవకీర్తనాత్ ॥**

ఏ యొక్క మోక్షపదము, తపస్సుచేగాని, యోగసమాధిచేగాని, సాధించుటకు కష్టమైయుండునో, ఆ పదము కలియుగమందు భగవన్నామోచ్చారణముచే సులభముగా చేకూరును అని సన్న్యాస సంగ్రహము. భక్తి మార్గము, జ్ఞానమార్గము వేఱువేఱుగా తోచినను గమ్యస్థాన ముభయుల కొకటియే. ఎట్లనగా, ఒకరెండు రోడ్డు ముఖ ద్వారమునుండి ఒకరు కుడిభాగము తోను, ఎడమ భాగముతో ఒకరున్ను ప్రయాణ మారంభించినపుడు, ఉభయులకు మార్గములు మాత్రము వేరువేరుగా నుండినను ఇద్దరును ఒకటే స్థానమునకు చేరుదురు. ఇదియే భక్తిజ్ఞానముల యొక్క తారతమ్యము. భక్తులు ఈశ్వరునే ధ్యానించగా జీవత్వము

నశించి శివస్వరూపు లగుదురు. నది సముద్రమును సేవించి సముద్రమగు నట్లును, కీటకము, (పురుగు) భ్రమరమును భజించగా క్రిమిత్వము నశించి భ్రమర మగునట్లును, ఉప్పు జలమును ఆశ్రయించి జలమయమై పోవునట్లును భక్తుడు, జీవేశ్వర భేదముగా ధ్యానించినను పర్యవసానకాలమందు పరమాత్మయందు ఐక్యమై పోవుచున్నాడు (అనగా ద్వైతభావముతో ధ్యానించినను అద్వైతమగుచున్నది). ఇది సులభమార్గము.

## సగుణ నిర్గుణ ధ్యానవివరణము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! దీనిలో సగుణ ధ్యానము శ్రేష్ఠమా ? లేక నిర్గుణ ధ్యానము శ్రేష్ఠమా ? దీని సంశయము దయ యుంచి విశద పరపుము మహాత్మా!

ఉత్తరము ॥ ఓ బుధజన విధేయుడా ! ఈ భక్తి సగుణ మనియు, నిర్గుణ మనియు రెండు తరగతులు. సగుణ ధ్యానము లేనివానికి నిర్గుణ ధ్యానము సిద్ధింపదు. ధనుర్విద్యాభ్యాసము చేయువారు మొట్టమొదట సమీపమందు ఒక గురుతు పెట్టి దానియందు గురి నిలిపి అభ్యాసము పూర్తియైన తర్వాత గురి లేకయే యే యొక్క వస్తువును గాని భేదింప వచ్చును. కనుక అభ్యాసకాలమందు మనస్థైర్యము కొఱకై విగ్రహారాధన మత్యావశ్యకమని నిశ్చయించి మహనీయులైన ఋషిపుంగవులు జనోపకారార్థమై నియమించిరి. '' యద్భావం తద్భవతి '' అను రీతిగా విగ్రహాదులయందు భగవంతుడున్నాడని నిశ్చయించి అందు విశ్వాస భక్తి గలవారికి నిశ్చయముగా భగవంతుడు దానియందుండి వారి సర్వాభీష్టముల నొసంగును. మార్కండేయ మహాముని శివలింగమందు పరమేశ్వరు డున్నాడని నిశ్చయభక్తితో పూజించినపుడు వానియొక్క యమబాధ నివృత్తికొఱకు కరుణానిధియైన శ్రీ పరమేశ్వరుండు దాని నుండి ఆవిర్భవించి కాల సంహారము చేయలేదా? ఆ కారణముచే కాలాంతకుడని పరమేశ్వరునికి నామ మేర్పడినది. పరమభక్తులైన ప్రహ్లాదులవారికి స్తంభమందుకూడ శ్రీమన్నారాయణుండుండునని నిశ్చల భక్తి యుండిన కారణముచే హిరణ్యకశిపు సంహారము కొఱకు స్తంభమునుండి నృసింహావతారము ధరించలేదా? ఆ కారణముచే దైత్యారి అని పేరు భగవంతునికి ఏర్పడినది. ఏకలవ్యుడు మట్టిచే ద్రోణాచార్యులవారి

విగ్రహమును నిర్మించి పూజించి ఆవిగ్రహమునుండి సమస్తమైన ధనుర్వేదమును గ్రహించలేదా ? శ్రీ భద్రాచలమందు శ్రీరామదాసులవారికి శ్రీ రామచంద్రుండు ప్రత్యక్షమై అభయ మొసంగలేదా ? మన శ్రీ వేంకటేశ్వర పాదారవింద సన్నిధియందు శ్రీ తరికొండ వెంగమాంబకును, హత్తిరాంబావాజి గారికిని స్వామి ప్రత్యక్షమై అభయ మొసంగిన విషయము లోక విఖ్యాతము గదా! ఇది జరిగి సుమారు మున్నూరు సంవత్సరములై యున్నది. ఈలాగుననే పండరి పురమందు శ్రీ పుండరీక వరదుడు అనేక భక్తులకు ప్రత్యక్షమైన విషయము భక్తవిజయముచే తేటపడుచున్నది. ఈలాగుననే శ్రీ చిదంబరమందు అనేకమంది భక్తులకు శ్రీ పరమేశ్వరుండు దర్శన మిచ్చి కృతార్థులను చేసిన విషయము పెరియపురాణమందు గన్పట్టుచున్నది. ఇదంతయు సత్యము.



## విగ్రహారాధన ప్రయోజనకరము

ప్రశ్న ॥ ఓ స్వామీ। దేవరా ! సర్వవ్యాపియైన పరబ్రహ్మమునుధ్యానించుటకై చేతనమైన విగ్రహమును, దానికి ఒక స్థల మెందుకుండవలయును ?

ఉత్తరము ॥ ఓ పాపరహితుడవైన ప్రియసోదరుడా ! పరబ్రహ్మము సర్వవ్యాపియై యుండినను అది అవ్యక్తమై యుండిన కారణమున ఒక వ్యక్త వస్తువు నాశ్రయించక మాత్రము గోచరము గానేరదు. ఎట్లనగా విద్యుచ్ఛక్తి ( అనగా ఎలక్ట్రిక్) సర్వత్ర నిండి యుండినను దానిని దీపముగా ప్రకాశింప చేయుటకై ఒక యంత్రసహాయముచే ఆకర్షించి కాంతము యొక్క తీగెయందు నిలిపినప్పుడు మాత్రము ప్రకాశించును. ఆలాగుననే సర్వవ్యాపియైన పరబ్రహ్మము ఒక విగ్రహమందు ప్రవేశించి భక్తులను రక్షించుట సులభమై యున్నది. ఒకగోవుకు శరీరమంతయును పాలు వ్యాపించియుండినను దాని స్తనముల ద్వారము నుండి సిద్ధించును గాని వేఱువమార్గము లేదు. ఆలాగుననే ఈశ్వరుండు సర్వాంతర్యామియై యుండినను ఒక ప్రతిమనుండి శక్తి బయలు దేరుట సులభముగా నున్నది. విగ్రహము అచేతనమైనను భక్తుని యొక్క మంత్రధ్యాన శక్తిచే చేతనమగుచున్నది. ఇనుమును కొలిమి యందుంచి కమ్మరవాడు ఊదునపుడు అగ్నివలె ప్రకాశము, దహన శక్తి యెట్లు గలుగుచున్నదో అలాగుననే భక్తునియొక్క

ధ్యానశక్తిచే ఆ విగ్రహమునందు ఈశ్వరశక్తి నిలుచును. కనుకనే ఒక విగ్రహమునందు సంకల్పించి దేవుని దివ్య నామము లుచ్చరించి అర్చన పూజనాదులు జరుగుచున్నవి. ఎట్లనగా, కేశవాయ నమః, నారాయణాయ నమః, శివాయ నమః, మహేశ్వరాయ నమః, శ్రీరామాయ నమః అని భగవంతుని నామములు జపించుదురే గాని, పాషండాయ నమః, దారవే నమః, దర్పణాయ నమః అని యెవ్వరును చెప్పుట గనపడలేదు. ఏ యే భావముతో భక్తుడు సంకల్పించి పూజించునో ఆ యా రూపములతో భగవంతుడు భక్తుల ననుగ్రహించును. సాధారణజనుల మనసు చంచలమై యుండు కారణముచే ఏకాగ్రత ఏర్పడుటకొఱకై విగ్రహాది పూజలు ఏర్పడినవి. ఇవి లేనివారికి మనోనిగ్రహము గలుగదు.

సగుణ జ్ఞానహీనస్య న హి నిర్గుణ వేదనమ్ ।
నందిదర్శనహీనస్య యథా న శివదర్శనమ్ ॥

ఏలాగున మొట్టమొదట నందిదర్శనము లేక శ్రీ శివదర్శనము సిద్ధింపదో, ఆలాగుననే సగుణజ్ఞానము లేనివానికి నిర్గుణజ్ఞానము సిద్ధింపదని తత్త్వనారాయణ మను గ్రంథమందు చెప్పియున్నది. ఎట్లనగా, ఒక బాలునికి అక్షరాభ్యాసము చేయునపుడు మట్టియందు గాని, పలకయందు గాని పెద్ద అక్షరము వ్రాసి దానియందు మనసు దృఢమగు నట్లు నేర్పిన తర్వాత వానికది మనసులో నిలుచునేగాని , మొట్టమొదట బాలునితో, అ, అని వ్రాయుటకై నూరుసార్లు చెప్పినను సాధ్యము కానట్లు భగవత్ స్వరూప నిరూపణ కొఱకు ఒక్క రూపము అత్యావశ్యకము. లేనియెడల సాధ్యము కాదు. అనగా పుట్టంధుడైన వానికెట్లు శుక్ల కృష్ణ శ్వేత రక్త వర్ణములు తెలియ సాధ్యముకావో ఆలాగుననే స్వరూప ధ్యానము లేనివానికి అరూప ధ్యానము గలుగనేరదు.

శివజ్ఞానం ద్విధా జ్ఞేయం సగుణం నిర్గుణం తథా ।
ఆదౌ సగుణమాశ్రిత్య పశ్చాన్నిర్గుణ మాచరేత్ ॥

అవ్యక్తమైన శివ స్వరూపము రెండు విధములుగా గ్రహింపదగినది. అవి సగుణ మనియు, నిర్గుణ మనియు చెప్పబడును. దానియందు ఆదికాలమున

సగుణోపాసన చేసిన తర్వాత తనంతటనే నిర్గుణమై పరిణమించును. అది ముందుగా జెప్పిన ఉప్పు, జలము, పురుగుల రీతిగా అగుచున్నది.

**శివార్చనవిహీనో యః పశురేవ న సంశయః ।**

**స తు సంసారచక్రేఽస్మిన్ అజస్రం పరివర్తతే ॥**

ఎవడు ఈశ్వరపూజార్చనాది కర్మముల చేయలేదో, వాడు నిశ్చయముగా ద్విపాద పశువే. (అనగా రెండుకాళ్లపశువు) అట్లు పూజార్చనాది పుణ్యకార్యముల చేయనివాడు ఈ జనన మరణ ఘోర సంసారచక్రమందు సర్వదా తిరుగుచుండునే కాని మోక్షము పొందనేరడు అని శివయోగ ప్రదీపిక.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**

**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥**

తులసి, బిల్వము మొదలైన పత్రములు, పుష్పము, ఫలము, జలము, ఆలాగున అనేక విధములైన నైవేద్యములు ఎవడు భక్తితో నాకు సమర్పించునో, ఆ పరిశుద్ధమైన మనసు గలవాని నైవేద్యాది వస్తువులను నేను ప్రేమతో భుజింతును అని శ్రీ కృష్ణ స్వామి గీతావచనమందు చెప్పినదే ప్రమాణము. ఈ విగ్రహాది పూజనములు అష్టవిధములుగా భాగవత ఏకాదశస్కంధమం దుద్ధవుల వారికి శ్రీకృష్ణస్వామి ఉపదేశించియున్నారు.

**శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ ।**

**మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధా స్మృతా ॥**

శిలావిగ్రహము, దారువు, లోహము, చిత్రము, దర్పణ లిఖితము, మృత్తిక, మనః కల్పితము, రత్ననిర్మితము లని ప్రతిమలు ఎనిమిది విధములుగా విధించబడినవి.

**పశురాత్మాఽస్వతంత్రశ్చ చిన్మాత్రో మలదూషితః ।**

**సమ్మూఢో నిత్యసంసారీ కించిజ్జ్ఞోఽనీశ్వరోఽక్రియః ॥**

జీవు డనగా పశుప్రాయుడు, పరతంత్రుడు, కించిజ్జ్ఞుడు, జ్ఞానమాత్రుడు, మాయామలముతో గూడినవాడు, జ్ఞానహీనుడు, నిత్యసంసారి, మందుడు, శక్తిలేనివాడు, క్రియారహితుడు స్వల్పగుణములచే మాయాబద్ధుడు. కనుక

ఈశ్వర కరుణలేక జీవునికి జ్ఞానము గలుగనేరదు. కాబట్టి ఈశ్వరపూజ అత్యావశ్యకము.



## మానస పూజ

ప్రశ్న ॥ ఆ ఈశ్వరపూజ హృదయమందు చేసిన చాలదా, హృదయస్థుడైన ఈశ్వరునికి మరియొక స్థలమెందుకు ?

ఉత్తరము ॥ ఓ సువ్రతా ! మనసునందు ధ్యానము చేయు శక్తి ఉన్నవారికి తనకొఱకు ఆవశ్యకము లేనప్పటికిన్ని పరులకొఱకు కర్మము చేయవలసి యున్నదని శ్రీ గీతాశాస్త్రాభిప్రాయము. మనసుచే పూజించుటకు శక్తి గల మహనీయు లిప్పుడు నిండా అరుదుగా నున్నారు. మనోధ్యాన శక్తిగల ఋషీశ్వరులకు తమ హృదయమందు పూజించు శక్తి యున్నప్పటికిని వారికి తెలియకకాదు ఈ విగ్రహారాధనము ఏర్పరచినది. ఇప్పుడున్న శుష్క-వేదాంతులలో మానసపూజ చేయుటకు శక్తి యున్నయెడల మనసుతో నేనన్నము భుజించితిని, పాలు పానము చేసితిని, ఫలహారము భక్షించితిని అని మానసికభక్తిచే భుజింపకూడదా ? రోగము వచ్చునపుడు ఔషధము మనసుచే సేవించితినని నిశ్చయింపగూడదా ? లేక నిత్యశుద్ధుడనైన నాకు శరీరము లేదు. నేను బట్టబయలు, అచలుడు, అని స్థిరముచేసుకొని యుండకూడదా ! మరి యెందుకు ఆకలిబాధ కోర్వలేకయు, రోగపీడ సహింపలేకయు, అల్లాడుచున్నారు? ఇదంతయు మూఢుల మాటలు గాని జ్ఞానులు చెప్పునది కాదు. విగ్రహారాధనచే ఉపయోగములేని యెడల శ్రీతారకబ్రహ్మ శ్రీరామస్వామి శ్రీ రామేశ్వరమందు శివలింగ ప్రతిష్ఠ ఏలచేయవలెను ? ఈలాగుననే, గోదావరితీరము, పంపాసరోవరము మొదలైన పుణ్యస్థలములలో రామలింగక్షేత్రము లనేకములు గనపడుచున్నవి. శ్రీ వ్యాసులవారు శ్రీ కాశియందు సహస్రలింగములు ప్రతిష్ఠించి పూజించినారు. ఇప్పుడున్ను దర్శింప వచ్చును. ఈలాగునే శ్రీ కపిలమహర్షి నారద వసిష్ఠ భరద్వాజ అగస్త్య భృగు పరశురాములు మొదలైన అనేక మహర్షులు శివ కేశవుల దేవస్థానముల స్థాపించి పూజించిన సంగతి ప్రత్యక్షముగా లోకమంతయు గన్పట్టుచున్నది. ఈలాగున దివ్యస్థలములచే మనుజులకు గల్గు ఇహపర

సౌఖ్యములు చెప్పుటకలవి కాదు. ఇట్లు దేవాలయములు లేనియెడల ఇప్పుడున్న స్థితికి మనుష్యులు కేవలము మృగప్రాయు లగుదురు.

**కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః**
**కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నుతిభిః కంచిత్కథాఽఽకర్ణనైః ।**
**కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం**
**యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు ॥**

ఓ ఉమామహేశ్వరా ! ఒకప్పుడు నీ పాదారవిందములయందు మనసు నిలిపి అర్చనముచేతను, మరియొక కాలమున నీ యొక్క ధ్యానముచేతను, మరియొక సమయమున నీ యొక్క పాదారవింద నమస్కారములును, ఇంకొక తరి నీది కథలు వినుటయున్ను, మరియొక వేళ నీ యొక్క దివ్య దర్శనములు చేయుచును సంతోషముతో నున్నవారు జీవించియున్నప్పటికి ముక్తులే అని శివానందలహరి. ఇది శ్రీ శంకర భగవత్పాదాచార్యుల సూత్రము. మనోనిగ్రహము కొఱకు నిండా మంచిదిగా నున్నది. ముముక్షువులకు కొంతసేపు ధ్యానమందున్నప్పుడు మనసు సుఖముగా నుండును. దానినుండి మనసు బహిర్ముఖముగా వచ్చునపుడు దానిని ఒక పనియందు నియమింపనియెడల విషయమందు ప్రవర్తించును. అట్లు పోనీయక కొంత సేపు స్తోత్రకీర్తన భజన పారాయణములలో నియమింపవలయును. దానియందు కొంచెము ప్రీతి తగ్గినపుడు పూజార్చనాదివిధులలో నిలుపవలయును. దానియం దనిష్టము కలిగినప్పుడు వేదాంతగ్రంథ కాలక్షేపములతో సమయము గడుపవలయును. ఇట్లున్నవారి మనస్సు ప్రపంచవిషయమందు పోవుటకు వీలులేదు. అట్లు సర్వదా భగవద్విషయమందు మనసు సంచరించుట వలన మనసు శీఘ్రముగా పరిపక్వమై శమదమాది గుణములు గలిగి మాయావిముక్తి గలుగును. దీనికొఱకై మనః పరిపక్వము సంపూర్ణముగా లేనివారికి పూజార్చనాది కార్యములు ఏర్పడినవి. ఇవి లేనియెడల కొంతసేపు ఆత్మవిచారము గాని, ధ్యానము గాని, జపము గాని ఐన తర్వాత మనసు విషయములందు బ్రవర్తించును. మనసు అతిచంచలమైనది. అది ఒక నిముషమైనను వూరకుండదు. కనుక మనసు నిలుచుటకై ఇది మంచితంత్రము.

## భక్తి ప్రభేదములు

ప్రశ్న ॥ భక్తి యెవరియం దుంచవలయును, దానిలో ఏభక్తి శ్రేష్ఠము?

ఉత్తరము ॥ ఈ భక్తి శ్రీ రాములయందుగాని, శ్రీ పరమేశ్వరుని యందుగాని, శ్రీమన్నారాయణుని యందుగాని ఉండినయెడల మిక్కిలి శ్రేష్ఠము. ఎందుకనగా, అనేకమంది మహాత్ములు ఈ త్రిమూర్తులయందు భక్తిగలవారై ఈ ఘోరసంసార సాగరమును సులభముగా దాటిరి. లేక మహానుభావులైన సద్గురువునందు భక్తి యుండిన యెడల అదియును మంచిదే. మరియు శ్రీసుబ్రహ్మణ్య స్వామియందును, శ్రీదత్తాత్రేయుల వారి యందును, భక్తి యుండిన అదియున్ను మంచిదే. వీరున్ను దయామూర్తులు.

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥**

**స ఏవ లభతే జ్ఞానం మద్భక్తశ్శ్రద్ధయాఽన్వితః ।**
**నాన్యకర్మాణి కుర్వాణో జన్మకోటిశతైరపి ॥**

త్రిగుణాత్మికయై, దైవ సంబంధియైన నా యొక్క మాయను దాటుట మిక్కిలి కష్టము కాని, ఎవరు పరమేశ్వరుడనైన నన్ను అనన్యభక్తితో సేవించెదరో వారు సుఖముతో శీఘ్రముగా ఈ మహామాయను దాటుదురు. శ్రద్ధా భక్తులతో గూడినవాడు మాత్రము జ్ఞానము పొందును. భక్తిలేక శతకోటి జన్మములు యజ్ఞ దానతపములను కర్మలు చేసినను మోక్షము పొందుటకు సాధ్యము కాదు అని శ్రీ శివగీత. ( అ. 14. ) ఈ మాదిరి ఒక శ్లోకము భగవద్గీత సప్తమాధ్యాయమందు గలదు.

**ఈశ్వరాను గ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణా ద్విప్రాణామువజాయతే ॥**

అద్వితీయమగు పరబ్రహ్మ విచారము స్థిరమగుట కొరకున్ను మహాఘోర సంసార దుఃఖము తొలగించి రక్షించుటకును పరమేశ్వరుని యొక్క కారుణ్యకటాక్ష వీక్షణమైన అనుగ్రహముచే మాత్రము అజ్ఞానులైన కొందరు జీవులకు జ్ఞానము గలుగుచున్నది. అవధూత గీత.

శ్రుతి ॥ కారణేన వినా కార్యం నోదేతి, భక్త్యా వినా బ్రహ్మజ్ఞానం కదాఽపి న జాయతే। తస్మాత్త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ ॥

అని మహానారాయణోపనిషత్తు రీతిగా కారణము వినా కార్యమెప్పటికి కానేరదు. కాబట్టి భక్తిలేని వారికి బ్రహ్మజ్ఞానము సిద్ధింపదు. ఆ కారణముచే అన్యములైన సర్వోపాయములను త్యజించి ఒక్క భక్తిని మాత్రము శ్రద్ధతో ఆశ్రయింపుము. కూపమందు పతితుడైనవానికి మరియొకరి సహాయము లేక ఉద్ధరించుటకు సాధ్యము కాదు. అట్లు సంసారకూపమందు పతితుడైనవాడు ఈశ్వరుని కరుణచేగాని, సద్గురుని అనుగ్రహముచే గాని కృతార్థుడు కావలయునే గాని వేరొక మార్గము లేదు.



## మంత్రజప వివరణము

ప్రశ్న ॥ ఈ భక్తిసిద్ధించుటకై యే యొక్కమంత్రము జపము చేయవలయునో దానిని దయతో సెలవొసగుడు.

ఉత్తరము ॥ మంత్రము గాదు భక్తియను వాక్యమునకు అర్థము. భక్తి యనగా, ఈశ్వరునియందు అమితమైన ప్రేమయే. ఈ పరమప్రేమ లేనివారికి ఏ మహామంత్రము జపించినను ఏమియు ప్రయోజనము లేదు. పరమభక్తుడైన వానికి మంత్రము లనావశ్యకములు. మహనీయులైన ఋషిపుంగవులును, దయాస్వరూపులైన త్రిమూర్తులును ముముక్షువుల మనసు నిలుచుటకు మంత్రము లేర్పరచిరి. ఆ మంత్రములు గూడ భక్తితో జపించిన వారికి మాత్రము మహాప్రయోజనకరములై యున్నవి. ఈ సప్తకోటిమహామంత్రములలో శ్రీరామతారకమంత్రముగాని, శ్రీశివపంచాక్షరిగాని, శ్రీనారాయణాష్టాక్షరిగాని అనుష్ఠానము చేయవచ్చును. ఈ మంత్రత్రయము అత్యుత్కృష్టము. ఈ మూడును సాక్షాత్ మోక్షసాధనములే. వీటిని విధిప్రకారము (శ్రద్ధా భక్తులతో) అనుష్ఠించువారికి ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములును గాక అణిమాద్యష్టసిద్ధులు కూడ సిద్ధించును.

ఓ నాయనా ! ఇంకొక రహస్యము గలదు. అదేమనగా భక్తి యనగా తన ఆత్మానుసంధానము చేయుటచే నిజమైన భక్తి. ఇది మహర్షులు నిండా గుప్తముగా ఉంచియున్నారు. ఉత్తమాధికారులైన అంతరంగ శిష్యులకు మాత్రము రహస్యముగా బోధించుదురు. తక్కిన వారికి బోధించినను ప్రయోజనము లేదు. ''స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే '' అని శ్రీ శంకరులు సెలవిచ్చియునారు. అనగా తన ఆత్మానుసంధానము చేయుటయే శ్రేష్ఠమైన భక్తియని చెప్పియున్నారు. దీనికి ప్రణవమంత్రమే విధించియున్నది. ప్రణవమనగా ఓంకారము. దీనికి ఏకాక్షరము, బ్రహ్మమంత్రము, అక్షరము, వేదాంత తత్త్వము, వేదసారము, తారకము, ఆత్మమంత్రము, అజప గాయత్రి, హంసమంత్రము, సోహము, బ్రహ్మోపదేశమని అనేక నామములు గలవు. ఇది అతిరహస్యము. వేద వేదాంతసారము. దీనియొక్క మర్మము గురు ముఖముగా ఎఱుంగవలయును. ఈ యొక్క మంత్రధ్యానమే భగవాన్ కృష్ణమూర్తి గీతయం దుపదేశించినారు.

**యదక్షరం వేదవిదో వదంతి**
**విశంతి యద్యతయో వీతరాగాః ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥**

ఏ పదమును (మంత్రమును) అక్షరమైన బ్రహ్మమునకు వాచకముగా వేదము లెఱింగిన ఋషిపుంగవులు చెప్పుచున్నారో, దేనిచే వాచ్యమైన బ్రహ్మమును రాగద్వేషరహితులైన యతీశ్వరులు ప్రవేశించుచున్నారో, దేనిని తెలియగోరిన వారలై మహర్షులు బ్రహ్మచర్య మహావ్రత మవలంబించుచున్నారో, అట్టి పవిత్రమైన మహాసార పదమును నీకు సంక్షేపముగా చెప్పెదను.

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాఽఽత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥**

సర్వేంద్రియములను నిగ్రహించి, మనసును హృదయ కమలమందు నిలిపి, అందు వశీకృతమైన మనసుతో హృదయము నుండి ప్రాణవాయువును ఊర్ధ్వగామియగు సుషుమ్నానాడిచే నూర్ధ్వముగా నారోహింపచేసి తన సహస్రారమందు నిలిపి ఇట్లు యోగధారణ చేయువాడై -

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

తర్వాత ఓమ్, అను ఏకాక్షరమైన, బ్రహ్మమునకు వాచకమైన ప్రణవ మంత్రమును ఉచ్చరించుచు, తదర్థభూతుడైన పరమాత్మను ధ్యానించుచు, ఎవడు దేహమును విడుచుచున్నాడో అతండు పరమపదమైన మోక్షమును పొందుచున్నాడు. యోగమనగా, చిత్తైకాగ్ర ధ్యానయోగము గాని హఠయోగాభ్యాసమని దీనియందు భ్రమింపరాదు.

శ్రుతి ॥ **సర్వే వేదా యత్పదమామనంతి**
**తపాంసి సర్వాణి చ యద్వదంతి ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥**

సమస్తమైన వేదములు ఏ యొక్క పదము చెప్పుచున్నవో, తపస్సు చేయు మహర్షులు ఏ యొక్క పదము ఉత్కృష్టమని చెప్పుచున్నారో, ఏ యొక్క ఫలప్రాప్తికొఱకు బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించు చున్నారో, ఆ పదము సంగ్రహముగ నీకు నేనుపదేశించుచున్నాడను. అదేమి యనగా ఓమ్ అను మంత్రమే. ఓంకార వాచ్యుడైన బ్రహ్మమని భావము.

శ్రుతి ॥ **ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥**

ఈ అక్షరమే పరబ్రహ్మము, ఈ అక్షరమే పరమపదము, ఈ అక్షర రహస్యము తెలిసికొనినవాడు ఏది కోరునో వానికి అదంతయు సాధ్యమగును.

శ్రుతి ॥ **ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరమ్ ।**
**ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥**

ఈ ఓంకారమే మోక్షమార్గమునకు శ్రేష్ఠమైన సోపానము. ఈ ఓంకారమే పరమపదమైనది. దీని యవలంబము సర్వోత్కృష్టమైనది. దీని యొక్క రహస్యము తెలిసినయెడల వాడు బ్రహ్మలోకమందు పూజ్యుడగును అని కఠోపనిషత్తు. ఈ మంత్రములు శివగీతయందు ఈలాగుననే చెప్పియున్నవి.

ఏవమాత్మారణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।
ధ్యాననిర్మథనాభ్యాసా త్సాక్షాత్పశ్యతి మాం జనః ॥

సిద్ధాసనమందు ఆసీనుడై, ఏకాగ్రచిత్తము గలవాడై, తన ఆత్మను పూర్వారణిగాజేసి, ఓంకారమంత్రమును ఉత్తరారణిగా గావించి, ధ్యానమను మథనము గావించినచో సాక్షాత్తైన శివస్వరూపమును ముముక్షువు దర్శించును.

ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।
ధ్యాన నిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥

తన మనసును క్రింద అరణిగా గావించి, ఓంకారమును పైగా నిలిపి ధ్యానము చేయునపుడు అరణినుండి అగ్ని ఉద్భవించునట్లు సూక్ష్మమైన పరమాత్మను దర్శించును. అరణి యనగా యాగాగ్నిని పుట్టించు కొయ్యలపేరు. దీనికి మరియొక దృష్టాంతము గలదు. పెరుగు మర్దనచేయునపుడు వెన్న యెట్లుద్భవించునో, ఆలాగుననే హృదయమందు ప్రణవమను కవ్వము నిలిపి; ధ్యానమను మర్దనము చేయునపుడు అప్రత్యక్షమైన పరమాత్మ ప్రత్యక్ష మగును అని ఉత్తరగీత.

శ్రుతి ॥ ఓంకార ప్రభవా వేదా ఓంకార ప్రభవా స్స్వరాః ।
ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం స చరాచరమ్ ॥

ఓంకారమను బ్రహ్మమునుండి సమస్త వేదములును, ఓంకార మందుండియే సర్వ స్వరములున్ను (నాద, బిందు, కళలు), ఓంకార మందుండియే సమస్త చరాచరములైన ఈ ప్రపంచమంతయు నుద్భవించినది.

శ్రుతి ॥ ప్రణవో హి పరబ్రహ్మ ప్రణవః పరమం పదమ్ ।
ప్రణవం సర్వవేదాద్యం సర్వవేదమయం విదుః ।
సర్వేషాం చైవ మంత్రాణాం ప్రణవః ప్రాణ ఉచ్యతే ॥

ప్రణవమే పరబ్రహ్మము. ప్రణవమే పరమపదము. ప్రణవము సమస్త వేదములకు ఆదికారణము ( అనగా ప్రణవము నుండియే వేదము లుద్భవించినవి. ప్రణవము బ్రహ్మమయమని బ్రహ్మవేత్తలైన పెద్దలెఱుంగు చున్నారు). సమస్తమైన

మంత్రములకు ప్రణవమే ప్రాణబీజమై యున్నది. ప్రణవ రహిత మంత్రమునకు ప్రాణశక్తిలేదు. మరియు ప్రాణులకు శిరస్సు ప్రధానముగా నున్నట్లు మంత్రమునకు ప్రణవము శిరస్సుగా వున్నది. ప్రణవము లేనిమంత్రము మొండి శరీరము వంటిది.

**శ్రుతి ॥ ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

ప్రణవమును ధనుస్సుగా గావించి, ఆత్మను శరముగా నుంచి పరబ్రహ్మమును లక్ష్యముగా చేయవలయును. ప్రమాద రహితునిచే వేద్ధవ్యమగును. అట్లు చేయునపుడు శరమువలె తన్మయ మగును. ( అనగా సూక్ష్మ దృష్టి గలవానిచే విడిపించిన అస్త్రము లక్ష్య వస్తువు నందు ప్రవేశించునట్లు మన సనెడు శరము ప్రణవ మను ధనుసునందు అనుసంధించి ధ్యాన మను దెబ్బచే లక్ష్యమను బ్రహ్మమును పొందవచ్చును. ) దీనియందు అప్రమత్తేన అను పదమునకు పరిశుద్ధమైన మనసును, సూక్ష్మబుద్ధియును గల వానికి సాధ్యమగునని భావము అని ముండకోపనిషత్తు.

తుపాకిచే వేటాడువాడు గురిపెట్టినపుడు అణుమాత్రము చలించినను ఏలాగున తప్పిపోవునో ఆలాగుననే చిత్తైకాగ్రత లేనివారి ధ్యానము వ్యర్థము.

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటా నినాదవత్ ।**
**అవాచ్యం ప్రణవం ప్రాప్యం యస్తం వేద స వేదవిత్ ॥**

అవిచ్ఛిన్నమైన తైలధారవలె, దీర్ఘఘంటానినాదమువలెను. అవాచ్యమైన ఓంకారమును ఎవడు ఎరుంగునో వాడే వేద వేదాంత మెరింగిన మహనీయుడు అని ఉత్తరగీత.

**శ్రుతి ॥ యావజ్జీవం జపేన్మంత్రం ప్రణవం బ్రహ్మణో వపుః ।**
**హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ।**
**ప్లుతస్తు సర్వసిద్ధ్యై స్యాత్ ప్రణవస్త్రివిధః స్మృతః ॥**

పరబ్రహ్మ స్వరూపమైన ప్రణవమంత్రము జీవిత పర్యంతము జపము చేయవలయును. అది హ్రస్వమనియు, దీర్ఘమనియు, ప్లుతమనియు ఉచ్చారణము

ననుసరించి త్రివిధములు. హ్రస్వముచే సమస్త పాపములు భస్మమగును. దీర్ఘము మోక్షదాయకము. ప్లుతముచే సర్వసిద్ధియును గలుగును. ఇట్లు సన్న్యాస సముచ్చయము. రెండు మాత్రలసమయము హ్రస్వము, మూడు మాత్రల సమయము దీర్ఘము. నాలుగు మాత్రల సమయము ప్లుతము. ఒక్క అకారము వుచ్చరించెడు సమయమునకు మాత్ర యనిపేరు.

**సూ ॥ తజ్జపస్తదర్థభావనమ్ ।**

ప్రణవ ధ్యానమందు దాని అర్థమైన పరమాత్మ భావనకూడ ఉండవలయును. అట్లు జేయువారికి ఆత్మదర్శనము సిద్ధించును అని పతంజలి భగవంతుని అభిప్రాయము. దీనికంటె పవిత్రమైన వస్తువు ముల్లోకములలో లేదు. దీనిని ధ్యానించువారు నిండా శ్రద్ధా భక్తులతో గూడియుండవలయును.

## యోగ రాహిత్యముచే జ్ఞానము ప్రకాశింపకుండుట

ప్రశ్న ॥ ఓ స్వామీ ! యోగము లేనివారికి జ్ఞానము సిద్ధింపదని కొందరు చెప్పునది నిజమై యుండునా ?

ఉత్తరము ॥ అది వాస్తవము. యోగము లేనివారికి జ్ఞానము సిద్ధించుటప్రయాసము. కాని ఈ యోగము మనశ్శాంతి గలిగిన వారికిని, పరమభక్తులైన వారికిని, విషయ విరక్తి పొందినవారికిని, సాధన చతుష్టయ సంపత్తి గలిగి ధ్యానమందు మనః స్థిరత గలిగిన వారికిని, ఆవశ్యకము గాదని యోగశాస్త్రములు చెప్పుచున్నవి. ఈ యోగాభ్యాస విషయములో నిండా అపాయము గలదు. ఇక్కాలమందు యోగసిద్ధి గల యోగీశ్వరులును, దాని నభ్యసించుటకు తగువైన శమదమాది గుణములు గలిగిన శిష్యులును దుర్లభులు. ఈ విద్యమాత్ర మనుభవము గల గురువులవద్దనుండి గ్రహింపవలయునేగాని హఠయోగ పాతంజలాది యోగ గ్రంథములను చూచి చేయరాదని ఆ గ్రంథకర్తలే చెప్పుచున్నారు. యోగశాస్త్రము నుండి హఠయోగాది కాయకీయాభ్యాసము శ్రీశంకర భగవత్పాదాచార్యు లుపేక్షించి ప్రాణాయామాదులగు కొన్ని ఆసనములను గ్రహించిరి. ఆత్మసిద్ధి కొఱకు ఇవియే చాలునని వారి

అభిప్రాయము. ప్రాణాయామముచే అనేకమైన అమానుషసిద్ధులు గలుగును. దీనిచే మనశ్శాంతి, జితేంద్రియత్వము, అరోగత, చిత్తైకాగ్రత మొదలైన గుణములు శీఘ్రముగా సిద్ధించును. వైరాగ్యము, జ్ఞాన, యోగములను మూడున్ను మహనీయము లందరికిని గనుపడుచున్నవి. ఒక పక్షికి ఆకాశమందు సంచరించుటకు రెండు రెక్కలున్ను, మూడవదైన పుచ్ఛమున్ను ( తోకయున్ను) ఉండవలయును. వీనియందు వైరాగ్యమను ఒక పక్షమున్ను, జ్ఞానమను ఇతర పక్షమున్ను యోగమను పుచ్ఛమున్ను ఉండిన యెడల మాత్రమే సరిగా పోవుటకు వీలగును. ఈ వైరాగ్య, జ్ఞాన యోగములు మూడున్ను లేనియెడల ముముక్షువునకు ప్రయోజనము లేదు.

యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతి ధ్రువమ్ ।
తస్మాత్ జ్ఞానం చ యోగం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥

మోక్షదాయకమైన జ్ఞానము యోగము లేక సిద్ధించుటకు ప్రయాసము. ఆ కారణముచే ముముక్షువైనవాడు యోగమును జ్ఞానమును నిశ్చయముగా అభ్యసింపవలయును. యోగము ఓడకు చుక్కాని వంటిది. చుక్కాని లేని యెడల ఆ పడవ చక్కగా నడుచుటకు వీలులేదు. కనుక రాజయోగులకు గూడ ప్రాణాయామాది అభ్యాసము నిండా ఉపయోగము. యోగకర్తలలో గురువైన వారు శ్రీ పతంజలి మహర్షి, వీరే సేశ్వరసాంఖ్యయోగ కర్త, వీరి అభిప్రాయము.

సూ ॥ యోగశ్చిత్తవృత్తినిరోధః ॥

అంతః కరణ వృత్తుల నిగ్రహము యోగ మనబడును. ( అనగా విషయమందు సంచరించు మనసును వశీకరించి అంతర్ముఖముగా జేసి ఆత్మధ్యానమందు నిలుపుట).

శ్రుతి ॥ యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టేత తామాహుః పరమాం గతిమ్ ॥

ఎప్పుడు జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, మనసుతో గూడి స్థిరమగునో, బుద్ధియును ఆత్మ యందు లీనమై వుండునో, అప్పుడున్న స్థితియే పరమపదమైన మోక్షమని చెప్పుచున్నారు.

శ్రుతి ॥ తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణామ్ ।
అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥

ఇంద్రియము లన్నియు లయించి తన స్వస్వరూపస్థితియందు స్థిరముగా నిలుచుటయే యోగమని చెప్పుదురు. అప్పుడు మాత్రమే వాడు ప్రమాదరహితు డగును. కనుక యోగమే ప్రభవ ప్రళయములకు కారణము.

**యథా వహ్నిర్మహాదీప్త శ్శుష్కమార్ద్రం చ నిర్దహేత్ ।**
**తథా శుభాఽశుభం కర్మ యోగాగ్ని ర్దహతి క్షణాత్ ॥**
**అత్యల్పోఽపి యథా దీప స్సుమహాన్నాశయేత్తమః ।**
**యోగాభ్యాస స్తథాఽల్పోఽపి మహాపాపం వినాశయేత్ ॥**

ఏలాగున మహోజ్వలనమగు అగ్ని కట్టెలను భస్మము చేయుచున్నదో, ఆలాగుననే అనేక జన్మార్జిత శుభాశుభ కర్మసమూహము నంతయును యోగాగ్ని క్షణమాత్రములో భస్మము చేయును. దీపమల్పమైనను మహత్తైన అంధకారమును ఎట్లు నాశము చేయుచున్నదో, ఆలాగుననే యోగాగ్ని కొంచమైనను మహాపాపసంఘమును తొలగించును అని స్కాందపురాణము.

**యోగాత్సంజాయతే జ్ఞానం జ్ఞానాన్ముక్తిః ప్రజాయతే ।**

యోగముచేత శీఘ్రముగా జ్ఞానోదయమగును. జ్ఞానముచే ముక్తి యును సిద్ధించును. ''చలే వాతే చలం చిత్తం నిశ్చలే నిశ్చలం భవేత్'' మనసుకున్ను, ప్రాణవాయువుకున్ను సంబంధము గలదు. మనసు స్థిరమైన యెడల ప్రాణవాయువు చలనరహితమై యుండును. మనస్సు చలించినప్పుడు ప్రాణవాయువున్ను చలించును. లేక ప్రాణవాయువు నిలిచిన యెడల మనస్సు చలింపదు. కనుక ఈ రెంటిలో ఏదైనా ఒకటి నిగ్రహింపబడిన యెడల రెండును నిలుచును.

**హఠం వినా రాజయోగో రాజయోగం వినా హఠః ॥**

హఠయోగము లేక రాజయోగము సిద్ధింపదు. రాజయోగము లేక హఠయోగము సిద్ధింపదు. కనుక రాజయోగసిద్ధి పర్యంతము హఠయోగ మావశ్యకమని తాత్పర్యము.

శ్రుతి ॥ వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని ।
ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే ॥

మనస్సు యొక్క వృత్తుల నిగ్రహించి ఆ మనసును ఆత్మయందు ఏకీభావము చేయుటయే ముఖ్యమైన యోగము. దీనిచే విముక్తు డగును.

ధ్యానాత్పాపాని నశ్యంతి ధ్యానాన్మోక్షం చ విందతి ।
ధ్యానాత్ప్రసీదతి హరి ర్ధ్యానం సర్వార్థసాధనమ్ ॥

అధ్యాత్మధ్యానవముచే సమస్తములైన పాపములును నశించును. ఆత్మధ్యానవముచే మోక్షము పొందవచ్చును. ధ్యానవముచే శ్రీహరి సంతోషించును. హరిధ్యానముచే సర్వార్థ సిద్ధియును గలుగును.

ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః ।
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా ॥

సమస్తమైన వేదశాస్త్రములును పునః పునః పరిశోధింప ఒకటి మాత్రము సిద్ధించినది. అది యేదనగా, సర్వదా నారాయణ స్వరూపమైన ఆత్మను ధ్యానించుటయే గొప్పది అని శ్రీ శుకవచనము.

బ్రహ్మహత్యా సహస్రాణి భ్రూణహత్యా శతాని చ ।
ఏతాని ధ్యానయోగశ్చ దహత్యగ్ని రివేంధనమ్ ॥

పదివేలు బ్రహ్మహత్యలును, నూరు గర్భిణీ హననములైన పాపసంఘమంతయున్ను ఒక ధ్యానయోగముచే కట్టెల సంఘము అగ్నిచే భస్మమగునట్లు భస్మమగు చున్నది.

ముహూర్తమపి యో గచ్ఛే న్నాసాగ్రే మనసా సహ ।
సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్ ॥

భ్రూమధ్యమందు ప్రణవ మంత్రములతో మనసును ఐక్యపరచి ఒక ముహూర్తమాత్రము ఎవరు ధ్యానింతురో, వారియొక్క శతజన్మార్జిత మైన పాపసంఘ మంతయు నశించి నిర్మలు లగుదురు.

నిమిషం నిమిషార్ధం వా ప్రాణినోఽధ్యాత్మచింతకాః ।
క్రతుకోటిసహస్రాణాం ధ్యానమేకం విశిష్యతే ॥

నిమిషముగాని, అర్ధనిమిషముగాని ఆత్మధ్యానము చేసిన యెడల మనుజులకు కోటి అశ్వమేధాది యాగములకంటె ఒకధ్యాన మతిశయమై యున్నది అని ఉత్తరగీత.

**నాస్తి ధ్యాన సమం తీర్థం నాస్తి ధ్యాన సమం తపః ।**
**నాస్తి ధ్యాన సమోయజ్ఞ స్తస్మాద్ధ్యానం సమాచరేత్ ॥**

సప్తసాగరపర్యంతము తీర్థస్నానము చేయుఫలముకంటె ధ్యానయోగము మిక్కిలి శ్రేష్ఠము. అశ్వమేధాది యోగములకంటె ఆత్మధ్యానము గొప్పది.

**వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ**
**దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్ ।**
**అత్యేతి తత్సర్వమిదం విదిత్వా**
**యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ ॥**

వేదాధ్యయనములయందును, యజ్ఞములయందును, తపముల యందును, దానములయందును, ఏ పుణ్యఫలము చెప్పబడినదో యోగియైనవాడు వాటికన్నింటికంటె గొప్పదైన మోక్షఫలమును బొందుచున్నాడు. అనగా యజ్ఞ, దాన, తపోవేదాధ్యయనములకంటె ధ్యానయోగ ముత్కృష్టమని భావము అని భగవద్గీత.

**పూజాకోటి సమం స్తోత్రం స్తోత్రకోటి సమో జపః ।**
**జపకోటి సమం ధ్యానం ధ్యానకోటి సమో లయః ॥**

కోటిపూజలు చేయుటకంటే, భక్తితో ఒక స్తోత్రము చేయుట మంచిది. కోటిస్తోత్రములకంటె, ఒక జపము ముఖ్యము. కోటిజపములకంటె, ఒక ధ్యాన ముత్కృష్టము. కోటిధ్యానములకు, ఒక లయము సమమైయున్నది. (అనగా స్వస్వరూపస్థితి)

**ఆత్మపూజాసమా నాస్తి పూజా రఘుకులోద్వహ ।**
**మత్సాయుజ్యమవాప్నోతి చండాలో స్వాత్మపూజయా ॥**

ఓ రాఘవా ! ఆత్మపూజకు సమమైనది మరియొక పూజ లేదు. చండాలుడైనను ఆత్మపూజచే నాయొక్క సాయుజ్య ముక్తి పొందును అని శివగీత.

**లయో లయ ఇతి ప్రాహుః కీదృశం లయ లక్షణమ్।**
**అపునర్వాసనోత్థానో లయో విషయ విస్మృతిః ॥**

నే నమస్కుడననియు, నిర్గుణే ననియు, అచలుడననియు, రాజయోగి ననియు చెప్పుదురు. దానియొక్క లక్షణ మేదియో తెలియదు. లయమనగా వాసన (వృత్తి) లేకుండుటయును, విషయ విస్మృతి అని ఎరుంగవలయును.

**జ్ఞేయవస్తు పరిత్యాగా ద్విలయం యాతి మానసము।**
**మనసో విలయే జాతే కైవల్య మవశిష్యతే ॥**

విషయ పరిత్యాగముచే మనసు లయము పొందును. మనసు లయమైన తర్వాత ఆత్మ శేషించును. ఆ స్థితియే కైవల్య మనబడును అని హఠయోగ ప్రదీపిక.

**చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్ష ఏవ హి।**
**తస్మాచ్చిత్తం స్థిరం కుర్యాత్ ప్రజ్ఞయా పరయా బుధః ॥**

మనస్సు విషయమందు ప్రవేశించిన యెడల నిశ్చయముగా సంసారి యగును. చిత్తచలన రాహిత్యమే మోక్ష మనంబడును. ఆ కారణముచే బుద్ధిమంతుడు విశేష ప్రజ్ఞాబలముచే మనోనిగ్రహము చేయవలయును.

**యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః।**
**న క్షీణా వాసనా యావచ్చిత్తం తావన్న శామ్యతి ॥**
**న యావద్యాతి విజ్ఞానం న తావచ్చిత్తోపశమః।**
**యావన్న చిత్తోపశమో న తావత్తత్త్వవేదనమ్ ॥**

ఎంతవరకు మనసు లీనము గాలేదో, అంతవరకు వాసనా నాశము కానేరదు. ఎంతవరకు వాసనాక్షయము గలుగలేదో, అంతవరకు మనసు నశింపదు. ఎంతవరకు విజ్ఞానము గలుగలేదో అంతవరకు చిత్తము శాంతమునకు రాదు. అంతవరకు తత్త్వజ్ఞాని కానేరడు. అనగా మనసు ఎంత కాలము వరకు విషయములనుండి ఆత్మధ్యాన మందు నిలువలేదో, అంతవరకు మోక్షము

కానేరదని భావము. కాబట్టి ఓ సోదరుడా ! విషయముల నుండి మనసును మరలించి ఆత్మధ్యానమందు నిలుపుము అని వాసిష్ఠము.



## జ్ఞానమునకు యోగమువలన సహాయము

ప్రశ్న ॥ ఈ యోగము మిక్కిలి కష్టతరమని తమరు సెలవిస్తిరి గదా ! కనుక ఈ ధ్యాన యోగము సాధ్యము కానివాడు మోక్షము దొరకక సంసార సాగరమందు కష్టమునకు పాత్రుడగునని అభిప్రాయమా ?

ఉత్తరము ॥ మోక్షమునకు యోగమొకటియే కావలయునని నిర్బంధము లేదు. ఈ మోక్షముకొఱకు జగదీశ్వరునిచే అనేక మార్గములు ఏర్పరుపబడినవి. దానియం దేదైనా ఒకదాని నాశ్రయించిన యెడల అందరు చేరు ఆ ముక్తిపదము నందవచ్చును.

శ్రీ సనకసనందన సనత్కుమారాదులు యోగముచేతను, శుక సూతాది మహర్షులు ధ్యానము చేతను, శ్రీ నారద ప్రహ్లాదాది మహాత్ములు భక్తి చేతను, వశిష్ఠ పరాశరాది మునిపుంగవులు కర్మయోగముచేతను, శ్రీ వామదేవాదులు జ్ఞానము చేతను, శ్రీ జనకభగీరథాదులు గృహస్థాశ్రమము నందుండియు, కపిలాది మహర్షులు సాంఖ్యతత్త్వవిచారము చేతను, విశ్వామిత్రాది మునీశ్వరులు తపస్సు చేతను, భరతాదులు వైరాగ్యము చేతను ముక్తి పొందిరి.

**ధ్యానేనాఽఽత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

**అన్యేత్వేవ మజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥**

కొందఱు పరిపక్వమైన బుద్ధిచే ధ్యానము చేసి ఆత్మను పొందుచున్నారు. మరికొందరు ఆత్మానాత్మ విచారము పొందుచున్నారు. మరికొందఱు సాంఖ్యయోగముచేతను, ఇక కొందరు నిష్కామ కర్మయోగముచేతను ముక్తులగుచున్నారు.

ఇంక కొందఱు, ఈ యుపాయముల నెరుంగ సాధ్యము కానివారై

ఇతరులైన గురువులవద్ద విని శ్రద్ధా భక్తులతో దానిని అనుష్ఠించి జనన మరణమైన సంసార సాగరమును దాటి శాశ్వతానంద మోక్షమును పొందుచున్నారు.

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥**

పరమాత్మయైన నా యందు మనస్సును ధ్యానయోగముచే నిలుపుము. అట్లు చేసినయెడల ఇక మీద నిశ్చయముగా మద్రూపుడవై వసియింపగలవు. దీనియందు సంశయము లేదు. అనగా ఆత్మస్వరూపుడ వగుదువని భావము.

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మామిచ్ఛాఽఽప్తుం ధనంజయ ॥**

ఓ అర్జునా ! అట్లు ధ్యానయోగముచే మనోబుద్ధులు నాయందు ఐక్యము చేయుటకు సాధ్యము కానియెడల, అభ్యాస యోగముచే విషయమునుండి మనసును మరలించి నన్ను పొందుటకై ప్రయత్నింపుము.

**అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ।**
**మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥**

అభ్యాస యోగమునకు కూడ సమర్థత లేనియెడల ఈశ్వరార్పణ బుద్ధితో శ్రద్ధాభక్తుడవై పుణ్యకర్మానుష్ఠానము చేయుము. అట్లు నా కొఱకు నిష్కామకర్మము చేయుచుండిన నీవు నన్ను బొందగలవు.

**అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥**

ఇంక దీనిని చేయుటకుగూడ నీవు అశక్తుడవైనయెడల, చేయు కర్మము లన్నియు నాయందు సమర్పించి పుణ్యకర్మములుచేయుట కుత్సాహము గలవాడవై నియతచిత్తుండవై, సర్వకర్మ ఫలత్యాగము చేయుము. దీనిచే నీవు మోక్షము పొందగలవు. అనగా నీవు ఏయే కర్మముల చేయుచుందువో వాటిని నాయందు సమర్పించి ఆ కర్మఫలము గోరకుము. దీనిచే నీవు ముక్తుడ వౌదువు అని గీత.

కరుణానిధియైన శ్రీ కృష్ణ స్వామి జీవులపై అపారమైన కరుణ గలిగి

వారివారికి సాధ్యమైన మార్గములను మోక్షము కొఱకు నేర్పరచిరి. దీనియందు నాలుగు విధములుగా చెప్పియున్నది. ఇవి మృదు, మంద, తీవ్ర, తీవ్రతర, ( ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ) అధికారుల ననుసరించి యున్నవి. ఉత్తమోత్తమునికి అభేద ధ్యానమందు మనఃస్థిరత గలుగును. ఉత్తమునికి అంత మనః పరిపక్వము లేనికారణముచే అభ్యాసయోగము విధింపబడినది. మధ్యమాధికారికి అభ్యాసయోగమునకు గూడ వైరాగ్యాది గుణములు లేనందున నిష్కామ కర్మానుష్ఠానము చెప్పంబడినది. కనిష్ఠాధికారి దానికిని బుద్ధి కుశలత లేనివాడు కనుక వీడు సమస్త కర్మములను ఈశ్వరుని యందు సమర్పింప వలయునని నాలుగు విధములుగా ఏర్పడినది. ఈ భగవదాశయము తెలియక ముముక్షువులయొక్క మనః పరిపక్వత కనిపెట్టక అందరికిని అచలపరిపూర్ణమును బోధించిన యెడల నెంత కష్టము !



## బ్రహ్మవిద్యాధికారము

ప్రశ్న ॥ ఈ ఆత్మజ్ఞానవమునకై జాతివర్ణాశ్రమ స్త్రీ పురుషాది భేదమేమైనను కలదా, లేదా ?

ఉత్తరము ॥ జాతి వర్ణాశ్రమ స్త్రీ పురుష భేదము గలదు, కాని ఆ విషయమై మూఢులు చెప్పురీతి శరీరసంబంధ మేమియు లేదు. మనః పరిపక్వతల ననుసరించి కొన్ని కొన్ని భేదములు గలవు. హృదయ పరిశుద్ధత గలవా రెవరైనను బ్రహ్మవిద్యను అనుష్ఠించి పరమపదమైన మోక్షమును పొందవచ్చును.

బ్రహ్మజ్ఞాన మెుకరివస్తువు మాత్రము గాదు. అది అందరి హృదయమందు నిండియుండునట్టి గొప్పధనము. దానిని తెలియక జీవులు కష్టమునకు పాత్రులగుచున్నారు. ఏయే జాతులయందు, ఏయే కుటుంబమందున్న ధనముచే వారు సుఖము పొందుటలో ఇంక ఒకరికి అసూయ యేల గలుగవలెను ?

> బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాః స్త్రియశ్చాత్రాధికారిణః ।
> బ్రహ్మచారీ గృహస్థో వా ఽనుపనీతో ఽథవా ద్విజః ॥

బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులును. స్త్రీలును గూడ ఈ బ్రహ్మవిద్య కధికారులే. ఆలాగుననే బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థులును, ఉపనయనము లేని బాలుడు గూడ ఈ బ్రహ్మవిద్యకు అధికారులే అని శివగీత.

**బ్రాహ్మణక్షత్రియవిశాం స్త్రీ శూద్రాణాం చ పావనమ్।**
**శాంతయే కర్మణామన్య ద్యోగాన్నాస్తి విముక్తయే॥**

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, స్త్రీ, శూద్రాదు లందరికిన్ని సమస్త కర్మ వినాశనమునకున్ను, పావనమైన మోక్షమునకున్ను, ధ్యానయోగము కంటె పవిత్రమైనది మరియొకటి లేనేలేదని యోగసారము చెప్పుచున్నది.

ఓ ప్రియసోదరా! రోగమున్న వారికి గదా ఔషధమును, వైద్యులున్ను ఏర్పడిరి. ఆలాగుననే అజ్ఞానమను రోగము ఎవరికి అధికముగా గలదో వారికి గదా బ్రహ్మజ్ఞాన మను ఔషధమును, భవరోగవైద్యులైన జ్ఞానులును ఏర్పడినారు. కనుక ఔషధము సేవించువారు పథ్యము మాత్రమొకటి ఉండవలయును గాని, వేరే జాతి వర్ణాశ్రమ స్త్రీ పురుష భేద మేమియు లేదు. భూతదయ, ఈశ్వరభక్తి, శాంతగుణము, నిర్మలత్వముగల వారందరున్ను అధ్యాత్మధ్యాననిష్ఠ చేయవచ్చును. ఇది సత్యమైన వేదముల యొక్కయు, నిత్యుడైన ఈశ్వరుని యొక్కయు, ముక్తులైన మహాత్ములయొక్కయు నిశ్చయాభిప్రాయము. దీనియందు ఎవరికిగాని సంశయమునకు అవకాశము లేదు. ఈ విషయము 17వ ప్రశ్న యందు విశదముగా గనందగును.



## యోగభ్రష్టత్వమునకు కారణము

ప్రశ్న॥ ఓ స్వామీ! కొందఱు కొంత కాలమువరకు వైరాగ్య ధ్యానముతో గూడి అల్పమైన సిద్ధులు గూడ గలిగిన తర్వాత తుచ్ఛమైన విషయమందు ప్రవేశించు చున్నారు గదా! అది వారి ప్రారబ్ధ కర్మమా? లేక ఈశ్వర పరీక్షయా? అది విశదముగా తెలియజేయుడు.

ఉత్తరము॥ ఓ భక్తసత్తమా! ఈ ప్రశ్న నిండా ఉపయోగమైనది. అట్లు కొంతకాలము ధ్యాననిష్ఠ యందున్నవారికి విఘ్నములు గలుగుటకు అనేక

కారణములు గలవు. అది ప్రారబ్ద కర్మమును కాదు. ఈశ్వర పరీక్ష యును గాదు. వైరాగ్యభక్తిలేని కారణముచే అట్లు గలుగుచున్నది. దీనికి మొట్టమొదటి కారణ మేమనగా, వారు ఈ ప్రపంచ మంతయు తుచ్ఛమని తలంచి నిజమైన జ్ఞానమును పొందుట కొరకు నిజమైన ధ్యాన యోగము నవలంబించిన వారు కారు. ఏదో కారణాంతరముచే మందవైరాగ్యము గలిగి వచ్చినవారే కాని నిజమైన వారైన యెడల పునః సంసారమునందు ప్రవేశింపరు. ఎట్లనగా, వాంతియైన వమనాన్నము నెట్లు మరల భుజింపరో ఆలాగుననే త్యజించిన నిస్సారమైన సంసార విషయమును రెండవతూరి కోరరు. లేక విషమని తెలిసిన వారు ఏలాగున దానిని భుజింపరో ఆలాగుననే విషయమను విషమును రెండవతూరి అవలంబింపరు. ఇంకను వేరు కారణములు గలవు. యోగమునకు అనేకములైన విఘ్నములు గలవు. వాటినుండి రక్షించుటకై ఈశ్వరునియొక్క కరుణ నిండియుండవలయును. ఈ కారణముచే మొట్టమొదట ఈశ్వర భక్తి అవలంబింపవలయునని విధించియున్నది. ఇదియును గాక ఈలాటి విఘ్నములు రాకుండుటకై జ్ఞాని యైనవాడు ఏకాంత మందుండి మితాహారముతో సర్వదా బ్రహ్మనిష్ఠయందుండ వలయునని శాస్త్రము చెప్పిన రహస్యము.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥**

ఏ ముముక్షువులు నేనే రక్షకుడనని నిశ్చయము గలవారై, అనన్యభక్తులై, నన్నే సేవించుచున్నారో, అట్టి సర్వదా నన్నే ధ్యానించు యోగుల యొక్క అప్రాప్త లాభమగు యోగమును, ప్రాప్తరక్షణమైన క్షేమమును నేనే నిర్వహించుచున్నాను. అనగా భక్తులకు నేలాటి విఘ్నములు రాకుండ రక్షించుదునని భావము. ఇప్పుడున్న ముముక్షువులలో కొందరికి కొంత కాలము ధ్యాననిష్ఠ యందున్నప్పుడు తనకు తానే అమితమైన ధ్యానానందము గలుగును. గొప్పవారందరికి వీరిపై విశ్వాసము గలుగును. అనేకమైన వాచాసిద్ధులు గూడ గలుగును. బహువిధములైన భోగ్యవస్తువులు వచ్చి చేరును. స్త్రీలు పాదశుశ్రూష కొఱకు గనిపెట్టి నిలుచుచుందురు. ఆ సమయమున మందబుద్ధియైన కారణముచే నేను సర్వజ్ఞుడనని ఒక అహంభావము గలుగును. ఇంక మీద ధ్యాన జప తపములు

ఎందుకు ? పథ్యాపథ్య ఆహారనియమమెందుకు చింతచేయవలెనని యొక దుర్బుద్ధి ఉదయమగును. అప్పుడు తన స్థితినుండి చలించిన కారణముచే కొన్ని దినములు పోయిన తర్వాత విషయమందు మనసు ప్రవర్తించును. కనుకనే భక్తులైన వారు ఏకాంతవాసము, ధ్యాననిష్ఠ, మితాహారము, ఎప్పటికిని వదలకూడదని మహర్షులు చెప్పిరి.

**అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమగ్రహః ।**
**జనసంగశ్చ లౌల్యం చ షడ్భిర్యోగో వినశ్యతి ॥**

సాత్వికాహార మైనను మితముకంటె అధికముగా దినుట, ధ్యాననిష్ఠకు భంగమైన లోకవ్యవహారములు చేయుట, అధికమైన వాచా ప్రసంగము, నియమమును గ్రహించుట, (స్నాన భోజనములు టైమునకు జరుగ వలయునని నిరీక్షించుట) సంసారజన సంగమందు నివసించుట, విషయవాసనయందు మనసుపోవుట అను ఈ యారు కారణముల వలన ధ్యానయోగమునుండి భ్రష్టుడగును అని హఠయోగ ప్రదీపిక.

**శ్రుతి ॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత**
**స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।**
**శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే**
**ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే ॥**

ఒకరు ఆత్మజ్ఞానమందు ప్రయత్నించు సమయమందు శ్రేయస్సును, ప్రేయస్సును వానికి ప్రాప్తించును. శ్రేయ స్సనగా మోక్షము, ప్రేయస్సు ప్రాపంచిక భోగము. అప్పుడు ధీరుడైనవాడు దీనిని బాగుగా యోచించి (దోషములు గనిపెట్టి) అశాశ్వతమైన భోగమును త్యజించి శాశ్వతమైన మోక్షము కోరును. మందుడైనవాడు భోగము గొప్పదని తలంచి విషయమందు ప్రవేశించును అని కాఠకోపనిషత్తు.

**వ్యాధిస్త్యాన సంశయ ప్రమాదాలస్యావిరతి భ్రాంతిదర్శనా**
**లబ్ధభూమిక త్వానవస్థిత త్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః ॥**

రోగము, యోగనిష్ఠాఽనవస్థత, సందేహము, అజాగ్రత, మత్తత, అతృప్తి భ్రమము, సమాధియందు మనసు నిలవకపోవుట, చిత్తచాంచల్యము ; అను ఈ తొమ్మిదియు యోగమునకు విఘ్నములని పతంజలి మహర్షి అభిప్రాయము. ఈ విఘ్నముల నుండి నివృత్తి కొఱకు పరమేశ్వరుని ధ్యానింపవలయును.

స్త్రీణాం స్త్రీసంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్ ।
క్షేమే వివిక్త ఆసీన శ్చింతయేన్మామతంద్రితః ॥

ముముక్షువైనవాడు స్త్రీలను, స్త్రీసంగపురుషులను బహుదూరముగా విడిచి ఏకాకియై నిర్మలమైన ఏకాంతస్థలమునందు ఆసీనుడై ఇంద్రియ సంయమియై ఆత్మచింతన చేయవలయునని శుకులవారి అభిప్రాయము. ( భాగవత ఏకాదశస్కంధము. )

దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్ ।
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా ॥

విషయ త్యాగము బహుదుర్లభము. అభ్యాసయోగముచే విషయ విరక్తి గలిగినను ఆత్మదర్శన మతిదుర్లభము. దానికంటె సహజామనస్కభావ మతిదుర్లభము. ఇదంతయును సద్గురు కృపాకటాక్ష వీక్షణామృతము లేనివారికి సాధ్యము కాదు. అనగా విషయవిరక్తి లేనివారికి ఆత్మతత్త్వము ప్రకాశింపదు. ఆత్మబోధము గలుగనివానికి అమనస్క రాజయోగము సిద్ధింపదని భావము. సద్గురువని ప్రయోగించిన కారణముచే బ్రాహ్మణాది జాతియున్ను, సన్న్యాసాది ఆశ్రమములు చూడపనిలేదు. బ్రహ్మానుభవముగల మహనీయుడు చండాలుడు గాని, స్త్రీగాని, గృహస్థాశ్రమమందున్న వారినైనను గురువుగా స్వీకరింప వచ్చునని హఠయోగ ప్రదీపిక.

రసాయన క్రియావాదో జ్యోతిషం క్రయ విక్రయమ్ ।
వివిధాని చ శిల్పాని వర్జయే త్పరదారవత్ ।

రసాయన క్రియలును, వాదవిద్య, ( తామరాది భస్మము) వైద్యము, మాంత్రికము, జ్యోతిషము, క్రయ విక్రయములు, మరి అనేకములైన శిల్పి

పనులు ముముక్షువైనవాడు పర స్త్రీని వలె వర్జింపవలయును. అనగా ముముక్షువైనవాడు వైద్యము, జ్యోతిషము, మంత్రము, యంత్రములచే భ్రష్టుడగును. ఎట్లనగా, ఈ విషయమునకై ప్రారంభించునపుడు అనేకమైన పామర మనుష్యుల సంసర్గమునకు కారణ మగును. అపుడు క్రమక్రమముగా మట్టియందు బడిన కత్తి చిలుము బట్టి నశించు చందమున వీడును భ్రష్టు డగును. లేక నదీతీరమందున్న గొప్ప వృక్షమైనను జలము యొక్క అలలచే మట్టి కరిగి పోయి యెట్లు ఆ వృక్షము నదియందు పడుచున్నదో ఆలాగుననే గొప్ప యోగియైనను ప్రపంచ విషయముచే క్రమముగా భ్రష్టుడగును. కనుక ముముక్షువైనవాడు సర్వసంగ విముక్తుడై ఉండవలయును. ఉన్నతస్థితిని బొందిన బ్రహ్మనిష్ఠ లనేకులు వైద్యముచేతను, మంత్రము చేతను పతితులైన వారిని నేను కన్నులార చూచితిని.

సమాధౌ క్రియమాణే తు విఘ్నాన్యాయాంతి వై బలాత్।
అనుసంధాన రాహిత్య మాలస్యం భోగలాలసమ్ ॥
లయస్తమశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా।
ఏవం యద్విఘ్న బాహుల్యం త్యాజ్యం తద్బ్రహ్మవిజ్జనైః ॥

సమాధిని అభ్యసించువానికి విఘ్నములు తనంతటనే బలాత్కారముగా అనేకము వచ్చి చేరును. అవేవనగా, అనుసంధానము లేకుండుట, ఆలస్యము భోగేచ్ఛ, నిద్ర (మందత) అవివేకము, రసాస్వాదము, (అనగా నేను బ్రహ్మానుభవము పొందినవాడనను) అభిమానము. శూన్యత్వము ( ఈశ్వరుడు లేడను భావము). ఇట్లు సంభవించు విఘ్నములను బ్రహ్మవేత్తలు జాగరూకులై కనిపెట్టి తొలగించుటకై ప్రయత్నము చేయవలయును. లేనియెడల మోసపోయి పతితు లగుదురు. ఈ రహస్యము తెలియక ఇప్పుడు రాజయోగుల మని చెప్పువారిలో కొందరు కొంతకాలము ధ్యాననిష్ఠ అవలంబించి పరిపూర్ణత్వమునకు ముందుగా ధ్యాననిష్ఠ మనన నిదిధ్యాసనముల వదలి గర్వితు లగుచున్నారు. వారికి జ్ఞానము పొంద సాధ్యము కాదు. ఒకరు జ్ఞానియైనయెడల వారు నిండా జాగ్రత్తగా నుందురు. ఎట్లనగా, ధనముండు బ్యాంకీలకు గదా కావలి యుండవలయును. ఆలాగుననే

ఫలముండు వృక్షములకు మాత్రము కావలి యుండవలసియున్నది. పై జెప్పిన వైద్యము తీవ్ర బ్రహ్మనిష్ఠులకు ప్రతిబంధమని చెప్పినదే కాని తదితరులకు విరోధ మనియు, వైద్యము చెడ్డదనియు భావము కాదు.

## జ్ఞానావలంబన తరుణము

ప్రశ్న ॥ అయ్యా ! స్వామీ ! ఈ పరమ పవిత్రమైన ఆత్మజ్ఞానము సిద్ధించుటకై బాల్యకాలమందు ప్రయత్నించు వారికి అనేక విఘ్నములు వచ్చుననియు, ప్రపంచ సుఖమును అనుభవించి తృప్తుడైన తర్వాత భంగములు రావనియు కొందరు చెప్పు మాటలు నిజమా?

ఉత్తరము ॥ ఓ ప్రియ సోదరుడా ! ఆత్మజ్ఞానము సిద్ధించుటకై బాల్యకాలము నిండా మంచి తరుణము. అప్పుడు వారి హృదయము రాగద్వేషములచే చెడలేదు. మృదువైన మట్టియందు వృక్షము బహు శీఘ్రముగా వృద్ధి పొందునేకాని బండ మీద వృద్ధియగుట దుర్లభము. ఆలాగుననే బాల్యకాలమందు మనసు మృదువై, పవిత్రమై యుండును. వార్ధక్యావస్థ యందు ప్రపంచవాసనచే మలినమై, కఠినమై యుండును. బాల్యకాలమందు అజ్ఞాన వృక్షము అంకురమై యుండును. అది వృద్ధాప్యమున గొప్ప వృక్షమై శాఖోపశాఖలచే విస్తీర్ణమైయుండును. ఒక చింత చెట్టు మొలకెత్తునపుడు గోటిచే త్రుంచి వేయవచ్చును. గొప్పవృక్షమైన వెనుక దానిని నాశము చేయుట కెంతకష్టము ! లేక ఒక వెదురు లేతకాల మందొకటియైనను శింబులు పుట్టవు. అప్పుడు ఆ గుమినుండి సులభముగా తీయువచ్చును. కొన్నిదినములు దానియం దుండునపుడు, ప్రతి గెనుపు నందును రెమ్మలుపుట్టి ఆపాదచూడ పర్యంతము ఒక దానికొకటి పరస్పరము బంధమగునప్పుడు ఆ గుమినుండి దానిని బయటకు తీయుటకు నెవరికి సాధ్యమగును ? ఆలాగుననే బాల్యమందు దుర్వృత్తులైన రెమ్మ లుద్భవింప లేదు. సంసారమందు కొంత కాల ముండునపుడు పుత్ర మిత్ర రాగ ద్వేషము లను రెమ్మలచే కట్టుపడి విముక్తుడగుట బహుకష్టము. కనుకనే ఏ యొక్క మహనీయుల చరిత్రము చూచినను వారందరున్ను చిన్న కాలమునుండి భక్తులై కనపడుచున్నారు. విషయ సుఖమును అనుభవించి, తర్వాత మోక్షమునకు ప్రయత్నము చేయువలయునని చెప్పువారు అగ్నిచే ఇల్లు

దహించునపుడు నూయి త్రవ్వి జలము సంపాదించి చల్లార్చ వచ్చునని చెప్పు మూఢులవంటి వారని గరుడపురాణమందు చెప్పియున్నది.

ఇదియుగాక ''న హి ప్రమాణం జంతూనా ముత్తరక్షణజీవనే'' అన్నట్లు మృత్యువు ఏ సమయమందు తటస్థించునో తెలియదుగదా ! కాబట్టి వార్ధక్యపర్యంతము జీవింతుమని యెట్లు తెలియును ? కనుక ఒక నిమిషము ముందు ఆత్మచింతన చేసినవారు ధన్యాత్ములు. ఇంక మరియొక దృష్టాంతము గూడ గలదు. ఒక గుమ్మడి తీగ కల్లమండలయందు ప్రవేశించిన తర్వాత నెట్లు పిమ్మట లాగిన యెడల రాదో, ఆలాగుననే విషయమందు ప్రవేశించిన మనసు విముక్తి పొందుట బహుకష్టము.

**మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా ।**
**పారం దుఃఖోదధేర్గంతుం తర యావన్న భిద్యతే ॥**

ఓ జనుడా ! నీవు దుఃఖసాగరముయొక్క యావలియొడ్డు చేరుటకై గొప్ప పుణ్య మను క్రయముచేత ఈ శరీర మను నోడను కొని యుంటివి. కావున ఈ శరీర మను నోడ భిన్నమై పోవుటకు ముందే దుఃఖ సాగరమును దాటుము.

**ఉద్ఘాటిత నవద్వారే పంజరే విహగోఽనిలః ।**
**యత్తిష్ఠతి తదాశ్చర్యం ప్రయాణే విస్మయః కుతః ॥**

తెలుపబడిన తొమ్మిది వాకిళ్లు గల ( నవ ద్వారములు గల) ఈ దేహ మను పంజరము నందు ప్రాణవాయు వను పక్షి నిలిచి యుండుట యేది గలదో అది యాశ్చర్యము గాని దీని నుండి వెడలి పోవుట యెట్లు ఆశ్చర్యమగు ననుటచే ఉత్తరకాలము నమ్మరాదనుట సిద్ధము.

**కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత**
**రద్యైవ మే విశతు మానసరాజహంసః ।**
**ప్రాణ ప్రయాణ సమయే కఫ వాత పిత్తైః**
**కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥**

ఓ శ్రీ కృష్ణ పరమాత్మా ! తామర రేకువంటి నీ యొక్క పాదపంజర మందు నా యొక్క మనస్సను రాజహంసము ఇప్పుడే ప్రవేశించుగాక ! వార్ధక్యమున

వాత పిత్త శ్లేష్మములచే కష్టపడు కాల మందు నిన్ను ఎట్లు స్మరింతును ? అనగా వార్ధక్యకాలమందు సాధ్యము కాదని అర్థము.

## పరులచే విషయాశ దుఃఖమని తెలిసికొనుట

ప్రశ్న ॥ విషయభోగముల ననుభవించి వాటియందుండు కష్టములు తెలియక విషయాదులందు ఎట్లు విరక్తిగలుగును ? ముష్టికాయ లైనను తినని యెడల చేదు తెలియునా ?

ఉత్తరము ॥ ఓ సద్గుణ నిధీ ! సంసారమందు అనేకులు కష్టపడుచుండు విషయము చూచినయెడల తెలియదా? నీ యొక్క యుక్తి యెట్లుండె ననగా, ఒకరు అగ్నిచే దహింపబడి సంకటము చెందుచుండగా వానిని చూచి తెలుసుకొనక వీడును ఆలాగుననే అగ్నియందు ప్రవేశించి చూడవలయునని చెప్పురీతిగా నున్నది. ఆలాగుననే తాపత్రయాగ్నిచే తపించు జీవులయొక్క పరమసంకటము చూచిన తెలియదా ? లేక ఒకరు వృక్షమందుండి క్రిందపడి కర చరణ దంతములు శిథిలమై దుఃఖపడు సంగతిచూచి యెరుంగక వీడును చెట్టుమీదికెక్కి క్రిందపడి ఆ కష్టముననుభవించిన తెలియునని చెప్పురీతిగా నున్నది నీ యొక ఊహలు

**ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమ్ ।**

అనగా, మలమందు ప్రవేశించి శుద్ధిచేయుటకంటె, దానియందు ప్రవేశింపకుండుట శ్రేష్ఠమని శాస్త్రసిద్ధము. లేక విషమును భుజించి చికిత్స జేసి సుఖపడుట కంటె, విషము తినకయుండుట మేలు గదా !

**సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్ ।**
**అనంతం బ్రహ్మనిష్ఠానా మితి వేదాంతడిండిమః ॥**

సంసార విషయ మందుండు జనులు, అల్పమైన సుఖమును, బహుదుఃఖమును పొందుదురు. బ్రహ్మనిష్ఠులైనవారి సుఖము అనంతము.

**అసత్యస్సర్వసంసారో రసాభాసాదిదూషితః ।**
**ఉపేక్ష్యో బ్రహ్మ విజ్ఞేయ మితి వేదాంతడిండిమః ॥**

అసత్యమైన ఈ నిస్సార సంసారము రసాభాసాది దూషితము. అనగా

విషము గలిగిన క్షీరాన్నమువలె తినునప్పుడు మధురముగాను, తర్వాత ప్రాణహానియు గలుగునట్లు, సంసారము ఆదిలో సుఖము, అంత్యమందు కష్టమై యుండును. కాబట్టి బ్రహ్మవేత్త లవశ్యము త్యజింపవలయును. సంసారమందు ప్రవేశించిన తర్వాత దాని నుండి వదలివచ్చుట మిక్కిలి కష్టము. అగ్నిని చూచి మిడుతలు ( శలభములు) భ్రమసి ఆశచే అందులో ప్రవేశించిన వెంటనె ప్రాణహాని గలుగునట్లు, సంసారమునందు సుఖముండునను భ్రమచే మనుజులు దానిలో ప్రవేశించిన యెడల వారికి అదే ప్రాణాంతకమని భాగవతము ఏకాదశస్కంధములో చెప్పియున్నది. లేక గాలమందున్న మాంసమును చూచి దానిలోపలనుండు అపాయము తెలియక ఆశచే మ్రింగిన చేపలెట్లు నశించునో, ఆలాగుననే విషయ సుఖమందు అంతర్భూతమైన కష్టము తెలియక మనుజులు కష్టపడుచున్నారు. మరియొకటి మూషికములకు హంతయగు బోనులో ఉంచియుండు పండ్లు తినుటకె ప్రవేశించిన యెలుకలెట్లు బయటవచ్చుటకు వీలులేక కష్టపడుచునానో ఆలాగుననె విషయాశచె సంసారములో ప్రవేశించునవారు కష్టపడుదురు. కనుక నాయనా, దానియందు ఆశను వదలుము. అది మంచిది కాదు.

## మోక్షార్థులకు కాల సమయము చూడ పని లేదు

ప్రశ్న ॥ ఓ స్వామీ ! దేవా ! తమరు దీనికి ముందుగా సెలవిచ్చిన ప్రకారము బాల్య కాలమందు జ్ఞానమార్గావలంబి కానియెడల మోక్షము దొరకదని చెప్పిన కొందరు యౌవన కాలమందును, మరికొందరు వార్ధవస్థయందును, మోక్షమార్గావలంబులై యుండుటయే గాక, మరికొందరు బాల్యమందు జ్ఞానము నవలంబించి పరిపూర్ణత్వము పొందుటకు మునుపే మరణించిన వారికి గతి లేదని తమ అభిప్రాయమా ?

ఉత్తరము ॥ ఓ నాయనా ! బాల్య, యౌవన, వార్ధకావస్థల యందు గూడ జ్ఞాన మవలంబంచి ముక్తిని పొందవచ్చును. దీనికి ఒక కాలసమయము లేదు. ''బ్రహ్మవిద్బ్రహ్మ భవతి '' అని శ్రుతి చెప్పుచున్నది. అనగా ఏ సమయమందు బ్రహ్మము నెఱుంగునో, అప్పుడే వాడు బ్రహ్మమగుచున్నాడు. ''స్థిత్వాఽస్యామన్త కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి '' అని గీతాశాస్త్రముగూడ చెప్పుచున్నది.

అనగా ప్రాణము కంఠగతమైన అంత్యకాలమందైనను బ్రహ్మ జ్ఞానమందు స్థిరత్వము గలిగిన యెడల వాడు ముక్తుడగుచున్నాడని భావము

ఒకరు వార్ధక కాలపర్యంతము దరిద్రుడైనను, అంత్యకాలమందు ఒక గొప్ప నిక్షేపము దొరికినయెడల ఆ దరిద్ర దుఃఖము పోయి ఎట్లు ధనవంతు డగుచున్నాడో, లేక గుహయందు బహుకాలము ప్రకాశము లేక చీకటై యుండినను, ఒక దీపముంచిన తత్సమయమందే అనాది కాలముగా ఉండిన అంధకారము తొలగినట్లును, ఒకరి హృదయమందెంత కాలమువరకు అజ్ఞానాంధకార ముండినను ఎప్పుడు జ్ఞానము గలుగునో అప్పుడే వాడు జ్ఞానియై ముక్తు డగును. మరియు ఒక్కరికి బహుకాలముగా నేత్రమందు తిమిరరోగ ముండినను యెప్పుడు దానికి దివ్యాంజనము వేయుదురో, ఆ క్షణముననే చూపు తెలియునటుల అనాదియైన అజ్ఞానాంధకారముచే గూడియుండినను, జ్ఞానాంజనము వేసిన యెడల దివ్యదృష్టి గలిగి ముక్తుడగును. లేక ఒక కొండపై అనేక కాలముగా బడియుండిన కట్టెలు మొదలగునవి అగ్ని సంయోగముచే ఎట్లు భస్మమగుచున్నవో, ఆలాగుననే అనాది కాలముగా నుండిన కర్మ సంఘమంతయు జ్ఞానాగ్ని ప్రవేశించిన వెంటనే ధ్వంసమై ముక్తుడగు చున్నాడు. కాబట్టి ప్రాణ మున్నప్పుడు ఒక నిమిషము ముందుగా ఈ బ్రహ్మవిద్యయైన బీజ మెవరి హృదయమందు నెలకొనునో, వారే ధన్యాత్ములు. ఇంక రెండవ ప్రశ్నకు ఉత్తరము.

ఈ జన్మమందు జ్ఞానము ననుష్ఠించి పూర్తినొందని వారి మరణానంతర గతి ఏమియని గదా ? బ్రహ్మవిద్య నభ్యసించువారికి ఈ జన్మమునందు మోక్షము గలుగని యెడల సుఖమం దభిలాష యుండిన వారు స్వర్గలోకములో అనేక కాలము దివ్యభోగము లనుభవించి ఉత్తమ కులమందు జన్మించి జ్ఞానము పూర్తికొఱకు చిన్ననాటినుండి ప్రయత్నించి ఆ జన్మమునందు ముక్తుడగును. లేక అర్చిరాది మార్గముగా బ్రహ్మలోకము ప్రవేశించి బ్రహ్మదేవుని వలన ఉపదేశము పొంది ముక్తుడు కావచ్చునని మరియొక మార్గము గలదు. ఒక్కరు బి. ఏ. క్లాసునందు చదువునప్పుడు పరీక్షయందు నాలుగు విషయములుండినను దానిలో మూడింట విజయము పొందిన తక్కిన ఒకటికి మాత్రము మరు సంవత్సరములో పరీక్ష కావలెనే గాని నాలుగున్ను కావలసిన ఆవశ్యకత లేదు. ఆలాగుననే ఈ జన్మమందు చేసిన ధ్యానయోగశక్తిచే పరిపూర్ణమము కాని యెడల తక్కినది మరుజన్మమునందు

చేసి ముక్తుడగును. మరియు పగ లొక రొక పనిని చేయునపుడు పూర్తికాక మునుపే రాత్రియైన యెడల రాత్రి అంతయు ఆ పనియందు విచారవముండి సూర్యోదయమైన వెంటనే ఆ పనికి పోవునట్లు, ఈ జన్మము నందు జ్ఞానము పూర్తి కాక మరణము పొందిన వారికి ఆ జ్ఞానమందే సర్వదా మనసు పోవును గాని వేరుగా మరియొక విషయమునకు మనసు పోదు. ఎప్పుడు జన్మము దొరుకునా యని చింతతో గూడియుండి జన్మమెత్తిన వెంటనే జ్ఞానమార్గమందు ప్రవేశించునే గాని, సంసారమందు ప్రవేశింపదు. అట్లున్నవారే చిన్నతనము నుండి భక్తులై కనపడుచున్నారు. ఎట్లనగా, బాతుగ్రుడ్లను కోడిగ్రుడ్లను గూడ కోడిపొదుగునందు పెట్టినచో రెండును పిల్లలవును. కాని బాతుపిల్లలు అప్పుడే నీటియందు దుముకును. కోడిపిల్లలకు అది సాధ్యము కాదు. ఆలాగుననే ఒక తల్లి గర్భమందు అనేకులు పుట్టినను పూర్వజన్మ సంస్కారము మున్నవారు మాత్రము చిన్ననాటి నుండి జ్ఞానము అవలంబించుచున్నారు. తక్కిన వారికి అది సాధ్యము కాదు. లేక కాకుల గూటియందు దానిగ్రుడ్లతో గూడ కోవెలయు తన గ్రుడ్ల నుంచును. పిల్లలైన తర్వాత వర్ణమున్ను, స్వభావమున్ను, కాకిపిల్లలకు కోవెల పిల్లలకు ఒకే విధముగా నుండినను స్వరములు మాత్రము వేరుగా నుండును. కోవెల యొక్క మనోహర స్వరమును గనిపెట్టిన కాకులకు దానితో విరోధము గలుగగా అది వేరుగా పోవును. ఆలాగుననే ఒక మాతృగర్భమందు పుట్టిన అన్నదమ్ము లక్కచెల్లెంద్రందరు ఒక మాదిరిగా నుండినను, పూర్వజన్మ సంస్కారము గలవాడు కొన్నిదినములు పోయిన తర్వాత భజన ధ్యానములను ఆరంభించును. వానికి సంసారవిముక్తి కూడ గలుగును. అప్పుడు వారికుటుంబస్థులకును వానికిని గుణములు పరస్పరము పట్టక మనోవిరక్తి గలిగి వాడు వీరి నందరిని త్యజించి విరాగియై పోవును.

**పార్థ ! నైవేహ నాఽముత్ర వినాశస్తస్య విద్యతే ।**
**న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥**

ఓ పార్థా ! యోగధ్యానముల నవలంబించి పూర్తికాక మునుపు మరణము పొందినవారికి పరలోకమందు గాని, ఇహలోకమందు గాని దుఃఖమునకు కారణము లేదు. నాయనా ! శుభకర్మము చేయువాడెవడైనను ఎప్పటికైనను దుర్గతి పొందడు.

**ప్రాప్య పుణ్య కృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥**

యోగభ్రష్టుడైనవాడు శరీరపతనానంతరము పుణ్యవంతుల లోకము పొంది అచ్చట బహుకాలము సుఖము ననుభవించి పరిశుద్ధులును, శ్రీమంతులునగు వారి గృహమందు పుట్టుచున్నాడు. ''అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం'' బుద్ధిమంతులై జ్ఞానవంతులగు యోగులైనవారి కులమందైనను జన్మించును.

**తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।**
**యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన ॥**

ఓ కురునందనా ! ఆ జన్మమందు పూర్వదేహమం దభ్యసించిన ఆ బుద్ధిసంబంధమగు యోగానుష్ఠానమును పొందుచున్నాడు. అప్పుడు తక్కిన యోగము పూర్తికొరకు చిన్ననాటినుండి మిక్కిలి అధికముగా ప్రయత్నించు స్వభావము గలవాడగును.

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాఽతివర్తతే ॥**

పూర్వజన్మమునందు చేసిన యోగధ్యానముచే విషయమందు పరవశుడైనను , బలాత్కారముగా మనసును విషయమునుండి ఆకర్షించును. జ్ఞానమును తెలియగోరువాడు గూడ వేదము నతిక్రమించిన బ్రహ్మపదము పొందుచున్నాడు. తెలియుటకై అభిలాష గలవాడే బ్రహ్మపదము పొందుచున్నప్పుడు అభ్యాసము చేయువాని సంగతి చెప్పవలయునా ? అని భావము. కాంతము ఏలాగున ఇనుమును ఆకర్షించునో , ఆలాగుననే పూర్వజన్మ సంస్కారశక్తియను కాంతము విషయాదులనుండి మనసును ఆత్మధ్యానమునకై లాగును. ఇది శ్రీ కృష్ణ స్వామి అపారకృపచే చెప్పినారు. అనగా జనులారా ! ధ్యానయోగమునకు సాధ్యము లేనియెడల చేయవలయుననెడి ఉద్దేశమైనను ఉంచుకొందురు గాక ! విచారము బీజము వంటిది. బీజము పెట్టిన యెడల ఒక సమయమందు మీకు తెలియకనే మొలక వచ్చును. అప్పుడు మీరు ధన్యాత్ములగుదురని భావము.

## నరక స్వర్గముల విమర్శ

ప్రశ్న ॥ ఓ స్వామీ ! నా కొక గొప్ప సంశయము గలదు. అదేమనగా మనుజులు మరణానంతరము పుణ్య పాపములు చేసినవారు స్వర్గ నరకముల ననుభవించిన యెడల ఇచ్చట నందరున్ను ఒకటే ప్రకార ముండవలయును గదా! అట్లు కనుపడుట లేదు. కనుక నరక స్వర్గములను సత్యమని నమ్ముటకు వీలులేదు.

ఉత్తరము ॥ ఓ నిర్మలహృదయముగల సోదరుడా ! అట్లు చెప్పకూడదు. బహు పాతకము. మన ఋషీశ్వరు లెప్పటికిన్ని అబద్ధము చెప్పువారు కారు. వారందరున్ను నరక స్వర్గాదులగు త్రిలోకములందు సంచరించువారై యున్నారు. దీని రహస్యము లోతుగా దిగి యోచించిన యెడల గనందగును. ఎట్లనగా జీవులయొక్క పుణ్య పాపానుసారముగా పాపము చేసినవారు కొంత పాపము మాత్రము నరకమందనుభవించి తక్కిన పాపమునకు భూలోకమందు కష్టజన్మము ఎత్తవలయునని యమధర్మరాజు విధించును. ఆలాగుననే పుణ్యకార్యములు చేయువారు స్వర్గభోగ మనుభవించి భూలోకమందుత్తమ జన్మమందు జన్మించుటకై నియమించును. దీనికిని కర్మశేషమని పేరు. ఎందుకు అట్లు చేయవలెను ? పాపనాశమువరకు నరకమందు పెట్టకూడదా ? లేక స్వర్గమందుంచకూడదా ? అని ఒక చోద్యమునకు వీలు గలదు. అట్లు పరలోక మందు పుణ్యాపాపముల ననుభవించి అందరున్ను సమముగా నుండిన యెడల మనుజుల యొక్క మందబుద్ధిచే స్వర్గనరకములు లేనేలేవని చెప్పుటకై ఏమియున్ను సంశయింపరు. ఆలాగుననే పుణ్యకర్మ ఫలముచే గొప్పవా రగుదురను విచారము లేకపోవును. కనుక జీవులయొక్క ఉపకారార్థమై ఇహమందుగూడ పాపపుణ్యఫలములు తెలియుటకై అట్లు ఈశ్వరుడు చేయుచున్నాడు. ఇట్లు లేని యెడల లోకము నిండా హీనస్థితికి వచ్చును. దీనికి దృష్టాంతము ఆదికాలమందు రాజులు గొప్ప తప్పులు చేయువారిని నాలుగు మార్గములు చేరు రాజవీధియందు శిక్షించుచుండిరి. అది యెందుకనగా, దీనిని చూచి మనుజు లింక మీద పాపకృత్యము లైన తప్పులు చేయకుండుటకై అట్లు చేయుచున్నారు. ఆలాగుననే మంచి సన్మార్గియై బాగుగా విద్య నభ్యసించిన వారికి గొప్ప గొప్ప

ఉద్యోగములు కూడ నిచ్చుచున్నారు. శాస్త్రము కూడ ఈలాగుననే చెప్పుచున్నది. ''రౌరవం నరకం గత్వా చండాలేష్వపి జాయతే'' అని కనపడుచున్నది. అనగా ఘోరనరకము ననుభవించినతర్వాత హీనజన్మమందు జన్మించును.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

అని గీతాశాస్త్రము. దీనియొక్క రహస్యమిదియే.

## కర్మత్రయ నిరూపణము

ప్రశ్న ॥ సంచిత, ఆగామి, ప్రారబ్ధకర్మవులు త్రివిధవులుగా ఉండునపుడు ప్రారబ్ధము భోగముతో నశించుననియు, జ్ఞానముచే సంచితము నశించుననియు చెప్పునది సరియే గాని, ఇప్పుడున్న మహనీయులు కొందరు బ్రహ్మనిష్ఠ యందును, మరికొందరు తపోనిష్ఠ యందును గనపడుచున్నారు. దానియొక్క గొప్ప ఫలమైన ఆగామి యెట్లు నశించును ?

ఉత్తరము ॥ ఓ సద్గుణశాలీ ! ప్రారబ్ధాది కర్మత్రయములయొక్క స్థితి జీవన్ముక్తులైన మహనీయులకు చెప్పినది కాని తదితరులైనవారు ఆ పదమున కర్హులు కారు. జీవన్ముక్తులలో కొందరు మాత్రము తపోధ్యాన మందుందురే కాని మరికొందరు సాక్షిమాత్రులై ప్రారబ్ధ మనుభవించుచుందురు. తపోధ్యానములు చేయుట గూడ ఫలము నపేక్షించి కాదు. జన్మాంతరవాసనాశక్తిచే అట్లు చేయుచున్నారు. అదిన్ని ప్రారబ్ధ మని చెప్పవచ్చును. ఎందుకనగా, అనేక జన్మములందు చేసిన తపోధ్యానశక్తిచే జ్ఞాన ముదయమగునని శాస్త్రము చెప్పుచున్నది. కనుక సంచిత శేషమిప్పుడు తపోరూపమై రావచ్చును. ఇది యిట్లుండ నిమ్ము, ఏ సమయమందు జ్ఞానోదయమైనదో అప్పుడు కర్మఫలము గాని కర్మము గాని వానికి లేనే లేదు. కర్మవు, కర్మఫలవు, కర్త, భోక్త, నీవు, నేను అని చెప్పునదంతయు భ్రమయే గాని, మరియేమియు గాదు. స్వస్వరూపస్థితి (తనయొక్క యథార్థస్థితి) గలుగునప్పుడు అప్పుడే వాడు నిత్యశుద్ధజ్ఞానస్వరూపుడని తనంతటనే నిస్సంశయముగా దృఢ ప్రజ్ఞ కలుగును. అప్పుడు వానికి తనకు తానే జన్మము లేని నాకు కర్మ యెట్లు గలుగునని గోచర మగును. కర్త గాని నాకు కర్మఫలమైన భోక్తృత్వ మెట్లుండునని స్థిరమైన యొక జ్ఞానశక్తి గలుగును.

జ్ఞానమనగా భ్రమనివారణమే. రజ్జువును చూచి సర్పమని భయపడిన వానికి తర్వాత సర్పము గాదని తెలిసికొనిన వెంటనే సర్పభ్రాంతిచే గలిగిన భయము నివృత్తమగుచున్నది. మరియు స్వప్నమందు గనిపించు పులిని చూచి భయకంపితుడైన వానికి మేలుకొనిన వెంటనే ఆ పులి తనను చంపునను భీతి యుండునా ? ఆలాగుననే అజ్ఞానదశ యందు జీవు డనియు, కర్తయనియు, భోక్తయనియు తోచి భ్రమించువాడు జ్ఞానోదయమైన పిమ్మట ప్రారబ్ధకర్మములకు బద్ధుడు కాకయుండు సంగతి పరులకు తెలియ సాధ్యము కాదు. జ్ఞానికి గూడ శరీర మున్నంతవరకు ప్రారబ్ధవశముగా సుఖదుఃఖములున్నట్లు పరులకు తోచును గాని, ఆ సుఖదుఃఖములు వానికి లేనేలేవు. దేహత్రయ విలక్షణుడైన వానికి దేహసంబంధమైన సుఖదుఃఖము లెట్లుండును? ఎట్లనిన, ఒక చింతకాయ పచ్చికాలమందు దాని బొప్పితో గూడియుండగా పైన తగులు దెబ్బ బొప్పెతోకూడ లోపల గుజ్జును బాధించును. ఆ కాయ పండు పండిన తర్వాత బొప్పెవేరై గుజ్జు వేరై (పండు) ఉండును. అప్పుడు బొప్పెకు తాకు దెబ్బ యేమాత్రము గాని పండును అంటదు. మరియు టెంకాయ పచ్చిగా నున్నప్పుడు బహిర్భాగమందు తాకు దెబ్బ లోపలి కొబ్బరకు సోకి చెడును. అది పండిన పిమ్మట జలమంతయు నశించి చిప్పనుండి వదలిన తర్వాత చిప్ప పగల గొట్టినను దానిలోపలనుండు కొబ్బరకు ఏమియును బాధ కలుగదు. ఆ కొబ్బరచెడకయుండును. ఆలాగుననే అజ్ఞానదశయందు శరీరమే తాననియుండు కారణముచే శరీర సంబంధమైన సుఖదుఃఖములన్నియును వానిని బాధించుచున్నవి. జీవన్ముక్తుడైన తర్వాత శరీరబాధలు ఏమిన్ని వానికి అంటవు. సర్పము విడిచిన కుబుసము ( చర్మము) గాలిచే చలించినపుడు దాని నిజము తెలియనివారు వాస్తవముగా సర్పమని భ్రమించినను, కుబుసము మనిషిని కఱచి బాధ పెట్టునా ? ఆలాగుననే జ్ఞానియొక్క శ రీరము అజ్ఞాని శరీరమువలె ఉండినను పామరుల కుండు రాగద్వేషాదులు వానికి లేవు. సర్పము వేఱు. కుబుసము వేఱు. అట్లు జ్ఞానియగువాడు దేహత్రయాతీతుడు. ఈ రహస్యము స్వానుభవముచే తెలుసు కొనదగునుగాని ఇతర విధమున సాధ్యము కాదు. కనుకనే జ్ఞానియొక్క కర్మము దగ్ధపటన్యాయరీతియని చెప్పియున్నది. అనగా ఒక కాగితము గాని, లేక వస్త్రము గాని, లేక త్రాడు గాని అగ్ని యందు దహించినను ఆలాగుననే ఉండునుగాని

దాని యందు వ్రాయుటకు గాని, ఆ వస్త్రము ధరించుటకు గాని, త్రాడుచే కట్టుటకు గాని ఉపయోగము లేనట్లు జ్ఞానియొక్క శరీరాది సుఖదుఃఖములు పరులకు చూచునపుడు గనుపడినను నిజముగా వాని కవి లేవు. దీనిని శాస్త్రమందు ఈ రీతిగా మరియొక విధముగాను చెప్పియున్నది. ఇదియును గూడ మంచి ఉపాయమే.

ప్రారబ్ధం భోగతో నశ్యే త్తత్త్వజ్ఞానేన సంచితమ్ ।
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్ద్వేషి ప్రియవాదినోః ॥

ప్రారబ్ధము భోగముతోగూడా నశించును. జ్ఞానాగ్నిచే సంచితము భస్మమగును. ఆగామి ( అనగా ఇప్పుడుచేయు సంకల్ప కర్మములకు రాబోవు ఫలమునకు ఆగామి యని పేరు. ) ప్రియ ద్వేషివాదులచే హరించి పోవుచున్నది.

ప్రారబ్ధం భోగతో నశ్యే చ్ఛేషం జ్ఞానేన దహ్యతే ।
ఇతరం ద్వితయం కర్మ తద్ద్వేషి ప్రియవాదినామ్ ॥

దీని అర్థము పై చెప్పినదే ( శివతత్త్వజ్ఞానము. )

తత్త్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే ।
దేహాదీనామసత్వాత్తు యథా స్వప్నో నిబోధతః ॥

మేలుకొనిన తర్వాత కలయందు గనుపడిన వస్తువులు లేనట్లు, తత్త్వ జ్ఞానోదయమైన తర్వాత దేహాదులు అసత్తగుటవలన ప్రారబ్ధము లేదనుట.

కర్మ జన్మాంతరీయం యత్ప్రారబ్ధమితి కీర్తితమ్ ।
తత్తు జన్మాంతరాభావాత్ పుంసో నై వాస్తి కర్హిచిత్ ॥

జన్మాంతర కర్మమెద్దియో, అది ప్రారబ్ధ మనబడును. పురుషునకు జన్మమే లేనందున ఆ కర్మము కొంచమైనను లేదు అని అపరోక్షానుభూతి.

## మోక్షమునకు పుత్రు డనావశ్యకము

ప్రశ్న ॥ అనేక స్త్రీ పురుషులు పుత్రసంతానము లేనివారికి గతి లేదని చెప్పి అనేకములైన యజ్ఞ, దాన, తపములు ఆచరించి బహువిధ కష్టములకు

పాత్రు లగుచున్నారుగదా ! దీనికి సరియైన శాస్త్రములనున్ను వారు చెప్పుచున్నారు. ''అపుత్రస్య గతిర్నాస్తి'' - ఇది సరియా ?

ఉత్తరము ॥ ఓ సద్గుణశీలా ! ''అపుత్రస్య గతిర్నాస్తి'' అని చెప్పిన శాస్త్ర మందరికిని సంబంధించినది కాదు. ఆ శాస్త్రము సంసారమందుండు ఆదికాలపు రాజులకు చెల్లును గాని తక్కిన వారలకు గాదు. రాజులు పుత్రుని ముఖమును దర్శించి తపస్సుకొఱకు అరణ్యములకు వెళ్ళుట పూర్వకాలస్వభావము. అప్పుడు రాజ్యపరిపాలనకొఱకు పుత్రుడు ఆవశ్యకమైయుండుట వలన అట్లు చెప్పిరి. కాని మఱియొక హేతువు కాదు. ''అపుత్రస్య గతిర్నాస్తి'' యను శాస్త్రము కూడ కర్మకాండ సంబంధమేగాని జ్ఞానకాండము ననుసరించి కాదు. పుత్రులు లేనివారికి మోక్షము లేనియెడల అనేక ఋషి శ్రేష్ఠులు నిత్యబ్రహ్మచారులై కనపడుచున్నారు. వారికి మోక్షము లేకుండా పోవునా ? శ్రీ నారద, శుక, సనక సనందనాది అనేక తపోనిధులేకాక శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యాది అనేక మహాత్ములు సన్న్యాసులై కన్పట్టు చున్నారు. పుత్రులు లేనివారికి గతులు లేవని చెప్పుమాటలు వట్టి భ్రమయే గాని మరియేమి యునుం గాదు. తండ్రి రోగమం దున్నప్పుడు పుత్రు డౌషధము సేవించిన తండ్రి రోగము కుదురునా ? లేక భార్య రోగపీడితురాలై కష్టముగా నుండునపుడు, భర్త ఔషధము సేవించిన భార్య రోగము కుదురునా ? మరియు ఒక్క ఇంటియందు అందరున్ను స్నేహముతో ఉన్నప్పుడు గూడ పుత్రుడు భుజించినచో తల్లి కడుపు నిండునా, లేక భర్త భుజించిన మాత్రముననే భార్యకు ఆకలి తీరునా ? లేదు గదా ! ఆలాగుననే వారి వారి రోగనివారణ కొఱకు వారు వారు ఔషధము సేవించి పథ్యప్రకారము ఉండిననే కాని తదితరులచే రోగము బాగుపడదు.

కనుక వారివారి సంసార మహారోగమునకు వారువారు జ్ఞానము ననుష్ఠించి మోక్షము పొందవలయునే కాని తక్కిన మాటలు వ్యర్థము. ఇదియ్యునుం గాక ఇప్పుడున్న జన్మమునకు ముందెన్నో కోట్లు జన్మము లెత్తియుండవచ్చునే ఆయా జన్మములందు పుత్రసంతానము అనేకములై యుండకపోవునా? అట్లున్నయెడల మరల ఇప్పుడు ఏల జన్మమెత్తవలసియుండును ? మరియు సత్పుత్రుడైన యెడల మాత్రము మంచి పితృ కర్మానుష్ఠానము చేసిన యెడల



స్వర్గము దొరకునని చెప్పునప్పుడు దుర్వృత్తి గల పుత్రుడు చేయు పాపకర్మమునకు తల్లి దండ్రులు నరకమునకు పోకూడదా ? పితరుల యొక్క ధనమున కధికారము గలవాడు, ఋణమునకు మాత్రము బాధ్యుడు కాడా ? కనుక ఇప్పుడున్న మనుజులకు సత్పుత్రులు నిండా అరుదై యున్నారు. పుత్ర సంతానము గలిగినంతటనే, ధన్యులయ్యే పక్షమున పదిమంది పుత్రులు గల దుష్టు డెంత గొప్ప స్థితిని పొందవచ్చును !

ఇదియునుం గాక ప్రేతలోక మందున్న వారికి గదా పితృకర్మము ఏర్పడినది. సాధార ణ సన్మార్గులు కూడ ప్రేతలోకమునకు వెళ్ళరు. వారు మరణానంతరము స్వర్గలోకము పొంది, అచ్చట దేవభోగ మనుభవించుదురని శాస్త్రము చెప్పుచున్నది. దొంగలు మాత్రము జయిలులోకి పోవుదురు గాని సన్మార్గు లెందుకు పోవలెను ? జయిలులో ఉన్నవాడు సుఖపడుటకై వాని పై అధికారులకు వీని పుత్రులు గాని బంధువులు గాని లంచమియ్యవలసియున్నది. ఆలాగుననే ప్రేత లోకమందున్నవారికి గదా పితృకార్యములు చేయవలయును.

ఇంకను దీనియందొక రహస్యము గలదు. జయిలులో ఉన్న వాని సుఖమునకుగా పై ఉద్యోగస్థులకు ఏదో లంచ మిచ్చిన అల్పసుఖముండవచ్చునే గాని పరలోకమందు యమధర్మరాజు గూడ ఆలాటి లంచము ఆశించువా ? కాదు కాదు. కనుక ''అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం'' అని శాస్త్రము చెప్పుచున్నది. కావున ఇట్లున్నప్పటికిన్ని పుత్రుడు చేసిన కర్మఫలము వ్యర్థము కానేరదు. ఆ ఫలము వానికి సిద్ధించును గాని వీరికి లభింపదు. పుత్రుడు గొప్ప పరీక్ష ప్యాసైన తండ్రికి ఉద్యోగమిచ్చుట గనుపడలేదు. తండ్రి దొంగపని చేసిన పుత్రుడు జయిలుకు పోవుట లేదు. కనుక జీవుడు శరీరమందున్నప్పుడే అందరున్ను విచారశీలురై సాధ్యమైనంత పుణ్యకర్మము, ఈశ్వరభక్తి చేయుటకై ప్రయత్నించినయెడల వారు ధన్యాత్ములు. తక్కిన మాటలు విశ్వసించి జన్మము వ్యర్థపుచ్చరాదు. సత్పుత్రుల యొక్క ముఖ్య కర్తవ్య మేమియన, తల్లితండ్రు లపర వయస్సున ఈశ్వర ధ్యానము చేయు సమయమున వారికి ఏ యొక్క లోపము చేయక శ్రద్ధాభక్తులతో సేవించుటయే శ్రాద్ధమనంబడును. ఇట్లుండు కుమారుడు తల్లితండ్రుల నుద్ధరించుట నిజము. ఇచ్చటనే తల్లి దండ్రులను గడతేర్చెడివాడే నిజముగు కుమారుడు.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్య గుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥

సత్త్వగుణము యొక్క వృత్తిలోనున్న వారు ఊర్ధ్వ లోకము పొందుచున్నారు. అనగా బ్రహ్మలోకము పొందుచున్నారు. లేక ఉత్కృష్టమైన మహాత్ముల కులమందు జన్మించుదురు. రాజస గుణములతో కూడినవారు మధ్యమ మైన స్వర్గలోకము పొంది అచ్చట సుఖించుదురు. లేక సామాన్య జనసంగములో పుట్టుదురు. అధమ వృత్తిగల తమో గుణము గలవారు నరక లోకము ప్రవేశించుదురు. లేక దారిద్ర్యాది రోగములతో గూడి నీచ యోనియందు జన్మించుదురని గీతాశాస్త్రాభిప్రాయము. కనుక పుణ్యాత్ములైన వారికి ప్రేతలోకము చూచుటకైనా, అవకాశము లేదని అభిప్రాయము.

ఋణమోచనకర్తారః పితుస్సన్తి సుతాదయః ।
బంధమోచనకర్తా తు స్వాత్మనో ఽన్యో న కశ్చన ॥

తండ్రికి ధనఋణ విముక్తిచేయుటకు పుత్రులు మొదలగు వారుకలరు గాని, సంసారబంధ విమోచనకర్త తనకంటె వేఱెవ్వరును గానరారు.

మస్తకన్యస్త భారాదే ర్దుఃఖమన్యైర్నివార్యతే ।
క్షుధాది కృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్ ॥

నెత్తిపై ఉంచబడు భారము మొదలుగా గలవాని యొక్క దుఃఖము ఇతరులచే నివారింపబడును గాని, యాకలి మొదలగువానిచే గలుగు దుఃఖము తనచేగాక ఇతరులచే నివారణ చేయుటకు సాధ్యము కాదు. అనగా తన యొక్క సంసారబంధ విముక్తికొఱకు జీవముతో గూడియుండినపుడు యత్నింపక పుత్రుడు విముక్తిని చేయునని తలంచి మోసపోగూడదని భావము. పుత్రునియొక్క యొక్క నిజార్థ మేమన ముక్తికాంత యను భార్యతో గూడి జ్ఞాన మను పుత్రుని గనుట పురుషులకున్ను, ఆలాగున ఆత్మారాము డను పరమాత్మతో యోగాష్మాన క్రీడ యను ఆత్మానాత్మ సంయోగముచే బ్రహ్మజ్ఞానమనెడు పుత్రుని గనుట స్త్రీలకు తగునని గ్రహించదగినది.

పథ్యమౌషధ సేవా చ క్రియతే యేన రోగిణా ।
ఆరోగ్యసి ద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా ॥

పథ్యము, ఔషధసేవయు నెవనిచే జేయంబడునో వానిచేతనే ఆరోగ్యసుఖ మనుభవింపబడుచున్నది. ఇతరులు చేసిన పథ్యౌషధ సేవచే పొంద సాధ్యము కాదు. కనుక తనకు గల సంసార ఘోర దుఃఖమునకు తానే ధ్యానానుష్ఠానము చేయక పుత్రులు చేయుదురని తండ్రియు, భర్త చేయునని భార్యయు చింతించి కాలము వ్యర్థము చేయరాదని భావము.

**అవిద్యా కామకర్మాది పాశ బంధం విమోచితుమ్ ।**
**కశ్శక్నుయాద్వినా ఽఽత్మానం కల్పకోటి శతైరపి ॥**

పై చెప్పినరీతి అజ్ఞానము, కామము, కర్మము మొదలుగాగల పాశముచే గట్టబడు బంధము నెవ్వరు గాని తనకు తాను వినా కోటిబ్రహ్మ కల్పములకైన అన్యులచే విడిపించుకొనుటకు సాధ్యము కాదు అని వివేక చూడామణి.

కనుక ఓ నాయనా ! ఒక కుటుంబమునందు అందరు ప్రేమతో గూడి యుండిన ఒకరికి రోగము వచ్చిన మరియొకరు ఔషధము సేవించుటచే సౌఖ్యపడుట కనుపడలేదు. మరణానంతరము వారివారి పుణ్యపాప కర్మముల ననుసరించి ఒకరు స్వర్గలోకము, మరియొకరు నరకలోకము, మరియొకరు ఇహలోకమునందును ఉందురు. అప్పు డొకరికొకరు ఏలాటి సహాయము చేయుటకును వీలులేదు. కనుక ప్రాణముతో గూడియున్నప్పుడు ఈశ్వరునియొక్క కరుణాకటాక్షమునకు పాత్రులైనవారు ధన్యాత్ములు.

ఇట్లు చెప్పుటచే శ్రాద్ధమును నిషేధించుటయని భావము గాదు. ఉత్తమ లోకము పొందని జీవులకు బ్రహ్మనిష్ఠులచే శ్రాద్ధము చేయించిన కొంత సౌఖ్యము కలుగవచ్చును. లేక ఈ కర్మమును చూచి పితరులు సంతోషపడి అనుగ్రహము చేయుదురు.

## విషయవాంఛాపాయము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! '' కామి గాక మోక్షగామి గాడు '' అని శాస్త్రము చెప్పుచున్నదని వైరాగ్యముతో గూడి నిర్మలహృదయులైన ముముక్షువులను రాజయోగులలో కొందరు విషయమందు ప్రవేశింప జేయుటకై ప్రయత్నించు చున్నారు గదా ? దీని యథార్థమును నాకు బోధచేయుము ధర్మాత్మా !

ఉత్తరము ॥ ఓ బుధజన విధేయుడవైన సోదరుడా ! ''కామి గానివాడు మోక్షకామి కాడు '' అను శాస్త్రము సరియే గాని దాని యథార్థమైన అర్థము తెలియక మూఢులు తలక్రిందుగా చెప్పుదురు. కామశబ్దమునకు కోరిక, అభిలాష, ఆసక్తి అను మొదలైన అర్థములు గలవు. అప్పుడు దేనియందు కామి గానివాడనగా మోక్షమునందు మిక్కిలి కామము లేనివానికి ముక్తి పొందుటకు సాధ్యము కాదను భావముగాని, విషయ కామము కాదు. ఎట్లనగా , ఒక అత్యంత కాముకుడు వాడు చింతించిన స్త్రీలో రమించుటకై తన ధనము, కులము, బంధువర్గము, మానమును కూడ వదలి ఆ స్త్రీ కొఱకెంత పాటు పడుచున్నాడో, ఆలాగుననే మోక్షమనెడు ముక్తికాంతతో విహారమునకై పాటుపడు వైరాగ్యధీరులకు మోక్షము సిద్ధించునే గాని, అశ్రద్ధ గలిగిన మందబుద్ధుల కది సాధ్యము కాదని భావము. భగవద్గీత యందు ద్వితీయాధ్యాయమున ''స శాంతి మాప్నోతి న కామ కామీ'' అని దీని యర్థమును భగవంతుడే విశదపరచియున్నాడు . అనగా సర్వేంద్రియ సంయమియైన నిష్ఠాగరిష్ఠుడు శాశ్వతానంద మోక్షమును పొందునేగాని, ''న కామకామీ'' విషయమందు కామము గలవానికి సాధ్యము కానే కాదని భావము. ఇంకయును,

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥**

అని తృతీయాధ్యాయ మందును.

**త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।**
**కామః క్రోధ స్తథలోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్ ॥**

అని షోడశాధ్యాయమందు కూడ విషయకామము ఖండింపబడి యున్నది.

**శ్రుతి ॥ యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

అని కాఠకోపనిషత్తునందు గనపడుచున్నది. ఈలాగున శ్రుతులు చెప్పునపుడు

దానికి విషయకామమను అర్థము కానే కాదు. ఈలాగున వికటమైన ఒక శ్లోకము హఠయోగప్రదీపికయందు గనపడుచున్నది.

**గోమాంసం భక్షయే న్నిత్యం పిబేదమరవారుణీమ్ ।**
**కులీనం తమహం మన్యే ఇతరే కులఘాతకాః ॥**

నిత్యము గోమాంసమును భక్షించువాడును, సారాయి త్రాగువాడును, మహాశ్రేష్ఠుడనియు, తదితరులు కులఘాతకులనియు విరోధార్థము. దీని యొక్క నిజార్థము ఆ గ్రంథమందు తృతీయోపదేశమందు 4-5 శ్లోకములలో గనందగును. లంబికాయోగ(ఖేచరీయోగ)ము కొఱకు జిహ్వాచ్ఛేదనముచే కంఠకుహరమందు నాలుకను ఎక్కించుట గోమాంసభక్షణ శబ్దార్థము, ఆ స్థానమందు జిహ్వాగ్రము, ప్రాణవాయువు, మనసు మూటిని ఏకాగ్రము చేసి ధ్యానించునప్పుడు అమృతధార ప్రవహించును. దానిని పానము చేయుటయే ''అమరవారుణీపాన'' శబ్దమునకు అర్థము. అట్లున్న యోగి అమృతుడగుచున్నాడు గనుక నాయనా , విషమైన విషయమునందు పామరులు చెప్పు మాటలు నమ్మి ప్రవేశింపవద్దు ; చెడిపోదువు. ఈ విషయమును శాస్త్ర మెట్లు ఖండించుచున్నదో అది చూడుము.

**విషస్య విషయాణాం చ దూరమత్యంత మాంతరమ్ ।**
**ఉపభుజ్య విషం హంతి విషయా స్స్మరణాదపి ॥**

విషమునకు, విషయమునకును బహుదూరమైన తారతమ్యము గలదు. విషము తినువానిని మాత్రము చంపును. కాని విషయము తన్ను స్మరించిన వెంటనే హననము చేయును. అనగా కాలకూట విషమున కంటె విషయవాంఛ మహాక్రూర మైనదని తాత్పర్యము.

ఈ క్రింది విషయము గుప్తముగా ముముక్షువు చూడవలసినది. కాని స్త్రీ పురుషులు విశేషముగా నుండు స్థలములలో చదువగూడదు.

**యోషిద్దర్శనమాత్రేణ ముహ్యతి క్షుభ్యతి స్వయమ్ ।**
**స్త్రియో హి నరక ద్వారం నిర్మితం పరమేష్ఠినా ।**
**తస్మాత్తద్దర్శనం పాపం నరాణాం తు తపస్వినామ్ ॥**

స్త్రీ యొక్క దర్శనముచే స్వయముగా పురుషుడు మోహమందు మగ్నుడై క్షోభించును. (అనగా గ్రహము సోకిన వానివలె ప్రజ్ఞాహీను డగును) స్త్రీలు నరకద్వారముగా బ్రహ్మదేవునిచే నిర్మింపబడిరి. కనుక ఆ స్త్రీ యొక్క దర్శనము తాపసులకు బహు పాతకమై యున్నది.

**మాంస పాంచాలికాయాస్తు యంత్రలోలేఽంగపంజరే।**
**స్నాయ్వస్థిగ్రంథిశాలిన్యాః స్త్రియాః కిమివ శోభనమ్॥**

నరములచేతను, ఎముకలచేతను, మాంసపు కదుముల చేతను నొప్పి యున్న మాంసపు బొమ్మయగు స్త్రీ యొక్క యంత్రము వలె కదలుచున్న శరీరమను పంజరమునందు ఏమి సుఖము గలదు ? (చెఱకు యంత్రము వలె అది పురుషుని సారము తీయును)

**త్వఙ్మాంస రక్త బాష్పాంబు పృథక్కృత్వా విలోచనమ్।**
**సమాలోకయ రమ్యం చేత్కిం ముధా పరిముహ్యసి॥**

చర్మము, మాంసము, నెత్తురు, వేడినీరు దీనిని వేఱు చేసి సుందర మగునేని అపుడు నేత్రములతో చూడుము. ఎందుకు వ్యర్థముగా మోహ మొందెదవు?

**కేశకజ్జలధారిణ్యో దుస్స్పర్శా లోచనప్రియాః।**
**దుష్కృతాగ్ని శిఖా నార్యో దహంతి తృణవన్నరాన్॥**

వెండ్రుక లను పొగను ధరించినవారును, స్పర్శింప అగ్నివలె అలవి గానివారును, కనుల కింపైన వారునునై పాపము లను అగ్నుల యొక్క జ్వాలలైన స్త్రీలు పురుషుని గడ్డి పరకను బోలె శీఘ్రముగా కాల్చుచున్నారు.

**జ్వలతామతిదూరేఽపి సరసా అపి నీరసాః।**
**స్త్రియో హి నరకాగ్నీనా మింధనం చారు దారుణమ్॥**

రసముగలవారుగా గనుపించియు, విచారించినయెడల నెంత మాత్రము రసములేని స్త్రీలు, కడు దూరమందున మండు నరకాగ్నులకు సుందరను, దారుణమైన ఇంధనముగా నున్నారు.

**కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసామ్ ।**
**నార్యో నర విహంగానా మంగబంధనవాగురాః ॥**

స్త్రీలు మూఢ చిత్తముగల మనుజులను పక్షులకు మన్మథు డను ఎఱుకల వానిచే వేయబడిన వలలుగా నగుచున్నారు.

**సర్వేషాం దోషరత్నానాం సుస్తిముద్గికయాఽ నయా ।**
**దుఃఖ శృంఖలయా నిత్య మల మస్తు మమ స్త్రియా ॥**

సమస్తమగు దోషము లను రత్నములకు సంపుటమైనట్టియు, ఎప్పుడును దుఃఖమును గలిగించు గొలుసైన స్త్రీతో ప్రయోజనము లేదు అని జ్ఞానవాసిష్ఠ వైరాగ్యప్రకరణము.

**నారీ స్తనభర నాభినివేశం దృష్ట్వా మాగా మోహావేశమ్ ।**
**ఏతన్మాంస వసాదివికారం మనసి విచింతయ వారం వారమ్ ।**
**భజ గోవిందం, భజ గోవిందం, గోవిందం భజ, మూఢమతే ॥**

ఓ మూఢుడా ! స్త్రీ యొక్క స్తనములను, నాభీస్థలమును జూచి మోహము చెందకుము, దీనిని మాంసము, నెత్తురు, క్రొవ్వు, చీము మొదలగు దుర్గంధమైన సమూహమని మనసునందు మాటిమాటికి విచారము చేసి గోవిందస్మరణ చేయుము, నారాయణ ధ్యానము చేయుము. రామభజన చేయుము అని శ్రీ శంకరులు బోధించియున్నారు.

**మనసా కర్మణా వాచా త్యజ తాం మృగలోచనామ్ ।**
**న తే స్వర్గోఽపవర్గో వా సానందం హృదయం యది ॥**

ఆ స్త్రీ ఎప్పుడున్ను నీకు స్వర్గము కాదు. ఆనందమును గాదు. మనస్సుఖమును గాదు. కాబట్టి మనసుచేతను, మాటల చేతను, శరీరము చేతను ఆ స్త్రీని దూరముగా వదలుము.

**న జానామి కథం కేన నిర్మితా మృగలోచనా ।**
**విశ్వాస ఘాతకీం విద్ధి స్వర్గమోక్షసుఖార్గలామ్ ॥**

ఆ లేడి కన్నులవంటి నేత్రములు గలయాడుది యెవ్వనిచే నెందుకై నిర్మింపబడినదో నేనెఱుగ సాధ్యము కాదు. ఆ యాడుది విశ్వాస ఘాతకురాలును, స్వర్గ సుఖమునకును, మోక్షసుఖమునకును, ఇహసుఖమునకున్ను గడియ వలె నడ్డమైనదని యెఱుంగుము.

**మూత్రశోణితదుర్గంధే హ్యామేధ్యద్వారదూషితే।**
**చర్మకుండే యే రమంతి తే లిప్యంతే న సంశయః॥**

మూత్రము నెత్తురుచే బహు దుర్గంధము గలదియు, రజస్సుచే దూషితమైనదియు, మలద్వార మగుటచే నిందింపబడిన తోలుకుండయందెవరు రమించుచున్నారో వారు సంసారముచే గట్టబడుచున్నారు. ఇందుకు సంశయము లేదు.

**కౌటిల్య దంభ సంయుక్తా సత్యశౌచవివర్జితా।**
**కేనాపి నిర్మితా నారీ బంధనం సర్వదేహినామ్॥**

కుటిలత, దంభము గలదియు, సత్యము, శౌచములేనిదియు నగు-ఈ స్త్రీ యెవనిచే నిర్మింపబడెనో తెలియదు. ఆ స్త్రీయే సమస్తమైన ప్రాణులకు సంసార మహాపాశ బంధక మని ఎఱుంగుము.

**జానామి నరకం నారీం ధ్రువం జానామి బంధనమ్।**
**యస్యాం జాతో రతస్తత్ర పునస్తత్రైవ ధావతి॥**

నేను స్త్రీని మహాఘోర నరకముగా నెఱుంగుచున్నాను. నేను స్త్రీని మోక్ష ప్రతిబంధమని నిశ్చయముగా నెఱుంగుచున్నాను. అట్లుండు స్త్రీ యందు పుట్టి, ఆ స్త్రీయందే ఆసక్తి గలిగి దానియందు రమించి ఆ విషయ మందే కాలము వ్యర్థము పుచ్చుచున్నారు. హా ! ఏమి కష్టము .

**భగాది కుచపర్యంతం తం విద్ధి నరకార్ణవమ్।**
**యే రమంతే పునస్తత్ర తరంతి నరకం కథమ్॥**

యోని మొదలుకొని కుచముల వరకును మహాఘోర సంసార నరక సముద్ర మని నిశ్చయముగా నెఱుంగుము. అట్టి స్త్రీ యందు రమించు వారెట్లు

సంసారసాగరమును దాటగలరు? అనగా విషయమందు ప్రవేశించిన వారికి సంసార సాగరము దాటుటకు శక్యము గాదని భావము.

**విష్ఠాది నరకం ఘోరం భగం చ పరినిర్మితమ్ ।**
**కిము పశ్యసి రే చిత్త కథం తత్రైవ ధావసి ॥**

ఓ మానసమా ! యోని భయంకరమైనది గాను, మల మూత్రములతో గూడిన ఘోర నరక కూపముగాను నిర్మింపబడినది. అట్టి దానిని యెందుకు పలువారులు చూచుచున్నావు? దాని విషయమై యెందుకు కాలము వ్యర్థపుచ్చుచున్నావు? అనగా దుర్గంధముతో గూడ ఈశ్వరుండు యోనిని నిర్మించినది యెందుకనగా జీవులకు మనసు దానియందు పోకుండుటకై యున్నది. కరుణామూర్తి ఇట్లు చేసినను మనుజులు ఈలాగున భ్రమించుచున్నారే. మఱియు సుగంధమైన యెడల అప్పుడు లోకము యొక్క స్థితి యేమని చెప్పవచ్చును. దీనిలో గోపాల భూపాల చండాల బ్రాహ్మణ కృష్ణ శ్వేత బాల యౌవన వార్ధకాది భేదము లేకయే అందరికిని ఒకే విధముగా దుర్గంధమై యేహ్యమై యున్నది.

**భగేన చర్మకుండేన దుర్గంధేన వ్రణేన చ ।**
**ఖండితం హి జగత్సర్వం సదేవాసుర మానుషమ్ ॥**

సదా దుర్గంధము గలదియు, ఎప్పటికిని ఆరని వ్రణరూపమైనదియు, తోలుకుండ యైనది యగు యోనిచే దేవతలు, రాక్షసులు, అసురులు, మనుజులు మొదలైన సమస్త ప్రాణులును బంధింపబడుచున్నారు.

**అంతరే నరకం విద్ధి కౌటిల్యం బాహ్యమండితమ్ ।**
**లలితామిహ పశ్యంతి మహామంత్రవిరోధినీమ్ ॥**

స్త్రీ యొక్క మర్మస్థానము ఘోర నరక కూపముగా నెఱుంగుము. వారు లోపల కుటిల బుద్ధి గలిగి బాహ్యమందు సుందరముగా అలంకరించు కొనియుందురు. అట్టి మహామంత్రమునకు విరోధియగు సుందరమైన స్త్రీని చూచుచున్నారు. మహామంత్ర విరోధియనగా. ప్రణవాది మంత్రమునకున్ను ఆత్మజ్ఞాన మను ముక్తికిన్ని ప్రతిబంధ మని ఎఱుంగవలయును.

తత్ర ముగ్ధా రమంతే చ స దేవాసుర మానుషాః ।
తే యాంతి నరకం ఘోరం సత్యమేవ న సంశయః ॥

ఎవరు బుద్ధిలేనివారై ఆ స్త్రీయందు రమించుచున్నారో, వారు దేవతలు, రాక్షసులు, అసురులు వీరిలో నెవరైనను ఘోరనరకము పొందుచున్నారు. ఇందుకు సందేహము లేదు. ఇది సత్యము.

అగ్నికుండ సమా నారీ ఘృతకుంభ సమో నరః ।
సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥

అగ్నికుండము వంటిది స్త్రీయున్ను, పురుషుడు నేతికుండవంటి వాడగును. కాబట్టి ఈ రెంటి సంయోగముచే నశించుచున్నారు. కనుక ఆడదానిని నిశ్శేషముగా వర్జింపవలయును.

గౌడీ మాధ్వీ తథా పైష్టీ విజ్ఞేయా త్రివిధా సురా ।
చతుర్థీ స్త్రీసురా జ్ఞేయా యయేదం మోహితం జగత్ ।

బెల్లము కల్లు వగైరాలతో చేయు సారాయి, ఇప్పపువ్వులతో మరికొన్ని వస్తువులు చేర్చి చేయు సారాయి, మినపపిండి సారాయి యని సారాయి మూడు విధములు. ఆడుది నాల్గవదియైన గొప్పసారాయి యని తెలిసికొనువము. స్త్రీయొక్క అధరపాన మను సురాపానముచే సమస్త ప్రాణులు జన్మజన్మాంతరము వరకును మోహమను లాహిరిచే బద్ధు లగుచున్నారు.

మద్యపానం మహాపాపం నారీసంగం తథైవచ ।
తస్మాద్ద్వయం పరిత్యజ్య తత్త్వనిష్ఠో భవేన్మునిః ॥

మద్యపానము మహాపాతకము. అట్లే నారీసంగముకూడ బహు దుఃఖకరము. కాబట్టి మోక్షేచ్ఛగలవాడు ఈ రెంటిని పరిత్యజించి తత్త్వనిష్ఠ యందుండును, అనగా బ్రహ్మవిచారమునకు ఇవి రెండు ప్రతిబంధకములు అని అవధూతగీత అష్టమాధ్యాయము.

జాతం మృతమిదం దేహం మాతాపితృమలాత్మకమ్ ।
సుఖదుఃఖాలయామేధ్యం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥

జనన మరణములతో గూడిన ఈ దేహము, తల్లిదండ్రుల శుక్ల, శోణిత, మలమయమై సుఖదుఃఖములకు ఆలయమై, మల మూత్రములకు భాండమైనది. దీనిని స్పర్శించిన స్నానము చేయవలయును.

**నవద్వారమలస్రావం సదా కాలే స్వభావజమ్।**
**దుర్గంధం దుర్మలోపేతం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥**

సర్వావస్థలయందు స్వభావముగా దుర్గంధమై దూషించిన మలముతో గూడి నవద్వారములయందు ప్రవహించుచున్న స్త్రీయొక్క దేహమును స్పర్శించినచో స్నానము చేయవలెనని విధించియున్నది.

**ధాతుబద్ధం మహారోగం పాపమందిర మధ్రువమ్ ।**
**వికారాకారవిస్తీర్ణం స్మృత్వా స్నానం విధీయతే ॥**

సప్త ధాతువులతో గూడినదియు, మహారోగమునకు కారణమైనదియు, పాపములకు ఆలయమైనదియు, అశాశ్వతమైనదియు, వికారమైన ఆకారముతో గూడినదియునగు స్త్రీయొక్క దేహసంబంధము స్మరించినంతటనే స్నానము చేయవలయును. అంత నికృష్టమని భావము. ( ఉపనిషత్ సార రత్నావళి. )

## జీవన్ముక్తుని లక్షణము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! జీవన్ముక్తులైన మహాత్ములయొక్క లక్షణ మెవ్విధముగా నుండునో, నాకు దయ చేసి వివరించి నన్ను ధన్యునిగా చేయుము నిర్మలాత్మా !

ఉత్తరము ॥ ఓ ఉత్తమాధికారివైన సోదరుడా ! జీవన్ముక్తుని లక్షణము చెప్పుట కెవరికిని సాధ్యము కాదు. ఏలననగా వారు పలు తరగతులై యుందురు. కాబట్టి ఒకరికి ఉండు లక్షణము మరియొకరికి గనపడదు. కనుక ఒకరి లక్షణము చూచి ఈలాగుననే అందరున్ను ఉండవలయునని నిశ్చయించి యితరులైన మహాత్ములను నిరాకరించినచో గొప్ప పాతకమునకు పాత్రులగుదురు. జీవన్ముక్తులు లక్షణ రహితులు, ఏలననగా త్రిగుణములకు మాత్రమే లక్షణము చెప్పుట వీలగును గాని, త్రిగుణాతీతులైన మహనీయుల అవస్థ చెప్పుటకు సహస్ర ఫణములు గల ఆదిశేషునికైనా అలవి కాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్క

లక్షణములు గూడ చెప్పవచ్చును గాని విదేహులైన బ్రహ్మజ్ఞానుల లక్షణము ఇట్టి దని యెట్టి వారికైనా జెప్పుటకు మార్గము లేదు. ఏమి అనగా అగ్నికి ఒకవస్తువును దహింపవలయును , ఒక వస్తువును దహింపగూడదు అని యేర్పాటేమైన గలదా? సూర్యుండు తన కిరణములను శుద్ధాశుద్ధములు లేకయే సర్వత్ర ప్రసరింపచేసి తాను దేనిని స్పర్శింపకుండునట్లును, వాయువు అన్ని స్థలములందు ప్రవేశించినను తనయందు ఏవియు ప్రవేశింపకుండునట్లును, మాయా విముక్తులైన మహనీయులు అన్నిటియందుబ్రవేశించినను వారి యందు ఏమియు ప్రవేశింపదు. వారు శుద్ధ స్వరూప పరబ్రహ్మమను దృఢ ప్రజ్ఞతో నుందురు. ఆకాశమందు అనేక విధ మేఘములు వచ్చిపోయినను అవి అంతయు ఆకాశము నెట్లు అంటవో, ఆలాగుననే వీరు శుద్ధ బ్రహ్మరూపులైన కారణముచే వీరిని ఏదియు నంటదు. ఈ అవస్థ నిండా గొప్పది.

**యథా పర్వతమాదీప్తం నాశ్రయంతి మృగద్విజాః ।**
**తద్వద్బ్రహ్మవిదో దోషా నాశ్రయంతి కదాచన ॥**

కార్చిచ్చుచే దహింపబడు పర్వతము నెట్లు మృగ పక్షులు సమీపించుటకు సాధ్యము కాదో, అట్లు బ్రహ్మజ్ఞానాగ్నిచే ప్రకాశించు మహాత్ముని యే యొక్క దోష మంటుటకు నెప్పటికిని సాధ్యము కాదు.

కనుక నాయనా ! ఆ మహాత్ములలో కొందరు గృహస్థాశ్రమ మందుండినను, మరికొందరు ధ్యాన నిష్ఠాది తపములతో గూడియుండినను, ఇంకా కొందరు పరిశుద్ధమగు నీతి ఆచారముతో కూడియుండినను, వేరు కొందరు శుద్ధాశుద్ధములు లేక సంచరించుచుండినను, బాహ్యచిహ్నములతో అనేక విధములుగా నుండినను అందరికి మొత్తముగా కొన్ని గుణములు ఒకే మాదిరి ఉండును. ఈ గుణములు లేనివారు మహనీయులు కారు.

1. ఆహార, నిద్రా, స్నానభోజనములు మొదలగు దినచర్యలు సన్న్యాసికిని సంసారికిని ఒకే మాదిరిగా నుండినను గుణములచే భేదము గలదు. చీనీ పండును, ముష్టిపండును, వర్ణము స్వభావము ఒకే విధముగా నుండినను, ముష్టిపండు లోపల చేదుగాను, చీనీపండు మధురముగాను ఉండును.

ఆలాగుననే మహనీయుల హృదయము పరమపవిత్రమై యుండునే గాని పామరులవలె రాగద్వేషాదులు వారియందు గనపడవు, 2. వారు సంసారి మనుజులవలె ఇంద్రియాది విషయములందు రమింపరు. ఏమియనగా దాని కంటె ఎంతోమహత్తైన పరమాత్మ ధ్యానామృతముచే తృప్తులైయుండు కారణముచే అట్లు చేయరు, 3. వారు సాధారణముగా ఏమియును చేయుటకు ప్రారంభింపరు. చేసినయెడల అది లోకోపకారము కొరకే కాని సంసారివలె తన సుఖమునకు కాదు, 4. వారొక ప్రాణికి అణుప్రమాణమైన కష్టము కలిగినయెడల ఆ కష్టము తమదని నిశ్చయించి దానిని రక్షింతురు. 5. వారు సర్వాధిష్ఠానులై యుండిన కారణముచే వేఱొక వస్తువును కోరరు. సర్వమును తామైయుండు కారణముచే ద్వేషించుటకై వారికి ఏమియును లేదు, 6. వారిని ఏదో ఒక వస్తు వొకరు కోరిన యెడల వీరికోరికను తీర్చు పర్యంతము మనస్సమాధానము గలుగదు. 7. వారు స్వభావముగా దయామూర్తులు, 8. సంసార జనసంఘమందుండుటకు వారికి ప్రీతి యుండదు. 9. సమస్త ప్రాణులను తమ వలె చూతురు. 10. అందరి సుఖము కొరకు తమ సుఖమును త్యజించి పాటుపడుదురు. ఈలాగున అనేక గుణములు సాధువులైన జీవన్ముక్తులకు గలవు. ఇది అన్ని జాతులందును సర్వమతముల యందును ఉండు మహనీయుల యొక్క సమష్టిగుణములు.

ఇంక స్థితప్రజ్ఞుని యొక్క లక్షణము భగవద్గీత ద్వితీయాధ్యాయమందు విశదముగా గనందగును. ఇంకను ఈ విషయమై శాస్త్రమునందు గల సంగతులు కొన్ని చెప్పెదను. ఏకాగ్రచిత్తుడవై వినుము.

**దిగమ్బరో వాపి చ సాంబరో వా**
**త్వగమ్బరో వాపి చిదమ్బరస్థః ।**
**ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా**
**పిశాచవద్వా విచరత్యవన్యామ్ ॥**

జీవన్ముక్తుడైనవాడు దిగంబరుడుగాను, శుచియైన వస్త్రములు ధరించినవాడుగాను, చర్మము కట్టుకొనువాడుగాను, హృదయ మందు ధ్యాననిష్ఠ సదా ఉండువాడుగాను, దయ్యము పట్టినవాని చందమునను, వెర్రివానిరీతిగాను, బాలునివలెను అనేక విధములుగా లోకమందు సంచరించును.

క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజ విభవః
క్వచిద్భ్రాంతః సౌమ్యః క్వచిదజగరాచారకలితః ।
క్వచిత్పాత్రీభూతః క్వచిదవమతః క్వాప్యవిదితః
చరత్యేవం ప్రాజ్ఞః సతతపరమానందసుఖితః ॥

జీవన్ముక్తుడగు వాడొక చోట మూఢుని రీతిగాను, వేరొక చోట పండితుడు గాను, మరియొక చోట రాజవైభవముతోను, మరియొకచోట వెఱ్ఱివాని మాడ్కియు, ఇంకొకచోట నవీన పరిష్కారి రీతిగాను, ఒక చోట కొండ చిలువవలె పడియుండువాడును, వేఱొకచోట యోగ్యునివలెను, మరియొక చోట నవమానితుండును, ఒకచోట గంటికి కనబడకయు ఉండువాడై ఎల్లప్పుడు బ్రహ్మధ్యానముతో సుఖించుచు తిరుగుచుండును.

చింతాశూన్యమదైన్యభైక్షమశనం పానం సరిద్వారిషు
స్వాతంత్ర్యేణ నిరఙ్కుశా స్థితిరభీర్నిద్రా శ్మశానే వనే ।
వస్త్రం క్షాళనశోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి ॥

బ్రహ్మవేత్తలకు విచారమునను, దిగులు లేని భిక్షమెత్తుటయే యాహారము. వారు ఏటి నీటియందు దప్పి తీర్చుకొందురు, విచ్చలవిడిగా నుందురు, భీతి లేక కాటియందో పాటియందో నిద్దుర సేయుదురు, ఉతుకుట ఎండవేయుట మొదలగునవిలేని వస్త్రమే వారికి కట్టుబట్ట. దిక్కే యిల్లు, పుడమియే పాన్పు. వేదాంతవీథులందు దిరుగుటయే వారికి సంచారము, పరబ్రహ్మమునందే విహారము.

క్షుధం దేహవ్యథాం త్యక్త్వా బాలః క్రీడతి వస్తుని ।
తథైవ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ ॥

పిల్లవా డాకలిదప్పులను, దేహశ్రమను పాటింపక నాటలాడు చందంబున జీవన్ముక్తుడైన వాడు అహంకార మమకారములను బాసి సుఖియై యాత్మానందమున దేలుచున్నాడు.

నాస్తి నిర్వాసనాన్మౌనాత్పరం సుఖకృదుత్తమమ్ ।
విజ్ఞానాత్మ స్వరూపస్య స్వానంద రసపాయినః ॥

బ్రహ్మజ్ఞాన స్వరూపుడై బ్రహ్మానంద రసమును గ్రోలు మహాత్మునికి వాసన, (అనగా వృత్తి) రహితమైన మౌనముకంటె మిక్కిలి సుఖము గావించునది మరియొకటి లేదు అని వివేక చూడామణి.

కర్మేంద్రియపరిత్యాగీ ధ్యానావర్జితచేతనః ।
ఆత్మజ్ఞానీ తథైవైకో జీవన్ముక్తః స ఉచ్యతే ॥

కర్మేంద్రియములను వర్జించి, మనసును ధ్యానశక్తిచే వశీకరించి, ఆత్మధ్యానమందు నిలుపువాడు మాత్రము జీవన్ముక్తుడైన జ్ఞానియని చెప్పంబడును.

గర్భధ్యానేన పశ్యంతి జ్ఞానినాం మన ఉచ్యతే ।
సోఽహం మనో విలీయంతే జీవన్ముక్తః స ఉచ్యతే ॥

అంతర్ధ్యానముచే మనసును ఆత్మయందు ఐక్యముచేసి అద్వితీయమైన పరమాత్మ నేనను భావనాశక్తి గలిగినవాడు జీవన్ముక్తు డనబడును.

ఏకాకీ రమతే నిత్యం స్వభావగుణవర్జితః ।
బ్రహ్మజ్ఞానరసాస్వాదీ జీవన్ముక్తః స ఉచ్యతే ॥

ఎవడు ఏకాంతమందు ఏకాకియై స్వభావ గుణములను త్యజించి బ్రహ్మజ్ఞానామృతముచే తృప్తుడగునో వాడు జీవన్ముక్తుడని చెప్పబడును. స్వభావగుణమనగా ఇంద్రియములు ఇంద్రియార్థము లందు రమించుట. ఈలాగు చేష్టలు లేనివాడని అర్థము (జీవన్ముక్తగీత)

బాహ్యార్థ వాసనోద్భూతా తృష్ణా బద్ధేతి రాఘవ !
సర్వార్థవాసనోన్ముక్తా తృష్ణా ముక్తేతి కథ్యతే ॥

ఓ రాఘవా ! ఇంద్రియ విషయ వాసన యగు తృష్ణయే బంధక మనియు, సమస్త విషయ వాసనల నుండి విడివడుటయే ముక్తి యనియు చెప్పబడును.

**హర్షామర్ష భయ క్రోధ కామకార్పణ్యదృష్టిభిః ।**
**న పరామర్శ్యతే యోఽంతః స జీవన్ముక్త ఉచ్యతే ॥**

సంతోషము, ద్వేషము, కోపము, కామము, దైన్యము, వీటిచే నెవ్వని అంతఃకరణము స్పర్శింపబడదో, వాడు జీవన్ముక్తుడని చెప్పబడును.

**ఆత్మాన మితరం చైవ దృశా నిత్యావిభిన్నయా ।**
**సర్వం చిజ్జ్యోతి రేవేతి యః పశ్యతి స పశ్యతి ॥**

తన్నును, ఇతరుని భేదరహితముగా చూచువాడును, సర్వము చిత్స్వరూపముగా గనువా డెవడు గలడో వాడు బ్రహ్మమును తెలిసిన వాడని యర్థము. ( జ్ఞానవాసిష్ఠము)

**శ్రుతి ॥ అనాత్మభూతే దేహాదావాత్మబుద్ధిస్తు దేహినామ్ ।**
**సా విద్యా తత్కృతో బంధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే ॥**

అనిత్యభూతములైన దేహాదుల యందు జీవులకు ఆత్మ బుద్ధియే బంధము. అదే అజ్ఞానము. దేహాది సమస్త ప్రపంచము నేను కాదనియు, నిత్యశుద్ధుడైన ఆత్మయే తానను దృఢప్రజ్ఞయే మోక్ష మనబడును.

**న మోక్షో నభసః పృష్ఠే పాతాళే న చ భూతలే ।**
**తృష్ణానా శేన మనసః శాంతిర్మోక్ష ఇతి స్మృతః ॥**

మోక్షము ఆకాశ మందును, పాతాళలోక మందును, భూలోకమందును లేదు. విషయ త్యాగముచే మనశ్శాంతి ఏది గలదో అదే మోక్షమని ఎఱుంగ వలయును. అనగా స్వర్గలోక మందు గాని, పాతాళలోక మందు గాని, భూలోకమందలి శ్రీ కాశి, బదరి కాశ్రమము మొదలైన స్థలములందు నివసించినను మనశ్శాంతి లేనియెడల ముక్తిని పొందుట సాధ్యము కాదని భావము.

**నాహం బ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢం బధ్యతే మనః ।**
**సర్వం బ్రహ్మేతి సంకల్పాత్ సుదృఢం ముచ్యతే మనః ॥**

నేను బ్రహ్మము కాను, జీవుడను అను భావముచే నిశ్చయముగా బద్ధుడగుచున్నాడు. సర్వమును బ్రహ్మమయమును దృఢ నిశ్చయమే ముక్తి యనంబడును.

**దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।**
**వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥**

దుఃఖము గలుగు నప్పుడు సంకటము నొందని మనసు గలవాడును, సుఖము గలిగినప్పుడు సంతోషము లేనివాడును, రాగము, భయము, క్రోధములను విడిచినవాడై మౌన ధ్యాన మందున్నవాడే స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును. అనగా ఇప్పుడు గలుగు సుఖము కాని, దుఃఖము గాని ప్రారబ్ధవశముగా వచ్చినదని నిశ్చయించి యుండుట.

**విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః ।**
**నిర్మమో నిరహఙ్కార స్స శాంతి మధిగచ్ఛతి ॥**

ఏ పురుషుడు ఎల్ల కోరికలను విడిచి దేనియందును ఆశ లేనివాడై అహంకార మమకారములు నశించినవాడై సంచరించుచున్నాడో అట్టి స్థితప్రజ్ఞుడు శాశ్వతానంద మోక్షము పొందును.

**యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః ॥**

ఎవనివలన లోకము భయము నొందదో, యెవడు లోకముచే భయము చెందడో, మరియెవ్వడు సుఖము చేతను, దుఃఖముచేతను భయము చేతను, క్షోభము చేతను విడువబడినవాడై యుండునో అతడు నాకు మిక్కిలి ప్రియు డగును అని శ్రీ కృష్ణ స్వామి వచనము. అనగా నెవడు ఒక ప్రాణికైనను దుఃఖము గలుగచేయడో, యెవడు తన బంధుమిత్రపుత్ర కళత్ర ధన ధాన్యములు నశించినను దుఃఖింపడో వాడే నిజమైన జ్ఞానియని భావము.

**జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।**
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥**

జ్ఞానముచేతను, విజ్ఞానముచేతను, పరిపూర్ణ తృప్తినొందిన చిత్తము గలవాడును, ప్రకృతి సంబంధమైన ఏ యొక్క వికారము లేనివాడును, చతుర్దశ ఇంద్రియములను జయించిన వాడును, మట్టిపెళ్ళయు, రాయియు, బంగారము వీటి నన్నిటిని సమముగా జూచువాడునునై ధ్యానయోగముచే సదానందము చెందువాడు యోగారూఢుడని చెప్పబడును.

**ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।**
**ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥**

ప్రశాంతమైన మనసుగలవాడును, శాంతమైన విక్షేపహేతువగు రజోగుణము గలవాడును, కల్మష రహితుడున్ను, బ్రహ్మమే తానని నిశ్చయము గల యోగి యెవడు గలడో వాడు నిరతిశయానందమైన సుఖమును పొందును.

**శ్రుతి ॥ మునిః కౌపీనవాసాస్స్యా నగ్నో వా ధ్యానతత్పరః ।**
**ఆత్మాత్మరతి రాసీనో నిరపేక్షీ నిరాశిషః ॥**

మౌనియై ధ్యాననిష్ఠ యందుండు మహాత్ముడు ఆత్మారాముడై సర్వాపేక్షాశూన్యుడై, ఆశలేనివాడై, ఏకాంతస్థలమందు ఆసీనుడై, కౌపీన ధారియై గాని, నగ్నుడై గాని, ఉండువాడు బ్రహ్మానందముచే ఓలలాడుచుండును.

**శ్రుతి ॥ సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానేఽపి దుర్జనైః ।**
**సమభావో భవేద్యస్య జీవన్ముక్తస్య లక్షణమ్ ॥**

ఈ దేహమందు పుణ్యాత్ములచే అత్తరు పన్నీరు మొదలైన వస్తువులచే అభిషేకముచేసి మల్లె, మొల్ల పుష్పములతో అర్చించునపుడు, దుర్జనులచే కొట్టి బాధింపబడునపుడును, ఈ రెంటిలోను సంతోష దుఃఖములు లేక సమభావము గలవాడు జీవన్ముక్తుడనబడును.

**అయం బంధు రయం నేతి గణనా లఘుచేతసామ్ ।**
**ఉదారచరితానాం తు వసుధైవ కుటుమ్బకమ్ ॥**

స్వల్పబుద్ధి గలవానికి వీడు నా బంధువు, వీడు శత్రువు అను భావముండును. ఉదారచారిత్రము గల మహనీయులకు ఈ భూలోకమంతయు స్వంత ఇల్లువంటిది.

శ్రుతి ॥ అతీతాననుసంధానం భవిష్య దవిచారణమ్ ।
ఔదాసీన్యమసి ప్రాప్తం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥

జీవన్ముక్తుడైన మహాత్ముడు జరిగిన విషయము సుఖము గాని, దుఃఖము గాని, గొప్పదిగాని, చిన్నది గాని చింతింపడు. ఈ విషయమునకు ముందు రాబోవుసంగతి యెట్లు జరుగునో అని విచారింపడు. వర్తమానకాలమునందు ప్రాప్తించినది ఉదాసీనుడై సంతోషముతో భుజించును. ఇది జీవన్ముక్తుని లక్షణము.

ఓ నాయనా ! అట్లుండు మహనీయుడు జన్మించిన వంశ మంతయు పావన మగును.



## జ్ఞానివంశము పావనము

ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।
ధన్యా చ వసుధా దేవీ యత్ర స్యాద్గురుభక్తతా ॥

ఎవనియందు గురుభక్తి యున్నదో ఆ మహనీయుడు ఏయే కులమందు జన్మించునో వారితల్లియు ధన్యురాలగును. తండ్రియు పవిత్రుడగును. వారి గోత్రస్థులందరు పరిశుద్ధు లగుదురు. ఆ కులమందు బుట్టినవారందరున్ను ధన్యాత్ము లగుదురు. వారు నివసించిన భూమి కూడ పరమ పవిత్రమైన దగును అని గురుగీత.

షష్టిం కులాన్యతీతాని షష్టిమాగామికాని చ ।
కులాన్యుద్ధరతే ప్రాజ్ఞః సన్న్యస్తమితి యో వదేత్ ॥

ప్రాజ్ఞుడైనవాడు ఏ కులమందు బుట్టి నేను సన్న్యసించుచున్నానని చెప్పుచున్నాడో, ఆ క్షణముననే ఆ వంశస్థులైన పితరులు అరువది తరములవారున్ను రాబోవు వంశస్థులు అరువది తరములవారున్ను వరుసగా ధన్యులగుదురు అని సన్న్యాసపారము. ఇట్లు చెప్పుట మహాత్ముల జన్మముగురించియు, బ్రహ్మజ్ఞానిని గురించియు శ్లాఘించుట యని గ్రహించుడు.

నృత్యంతి పితరస్సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।
దేవాశ్చ ఋషయస్తృప్తాః ప్రయాంతి పరమం పదమ్ ॥

భక్తుని జన్మమును చూచి దేవతలు సంతోషింతురు. ఋషులు తృప్తులగుదురు. ఆ వంశస్థులైన సమస్త పితరులును ఆనంద పరవశులై తాండవ మాడుదురు. వానికి సంబంధించిన వారందరు పరమ పదము పొందుదురు అని వరాహపురాణము.

**తీర్థీ కుర్వంతి తీర్థాని, సుకర్మీ కుర్వంతి కర్మాణి,**
**సచ్ఛాస్త్రీ కుర్వంతి శాస్త్రాణి ॥**

పరమభక్తులు చండాల వీథియందున్న జలమైనను వారు ముట్టిన మాత్రముననే దానికి గంగాజల మంత పవిత్రత గలుగును. వారు సత్కర్మములు గానివానిని సుకర్మములుగా చేయుదురు. సామాన్య శాస్త్రములను విశేష శాస్త్రములుగా చేయుదురు. అనగా మహాత్ములు దురాచార దుష్కర్మములను దూరీకరించి సదాచార సత్కర్మములను అనుష్ఠించి దుష్టశాస్త్రములను ఖండించి సచ్ఛాస్త్రములను స్థాపించి జనులను తరింప జేయుదురు.

**మోదన్తే పితరో నృత్యంతి దేవతాః సనాథాచేయం భూర్భవతి ॥**

భక్తుల జన్మములను చూచి పితరులు సంతోషింతురు. దేవతలు నృత్యము చేయుదురు. మరియు ఆ భక్తుడు భూమండలాధి పతులచే వందితుడగును అని శ్రీ నారద భక్తి సూత్రము.

## ఆత్మజ్ఞానియొక్క సుఖము

ఓ ప్రియసోదరుడా ! అట్టి మహాత్మునియొక్క సుఖము వర్ణించుటకు ఆదిశేషునికైనా సాధ్యము కాదు, ఆ బ్రహ్మానంద మందుండు సంగతి సాధారణ మనుజులకు తెలియదు.

**న తత్సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥**

ఏకాంతవాసియై, రాగరహితుడై, మౌనశీలుడగు మహాత్మునికి ఏ బ్రహ్మానందసుఖము గలదో, అట్టి సుఖము దేవేంద్రునికి గాని, చక్రవర్తులకు గాని లేనేలేదు.

రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని।
ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా ॥

ఎవడు బ్రహ్మానందరసమును అనుభవించి పరమాత్మ ధ్యానమందు తృప్తుడగుచున్నాడో ఆ మహాత్ముడు ఇంద్రుని కూడ పేదవాడైన భృత్యుని వలె భావించును. అట్లున్నప్పుడు రాజులయొక్క కథ నేమి చెప్పవలయును ? అనగా దేవేంద్రునికి సంపూర్ణ సౌఖ్యము లేనియెడల రాజులకు ఏమి సుఖము గలదు ?

శ్రుతి ॥ నాతః సుఖతరం కిఞ్చిత్త్రిషు లోకేషు విద్యతే !
వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసంగస్య యత్సుఖమ్ ॥

సమస్తమైన కామాది విషయములను వదలినవాడై, నిస్సంగుడైన వానికి ఏ యొక్క బ్రహ్మానంద సుఖము గలదో, దానికి సమమైన మరియొక సుఖము మూడు లోకములలోను లేనేలేదు.

న చేంద్రస్య సుఖం కిఞ్చిన్న సుఖం చక్రవర్తినామ్।
సుఖమస్తి విరక్తస్య మునేరేకాంతవాసినః ॥

న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినామ్।
యాదృశం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥

అని శివతత్త్వజ్ఞానము. దీని అర్థము పై నుదాహరింపబడినదే.

శ్రుతి ॥ న నిజం నిజవద్భాతి అంతఃకరణ జృంభణాత్।
అంతఃకరణనాశేన సంవిన్మాత్రస్థితో హరిః ॥
సంవిన్మాత్రస్థితశ్చాహమజోఽస్మి కిమతః పరమ్।
వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవచ్చ వినశ్యతి ॥
చిజ్జడానాంతు యో ద్రష్టా సోఽచ్యుతో జ్ఞానవిగ్రహః।
స ఏవ హి మహాదేవః స ఏవ హి మహాహరిః ॥
స ఏవ జ్యోతిషాం జ్యోతిః స ఏవ హి మహేశ్వరః।
స ఏవ హి పరం బ్రహ్మ తద్బ్రహ్మాహం న సంశయః ॥

జీవశ్శివశ్శివో జీవ స్స జీవః కేవలః శివః ।
తుషేణ బద్ధో వ్రీహిస్స్యాత్తుషాభావేన తండులః ॥
ఏవం బద్ధస్తథా జీవః కర్మనాశే సదాశివః ।
పాశబద్ధస్తథా జీవః పాశముక్తః సదాశివః ॥
దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః ।
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహం భావేన పూజయేత్ ॥

అంతఃకరణ చలనముచే ఆత్మస్వరూపము నిజముగా ప్రకాశింపదు. అంతఃకరణ చలన రాహిత్యముచే సంవిన్మాత్రుడై ప్రకాశించువాడు సాక్షాత్ హరియే. ఆ సంవిన్మాత్రుండై నిలుచు నేను జననము లేనివాడను. దీనికంటె పైన మరేమున్నది? నాకంటె భిన్నమైన దేహాది జడము సర్వమును స్వప్నమువలె నాశము పొందును. చిజ్జడములయొక్క అవస్థను ఎవ డెఱుంగునో, వాడే అచ్యుతుడైన జ్ఞానవిగ్రహుండు. వాడే మహాదేవుడు, వాడే నిజముగా మహాహరియు, వాడే జ్యోతులన్నిటికి జ్యోతియగును. వాడే పరమేశ్వరుడు. వాడే వాస్తవముగా పరబ్రహ్మము. ఆ బ్రహ్మమే నేను. సంశయము లేదు. జీవుడే శివుడు. శివుడే జీవుడు. ఆ జీవుడే సాక్షాత్ శివుడు. పొట్టుచే గప్పబడినప్పుడు వడ్లగింజనియు, పొట్టు పోయిన వెంటనే బియ్య మనియు అనునట్లు కర్మముచే కట్టబడిన వాడు జీవుడు. కర్మవిముక్తిచే సాక్షాత్ శివుడగును. ఈ దేహమే దేవాలయము. దానియందుండు జీవుడే దేవుడు. అజ్ఞానమైన నిర్మాల్యమును త్యజించి సోఽహం భావనచే పూజింపవలయును అని స్కందోపనిషత్తు.

శ్రుతి ॥ సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితమ్ ।
బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్ ॥

జాతివర్ణాశ్రమరహితమై, సర్వసాక్షియైన పరమాత్మను బ్రహ్మమయముగా చూచువాడు స్వయముగా బ్రహ్మరూప మగును.

## సాధు దర్శన పుణ్యము

శ్రుతి ॥ చిదేకత్వ పరిజ్ఞానే న శోచతి న ముహ్యతి ।
అద్వైతం పరమానందం శివం యాతి తు కేవలమ్ ॥

చిదేకత్వ పరిజ్ఞానము పొందినవాడు శోకింపడు, మోహింపడు. కేవలం అద్వైతమైన పరమానంద శివస్వరూపము పొందును. ఓ సుశీలుడా ! ఇట్లున్న మహాత్ముల దర్శనముచే పరమపవిత్రు లగుదురు. వారి దర్శనము అందరికిని లభింపదు.

**దుర్లభో మానుషో దేహః ప్రాణినాం క్షణభంగురః ।**
**తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠ ప్రియదర్శనమ్ ॥**

క్షణభంగుర మైన ప్రాణి కోట్ల యొక్క జన్మములలో మానవజన్మము అత్యంత దుర్లభము. అట్లున్న జన్మము దొరికినను పరమభక్తుల దర్శనము అతిదుర్లభమని శ్రీ కృష్ణభగవానులు ఏకాదశ స్కంధమందు చెప్పియున్నారు.

**యః స్నాతి శీతతరయా సాధుసంగతి గంగయా ।**
**కిం తస్య దానైః కిం తీర్థైః కిం తపోభిః కిమధ్వరైః ॥**

ఎవరు పరమ శీతలమైన పుణ్యపురుషులగు సాధు సంసర్గమను గంగా నదియందు స్నానముచేయుదురో, వారికి షోడశ మహాదానము లేల ? సప్తసాగర పర్యంతము తీర్థస్నానము లేల ? కృచ్ఛ్రచాంద్రాయణ తపము లేల ? అశ్వమేధాది యాగము లేల ? అనగా వీని అన్నింటికంటె గొప్పఫలము సాధు దర్శనమని భావము.

**శూన్యమాపూర్ణతా మేతి మృత్యురప్యమృతాయతే ।**
**ఆపత్సంపదివాభాతి విద్వజ్జన సమాగమాత్ ॥**

ఉత్తముడైన సాధువు తన స్థలమునకెప్పుడు వచ్చునో అప్పుడు తన సర్వ కష్టములును నశించి సౌఖ్యము గలుగును. క్షీణించి పోయిన అన్ని వస్తువులును పునరుద్భవించును. మరణము అమృత మగును. ఆపత్తు సంపత్తుగా నుండును అని వాసిష్ఠము.

**గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరుస్తథా ।**
**పాపం తాపం చ దైన్యం చ హంతి సజ్జన దర్శనమ్ ॥**

గంగా తీర్థము పాపమును మాత్రము పోగొట్టును. చంద్రుడు తాపమును శాంతము చేయును. కల్పవృక్షము దారిద్ర్యమును పోగొట్టును. పాపము, తాపము,

దైన్యము అను మూడున్ను సజ్జన దర్శనముచే నశించి మోక్షము కూడ సిద్ధించును.

## ధ్యాన విమర్శ

ప్రశ్న ॥ ఓ స్వామీ ! నిర్మలాత్మా , ఈ ధ్యాననిష్ఠ పూర్తికొఱకు ఏ ఆసనమందు కూర్చుండవలయును ? దానికి ఏ స్థలము శ్రేష్ఠము ? ఏ దిక్కు ముఖముగా ఉండవలయును ? అద్దానిని దయచేసి చెప్పవలయును.

ఉత్తరము ॥ ఓ సువిచారా ! ఆత్మజ్ఞాన సిద్ధికి స్వస్వరూప విచారము కంటె మరియొక సులభ మార్గము లేదు. దానికై ఆసనము గాని, దిక్కు గాని, స్థలము గాని అనావశ్యకము. ఇదంతయును బ్రహ్మమై ఉండునపుడు ఇంకొక స్థలము అపవిత్రమై ఉండునా ? ధ్యానము, స్థలము, ఆసనము, మొదలైనవి మధ్యమ మందాధికారులకు నేర్పడినవి గాని ఉత్తమాధికారికి కాదు. కాని నీవు అడిగిన కారణముచే నిష్ఠ పూర్తికొఱకు శాస్త్రమందు మహర్షులచే చెప్పబడిన సంగతి చెప్పెదను.

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాఽత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్ ॥**

**తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియక్రియః ।**
**ఉపవిశ్యాఽఽసనే యుంజ్యా ద్యోగమాత్మవిశుద్ధయే ॥**
**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాఽగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥**

పరిశుద్ధమైన ప్రదేశమందు చలింపనిదియు, మిక్కిలి పొట్టిగానిదియు పొడుగు గానిదియునగు దర్భాసనము, దానిమీద కృష్ణాజనము, దానిమీద వస్త్రము మొదలైన ఆసనములు స్థాపించి, ఆ యాసనమందు కూర్చుండి చిత్తముయొక్కయు ఇంద్రియముల యొక్కయు, వ్యాపారమును నిగ్రహించినవాడై మనసును ఏకాగ్రముగ జేసి ఆత్మయొక్క పరిశుద్ధత కొఱకు ధ్యానయోగము చేయువలయును. దేహమధ్యభాగమును, శిరస్సును, కంఠమును సమముగా నిక్కించి చలనము లేనివాడై, స్థిరుండై తన నాసికాగ్రము ( అనగా

(భ్రూమధ్యమును) చూచునట్లు దృష్టి నిలిపి ఇతర విషయమందు దృష్టిని గాని, మనసును గాని పోనివ్వక పరమశాంతుడై పరమాత్మధ్యానము చేయవలయును.

**శివదేవాలయే గోష్ఠే సర్వదేవాలయే శుభే।**
**వటస్య ధాత్ర్యా మూలే వా మఠే బృందావనే తథా॥**

శివదేవాలయము, గోవులకట్టు స్థలము, పవిత్రమైన సమస్త దేవాలయములు, వటవృక్షమూలము, నెల్లివృక్షము క్రింద మఠము, పుష్పోద్యానము.

**పవిత్రే నిర్మలే దేశే నిత్యానుష్ఠానతోఽపి వా।**
**నిర్వేదనేన మౌనేన జపమేతత్సమారభేత్॥**

ఆలాగుననే పవిత్రమైన ఏ స్థలమందుగాని ఆసీనుడై నిత్యానుష్ఠానము చేయువాడు చలనము లేనివాడై మౌనముతోకూడి జపము చేయవలయును.

**పీతాసనం మోహనే తు హ్యసితం చాభిచారికే।**
**జ్ఞేయం శుక్లం చ శాంత్యర్థం వశ్యే రక్తం ప్రకీర్తితమ్॥**

మోహనమునకు పసుపు వర్ణమును, జాలవిద్యకు నలుపు వర్ణము గలదియు, మనశ్శాంతికొఱకు తెలుపువర్ణము గలదియు, వశ్యమునకు రక్తవర్ణము గలదియు నగు ఆసనము శ్రేష్ఠమని చెప్పబడినది.

**కుశదూర్వాసనే దేవి హ్యాసనే శుభ్రకంబళే।**
**ఉపవిశ్య తతో దేవి జపేదేకాగ్రమానసః॥**

ఓ దేవీ! దర్భ, దూర్వ (గరిక) మొదలైన ఆసనములందుగాని, పరిశుభ్రమైన కంబళియందుగాని ఆసీనుడై యేకాగ్రచిత్తము గలవాడై జపమాచరింపవలయును.

**శుక్లం సర్వత్ర వై ప్రోక్తం వశ్యే రక్తాసనం ప్రియే।**
**పద్మాసనే జపేన్నిత్యం శాంతివశ్యకరం పరమ్॥**

ఓ ప్రియే! సమస్త కార్యములకు తెలుపువర్ణము గలదియు, వశ్యమునకు

రక్తవర్ణము గలదియు, పద్మాసనము నిత్యజప యోగ్యమైనది. దానిచే శాంతియు, వశ్యమును గలుగజేయుటకు అది శ్రేష్ఠమైనది.

**వస్త్రాసనే చ దారిద్ర్యం పాషాణే రోగసంభవః।**
**మేదిన్యాం దుఃఖమాప్నోతి కాష్ఠే భవతి నిష్ఫలమ్॥**

వస్త్రాసనమందు దారిద్ర్యము, రాతిమీద రోగము, భూమిమీద దుఃఖము, కొయ్యపీఠమందు నిష్ఫలము గలుగును.

**కృష్ణాజినే జ్ఞానసిద్ధి ర్మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి।**
**కుశాసనే జ్ఞానసిద్ధిః సర్వసిద్ధిస్తు కంబళే॥**

కృష్ణాజిన (జింక చర్మ) మందు జ్ఞానసిద్ధియు, పులిచర్మమునందు మోక్షలక్ష్మియు, దర్భాసనమందు మహాబుద్ధిశక్తియు, కంబళియందు పై జెప్పిన సిద్ధు లన్నియును గలుగును.

**ఉదఙ్ముఖః శాంతిజాప్యే వశ్యే పూర్వముఖస్తథా।**
**యామ్యే తు మారణం ప్రోక్తం పశ్చిమే చ ధనాగమః॥**

మనశ్శాంతిగలిగి మోక్షము పొందుటకొఱకు ఉత్తరముఖము, మంత్రవశ్యము కొఱకు తూర్పుముఖమును, మారణప్రయోగమునకు దక్షిణ ముఖమును, ధనము గలుగుటకొఱకై పశ్చిమ ముఖముగాను గూర్చుండి జపము చేయవలయును అని గురుగీత.

**యస్తు బిల్వవనే నిత్యం కుటిం కృత్వా వసేన్నరః।**
**సర్వే మంత్రాః ప్రసిధ్యంతి జపమాత్రేణ కేవలమ్॥**

**పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే శివాలయే।**
**అగ్నిహోత్రే కేశవస్య సన్నిధౌ చ జపేత్తు యః।**
**నైవాస్య విఘ్నం కుర్వంతి దానవా యక్షరాక్షసాః॥**

బిల్వవనమున గుడిసె వేసికొని నివసించి మంత్రములు జపించిన శీఘ్రముగా సిద్ధి గలుగును. పర్వతాగ్రమునను, నది యొడ్డునను, మారేడుచెట్టు

క్రిందను, శివాలయమునను, అగ్ని సన్నిధిని, విష్ణు ఆలయమునను, జపించిన దానవ యక్షరాక్షసులు మంత్రజపమునకు విఘ్నము చేయలేరు.

ఆత్మజ్ఞానం కుశగ్రంధీ రుద్రాక్షస్సర్వకామదః ।
ప్రవాళైశ్చ కృతా మాలా సర్వలోకవశప్రదా ॥

కుశగ్రంథి ఆత్మజ్ఞాన సిద్ధినిచ్చును. రుద్రాక్షమాల సర్వకామముల నిచ్చును. పగడమాల లోకమును వశమొనర్చును.

అష్టోత్తరశతం మాలా తత్రస్యాదుత్తమోత్తమా ।
శతసంఖ్యోత్తమా మాలా పంచాశన్మధ్యమా మతా ॥

చతుః పంచాశతీ యద్వాప్యథవా సప్తవింశతిః ।
అధమా పంచవింశత్యా యది స్యాచ్ఛతనిర్మితా ॥

పంచాశదక్షరాణ్యత్రానులోమ ప్రతిలోమతః ।
ఇత్యేవం స్థాపయేత్స్పష్టం న కస్మైచిత్ప్రదర్శయేత్ ॥

నూటయెనిమిది సంఖ్య గుండ్లుగల మాల ఉత్తమోత్తమము. నూరు సంఖ్యగల మాల ఉత్తమము. ఏబది సంఖ్యగల మాల మధ్యమము. లేక ఏబదినాలుగైనను సరియే. కనీసము ఇరువదియేడు సంఖ్యగల మాలయైనను ఉండవలయును. లేక ఇరువది అయిదింటిచే చేయబడిన మాలయైనను సరియే. ఒకప్పుడు నూరు సంఖ్యచే చేయబడిన మాలయైనచో అకారాది క్షకారాంతముగా జపించి, పిమ్మట లకారమును మేరువుగా చేసుకొని అనులోమ ప్రతిలోమములచే వర్ణముల మాలిక స్థాపించవలయును. జపమాలనెవరికిని జపించు సమయమున చూపకూడదు. అని శివగీత.

ఎనుబదినాలుగు ఆసనములలో ! 1. సిద్ధాసనము, 2. పద్మాసనము, 3. వీరాసనము, 4. స్వస్తికాసనము, 5. మత్స్యేంద్రాసనము, 6. పశ్చిమోత్తానాసనము, 7. సర్వాంగాసనము, 8. శవాసనము . ఈ యెనిమిది శ్రేష్ఠములైనవి. వాటిలో సిద్ధపద్మాసనములు అత్యంత శ్రేష్ఠములు.

ఏతత్సిద్ధాసనం ప్రాహురన్యే వజ్రాసనం విదుః ।
ముక్తాసనం వదంత్యేకే ప్రాహుర్గుప్తాసనం పరే ॥

దానిలో సిద్ధాసనము అత్యంతోత్కృష్టము. ఈ ఆసనమును వజ్రాసన మనియు, కొందరు ముక్తాసన మనియు, మరికొందరు గుప్తాసనమనియు చెప్పుచున్నారు.

చతురశీతిపీఠేషు సిద్ధమేవ సదా ఽభ్యసేత్ ।
ద్వాసప్తతిసహస్రాణాం నాడీనాం మలశోధనమ్ ॥

ఎనుబదినాలు గాసనవములందు సిద్ధాసనవమునే సదా అభ్యసింప వలయును. అది డెబ్బది రెండు వేల నాడుల యొక్క మలమును, ( దోషములను) శుద్ధి చేయునట్టిదిగా ఉన్నది.

ఆత్మధ్యాయీ మితాహారీ యావద్ద్వాదశవత్సరమ్ ।
సదా సిద్ధాసనాభ్యాసాద్యోగీ నిష్పత్తిమాప్నుయాత్ ॥

ఆత్మధ్యానము చేయువాడును, మితాహారము గలవాడును, పంద్రెండు సంవత్సరములు సదా సిద్ధాసనమునే అభ్యసించిన యెడల యోగియగుచున్నాడు. కావున వేరే యోగములను అభ్యసింప నక్కర లేదు.

''ముఖ్యం సర్వాసనేష్వేకం సిద్ధాః సిద్ధాసనం విదుః''

సమస్తమైన ఆసనవములలో సిద్ధాసనవము శ్రేష్ఠతవమువని సిద్ధులు ఎఱుంగుచున్నారు. ఏలననగా సిద్ధాసనమునకు శరీరకష్టము లేదు. గొప్ప ఫలము గలుగుచున్నది. రాజయోగసిద్ధికి ఇదియే చాలును.

యోనిస్థానక మంఘ్రిమూలఘటితం కృత్వా దృఢం విన్యసే
న్మేఢ్రే పాదమథైక మేవ హృదయే కృత్వా హనుం సుస్థిరమ్ ।
స్థాణుః సంయమితేంద్రియో ఽచల దృశా పశ్యేద్భ్రువోరంతరం
హ్యేతన్మోక్షకవాటభేదజనకం సిద్ధాసనం ప్రోచ్యతే ॥

గుదమునకును, ఉపస్థమునకును మధ్య ప్రదేశమగు యోనిస్థానమును

ఎడమకాలిగుదిచే హత్తించి కుడిపాదము యొక్క గుదిచేత ఉపస్థమునకు పై భాగమున చక్కగా హత్తించవలయును. హృదయమునందు గడ్డమును చక్కగా నునిచి ఇంద్రియములను విషయములయందుండి అడ్డగించి చలనము లేని చూపుతో భ్రూమధ్యమును వీక్షింపవలయును. చేతులను నాభిస్థాన మందుంచ వలయును. ప్రసిద్ధమైన ఇది మోక్షకవాటము ( అనగా ప్రతిబంధకము) యొక్క భేదనము కలుగచేయు సిద్ధాసన మని మహాత్ములచే చెప్పబడుచున్నది.

## మరియొక్క గురువును ఆశ్రయించుట

ప్రశ్న ॥ ఓ స్వామీ ! లోకసుఖాభిలాషీ ! నాకు ఒక గొప్ప సంశయము గలదు. అది ఏమనగా, ఒకరు ఒక్కగురువును ఆశ్రయించి వారిచే కొన్ని సంగతులు తెలిసికొని పరిపూర్ణ జ్ఞానము కలుగక సంశయ ముండియైనను లేక ఆ గురువు దేశాంతరము పోయినను, లేక సమాధిస్థులైనను, లేక దుర్వృత్తితో గూడిన వారైనను, వాడు మరియొక మహాత్ముని ఆశ్రయించి తక్కిన విషయమును పూర్తిచే సుకొనుటలో విరోధ మున్నదా ? అట్లు చేసిన గురుత్యాగద్రోహమునకు పాత్రు డగునా ? ఈ విషయము దయచేసి చెప్పి నన్ను నిస్సంశయునిగా జేయుము.

ఉత్తరము ॥ ఓ వివేకోత్తముడవైన సోదరుడా ! ఒక కాలమందు తత్సమయానుసారముగా లభించిన గురువును ఆశ్రయించి పూర్తిజ్ఞానము గలుగనియెడల పరిపూర్ణత్వము పొందుటకై ప్రయత్నముతో ఇతర గురువును ఆశ్రయించి పూర్ణుడు కావలయును. దానియందు ఏలాటి దోషమును లేదు.కాని మొదటి గురువునందుండు భక్తివిశ్వాసములు విడువకూడదు.పై జెప్పినరీతి శిష్యునియందు సందేహమున్న యెడల గురువైనవారే ఆ శిష్యుని నిస్సంశయము కొఱకు ఇతరులైన మహాత్ముల యొద్దకు సంతోషముగా పంపవలయును. ఎట్లనగా, ఒకవైద్యుని పుత్రునికి రోగశాంతి తనచే గానియెడల అతడు తన పుత్రుని తానే ఇంకొక వైద్యునివద్దకు పిలుచుకొని పోవుటచే కుమారుని పితృభక్తికి హానివచ్చునా? ఆ విషయమై తండ్రికి పుత్రవాత్సల్యము తగ్గునా ? లేదు గదా ! శ్రీ శుకులవారికి మొట్ట మొదట తండ్రియైన శ్రీ వ్యాసులు గురువుగా నుండిరి. తండ్రి వద్ద సంశయ నివృత్తి కానందున ఆ సంగతి

శ్రీవ్యాసులవారు తెలుసుకొని శ్రీ శుకమహర్షిని జనక మహారాజు యొద్దకు పంపలేదా ? శ్రీ వ్యాసులకున్ను, జనకమహారాజుకున్ను ఎంత తారతమ్యము గలదు. శ్రీ వ్యాసులవారు సాక్షాత్ నారాయణాంశము, బ్రహర్షిసత్తములు. జనకులు క్షత్రియులు, గృహస్థాశ్రమ మందున్నవారు. అట్టి మహనీయులకే ఆలాగున జరిగియుండగా తక్కినవారు సంశయించుటకు కారణము లేదు.

భాగవతైకాదశస్కంధ మందు శ్రీ అవధూత యదుసంవాదములో అవధూతలవారికి ఇరువది నలుగురు గురువులున్నట్లు గన్పడుచున్నది. మరియు జనకుల వారికి అష్టావక్ర గీతయందు అష్టావవక్ర మునీశ్వరుడు గురువనియు, భారతమున పంచశిఖుడను మహర్షి గురువనియు, శుకబ్రహ్మకైవల్యమున శ్రీ వసిష్ఠులు గురువనియు, ఉపనిషత్తులో శ్రీ యాజ్ఞ్యవల్క్యులు గురువనియు, సిద్ధగీతలో సిద్ధులు గురువులనియు కనబడుచున్నది. కనుక సంశయ ముండిన యెడల నిస్సంశయముగా మరియొక గురువును ఆశ్రయించి ధన్యుడు గావలయును. లేనిచో నీజన్మము వ్యర్థమై పోవుటయే గాక, పునర్జన్మము నిశ్చయముగా గలుగును. సంశయము లేదు. ''సంశయాత్మా వినశ్యతి '' అను గీతావాక్యమే ఇందుకు ప్రమాణము.

**మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్।**
**జ్ఞానలుబ్ధ స్తథాశిష్యో గురోర్గుర్వంతరం వ్రజేత్॥**

తేనెను పానము చేయుటయందు అభిలాషగల తుమ్మెద ( భమరము) ఎట్లు దానికి తృప్తి పర్యంత మొక పుష్పమునుండి మరియొక పుష్పమును ప్రవేశించుచున్నదో, ఆలాగుననే బ్రహ్మజ్ఞానామృతము గ్రోలుటయందు అభిలాష గల శిష్యుడు గూడ నొకగురువుచే పరిపూర్ణుడు కానియెడల మరియొకరిని ఆశ్రయించి ధన్యుడు గావచ్చును. దీనిని గురించి యేలాటి సందియమున్ను లేదు అని గురుగీత.

## శివ కేశవుల అభేదము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! దేవా ! కొందరు వైష్ణవ భక్తులు శ్రీ మన్నారాయణుని తప్ప శ్రీ శివుడు మొదలగువారి దర్శన కీర్తనములు చేసిన యెడల పతివ్రతా

శిరోమణియైన స్త్రీ రత్నము పర పురుషుని పొందినట్లు వ్రతభంగమనియు లేక శ్రీ మన్నారాయణుండు తనను విడిచి అన్యుని ఆశ్రయించినందున నమ్మకము లేనివాడని కోపము చేసి త్యజించుననియు, ఆలాగుననే శ్రీ శివభక్తులైన కొందరు వీరశైవులు శ్రీ శివుని తప్ప శ్రీ విష్ణువు మొదలగు వారిని సేవించిన పైన చెప్పిన రీతిగా శ్రీ శివుడు వీరిని ఉపేక్షించుననియు చెప్పునది నిజమా ?

ఉత్తరము ॥ ఓ బుద్ధిమంతుడవైన సోదరుడా ! దీనికన్న మరియొక అజ్ఞానము గలదా ! ఇట్లు చెప్పువారు పామరత్వముచే స్వమతాభిమానముతో చెప్పుటయే గాని మరియొక హేతువు లేదు. దైవ మొకటియే గాని అనేకములని చెప్పుట భ్రమము. ఇది శ్రుతి యొక్క నిశ్చయాభిప్రాయము. ఒక్కజలమునకు జలమనియు, నీళ్ళనియు, అరవములో తణ్ణియనియు, సింహళ భాషలో వత్రుయనియు, మలయాళములో వెళ్ళ మనియు, కర్ణాటకమందు నీరనియు, హిందీభాషలో పానీయనియు, పాంచాలభాషలో ఆఫ్‌యనియు, ఇంగ్లీషులో వాటర్ అనియు, ఒక్కొక్క భాషయం దొక్కొక్క నామధేయమున్నట్లు ఏకమైన ఈశ్వరునికి అనేక మతముల వారనేక పేర్లు చెప్పుటయే గాని వాస్తవముగా దైవ మొకటియే. దీనియందు ఏదైనా యొకమతమందు పర్యవసానము వరకు ప్రయత్నము చేసిన యెడల, నిశ్చయముగా అందరున్ను మోక్షమను యొకటే స్థానమునకు చేరుదురు. గంగానది తూర్పుముఖము గాను, సింధువు పశ్చిమముఖముగాను, తామ్రవర్ణి సుమారు దక్షిణముఖముగాను, ఆలాగుననే ఉత్తరముఖముగాను అనేక నదులు వేరు వేరు మార్గములుగా ప్రవహించుచున్నను అన్నియు మహాసముద్రమునందే చేరుచున్నవి. లేక శ్రీ తిరుపతి వేంకటేశ్వర దర్శనముకొఱకు కాశీ నుండి దక్షిణముఖము గాను, రామేశ్వరమునుండి ఉత్తరముఖముగాను, మద్రాసునుండి పశ్చిమముఖముగాను, మైసూరునుండి పూర్వముఖముగాను వచ్చుచున్నప్పుడు మార్గములు మాత్రము వేఱు వేఱుగా నున్నవే గాని, అందరున్ను చేరు స్థలము తిరుపతి యొకటియే యైయున్నది.

ఆలాగుననే, ఒక్కొక్క మతాచార్యులు వారువారు పోయినమార్గములు చెప్పునది సరియేగాని దీనియందు తప్పేమియు లేదు. ఉత్తర కోసల మందు శ్రీరాములై, కురుక్షేత్రములో శ్రీ కృష్ణుడై, కపిల వాస్తువులో శ్రీ బుద్ధులై,

పశ్చాద్దేశములో శ్రీ యేసుక్రీస్తులై, అరేబియాలో శ్రీ మహ్మదులై,కేరళయందు శ్రీశంకరులై, ద్రావిడమందు శ్రీ రామానుజులై, కర్ణాటకమందు శ్రీ మధ్వులై, పాంచాలదేశములో శ్రీ గురునానక్కై అవతరించి లోకసంరక్షణ చేసిన మహనీయులందరు నొకటియే యగు పరబ్రహ్మశక్తియే గాని మరి యేమియును గాదు. ఈ రహస్యము సాధారణమనుజులకు గోచరము కాదు. ఎట్లనగా, నొక ఆట కంపెనీయం దొక డొకసమయమందు శ్రీ కృష్ణవేషము, ఇంకొక సమయమందొక మునిపుంగవుని వేషమును, ఈలాగుననే అనేక వేషములను ధరించివచ్చునప్పుడు దూరమందు కూర్చుండు మనుజులు ఈ వేషధారి వేఱు, ఆ వేషధారివేఱు అని తలచెదరు. వారున్ను ఆ వేషమునకు తగిన చర్యలు చూపుచూ ఆడుదురు. ఈ రహస్యము వారితో కూడి అంతరంగ మందుండు వారికి తెలియును. ఆలాగుననే,శ్రీ పరమేశ్వరుండొక్కడైనను, ఒక్కొక్క కాలమం దొక్కొక్క అవతారము వహించి ఆ దేశమందున్న జనులయొక్క మనఃపక్వత ననుసరించి మతోపదేశము చేయుచుండును. ఈ విషయము దైవసన్నిధికి దూరముగా నుండు అజ్ఞానులకు తెలిసికొనుటకు సాధ్యము కాదు. జ్ఞానులు ఈ రహస్యమెఱింగి వాదరహితులై సుఖింతురు. ఈ కారణముచే శ్రీ వివేకానందస్వాములవారు మనుజుల కొక కుక్కకుండు బుద్ధి లేదని లోకమందరికి బోధించిరి. ఎట్లనగా ఒకకుక్క తనయజమానుండు తెలుపు,నలుపు మొదలగు అనేక డ్రస్సులు ధరించి వచ్చినను ఆ కుక్క తన యజమానుడే అని వాస్తవముగా తెలుసుకొనును. శ్రేష్ఠముగు మనుజ జన్మము ఎత్తినను కుక్కకుండు తెలివిలేక ఒక్కొక్క సమయమందొక్కొక్క రీతిగా ఈశ్వరుడు భూలోకమందవతరించు శక్తి తెలియక వారిని దూషించి కష్టమునకు పాత్రులగుచున్నారు.

శ్రుతి ॥ ఏకో నారాయణో న ద్వితీయోఽస్తికశ్చిత్।
ఏక ఏవ శివో నిత్యస్తతోఽన్యత్సకలం మృషా ॥

బహునాత్ర కిముక్తేన సర్వం బ్రహ్మమయం జగత్।
అనేక భేదభిన్నస్తు క్రీడతే పరమేశ్వరః ॥

నారాయణుం డొక్కడే. ద్వితీయమైన దేమియును లేదు. ఆ నారాయణుడే నిత్యమైన శివుడు. దానికి అన్యమైన దంతయు అసత్యము. వేయేల? ఈ జగమంతయును బ్రహ్మమే. ఆ బ్రహ్మమగు పరమేశ్వరుండనేక విధములుగా అవతరించి క్రీడించుచున్నాడు.

శ్రుతి ॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥

ఏకమై, సర్వజగత్తులను తన వశమున నుంచినవాడై, సమస్త భూతాంతర్యామియై, ఏకరూపమును బహు రూపములుగా చేయువాడగు పరమాత్ముని ఆత్మయందు స్థిరముగా నెవరు ఏకమై దర్శింతురో వారు శాశ్వతమైన సుఖమును పొందుదురు. భేదబుద్ధు లగువారికి మోక్షము సిద్ధింపదు.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున ! తిష్ఠతి !
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

ఓ అర్జునా ! ఒకడే ఈశ్వరుండు సర్వభూతముల హృదయమందున్న వాడై మాయచే యంత్రము నెక్కినవానివలె సర్వభూతములను త్రిప్పుచున్నాడు. ఓ పరిశుద్ధుడవైన సోదరుడా ! ఆ యేకమైన పరమాత్ముని తెలిసికొనువారికి ఈలాగు గుణము లుండవలయును.

శ్రుతి ॥ సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।
అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః ॥

ఈ పరమాత్మ సత్యము చేతను, తపస్సు చేతను, జ్ఞానము చేతను, నిత్య బ్రహ్మచర్య నిష్ఠచేతను లభింపబడును. ఆ పరమాత్మ శరీరాంతర్భాగమైన హృదయ పుండరీకమందు పరిశుద్ధుడై జ్యోతిర్మయమై యుండును. అట్లున్న

పరమాత్మను రాగ ద్వేషాదులైన సర్వదోషములు నశించిన యతీశ్వరులు దర్శింతురు. ముండకోపనిషత్తు.

శ్రుతి ॥ ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

ఈ ఆత్మ సమస్తభూతములందు గూఢమై యుండు కారణముచే అజ్ఞానులకు తెలియుటకు సాధ్యము కాదు. సూక్ష్మదర్శులైన ధీరులచే కుశాగ్రమువలె నుండు అతి సూక్ష్మమైన బుద్ధిచే దర్శింపబడును.

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥

ఓ అర్జునా ! ఎప్పుడు నీ చిత్తము సంసారరూపమైన విషయ మాలిన్యము నుండి అతిక్రమించునో అప్పుడు నీవు వినవలసినదాని నంతయును విని విన్న దానినంతయును పొందగలవు. అనగా నెంతకాలము వరకు హృదయము నుండి విషయవాసన యను మేఘము వదలలేదో, అంతవరకు జ్ఞానమను సూర్యుడు ప్రకాశింపడని భావము. ఎప్పుడు ఆత్మజ్ఞానసిద్ధి గలుగునో, అప్పుడే దానికి ముందుగా శాస్త్రముల చేతను, గురువుల చేతను గ్రహించిన వాక్యము యొక్క అర్థము గోచర మగును. తర్వాత గ్రహింపవలసిన దేదియు లేదని స్వయముగా అనుభవమగును అని గీత.

శ్రుతి ॥ భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥

పరావరమైన పరబ్రహ్మమును దర్శించిన వెంటనే, అజ్ఞాన సమూహమైన హృదయ గ్రంథి భిన్న మగును. సమస్తములైన సంశయము లున్ను భిన్నము లగును. అనేకకోటి జన్మార్జిత కర్మము లంతయున్ను క్షయించును.

శ్రుతి ॥ అవిద్యాయామంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః ।
జంఘన్యమానాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాంధాః ॥

అజ్ఞానమైన విషయముల ననుభవించి దానిమధ్యమందు చిక్కుపడిన వారై తమకుతామే గొప్పవారని తలంచు హీనస్వభావులైన మూఢు లంధుని ఆధారముచే పోవు గ్రుడ్డివానివలె సంసారారణ్యమందు మరల మరల తిరుగుచున్నారు. అనగా అజ్ఞానమయమైన సంసార భోగముల ననుభవించి నీచకృత్యమును జేయువారు నేను బద్ధుడను కానని యు, శుద్ధస్వరూపుడనైన నేను నిస్సంగుడను, ఇంద్రియములు మాత్రము ఆ యా పనులు చేయుచున్న వనియు, కుమ్మరిపురుగు బురద యందుండినను దానితో సంబంధము లేనట్లును, తామరాకు నీటి యందున్నను దానిని అంటనట్లును, వెన్న మజ్జిగ యందున్నను దానియందు కలియనట్లును, నేను సంసారమం దుండినను నాకంటదని చెప్పువారు నాశము పొందుదురని ముండకోపనిషత్తు ఘోషించుచున్నది. గ్రుడ్డివాని మాటలు నమ్మి వేఱొక అంధుడు వాని నూతగా గొనిన యెడల ఉభయులును ఊరు చేరక తిరిగి కూపములో బడులాగున భ్రష్టు లగుచున్నారు.

అవిద్యాయాం బహుధా వర్తమానాః
వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః ।
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగా
త్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే ॥

అవిద్యయైన సంసారమందు బహువిధములుగా నీచ కృత్యములు చేయువారై స్వయముగా నేను కృతార్థుడ నని అభిమానించు వారలు పరమ మూఢులు. వారు మందబుద్ధులు. విషయమందు రాగముచే అకర్మలు చేయు కర్మమును తెలిసికొనలేక దుఃఖితులై ఘోరమైన నరకమందు అధఃపతితు లగుచున్నారు. ఓ నిర్మలహృదయము గల సోదరుడా ! ఇప్పుడు చెప్పబూనిన విషయము శివకేశవుల కభేదము. వీరిలో ఒకరిని స్తుతియించి మరియొకరిని నిందించిన యెడల మహాపాతకమునకు ప్రాతు లగుదురు.

శ్రుతి ॥ శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే ।
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః ॥

శివునియొక్క రూపమే విష్ణువు, విష్ణువు యొక్క రూపమే శివుడు. శివుని హృదయమే విష్ణువు, విష్ణు హృదయమే శివుడు అని స్కందోపనిషత్తు.

**నారాయణశ్శివో విష్ణు శ్శంకరః పురుషోత్తమః ।**
**ఏతేషు నామభిర్బ్రహ్మ పరం ప్రోక్తం సనాతనమ్ ॥**

నారాయణ, శివ, విష్ణు, శంకర, పురుషోత్తమ అని ఈ నామములన్నియు సనాతనమైన పరబ్రహ్మము యొక్క పేరులు గాని మరేమియు గాదు.

**హరిం హరం విధాతారం యః పశ్యేదేకరూపిణమ్ ।**
**స యాతి పరమానందం స యోగీ బ్రహ్మ ఉచ్యతే ॥**

బ్రహ్మ విష్ణు మహేశ్వరులను ఏకరూపముగా నెవరు చూచుచున్నారో, అట్లున్న యోగి శాశ్వతానంద మోక్షము నొందుచున్నాడు. వాడే బ్రహ్మమని చెప్పంబడును.

**మద్భక్తశ్శంకరద్వేషీ మద్ద్వేషీ శంకరప్రియః ।**
**తావుభౌ నరకం యాతో యావచ్చంద్ర దివాకరమ్ ॥**

విష్ణుభ క్తుడై శివద్రోహియైనను, శివభక్తుడై విష్ణుద్రోహి యైనను ఈ యిరువురును సూర్య చంద్రులున్న పర్యంతము నరకమందు ప్రవేశింతురు అని విష్ణుపురాణము.

**సృష్టిస్థిత్యంత కరణీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్ ।**
**స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః ॥**

సృష్టి స్థితి లయ కారణముల కొఱకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులని పేర్లు వహించిన పరమాత్మ ఒకటియే గాని మరేమియు లేదు.

**యోఽసౌ విష్ణు స్స్వయం బ్రహ్మో యో బ్రహ్మో ఽసౌ మహేశ్వరః ।**
**వేదత్రయే చ యజ్ఞేఽస్మిన్ పండితేష్వేష నిశ్చయః ॥**

ఎవ్వడు విష్ణువో, వాడే స్వయంవముగా బ్రహ్మదేవుడు. ఎవ్వడు బ్రహ్మదేవుడో, వాడే మహేశ్వరుడు. ఈ రహస్యము మూడు వేదముల యొక్కయు, యజ్ఞాదుల యొక్క, పండితుల యొక్క నిశ్చయాభిప్రాయము.

**హరిశంకరయోర్మధ్యే బ్రహ్మణశ్చాపి యో నరః ।**
**భేదకృన్నరకం భుంక్తే యావదాచంద్రతారకమ్ ॥**

శ్రీ మన్నారాయణుని గాని, శ్రీ పరమేశ్వరుని గాని, శ్రీ బ్రహ్మదేవుని గాని భేదభావముతో చూచువాడు చంద్రనక్షత్రాదు లున్నంత వరకు ఘోర నరకము ననుభవించును. కనుక, ఓ ప్రియ సోదరుడా! త్రిమూర్తులను భేదము లేకయే భజించి కృతార్థుడవు కమ్ము. లేక దీనియందు శ్రీ భర్తృహరి చెప్పినరీతిగా, ఇష్టదేవుని ప్రేమతో భజించి ఇతర దేవతలను నిందింపక యుండువము. అట్లుండుట మిక్కిలి శ్రేయస్కరము.

**మహేశ్వరే వా జగతామధీశ్వరే జనార్దనే వా జగదంతరాత్మని ।**
**న వస్తుభేద ప్రతిపత్తిరస్తి మే తథాపి భక్తిస్తరుణేందుశేఖరే ॥**

నాకు సమస్త జగదంతరాత్మయైన మహేశ్వరుని యందు గాని, సర్వాంతర్యామియైన జనార్దనుని యందుగాని కొంచెమైనను భేదప్రతిపత్తి లేదు. అట్లున్నప్పటికిన్ని స్వభావముగా చంద్రశేఖరుడైన పరమేశ్వరుని యందు ప్రేమ అధికముగా కలదు. ఈలాగుననే, విష్ణుభక్తులైన వారుకూడ నుండవలయును. ఇది శ్రేష్ఠమైన మార్గము. అనగా విష్ణువం దధిక ప్రీతి గలవారైనను, ఈశ్వర దూషణ లేక ఉండవలయును. అలాగుననే ఈశ్వరునియం దధిక ప్రీతియుండినను, విష్ణు దూషణము లేకుండా ఉండవలయును. ఇట్లున్నవారు ధన్యులగుదురు. సంశయము లేదు.

## స్వరూప స్థితి

ప్రశ్న ॥ ఓ స్వామీ! దీనదయాపరా! నా యొక్క సంశయములను నీల మేఘ సమూహము లంతయున్ను తమ కరుణా కటాక్ష వీక్షణ మను జంఝూ మారుత శక్తిచే ఛిన్నాభిన్నము లైనవి. నిర్మలాకాశమువలె పవిత్ర హృదయుడనైతిని. నేను గదా ధన్యుడను. దీనికై నేను ఏ యొక్క తపము ఏ కాలమందు చేసితినో తెలియదు. లేక నాయొక్క తల్లిదండ్రులుగాని, పూర్వీకులు గాని, యే యొక్క మహాపుణ్యముచేసిన వారలో తెలియ సాధ్యము గాక యున్నది. లేక కరుణా సముద్రుండైన కారుణ్యమూర్తియగు జగదీశ్వరుండు అనాథుడనైన నాపై అపారమైన కరుణ నుంచెనో తెలిసినది కాదు. అయ్యా స్వామీ! ఇంక నా యొక్క స్వరూపస్థితిని తెలిపి నన్ను కృతార్థునిగా జేయుము.

ఉత్తరము ॥ ఓ భక్తోత్తమా ! నీవు నిశ్చయముగా పుణ్యాత్ముడవే. లేనియెడల ఈస్థితి పొందుటకై బుద్ధిరాదు కదా ! పాపము లేశమైన నుండిన వారికి అధ్యాత్మజ్ఞాన విషయము రుచింపదు. నీవుత్తమాధి కారివి గనుక, నీ యొక్క నిజస్థితి నిప్పు డుపదేశించెదను. జ్ఞానగురువైన శ్రీ దక్షిణామూర్తిని తదేక ధ్యానముతో ధ్యానించి సిద్ధాసనమునందు ఆసీనుడవై, ఏకాగ్రచిత్తుడవై, బహిర్విషయములనుండి ఇంద్రియాది మనంబులను అంతర్ముఖముగా జేసి నామరూపములైన ఈ దేహాది ప్రపంచమును విడిచి నేను, నేను అని చెప్పు వాడై, పంచకోశ విలక్షణుడై, అవస్థా త్రయ సాక్షియైన ఆ దివ్యస్వభావమేమి యని ఏకాగ్రతతో చూడుము. మనసు నిలుపుటకు ప్రయాస ముండిన యెడల ప్రణవమును గూడధ్యానించి దానియర్థమైన సచ్చిదానంద నిత్యశుద్ధ పరబ్రహ్మము నీవని ధ్యానించుము. బుద్ధితో కూడిన మనసును విడిచి శేషించిన ఆ శుద్ధబోధ చైతన్యమే సత్యముగా నీవు. ఆ స్థితియందు సర్వదా యుండుము. ఇదే తత్త్వమసి యను మహావాక్యము యొక్క అర్థము.

అని యిట్లు బోధించిన వెంటనే అట్లు కొంతకాలము సమాధి యందుండి మనసు బహిర్ముఖమై వచ్చినపుడు ''నాయనా ! నీవిప్పుడెవరు. ఏ స్థితియందుంటివి'' అని ప్రేమతో అడుగగా నిట్లనియె.

నాహం మనుష్యో న చ దేవ యక్షౌ
న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః ।
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో
భిక్షుర్న చాహం నిజబోధరూపః ॥

ఓ స్వామీ ! తమ యొక్క కరుణాకటాక్ష వీక్షణామృత ప్రవాహముచే నేను మనుష్యుడను గాను, దేవుడను కాను, యక్షుడను కాను, బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులలో నెవరునుం గాను, బ్రహ్మచారియునుం గాను, గృహస్థుడను గాను, వానప్రస్థుడను కాను, సన్న్యాసియును కాను, నిజమైన బోధస్వరూప మేది గలదో అదే నేనని గ్రహించితిని.

న మృత్యుర్న శంకా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా చ జన్మ ।

**న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్య**
**శ్చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్ ॥**

నాకు మరణమును లేదు, సంశయమును లేదు, జాతి భేదములు లేవు, తండ్రియును లేడు, తల్లియును లేదు, జననమును లేదు, బంధువును లేడు, మిత్రులును లేరు, గురువును లేడు, శిష్యులును లేరు, సచ్చిదానంద స్వయం ప్రకాశమైన శివుడే నేను, శివుడే నేను.

**శ్రుతి ॥ ఆదిమధ్యాంత రహితో న బద్ధోఽహం కదాచన ।**
**స్వభావ నిర్మలశ్శుద్ధ ఇతి మే నిశ్చితా మతిః ॥**

నేను ఆదిమధ్యాంత రహితుడను, ఎప్పటికిని బద్ధుడను కాను, స్వభావముగా నిర్మలుడను, పరిశుద్ధుడను అని నాయొక్క నిశ్చయాభిప్రాయము.

**శ్రుతి ॥ కాలత్రయే యథా సర్పో రజ్జౌ నాస్తి తథా మయి ।**
**అహంకారాదిదేహాంతం జగన్నాస్త్యహమద్వయః ॥**

కాలత్రయమందు ఏలాగున రజ్జువునందు సర్పము లేదో, ఆలాగుననే సచ్చిదానంద స్వరూపుడనై, అద్వైతుడనైన నాయందు అహంకారాది దేహములైన జగత్తును లేదు.

**శ్రుతి ॥ చిద్రూపత్వాన్న మే జాడ్యం సత్యత్వాన్నానృతం మమ ।**
**ఆనందిత్వాన్న మే దుఃఖ మజ్ఞానాద్భాతి సత్యవత్ ॥**

చిద్రూపుడనైన నాకు జాడ్యమైన తమస్సు లేదు. సత్యాదిగుణములతో గూడిన నాయందు అసత్యాదియైన ప్రకృతి యుండదు. ఆనంద స్వరూపుడనైన నాకు దుఃఖమును లేదు. అజ్ఞానమైన భ్రమచే అది కనపడినది గాని వాస్తవముగా లేదు.

**దేహబుద్ధ్యాతు దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహమితి మే నిశ్చలా మతిః ॥**

ఓ దేవా ! దేహబుద్ధిచే నేను తమకు దాసుడను. జీవబుద్ధిచే మీ యొక్క అంశమే నేను కూడ. ఆత్మబుద్ధిచే మీరే నేను ఇది నా యొక్క నిశ్చయమైన అభిప్రాయము.

ఉత్తరము ॥ ఓ పరమ పవిత్రుడవైన ప్రియసోదరుడా ! ఇదియే నిజమైన అవస్థ, దీనియందు స్థిరముగా నుండుము.

**భ్రమేణాహం భ్రమేణ త్వం భ్రమేణోపాసకం మనః ।**
**భ్రమేణేశ్వరభావత్వం భ్రమమూలమిదం జగత్ ॥**

ఓ నాయనా ! భ్రమము చేతనే నేననియు, భ్రమము చేతనే నీవనియు. భ్రమము చేతనే ఉపాసన మనియు, మన స్సనియు, భ్రమచే ఈశ్వరుడనియు ఈ జగమంతయు భ్రమయే గాని బ్రహ్మముకంటె వేరేమియును లేదు.

**స్వయం బ్రహ్మ స్వయం విష్ణు స్స్వయ మింద్రస్స్వయం శివః ।**
**స్వయం విశ్వమిదం సర్వం స్వస్మాదన్యన్న కించన ॥**

ఓ సోదరుడా ! బ్రహ్మదేవుడును స్వయం బ్రహ్మమే. విష్ణువును స్వయం బ్రహ్మము. ఇంద్రుడు స్వయం బ్రహ్మమే. శివుడును స్వయం బ్రహ్మము. ఈ విశ్వమంతయును స్వయం బ్రహ్మము. స్వయమైన బ్రహ్మము కంటె అన్యమైన దేదియును లేదు.

## సంశయ రాహిత్యము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! లోకసుఖాభిలాషీ ! ఇంకమీంద నేనేమి చేయవలయును? తమ ఉత్తరవు మేర మీరక యుండువాడను. నేను నిత్యుడై, నిర్వికల్పుడై, నిరంజనుడై, సత్యజ్ఞానానంద పరబ్రహ్మమగు అపరోక్షుడ నైతిని. నేను రాహువుచే విడువంబడిన పూర్ణచంద్రునివలె అజ్ఞానమైన సంకల్పమునుండి విముక్తుడనై సత్యజ్ఞానానంద శివస్వరూపుడనైతిని. సూర్యోదయమందు అంధకారము సమూలముగా నశించినట్లు నేనైన జ్ఞానసూర్యుడుదయించిన వెంటనే అజ్ఞానమైన తమస్సు ఉన్మూలముగా నశించినది, మరియు,

**అద్య మే సఫలం జన్మ చాద్య మే సఫలం తపః ।**
**అద్య మే సఫలం జ్ఞానం శంభో ! త్వత్పాదదర్శనాత్ ॥**

ఓ ! శుభదాయకుడవగు మహాత్మా ! త్వత్పాద పంకజ దర్శనము వల్ల నాయొక్క జన్మము ఇప్పుడే సఫలమాయెను. నాయొక్క తపస్సు ఇప్పుడే ఫలించినది. నాయొక్క జ్ఞానము ఇప్పుడే సఫలమాయెను.

కృతార్థోఽహం కృతార్థోఽహం కృతార్థోఽహం మహామతే।
అద్య తే పాదపద్మస్య దర్శనాద్భక్తవత్సల ॥

ఓ బ్రహ్మబోధాకారుడవగు మహాత్మా ! నేను కృతార్థుడ నైతిని. ఓ భక్తవత్సలా ! మీ యొక్క పాదారవింద దర్శనముచేత ఇప్పుడే నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతిని. మరియు దత్తాత్రేయోపనిషద్రీతిగా :

ధన్యోఽహం ధన్యోఽహం నిత్యం స్వాత్మానమంజసా వేద్మి।
ధన్యోఽహం ధన్యోఽహం బ్రహ్మానందో విభాతి మే స్పష్టమ్ ॥

సర్వదా నాయొక్క నిజరూపమగు దేశకాలాద్యనవచ్ఛిన్న ప్రత్యగాత్మను సాక్షాత్తుగా నెరిగితిని, అందువలన నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతిని, మరియు బ్రహ్మస్వరూపమగు ఆనందము నాకు స్పష్టముగా స్ఫురించుచున్నది. అందువలను నేను కృతార్థుడనైతిని; నేను కృతార్థుడనైతిని.

ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం న వీక్షేఽద్య।
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాపి ॥

మరియు ఇప్పుడు దుఃఖస్వరూపమగు సంసారమును నేను జూచుచున్న వాడను కాను. అందుచేత నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతిని. నాయొక్క అనేక జన్మ కర్మ వాసనా సమూహము గల అజ్ఞానము ఎక్కడనో పారిపోయెను. (నశించెను) అందుచేత నేను కృతార్థుడ నైతిని. నేను కృతార్థుడ నైతిని.

ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే న విద్యతే కించిత్।
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥

మరియు నాకు చేయందగినది కొంచెమైనను ఇప్పుడు లేనందున నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడ నైతిని. మరియు పొందందగిన ఫలవర్గమంతయు ఇప్పుడు నాచే పొందబడినట్లాయెను. కనుక నేను కృతార్థుడ నైతిని. నేను కృతార్థుడనైతిని.

ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే।
ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః ॥

మరియు నా యొక్క తృప్తికి సమానమైన వస్తు వెద్దియు లోకమందు లేదు. అందువలన నేను ధన్యుడనైతిని, నేను ధన్యుడ నైతిని. ఈ తృప్తి కంటె మరియొకటి చెప్పందగినది గనబడని కారణముచేత నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతిని, మాటి మాటికి కృతార్థుడ నైతిని, నేను కృతార్థుడ నైతిని, కృతార్థుడ నైతిని.

> అహో పుణ్యమహో పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।
> అస్య పుణ్యస్య సంపత్తేరహో వయమహో వయమ్ ॥

అహో( ఆహా) పుణ్యము దృఢముగా ఫలించెను, అహో నాయొక్క పుణ్యము దృఢముగా ఫలించెను. ఈ పుణ్యసంపత్తువలన ఓహో మేమే ధన్యులము ! ఓహో మేమే ధన్యులము !

> అహో శాస్త్ర మహో శాస్త్ర మహో గురురహో గురుః ।
> అహో జ్ఞానమహో జ్ఞానమహో సుఖ మహోసుఖమ్ ॥

వేదాంతశాస్త్రము ఓహో ఎంతమనోహరము. వేదాంత శాస్త్రము ఓహో ఎంతసారమైనది ! ఓహో వేదాంతగురువు ఎంత గొప్పవాడు ! ఓహో మాగురువెంతవాడు ! ఓహో అద్వైతాత్మ తత్త్వజ్ఞాన మెంత మంచిది ! ఓహో అద్వైతాత్మతత్త్వజ్ఞాన మెంత సారమైనది ! ఓహో మా ఆత్మసుఖ మెంత గొప్పది! ఓహో మాసుఖ మెటువంటిది ! ఓహో ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! మరియు శ్రీ వేదవ్యాసులు చేసిన మానసిక స్నానము రీతిగా,

> అచ్యుతోఽహమనంతోఽహం గోవిందోఽహమహం శివః ।
> ఆనందోఽహమశేషోఽహమజోఽహమమృతోఽస్మ్యహమ్ ॥

> నిత్యోఽహం నిర్వికల్పోఽహం నిరాకారోఽహమవ్యయః ।
> సచ్చిదానందరూపోఽహం పరిపూర్ణోఽస్మి సర్వదా ॥

> బ్రహ్మైవాహం న సంసారీ ముక్తోఽహమితి నిశ్చయః ।
> శుద్ధబోధస్వరూపోఽహం నిర్మలోఽహం సనాతనః ॥

నేను సంశయ రహితుడనైతిని. ఈ మహోగొప్పస్థితిని గలుగ జేసిన తమకు నేను దక్షిణగా ఇచ్చుటకై త్రిలోకమందుగూడ ఏమియు కనపడలేదు. తమయొక్క పాదారవిందములకు అనంతకోటి నమస్కారములు. నేను నీవని భేదములేక నిరతిశయానంద బ్రహ్మమయమై, పరిపూర్ణుడనై, ఆదిమధ్యాంతరహితుడనై, ఇప్పుడుండు స్థితి సదా వుండుటకై నన్ను అను గ్రహింపుము పుణ్యపురుషా !

ఉత్తరము ॥ ఓ ప్రియసహోదరుడా ! మరల అజ్ఞాన, విక్షేపములు లేక సత్త్వరజస్తమములను త్రిగుణములు లేనివాడవై ఇప్పుడుండు గుణాతీతావస్థ యందు సర్వదా ఉండుటయే నాకు తగిన దక్షిణ యగును గాని చతుర్దశ భువనము లిచ్చినను బ్రహ్మజ్ఞానోపదేశమునకు ప్రత్యుపకారము గానేరదు. అమృతము నిచ్చి, విషము పుచ్చుకొనువారు, మాణిక్యము నిచ్చి గాజురాతిని దీసుకొనువారెవరు గలరో వారే బ్రహ్మజ్ఞానోపదేశమునకు దక్షిణాభిలాష గలవారలు.

ప్రశ్న ॥ ఓ స్వామీ ! తమ అనుగ్రహముచే నేను కృతకృత్యుడను, తృప్తుడను, పరిపూర్ణుడనైతిని. నాకన్యమైన దేదియునుం గనుపడలేదు. నాకు చేయుటకై ఏమియును లేదు. ఇంక తమ యిష్టప్రకార ముండువాడును.

ఉత్తరము ॥ ఓ నిర్మలాత్మా ! ఇకమీద నీవు చేయవలసిన దేదియును లేదు. ఈ అవస్థయే నిజమైన సహజానందామనస్క రాజయోగము, ఇదే విదేహకైవల్యము, జీవన్ముక్తియును మోక్షమును ఇదే. పరమపదము, వేదాంత రహస్యమును ఇదియే. దీనికంటె ఇతర మేదియును లేదు. కనుక నీవు నిర్మలజలము గలదియు, జనబాహుళ్యము లేనిదియు నగు పవిత్రమైన స్థలమందు స్వస్వరూప స్థితియందు ఆత్మారాముడవై ప్రారబ్ధవశముగా వచ్చిన భోగము ననుభవించుచు శరీరపతన పర్యంతము నీవుండు ఆశ్రమమునకు వచ్చిన అతిథులను ఆదరముతో ఆదరించి ఘోరసంసార సాగరమునుండి విముక్తినొందుట కభిలాషగలవారికి వారివారి మనఃపక్వత ననుసరించి జాతి వర్ణాశ్రమ స్త్రీ పురుష భేదముల పాటింపక కర్మభక్తి యోగజ్ఞానవములుపదేశించి వారిని కృతార్థులుగా జేయుము. గురువుయొక్క సుఖము కొఱకు శిష్యులను సంపాదించకూడదు, శిష్యులయొక్క క్షేమము కొఱకు గురు వుండవలయును. శిష్యులను ప్రేమతో జూడవలయును, వారియొక్క ఆత్మసుఖము కొఱకు పాటుపడవలయును. ఇంకను వినుము.

ధనాపేక్ష కలిగి అపక్వమైన వారికిగాని - సాధనచతుష్టయ సంపత్తిలేని వేదబ్రాహ్మణులైనను వారికిగాని ఈ బ్రహ్మజ్ఞాన ముపదేశింపరాదు. వైరాగ్యాది గుణములు గలవాడు చండాలు డైనను వానికి సంతోషముతో బోధించుము.

అది యెట్లనగా, సన్మార్గియైన వేదబ్రాహ్మణుడు తనపుత్రిని లక్షలకొలది ధనమిచ్చినను మ్లేచ్ఛుల కిచ్చునా ? వేదవిద్యాది గుణసంపన్నుడైన బ్రహ్మచారియగు బ్రాహ్మణుడు దరిద్రుడైనను వానికి ధనమునిచ్చి కన్యాదానము చేయురీతిగా ఈ పరమ పవిత్రమైన బ్రహ్మవిద్యావిషయముండును. కనుక నిర్ధనుడైనను గుణములు పూర్తిగా ( అనగా వైరాగ్యాదులు) ఉండువారిని చేపట్టి వారినిష్ఠ పూర్తికొఱకు అన్నవస్త్రములనిచ్చి పోషింపవలయును. కర్మ, భక్తి, యోగ, జ్ఞానములు, మృదు, మంద, తీవ్ర, తీవ్రతర తరగతుల ననుసరించి ఏర్పడినవి. కనుక నిష్కామ కర్మము, ఉపాసనా యోగముల ననుష్ఠించు ముముక్షువులను ఖండింపరాదు. వారందరున్నూ మోక్షమార్గ సోపానమునందు క్రింద, పై మెట్లలో నుండువారు గాని తప్పు మార్గమున నుండువారు కారు.

ఏ మతములను గాని ద్వేషింపకూడదు. అవి యన్నియున్ను దైవసన్నిధిని ప్రవేశించుటకై ఏర్పడిన రాజవీథులే. మతములలో నిప్పుడుండు దోషము లేవియును పవిత్రులైన మతాచార్యుల యందుండవు.

మఱియు, ఓ నాయనా ! సారమైన ఒక సంగతి చెప్పుచున్నాను. ఇదే నాయొక్క అంతరాభిప్రాయము. అదేమన అందరున్ను శిష్యులతో దాసాను దాసులై యుండవలెనని చెప్పుదురు. నేను చెప్పున దేమన మీరందరున్ను గురువులై యుండవలయునే గాని శిష్యులైయుండరాదు. కాని గురు వైయుండునప్పుడు ఎట్లుండవలయునో, దానిని మాత్రము ఎప్పుడును మఱవరాదు. అదే దీనియందుండు గూఢమైన సారార్థము. ఈ మాట దేహబుద్ధి కలవారిని దుఃఖములో బడద్రోయును. ఇది సత్యనిష్ఠయొక్క అంతర్భాగమునుండి వెలువడిన ప్రకాశము. మీకు సాధ్యములేనిచో లోకమంతయును తిరిగి ఉపన్యాసము చేయవలయును, లేక గ్రంథము వ్రాసి బోధ చేయవలయునని నేను చెప్పను. కాని మీరు మీకు మాత్రము గురువై యుండిన చాలును. అండాండమునకును. పిండాండమునకును సంబంధము కలదు. కనుక పిండాండమగు మీ దేహేంద్రియములకు మీరు గురువైనచో నిశ్చయముగా

లోకమునకు గూడ గురు వగుదురు. దీనియందు కించిత్తైనను సంశయము లేదని నాకు దృఢమగు నమ్మకము గలదు. మీరు వాచా వేయి ఉపదేశములు చేయుటకన్న అర్ధోపదేశము అనుష్ఠించి చూపిన చాలును. వాచాయంత్రవముచే చేయు ఉపదేశములు నీటియందు వ్రాసిన అక్షరములవంటివి. అది అర్థము లేని శబ్దధ్వనిమాత్రమగును. అనగా దర్భపూతవంటిది. అనుష్ఠానముచే చేయు ఉపదేశము నల్లరాతియందు చెక్కిన అక్షరమువలె శాశ్వతముగా నుండును.

దీనిలో గృహస్థాశ్రమ మందుండు వారలగు మనవారు దానిలో గురువులై యుండవలెను. మన సోదరీజనులున్ను స్త్రీలకు గురువులై యుండవలెను. ఆలాగున బ్రహ్మచారులున్ను, సన్న్యాసులున్ను వారి వారికి వారు గురువులై యుండిన చాలునని నామతము. ఇట్లు కొందరు ధీరులు త్రికరణములచే పనిజేసినచో భూలోకము పుణ్యము ప్రక్కగా తిరిగి జనులు ఇహపర సౌఖ్యము నొందగలరు.

బ్రహ్మనిష్ఠకై ప్రయత్నించువారు తన ప్రయత్న సంబంధమై ప్రపంచ మందుండువారు ఏమి చెప్పుచున్నారని వెనుకను, ముందును ప్రక్కభాగములను చూడరాదు. అట్లు వెనుకను, ముందును చూచువారికి సత్యము చెప్పుటకు మాయ సమయ మివ్వదు. అప్పుడు వారు ఆత్మవంచకులై లోకమందు పొట్ట కూడు కొఱకు నిప్పుడు తిరిగెడి శుష్కవేదాంతులవలె వంచకులగుదురు. ''సత్యేన లభ్యః'' అని శ్రుతి శాసనము. ఈ మార్గమున నడుచువారు నిండా మేధావులుగ నుండవలెను. సత్యము చెప్పి యిప్పుడే మరణము తటస్థించినను వాడెప్పటికిని చావనివాడు. అసత్యము చెప్పి ఇంద్రియాది సమస్త భోగముల ననుభవించి ప్రళయమున కావలి వఱకు జీవించి యుండినను వాడిప్పుడే చచ్చినవాడు.

నా ఆత్మాభిన్నుడవైన ఓ ప్రియసోదరా ! నీవు పోయి లోకమును పావనముగా చేయుము. నామనస్సు, నది సముద్రముఖమై ప్రవహించునట్లు పరమాత్మముఖమై బలవత్తుగా పోవుచున్నది. నేను పరమానంద పరమనిష్ఠ యందు సుఖించెదను.

తృతీయ పాదము - సమాప్తము.

ఓం తత్సత్.





# శ్రీ శుష్కవేదాంత తమోభాస్కరము

## చతుర్థపాదము

## ముముక్షు కర్తవ్యము

ప్రశ్న ॥ ఓ స్వామీ ! ముముక్షు కర్తవ్య మేమియో దానిని సెలవు దయచేయ కోరెదను ధీవరేణ్యా ?

ఉత్తరము ॥ ఆర్యశిరోమణివగు ప్రియసోదరా ? ఇది విశదముగా గ్రహించతగినది. మోక్షాపేక్ష కలవాడు ముఖ్యముగా బ్రహ్మనిష్ఠుడును, భేదరహితుడును, సదాచారవంతుడును, పరమ దయాళువునగు గురువును ముందుగా వెదకవలెను. '' ఆచార్యవాౕ పురుషో వేద '' అని శ్రుతి చెప్పుచున్నది. అనగా - అపరోక్షానుభవము గలిగి అహింసాది సమస్త సద్గుణములతో ప్రకాశించుచుండు సద్గురువును పొందిన వాడు మాత్రమే ఈ బ్రహ్మవిద్య నెరుంగ గలడని తాత్పర్యము. అట్లుండు మహాత్మునికి హర్షాశ్రువులు గల్గునట్లు నిర్మలబుద్ధితో శుశ్రూషాదులు చేసి వారిచే ననుష్ఠానములు సంపూర్ణమగువరకు వారి సన్నిధియందుండిగాని లేక అప్పుడప్పుడు వారివద్దకు పోయిగాని నిష్ఠ పూర్తిజేయువలయును. ఈ యనుష్ఠాన సమయములలో శిష్యుని ముఖ్య కర్తవ్యమేమన, అభ్యాసకాలమం దెన్నెన్ని కష్ట నష్టములు వచ్చినను పాటింపక తన యొక్క నిష్ఠను పూర్తిజేయవలయును. '' శ్రేయాంసి బహువిఘ్నాని '' అను రీతిగా రోగము గాని, మిత్రులచే ద్రోహము గాని, ధననష్టము గాని, ఇతరులచే దేహబాధ గాని కలిగిన అదంతయున్ను దైవానుగ్రహమను నమ్మకముతో నుండి

తన ప్రయత్నమంతకంతకు వృద్ధి జేయవలయును. ఆ బాధ లంతయున్ను మన ప్రారబ్ధమే గాని మరెవరున్ను, ఏమియున్ను చేసినది కాదని యాస్తిక బుద్ధితో గూడ నుండవలెను. ఆలాటి బాధలు మన మనుభవించిన కావలసినది జగదీశ్వరుండు మనపై కరుణతో శీఘ్రముగా గడుపుచుండుననియు, ఈ బాధలు పోయిన తర్వాత ప్రతిబంధములు నశించు ననియు నమ్మవలెను. ఒక్కరైలుబండి యెంత శీఘ్రముగా బోవునో యంతకంత దగ్గర స్టేషన్, కనుపడునట్లు మనము ఆత్మసన్నిధికి ఎంత వేగముగా పోవుదుమో అంతవేగముగా ప్రారబ్ధబాధలున్ను సమీపించును. దీనిచే మనకేమి సుఖమనగా ! మనము శీఘ్రముగా దైవసన్నిధికి పోవుచుండు ననుటయే: ముముక్షువైనవాడు బాధలకు భయపడి ధ్యాననిష్ఠనుండి వెనుకకు మారినచో మోక్షసుఖమును పొందడు. అదియును గాక రణరంగమందు శత్రుబాధకు భయపడి పారిపోయినవాడు యెట్లు రాజ్యప్రాప్తిని పొందును? అనగా పొందనే పొందడని తాత్పర్యము. అదియును గాక శూరుడైన యోధుడు ఈ హీనమగు అధర్మము నవలంబించునా ?

**అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిలభూశ్రియమ్ ।**
**రాజాఽహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ॥**

యుద్ధమందు తనకు ఎదురుగ వచ్చిన శత్రువులను సంహరింపకయును, అఖిలభూమిని జయింపకయును నేను రాజు, రాజు అని చెప్పినమాత్రముచే ఎట్లు రాజు గాజాలడో, ఆలాగుననే మోక్ష సామ్రాజ్య ప్రాప్తి మాటల మాత్రముచే పొందసాధ్యము గాదని శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు ఆనతిచ్చినారు.

బ్రహ్మనిష్ఠాభ్యాస కాలములలో రోగముచే అనుష్ఠానము చేయుటకే భంగము గలుగుట, ఒక సమయమున నిషిద్ధాహారము తినుట తటస్థించుట, స్త్రీ విషయమందు ప్రవర్తించుట మొదలగు విఘ్నములు బుద్ధినతిక్రమించి ఒకసారి గాని, పదిసారులు గాని, శతావర్తి గాని, సహస్రావర్తి గాని తటస్థించినను వెంటనే తెలుసుకొని ప్రాయశ్చిత్తముచే పునః ప్రారంభించవలెను. ఇది అతిసారమైన రహస్యోపదేశము. మనము మలములో ఎన్ని సారులు కాలుపెట్టినను అప్పుడప్పుడు జలముచే శుద్ధిగావించి పరిశుద్ధులమగునట్లు మన ప్రారబ్ధకర్మముచే ఇట్లు

కలిగినదని నిశ్చయించి పూర్వాధిక ప్రయత్న మారంభించుట ఉత్తమము. లేక ఎన్నిసార్లు విషమంటినను మంత్రౌషధములచే నివర్తించునట్లు ఎన్నిసార్లు పతనము గలిగినను మరలమరల ప్రయత్నము మాత్రము నిలుపరాదు. పతన సమయ మందంతయు పశ్చాత్తాపముచే భగవంతుని ప్రార్థించవలయును. ఈ రీతిగా చేయక కొందరు మందమతులగు ముముక్షువులు ఒకసారి గాని, రెండుసార్లు గాని విషయప్రవృత్తిలో మునిగినను, లేక మత్స్యమాంస సురాపానాది భక్షణములలో చిక్కుపడినను, లేక రోగబాధచే తినరాని వస్తువు తినినను, పునః బ్రహ్మవిచారము చేయక సిగ్గుపడి నిలిచిపోవుదురు. ఇది మహాతప్పు. మలమును త్రొక్కినను వెంటనే కడుగక అట్లే పెట్టుకొను మూర్ఖులెవరైనను గలరా ? వారుగదా పునరనుష్ఠానమునకు సిగ్గుపడుదురు.

శ్రీ విశ్వామిత్ర మహాఋషి ఒక్క అవస్థయందు క్షుద్బాధ సహింపక కుక్కమాంసము భుజించుట తటస్థించెను. మరల కుక్కమాంసము తినినంత మాత్రముచే తన తపస్సంతయున్ను వ్యర్థమై పోయెనని సంశయింపక ప్రాయశ్చిత్తమాచరించి మరల తపస్సును ప్రారంభించెను. మరియొక కాలమందు తపోనిష్ఠయందుండగా, మేనక యొక్క కామబాణమగు విషయవలలో చిక్కి బహుకాలము పరవశుడైనను, మరల ఆ మోసము జ్ఞప్తికి తెచ్చుకొని ఆలాటి విఘ్నములు రాని చోటికి పోయి అత్యధిక ఘోరతపము ఆచరించెను. మరియు శ్రీ వసిష్ఠమహర్షిచే బ్రహ్మర్షి అని పలికించు పర్యంతము ఎంతో బాధపడియు త్రిమూర్తులుగూడ మధ్యస్థముచేసియు తన యొక్క పట్టిన పట్టు విడువక తపమాచరించి ఆఖరున శ్రీ వసిష్ఠమహర్షిచే బ్రహర్షి యని చెప్పించినట్లు తీవ్రగుణము గలిగి ముముక్షువు లుండవలెను. లేక ఏదో కష్టనష్టములు వచ్చినను, లేక విషయమందు మగ్నులైనను, తినరాని వస్తువు తినినను భయపడి నిలిచిపోవుట నిండా శోచనీయము. కేవలము బుద్ధిహీనత.

కొందరు కొంచెము పతనము గలిగిన మరల భక్తుల సంఘముతో జేరకయు, గురువుల యొద్దకు వెళ్ళకయు నిలిచి పోవుటయు గలదు. ఇది గొప్ప ప్రమాదము. పరమ భక్తుడగు శ్రీప్రహ్లాదుడు ఎంత బాధ పొందినను తాను పట్టినపట్టు విడువక సాధించినట్లును, మహాత్ముడగు శ్రీ క్రీస్తుదేవుడు చిత్రవధ

నొందినను తన యొక్క నిష్ఠను పూర్తిచేసినట్లున్ను, హరిశ్చంద్రుడనేక విధములు పాటుపడియు తన సత్యము పరిపాలించి ధన్యత్వము పొందినట్లున్ను ముముక్షువు లుండవలయును.

**సమాధౌ క్రియమాణే తు విఘ్నాన్యాయాంతి వై బలాత్।**
**అనుసంధానరాహిత్యమాలస్యం భోగలాలసమ్ ॥**

అని చెప్పియుండుటంబట్టి సమాధినిష్ఠ నభ్యసించెడి వారికి అనేకములగు విఘ్నములు గలుగునని ఉపనిషత్తు ప్రమాణము. దీని అర్థము ఈ గ్రంథమునందు తృతీయ పాదమున గనందగును. ఈ విషయమై శ్రీ కృష్ణస్వామి ఉపదేశము చూడుము.

**హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥**

ఓ అర్జునా ? నీవు శత్రువులను జయింప సాధ్యపడక వారికి లోబడి హతుడవైనచో మహాసుఖభోగస్థలమగు స్వర్గమును పొందగలవు. లేనిచో శత్రువులను పరాక్రమముతో నీవు జయించినచో రాజ్యపట్టాభిషిక్తుడవై రాజ్యభోగము ననుభవింతువు. కనుక రెంటిలో ఏదైనను సరియే. కాబట్టి నిశ్చయబుద్ధిగలవాడవై యుద్ధము చేయుము. ఇదేరీతిగా దీని గూఢార్థము గ్రహింపం దగినది. అనగా ఇంద్రియవిషయములగు శత్రువు లను జయించి మోక్ష సామ్రాజ్యమును పొందుటకు ప్రయత్నించు ముముక్షువు ప్రారబ్ధ కర్మ బలముచే వృత్తులను జయింప సాధ్యము లేనిచో విషయములకు లోబడి పరిపూర్ణ జ్ఞానము పొందుటకు ముందుగా మృతినొందినను విరోధము లేదు. మహాసుఖతరమగు స్వర్గము ననుభవించి ఉత్తమ కులమునందు జన్మించి చిన్న కాలమునుండి మహాభక్తుడగును. లేక ఇంద్రియవిషయ శత్రువులను వైరాగ్య ధ్యానశక్తి యను గాండీవముచే జయించినచో నిత్యసుఖమును, శాశ్వతమోక్షమును అనుభవింపవచ్చును. కనుక ప్రయత్నము మాత్రము దృఢబుద్ధితో చేయవలయును. దీనికి మొట్టమొదట శ్రద్ధ యుండవలెనని శ్రీ వాసుదేవులు పదేశించిరి.

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి ॥**

బ్రహ్మజ్ఞానమం దాసక్తి కలవాడు ఇంద్రియముల యొక్క విషయము నుండి మనస్సును వశీకరించి బ్రహ్మనిష్ఠయం దత్యధిక ప్రయత్నము చేయవలయును. అట్లు శ్రద్ధగలవాడు నిశ్చయముగా అతిత్వరలో, జ్ఞానమును పొందగలడు. ఆ జ్ఞానమే శాశ్వతమగు నిర్వాణసుఖము, అనగా నిత్యసుఖమగు మోక్షము. శ్రద్ధయనగా తా నే యొక్క పనికి పూనెనో ఆ కార్యములో నెన్ని ప్రతిబంధములు వచ్చినను ఆ పని పూర్తి అగువరకు దానినే మరల మరల ప్రయత్నించుచు సంపూర్ణము చేయవలయును. అంతవరకు కొంచెమైనను విశ్రాంతి చేయరాదు. ఇది ధీరులయొక్క ముఖ్య గుణగణము. ఈ గుణముగలవాడు ఎంత అల్పుడుగా నుండినను వాని కసాధ్యమైనది ముల్లోకములయం దేదైన నుండదు. దీనికొక కథ చెప్పెదను.

**బహుభిర్న విరోద్ధవ్యమేకేనాపి బలీయసా।**
**స పరాభవమాప్నోతి సముద్ర ఇవ టిట్టిభాత్॥**

ఎంతబలవంతుడైనను బహుజనములతో విరోధము పొందరాదు. బహుజనములతో విరోధము పొందినవాడు సముద్రము కులింగపక్షితో విరోధపడి పరాభవమును పొందినట్లును దుఃఖమునకు కారణమగును.

ఇచ్చట బ్రహ్మవేత్తలు ఒక కథను చెప్పుట సంప్రదాయము. టిట్టిభము అనగా పక్షి విశేషము. ఈ పక్షి సాధారణముగా సముద్రతీర భూమియందే నివసించును. భూమియందు గుంటను త్రవ్వుకొని గ్రుడ్లు పెట్టిపెంచును. సముద్రతీరమునందు ఒక కులింగపక్షి తన భార్యతో కూడ కాపురము చేయుచుండెను. అప్పుడా కులింగపక్షి భార్య గర్భమును ధరించియుండి తన భర్తను చూచి ''యింక మనము ఇచ్చటనే కాపురము చేయకూడదు. ప్రసవ సమయము సమీపించినది. ఇచ్చటనే ప్రసవించిన యెడల ఈ సముద్రమునందు ఇప్పుడు వర్షాకాల మాసన్నమైనందున సముద్రమున కుద్రేకము గలుగును. గ్రుడ్లను తన అలలచే నీడ్చుకొని పోవును, కనుక మరియొక ప్రదేశమునకు పోయి

ప్రసవించెద'' నని చెప్పెను. అందుకా కులింగపక్షి భార్యను చూచి '' ఓ పిచ్చిదానా! నా సామర్థ్యము సముద్రమునకు తెలియదా? అతడు మనకు భయపడక ఉండునా?'' అని నిర్భయముగా చెప్పి ఇచ్చటనే ప్రసవించవలెనని చెప్పెను. అంతట భార్య నానాప్రకారముల ఇచ్చోటు విడిచి పోవలెనని చెప్పినను కులింగపక్షి యిష్టపడనందున భర్త మాటలు అతిక్రమింపజాలక బహుసంకటముతో ఆ సముద్రమునందే గ్రుడ్లు పెట్టెను.

సముద్రుడు ఈ కులింగపక్షి యొక్క ప్రగల్భ వాక్యమును విని ఆహా ఈ పక్షి యెంత చిన్నది. దీని యొక్క గర్వము చూచెదను, ఈ పక్షి ఏమి చేయును? అనుకొనుచు ఆ దినమే దానియొక్క గ్రుడ్లను అలలచే లోపలికి ఈడ్చుకొని పోయెను. అప్పుడా కులింగపక్షి భార్య తన పెనిమిటిని జూచి ''నేను ఇదివరకే చెప్పలేదా? సముద్రుడు మన గ్రుడ్లను ఈడ్చుకొని పోయెను కదా'' యని దుఃఖముతో బహువిధములుగా విలపించెను.

అప్పుడా కులింగపక్షి తనభార్యతో ''నీవు దుఃఖించకుము. నేను సముద్రజలమును నిశ్శేషముగా శోషింపజేసి మన గ్రుడ్లను తిరిగితెచ్చి నీకిచ్చి సంతోషపరచిన తర్వాత జలపానము చేయుదునే గాని మరి ఏమిన్నీ చేయను'' అని చెప్పి ఆహా ! సముద్రుడా ! నా పరాక్రమము నెఱుంగక పోతివి కదా ! అని గంభీర ధ్వనితో తనముక్కుతో ఒక్కొక్క జలబిందువును గ్రహించి దరికి నుమియుచుండెను. అప్పుడా పక్షి యొక్క బంధువులందరు వచ్చి ఇది నీకు శక్యము గాని పని, దీనిని మానుకొనుమని ఎంత చెప్పినను ఆ కులింగపక్షి తన ప్రయత్నము నిలుపక ఇతర పక్షులతో మీరందరున్ను నాకు సహాయముగా నుండుడు, త్వరలోనే ఈ సముద్రుని శోషింపచేయవచ్చునని ఆ పక్షులను సహాయము కోరెను. మరియు ఆ కులింగపక్షులు నానావిధములుగా ఈ పనిసాధ్యము కాదని పలుమారు చెప్పినను తన యొక్క ధైర్యమును విడువక శ్రద్ధగల వారికి అసాధ్యమైన పని ముల్లోకములం దేమియు లేదని వారికి ధైర్యము చెప్పి తనపనికి తోడుపడుటకు ప్రేరేపించెను. మరియు ఆ పక్షులు ఎంత చెప్పినను ఈ పక్షి మానక వారిని కూడ సహాయము చేయుటకై మరల మరల ప్రార్థించెను.

ఆ పక్షులన్నియున్ను ఈ పక్షికి సహాయపడి సముద్ర మొడ్డున వరుసగ

గూర్చుండి తమతమ ముక్కులతో ఒక్కొక్క జలబిందువును సముద్రము నందుండి గ్రహించి దరికి నుమియుచుండెను. అప్పు డీకుళింగపక్షి యొక్క అదృష్టముచే ఆ త్రోవను వచ్చుచుండు నారదమహర్షి ఈ కుళింగపక్షియొక్క యత్నమును మొదటనుండి కడవరకు విని ఆహా ఈ పని మీకు శక్యమా ? మానుకొనుట మేలని పలుమారు చెప్పెను. ఎంత బోధించినను ఆ కులింగపక్షి ''ఓ మహర్షి సత్తమా ! శ్రద్ధగలవారికి అసాధ్యమైనది ఏమైనను గలదా? ఈ పని నేను ఈ జన్మములో గాని, మరియొక జన్మమందు గాని, వెయ్యి జన్మము లెత్తినను ఈ దుర్మార్గుడగు సముద్రుని శోషింపచేసి నా గ్రుడ్లను నేను గ్రహించుదునేగాని ఈ సంరంభము మానుటలే'' దని దృఢముగా చెప్పి నీటిచుక్కలను వెలుపలికి నుమియుచుండెను.

అంతట నారదమహర్షి ఈ కులింగ పక్షి యొక్క దృఢనిశ్చయమునకు మిక్కిలి సంతోషించి ఈ స్థితియందు ఈ పక్షి యుండినచో పాపము ప్రాణము పోవునని నిశ్చయించి దానిపై దయకలవాడై శ్రీ వైకుంఠమునకు వెళ్ళి గరుత్మంతుని జూచి ''ఓ పక్షిరాజా ! నీ యొక్క రాజత్వము బోవుటకై కాలమాసన్న మైనదిగదా! ఏమన మీ వంశస్థులు సముద్రునితో యుద్ధము ప్రారంభించిరి. కనుక వారికి తోడ్పడినచో నీ యొక్క రాజత్వము స్థిరపడును. లేక వారు జయించినచో, ''పక్షిరాట్'' అను పేరు ఇకమీద కులింగపక్షులకు స్థిరపడును'' అని శ్రీ నారదులు గొప్ప తంత్రముచే ఆయనను ఈ కుళింగపక్షికి సహాయముగా ప్రేరేపించి పంపెను.

అంత నా పక్షీంద్రుడు తన పక్షముల వేగముతో సముద్రమందు రెండు మూడుసార్లు పరాక్రమముతో తిరిగెను. అంత సముద్ర జలమంతయు అల్లకల్లోలములతో బురదమయమై పోయెను. తర్వాత తన యొక్క ముక్కుతోను, కాళ్లతోను గొప్పగొప్ప పర్వతములను ఈడ్చుకొని సముద్రమును పూడ్చుటకై ప్రారంభించెను. ఆ పక్షీంద్రుని అపార శక్తిని చూచి సముద్రాధిపతి యగు వరుణుడు భయమునొంది ఆ కులింగపక్షి యొక్క గ్రుడ్లను దానికిచ్చి ప్రార్థించి తన అపరాధమునకు క్షమాపణ పొంది పోయెను.

ఈ ప్రకారమే పరమ ధర్మమైన మనోనిరోధమునందు ధ్యాననిష్ఠాది ప్రయత్నము చేయు ముముక్షువులు ఎంత బాధగలిగినను విసుగు పొందక

నిష్ఠయందు ప్రయత్నము చేసినచో వారిని పరమదయాళువగు పరమేశ్వరు డనుగ్రహించి శీఘ్రముగా బ్రహ్మనిష్ఠ పూర్తి అగునట్లు చేయును. లేక ఏదో ఒక మహాత్మునిచే అనుగ్రహింప చేయుటకై ప్రేరేపణ చేసి భక్తులను ధన్యులు గావించును. ఈ కథనుబట్టి ఎంతో సారము గ్రహించవచ్చును. ఈ విషయమై శ్రీ కృష్ణభగవంతుడు గీతయం దిట్లుపదేశించెను.

**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥**

బ్రహ్మనిష్ఠ మొదలగు పవిత్రకార్యము అభ్యాసానుష్ఠానకాలములో విషము వలె కనుపించినను క్రమక్రమముగా అవసానమున అమృత సమాన ముగ పరిణమించును. ఇదిన్ని గాక అట్టి తపోధ్యానాది ప్రయత్నములు సాత్త్వికమైనవి. మరియు ఆ తపోధ్యానాదులవలన ఎంత కల్మష హృదయముగా నుండినను ఆ దోషములు పోయి అత్యంత పరిశుద్ధత గలిగి జ్ఞానము ప్రకాశించును. ఇది సాత్త్విక బుద్ధికలవాని స్వభావమని చెప్పిన కారణ మేమన సాత్త్విక బుద్ధిగలవాడు తన అనుష్ఠానమునకు ఎన్ని విఘ్నములు గలిగినను తన పట్టును విడువక సాధించునని తాత్పర్యము. ''కష్టే ఫలీ '' అను న్యాయము ననుసరించి కష్టమునకు పాలుమాలువాడు సుఖము పొందడని వానికి నిశ్చయబుద్ధి కలదు. రజోగుణ, తమోగుణములు గలవారు కష్టమునకు భయపడి పోవుటచే వీరికి సుఖము పొందుట సాధ్యము కాదని శ్లోకార్థము. దీనికి నిదర్శనము మహర్నులే? ప్రపంచమందు గూడ గొప్పగొప్ప ఉద్యోగము పొందువారు ఎంతకాలము కష్టపడి చదివియు, డబ్బు వ్యయము చేసియు గొప్ప పరీక్షలో విజయమొంది గొప్ప పదవిని సంపాదించుచున్నారు. సోమరులును, అలస పురుషులును ఏ అవస్థను పొందుచున్నారు ? దీనిలో గూడ ఎంతకష్టపడి చదువువారికి అంత గొప్ప ఉద్యోగము దొరుకును గదా ? ఇదే దృష్టాంతము. శ్రీ వివేకానందస్వామి యొక్క ముఖ్యమత మును ఇదియే. వారు అన్నిటిలోను ఈ మంత్రమే ప్రథమముగా వ్రాయుదురు. ఈ మంత్రము కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతుడు అను ఋషిపుత్రుని కుపదేశించెను.

**శ్రుతి ॥ ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్య వరాన్నిబోధత !**

ఈ మూడు పదములను వారు ముందుగా వ్రాయుదురు. ఇప్పుడా మంత్రము పూర్తిగా వ్రాసెదను.

**శ్రుతి ॥ ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్య వరాన్ని బోధత !**

**క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదంతి ॥**

అజ్ఞానముచే అనాద్యవిద్యయందు ఏమియున్ను తెలియక నిద్రించు చుండెడి ఓ జనులారా ! ఉత్తిష్ఠత = లెండు, (అజ్ఞాన నిద్రనుండి) జాగ్రత = మేల్కొనుడు, అనగా మాయ యెప్పుడు మోసము చేయునోతెలియదు కనుక హుషార్, వరాః = బ్రహ్మనిష్ఠులగు మహాత్ములను (పరిశుద్ధులగు గురువులను), ప్రాప్య = పొంది, నిబోధత = బాగుగా తెలిసికొనుడు, క్షురస్య = మంగల కత్తి యొక్క, నిశితా = తీక్ష్ణముగా చేయబడిన, ధారా = వాదర, యథా = ఏ ప్రకారము, దురత్యయా = పొందశక్యమైనది కాదో, తథా = ఆ ప్రకారము, కవయః = బ్రహ్మవేత్తలు, తత్ = ఆ ఆత్మానుసంధానమైన, పథః = మార్గము, దుర్గం = దుస్సాధ్యముగా, వదంతి = చెప్పుచున్నారు.

ఓ నచికేతుడా ? బ్రహ్మవేత్తలు ఆత్మతత్త్వమును వివరించుచు సాన పట్టబడిన మంగలకత్తియొక్క వాదర మీద నడుచుట కెంత బుద్ధిమంతునికి సాధ్యమో అట్టి బుద్ధిగలవాడు మాత్రమే మోక్షమార్గ మందు నడువగలడు అని చెప్పుచున్నారు. కనుక అజ్ఞానముచే భోగమందు మగ్నులై యుండు ఓ జనులారా! మీరు లేచి మాయయొక్క నిద్రనుండి మేల్కొని సదాచారపరులగు సద్గురువులను పొంది ఆత్మతత్త్వమను శాశ్వత సుఖమును తెలిసి కొనుడని జనులకు శ్రుతి మిక్కిలి దయతో తల్లి పిల్లలకు బోధించునట్లు బోధించుచున్నది. దీనిచే వాడిమి గల కత్తిమీద నడుచువా డెంత జాగరూకుడుగా నుండవలెనో విచారించి కొంచెము ఏమారినచో గాయము తగులునట్లు బ్రహ్మనిష్ఠకు హానివచ్చుననియు తెలియం దగినది. బ్రహ్మనిష్ఠాభ్యాసము చేయువాడు గొప్ప రోగియుండు రీతిగా నుండవలెను. అనగా రోగియైన వాడు ఔషధసేవాకాలమందు ఏయే పదార్థములు భుజించినచో రోగబాధ కలుగునో ఆయా వస్తువులు కనిపెట్టి విడుచునట్లును,

ఏయే స్థలమందుండినచో రోగబాధ శాంతమగునో, ఆయా స్థల మందుండునట్లును, బ్రహ్మనిష్ఠుడు ఏయే ప్రవర్తనలచే నిష్ఠకు హానికలుగునో దానినంతయు జాగరూకుడై కనిపెట్టి వర్తించవలెను. మరియు ముముక్షువైన వాడు సువర్ణపరీక్షకునివలె నుండవలెను. అనగా వాడు అపరంజి యగు బంగారములో రాగిగాని, ఇత్తడిగాని కలిసియుండినచో దానిని అపరంజిచేయుటకై నిప్పులో పెట్టి ఆ దోషము పోవువరకు ఊదునట్లు గురుముఖమునుండి తన ఆత్మస్వరూపమును శ్రవణముచేసి మాయాసంబంధమగు వృత్తులు సమూలముగా నశించు పర్యంతము మనన నిదిధ్యాసనములు చేయవలయును. ఈ విషయమై శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరాముల వారి కిట్లుపదేశించెను.

తావదేవ నిరోద్ధవ్యం యావద్హృది గతం క్షయమ్ ।
ఏతజ్జ్ఞానం చ ధ్యానం చ శేషోఽన్యో గ్రంథవిస్తరః ॥

ఎంతవరకు హృదయ మందు వృత్తి రాహిత్యము గాలేదో అంతవరకును బ్రహ్మానుసంధానమగు ధ్యానము విడువరాదు. యోగము చేతను, జ్ఞాన శాస్త్రము చేతను, గురుముఖమునుండియు ఈ రహస్యమే తెలిసికొనందగినది. అన్యములగు సమస్త వేదశాస్త్రములయొక్క గూడార్థ మిదియే. ఇతర విషయములను చెప్పు సమస్త శాస్త్రములు దీని కొరకే.

కనుకనే శ్రీ వాసుదేవులు ''స్వధర్మే నిధనం శ్రేయః '' అని చెప్పిరి. ఈ పదమునకు అనేకులు అనేక విధములుగా అర్థము చెప్పుదురు. కాని దీని నిజార్థ మిది యని నాకు తోచుచున్నది. అనగా ఏ స్థితి యందుండి ఏ యొక్క బ్రహ్మనిష్ఠ మొదలగు శుద్ధ విచారము చేయుచున్నారో దానియందు ఎన్ని ప్రతిబంధములు వచ్చినను తన నిష్ఠను విడువకుండ నుండవలయును. ఒక్క వేళ ఆ విషయమై మరణము ప్రాప్తించినను శ్రేయస్కరమే. దీనికి శ్రీ క్రీస్తుదేవుడే సాక్షి. కనుక ఇహలోక సుఖమునకు గాని, పరలోకసుఖమునకు గాని శ్రద్ధయే అన్ని గుణముల కంటె ముఖ్యమైన గొప్ప గుణము. దీనినే శ్రీ కృష్ణ స్వామి గీతయందు చెప్పుచున్నారు.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ ! న చ తత్ప్రేత్య నో ఇహ ॥

ఓ అర్జునా ! శ్రద్ధ లేక చేయబడిన హోమ, జప, ధ్యాన, పూజా, తపోదానములు గాని, ఇతర పుణ్యకర్మలు గాని, ఇతర పనులు గాని అసత్తని మహర్షుల అభిప్రాయము. అనగా నిష్ప్రయోజన మనుట. ఈలాటి కృత్యములు ఇహలోకమందు గాని పరలోకమందు గాని యుపయోగపడవు. ఇది నిండా గొప్ప ఉపదేశము. అనగా ఇహలోకసుఖము కొరకు చేయు కృషి మొదలగు సస్యాదులు సమయమునకు సరిగా విత్తనము పెట్టకయు, సమయము ననుసరించి పెట్టినను నీళ్ళు ఎఱువు వేయకయు, కసువుతీయకయు, గొడ్లుమేయుట చూడకయు ఉండు కృషి నిరుపయోగమగును. అట్లే ముముక్షు హృదయమును కాపాడు బ్రహ్మనిష్ఠ యను కల్ప వృక్షమునకు దుర్వృత్తులను దుర్గుణములను కనిపెట్టి తీసివేయుటయు, దైవభక్తియను జలము పోయుటయు, ధ్యాననిష్ఠలో నెక్కువ ప్రయత్నమను పోషణము చేయుటయు, కామక్రోధాదులను దుష్టజంతువులు రాకుండునట్లు కాపుదారిగ బుద్ధిని నిలుపుటయు చేసినచో జ్ఞానఫలము అనుభవమునకు వచ్చును. లేనిచో ఇప్పుడు రాజయోగులని చెప్పు కొందరి నికృష్టావస్థను పొందగలుగును. అనగా పోషణ లేని కృషివలె వ్యర్థమని భావము. దీనినే అన్ని కృత్యములకున్ను అన్వయము చేయవచ్చును.

**రాజగుహ్యమైన రాజయోగంబును**
**శ్రద్ధధానులగుచు జనము లెల్ల,**
**సంశ్రయింప లేక సంసారవనధిలో**
**మునుగు చుండుదురు విమూఢు లగుచు.**

అని శ్రీ సీతారామాంజనేయ సంవాదమందు మొదటనే శ్రద్ధగా నుండవలెనని శాసించినారు.

ముముక్షువగువాడు లోకులు చేయు నిందాస్తుతులయందు సహనశక్తి మనః పూర్వకముగా సంపాదింపవలయును. ఈ విషయమై శ్రీ భర్తృహరుల వారిట్లుపదేశించిరి.

**నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు**
**లక్ష్మీస్సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ ।**

అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః ॥

నీతినిష్ఠయందు నిశ్చయ బుద్ధిగల ధీరులు పరులు నిందించినను సరే, లేక స్తుతించినను సరే, మహత్తైన అష్టైశ్వర్యములు వచ్చినను, లేక సమస్త సంపత్తు నశించినను, ఇప్పుడే మరణము సంభవించినను, లేక యుగాంతరమువరకు జీవించినను సన్మార్గమునుండి అణుమాత్రమైనను చలింపరు. మరియు ఇట్లు నుడివిరి. జనుల తృప్తిననుసరించి నడచుట యెవనికైనను సాధ్యము కాదు. అనగా అంతయున్న విడిచి యేకాంతవాసము జేసి బ్రహ్మనిష్ఠచేయువానితో ఏమి ? ఈశ్వరు డిచ్చుట మాత్రము కలవాడా ? ఈ నిర్జన స్థలమందు ఏల కష్టపడవలెను? ఊరిలో నుండినచో మోక్షము రాదా ? ఇట్లనియు, ఒకవేళ గ్రామమునందుండి ధ్యాననిష్ఠ జేసినచో, ఇదేమి ? భక్తులు జనస్థానమునం దుండవచ్చునా ? ఏకాంతస్థలముగదా వారికి విధించి యుండునది అనియు, మరియు జనులకు సన్మార్గమైన మంచినడతలగు లోకోపకారమైన ఉపదేశము చేయుచుండినచో, ఏమి ఇతడు సాధువై మౌననిష్ఠ నవలంబించి యుండక ఈ లోకులతో నేమిపని, మహాత్ములు మౌనియై యుండవద్దా యనియును, మౌనియై నిర్వాసన సమాధి నభ్యసించు చుండినచో, అయ్యో యితనికి మంచి నాలుక ఈశ్వరుండిచ్చినను ఏదో లోకులకు మంచి మాటలు చెప్పి వారిని గూడా సన్మార్గులనుగా జేయరాదా అనియు, మనస్సు సాత్త్వికస్థితి నొంది నిర్విషయ ధ్యానము సిద్ధించుట కొరకు గొందరు పుణ్యాత్ములు పాలు పండ్లు భుజించుచుండినచో ఏమి ? అన్నము భుజించువారికి మోక్షము రాదా ? పాలు పండ్లకు ఎంతఖర్చు అనియు, అన్నము భుజించు వారితో అన్నము మాయ గదా ! అన్నము విడువక మనస్సు నిలుచునా? అనియు చెప్పుదురు.

ఈలాటి పామరపు మాటలను విని చెడిపోవక నిశ్చలబుద్ధితో అపరోక్షస్థితి గలుగు పర్యంతము బ్రహ్మనిష్ఠ నభ్యసించుట కనుకూలమగు ఏర్పాటులు చేసుకొని అభ్యసించి నిష్ఠను పూర్తిచేయువాడు ధన్యుడగును. ఇంక కొందరు ఇట్లు చెప్పుదురు. పనిచేయుటకు సోమరితనముచే సాధువేషము వేసి తిరుగువాడనియు, ఏమి దేహబలము లేదా ? ఏదో కూలి చేసి ఎందుకు

జీవించకూడదనియును, మరికొందరు ఏదో దొంగపని చేసి యూరిలో నుండుటకు సాధ్యపడక తిరుగుచుండుననియు ఇంకకొందరు కడుపాత్రముకొరకే ఈ వేషమంతయు అని చెప్పుదురు. వేరుకొందరు దుర్మార్గులు మాయింటికి పనికిరా ? భోజనము పెట్టి నాల్గణాలు కూలి ఇచ్చెదనని చెప్పెదరు. వీనినన్నిటిని క్షమించి తననిష్ఠ నత్యధిక ప్రయత్నముతో సాధింపవలయును. ''పరిహాసం పాపనాశనం'' అని శాస్త్రము చెప్పుటచే నట్లు నిందించువారు వీరి పాపమును భాగించుకొనుచున్నారు గదా ? వారు ఎప్పుడైనను ఏదో పుణ్యకర్మము చేసి యుండినచో ఆ పుణ్యఫలము వీరికి వచ్చును. ''స దత్వా స్వకృతం పుణ్యం పాపమాదాయ గచ్ఛతి '' అనగా సాధునిందచేయువాడు తన పుణ్యము వానికిచ్చి పాపమును తీసుకొని పోవుచున్నాడని శాస్త్రసమ్మతము. పాపము ! వాడీలాటి దుర్వృత్తి చేయుట తెలియకనే చేయుచున్నాడు. అప్పుడు సాధువైనవాడు వారి యధోగతిని చూచి పశ్చాత్తాప పడునేగాని కొంచెమైనను దుఃఖముతో కోపింపడు. ఈ కాలమున వారు చెప్పునట్లే కొందరు సోమరులు కూడ తిరుగుచుండునది సత్యమే.

మరియు ఓ నాయనా ! ముముక్షువైనవాడు రెండు విషయములను నిశ్శేషముగా విడువవలయునని శాస్త్రము బలముగా శాసించుచున్నది. అది ఏమన ధనమున్ను, స్త్రీయున్ను చిత్తపిశాచ మను పక్షికి ఇవి రెండు రెక్కలు. వీనిని వైరాగ్య మను కత్తిచే నరికినచో ఒక స్థలమందు కదలక మెదలక పరబ్రహ్మధ్యానమందు పడియుండవచ్చును. దీనిని ముఖ్యముగా గ్రహించదగినది.

**వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వప్యనాసక్తో హి నరో నారాయణో భవేత్ ॥**

బ్రహ్మదేవుడు జీవులను ద్వివిధ భ్రమలచే మాయలో సృష్టించెను. అవి ఏవన కాంతయు, కనకమును. ఈ రెంటినుండి విముక్తి నొందిన నరుడు నారాయణుడగును. ఆలాగుననే పురుషసంబంధమున్ను, ధనమును విడిచినచో నారి, నారాయణి అగును. (పతితో గూడినవారి సంగతి కాదు.) దీనికి శ్రీ బుద్ధదేవుడే సాక్షి. రాజాధిరాజుల కేక కుమారుడై అప్సరః స్త్రీ సమానమగు

భార్యను విడిచిన కారణముచే నిర్వాణపదము నొందెను. దీనినే శ్రీ శంకరాచార్యులవారు మణిరత్నమాలయం దిట్లు చెప్పిరి.

**కిమత్ర హేయం ? కనకం చ కాంతా**

**సేవ్యం సదా కిం ? గురువేద వాక్యమ్ ।**

ముముక్షువైనవానిచే ఇహమందు విడువందగినవి యేవి యనెడు ప్రశ్నకు ''కనకం చ కాంతా'' అనగా స్త్రీ యున్ను, ధనమును అవశ్యముగా విడువందగినవి. మరియు సేవింపతగిన దేది అను ప్రశ్నకు ''గురువేదవాక్యం'' అనగా సద్గురుసేవయున్ను, వేదాంతవిచారమున్ను అవశ్యముగా చేయందగినవి అని బదులు చెప్పిరి. మరియు ముముక్షువైనవాడు తన్ను ఇతరులు తప్పుండిన గాని లేక గాని, సాధారణనేరము మోపి తిట్టి కొట్టినను, తనయందు తప్పు లేదని వాదించి ఇతరులపై పోరాటమునకు పోవుట గొప్ప బుద్ధిమాంద్యము. తన యందు దోషము లేదని తాను చెప్పుకూడదు. వారు ద్వేషించుటకు కారణమగు దోషము తనయందుండునని తలంచి తన దోషమును దిద్దుటకై ప్రయత్నించినచో ఉత్తమగతిని బడయగలడు. మన నేత్రముచే ఇతర వస్తువులను చూచుచున్నాము. మననేత్రము ఎఱుపుగాని, నలుపుగాని, తెలుపుగాని మనకు ఇతరులు చెప్పక తెలియదు గదా ? ఒక్కడు తనయందుండు దోషము కనిపెట్టుటకై యెప్పుడు ప్రారంభించునో అప్పుడు వాడు, నది ఏలాగున అతి వేగముగా పరుగెత్తి సముద్రమునం దైక్యమగునో, ఆలాగున అతివేగముగా పరుగెత్తి పరమాత్మయందు ఐక్యమగును. ఎవడు తనయందుండు దోషము చూడక ఇతరుల దోషము గమనించుటకై ప్రయత్నము చేయునో, అతడు పర్వతోపరిభాగమందుండి జలము క్రిందికి పడునట్లు స్వస్థానమునుండి అధోగతికి జారిపడుచున్నాడు. కనుక ఇతరులు తన్ను దూషించుచో దోషముండవచ్చునని నమ్మి తన దోషము పోగొట్టుకొన నిశ్చయించువాడు మహాబుద్ధిశాలి.

## పురుష ప్రయత్నము

ప్రశ్న ॥ మనుష్యప్రయత్న మెంత చేసినను కాలకర్మములు చేరక

యేమియున్ను సాధింప శక్యము కాదు గదా ? ఒక గర్భిణి స్త్రీ దశమాసములు వచ్చునప్పుడు ప్రసవించును, వృక్షము తగు కాలము ప్రాప్తించి నప్పుడు ఫలించునే గాని దీనిలోపల ఎన్ని ప్రయత్నములు చేసినను వ్యర్థము గదా ?

ఉత్తరము ॥ ఓ సుశీలుడవగు సోదరుడా ! ఈలాటిమాటలు నీవంటి ఉత్తమగుణములు గలిగిన తీవ్రగుణము గల వారికి చెప్పినవి కావు. ఇది కేవల మందమతులకు చెప్పినది. ఎట్లన గర్భమందుండు పిండమునకున్ను, వృక్షమునకున్ను స్వశక్తి లేదు. అవి ఆ స్థితిలో జడప్రాయములు, కనుక ఆలాటి జడప్రాయులు ఆ దృష్టాంతము నుదాహరించుదురు. ఇది నీవు నమ్మవద్దు, చెడిపోదువు.

జగదీశ్వరుండు మానవ జీవికి కొంత స్వశక్తి యిచ్చి యున్నాడు. దానిని శ్రద్ధతో వినుము. ఆదికాలమున మహర్షులు కొందరిని సద్యో జాతులుగా చేసినట్లు శాస్త్ర ప్రసిద్ధము. అప్పుడు నవమాస పూర్తి యెట్లు ఘటించును ? వృక్షములలో కూడ పోషణాది ప్రయత్నముచే ఫలమునకు కాలదూరసమీపములు గలుగును. ఒక టెంకాయచెట్టు మంచి భూమిలో పెట్టి బాగుగా పెంచినచో మూడునాలుగు సంవత్సరములలో ఫలించును. అదే చెట్టు సారరహితమగు భూమియందు పెట్టి పోషణము లేనిచో, ఇరువది సంవత్సరములకైనను, కాయ కనుపింపదు కదా ! మరియు సాధారణముగా కోడిగ్రుడ్లుగాని బాతుగ్రుడ్లుగాని పిల్లలుచేయుటకు పెట్టిన తర్వాత సుమారు ఇరువదియొక్క రోజులు పట్టును. ఇప్పుడు దానికి ఒక యంత్రము కని పెట్టియున్నారు. దానియందుంచినచో ఒక్క యామము లోపల పిల్లలు కలుగును. మరియు మనకు గంగా స్నానమునకు పోవలసినచో, పాదచారిగా పోయినచో, ఎనిమిది పదిమాసములు పట్టును. రైలులో పోయినచో ఆరుదినములు మాత్రము చాలును కదా ! నడచిపోవునపుడును, బండిలో పోవునపుడును, దూరము రెంటికి సమమైనను గమనశక్తికి మార్పుకలదు కదా? లేక కొందరు శ్రీరామభక్తులు శ్రీ రామకోటి వ్రాసెదరు. వారిలో కొందరు దిన మొక్కింటికి సహస్రము (వెయ్యి) వ్రాయువారికి కోటి పూర్తిఅగుట కిరువది ఏడువర్షముల నాలుగుమాసముల యిరువది మూడు దినములు పట్టును. దిన మొక్కింటికి మూడువేలు వ్రాయువారికి, తొమ్మిదిసంవత్సరములు ఒక

మాసము పదునెనిమిది దినములు పట్టును. దిన మొక్కింటికి పదివేలు వ్రాయువారికి రెండు సంవత్సరములు తొమ్మిదినెలలు పదహారుదినములు పట్టును. శ్రీరామ కోటి పూర్తియైన ఫలమందరికి ఒకటే ప్రకారము కదా సిద్ధించును. కాని ప్రయత్నము ననుసరించి కాలదూర సమీపములు కలుగును గదా? కాని ఈలాటి గొప్ప పని నిర్విఘ్నముగా పూర్తి కలుగుటకు జగదీశ్వరునియొక్క కరుణ పూర్తిగా లేనిచో సాధ్యము కాదు.

ఈ విషయమై నీకు దృఢబుద్ధి గలుగుటకై చెప్పెదను. ఈ దేశము నుండి నెటాల్ మొదలగు దేశములకు పనివారిని పిలుచుకొనిపోవుట చాలాకాలము క్రిందటి స్వభావము. దానిలో కంపెనీవారి డబ్బుఖర్చుతో పోవువారి కైదు సంవత్సరములు అగ్రిమెంట్ అనగా నైదుసంవత్సరములు వారికి లోబడియుండి వారు చెప్పుపనిని చేయవలయును. ఆయైదు సంవత్సరములన్న వస్త్రము లిచ్చి నెల యొకటికి రెండు లేక నాలుగు రూపాయలు పై ఖర్చు కొరకు ఇచ్చెదరు. దీనిలో వారివారి యిష్టానుసారముగా హెచ్చుతక్కువగా అడిగి పుచ్చుకొనవచ్చును. ఈ పోవు జనులలో దలాలి వారి మాటలు విని కొందరు మంచివారుకూడ వెళ్ళుదురు. అచ్చట పని కష్టసాధ్యము. ఆకష్టము నుండి తొలుగుటకు వారికి చెల్లించవలసిన రూపాయలు చెల్లించిననే కాని మరి వేరు మార్గము లేదు. అచ్చట కంపెనీ వారు కూడ ఈ పనివార్ల బుద్ధి కుశలత కనిపెట్టుట కొక్క సూత్ర మేర్పరచి యున్నారు. అది ఏమన పనివారందరున్ను ఉదయము ఆరు గంటలకు పోయి మధ్యాహ్నము రెండు గంటల వరకు విడుదల లేకయే పనిచేయ వలయును. రెండు ఘంటలు విడిచిన తర్వాత ఆదినము ఏర్పాటు ప్రకారము ఏమి పనియు నుండదు. మరల మూడు గంటల నుండి రాత్రి ఎనిమిది గంటల పర్యంతము ఆఫీసులో యిష్టానుసార మిష్టముండు వారికి పని దొరకును. సాధారణముగా ఒక్కరు పది పండ్రెండు అణాలకు పనిచేయవచ్చును. ఆ కూలి యప్పుడే యివ్వబడును. దీని కిష్టముండువారు పోవచ్చును. నిర్బంధములేదు. దీనిలో మనుజులను మూడుభాగములుగా మనమిప్పుడు చేయవచ్చును.

1. అతి శ్రద్ధగలవారు. 2. మందశ్రద్ధగలవారు, 3. అశ్రద్ధులు. వీరికి వేదాంతశాస్త్రము రీతిగా ఉత్తమ, మధ్యమ, కనిష్ఠాధికారులని పేరు. వీరిలో

ఉత్తముడు పై అగ్రిమెంటు దుఃఖమును తొలగించుటకై వారివిధి ప్రకారము చేయవలసినపని రెండు గంటలవరకు చేసిన తర్వాత యింటికి వచ్చి భోజనము జరిపి మరల మూడుగంటల నుండి రాత్రి ఎనిమిది గంటలవరకు ఆఫీసుపనికి పోయి లభించిన డబ్బుచే జీవితముగడపి మామూలు కంపెని వారిచ్చు బియ్యము మొదలైన సామగ్రి గాని చిల్లరరూపాయలు గాని పుచ్చుకొనడం. అప్పుడు కంపెనివారు వీరి కివ్వవలసిన మామూలు సామగ్రిన్ని రూపాయలున్ను లెక్కపెట్టి వాని లెక్కయందు జమచేర్చుదురు. ఇట్లున్నవారికి ఒకటిన్నర లేక రెండు సంవత్సరములలో వారికి చెల్లించవలసిన ఋణము తీర్చుకొని ఆ దుఃఖమునుండి విముక్తుడై సుఖముగా ఇష్టానుసారముగా నుండవచ్చును. ఇట్లుండువారు త్తములు. ఇక మధ్యమ గుణము గలవారు పై చెప్పిన ప్రకారము రెండు గంటల వరకు కంపెనీ వారి పని పూర్తి చేసి మూడు గంటల నుండి ఏ పనికిని పోక మామూలు బియ్యపు సామగ్రులున్ను రూపాయలున్ను పుచ్చుకొని జీవించుదురు. వీరు సరాసరి యైదు సంవత్సరములు వారి ఆధీన మందుండి చెప్పినపని అంతయున్ను చేసి కష్టపడవలెను. వీరు మధ్యములు. మూడవ తరగతివారు అశ్రద్ధులు, మందమతులు, వీరు మామూలు ప్రకారము రెండు గంటలవరకు పనిచాలించి మరి ఏ యొక్క పనికిపోవక మామూలు బియ్యపు సామగ్రిగాక మరల రెండు మూడు రూపాయ లధికముగా అప్పు చేసి దుర్వినియోగము చేయుదురు, వీరు పది యిరవై సంవత్సరములు పరాధీనమందుండి కష్టపడవలెను. ఈ మూడు తరగతులలో నుండు వారిలో ఉత్తము డగువాడు ఆదియందు కష్టమధికమైనను త్వరలో నిత్యసుఖము కలవాడగును. మధ్యము డైనవానికి క్రమముగా విముక్తి గలుగును. కనిష్ఠుడైనవానికి ఆదియందు మంచి సుఖము దొరకినను బహుకాలము వాడు ఋణవిముక్తుడు గాక కష్ట మనుభవింపవలెను.

ఈ దృష్టాంతము ఇప్పుడు దార్ష్టాంతమందు తీసుకొనవలెను. పైరీతిగా మన మందరమును నెటాల్ పోయినవారివలె కర్మబంధమునకు లోబడినవారమే. ఐనను మన యొక్క శ్రద్ధ ననుసరించి కర్మవిముక్తి చేయవచ్చును, ఎట్లన ఉత్తమాధికారియగు వాడు ప్రారబ్ధకర్మఫలమును నిశ్చయముగా ననుభవింపవలయునని దృఢచిత్తుడై, సత్యధర్మపరాయణుడై ఏ యొక్క ప్రాణి

పీడయు చేయక దేహకష్టముతో తన జీవితభారము లగు కుటుంబ కృత్యములను జరిపి కుటుంబసంబంధమగు పనులైన తర్వాత ఈశ్వర ధ్యాన, జప, పారాయణాది భజనచేయుటయు, యథాశక్తి అతిథి పూజతోడను, పరోపకారముతో నడచుచు వచ్చినచో పై చెప్పిన ఉత్తమాధికారి రీతిగా శీఘ్రముగా కర్మవిముక్తి నొందవచ్చును. వీనికి మొదట కొంచెము కష్టము ఏర్పడినను వేగముగా ఈశ్వరప్రీతి గలిగి సజ్జనకరుణచే జ్ఞానసుఖ మనుభవింపవచ్చును. రెండవవాడు ఏ యొక్క పుణ్యకార్యము గాని, పాపకర్మము గాని చేయక శక్త్యనుసారము ధర్మమార్గముతో కాలము గడుపువాడు. వీడు క్రమముక్తిని పొందగలడు. వీని కర్మమంతయు అనుభవింపవలసివచ్చును. మూడవ మందబుద్ధిగలవాడు ఏ యొక్క పుణ్యమును చేయనే చేయడు, మరియు ప్రాణిహింస సురాపానము, అసత్యప్రవర్తనము, మోసపుపని చేసి ధనము దుర్వినియోగము చేసి దేహసుఖ మనుభవించువాడు. వీడు బహు జన్మములకు కూడ మోక్ష మార్గ మెరుంగడు. ఇది యన్నిటియొక్క రహస్యమే, మనలో శ్రద్ధగలవానికి ప్రథమమున కొంచెము బాధ గలిగినను అతిశీఘ్రముగా సర్వదుఃఖ నివృత్తియగు శాశ్వత మోక్షము నొందవచ్చును. కనుక నీవుదాహరించిన కాలకర్మసమయ మందరిని బాధింపదు.

ఇంకొక్క విధము కూడ చెప్పెదను. కర్మమును జయించుటకు మనుష్య జన్మము వచ్చినది. కర్మము, కర్మము అని ధ్యానించువాడు సర్వదా కర్మియే. దీనికి ఒక ఉదాహరణము. ఒక కుటుంబస్థుడు గతసంవత్సరములో కొంచెము భూమిని మాత్రము కృషి చేసెను. దానిలో రాగి, కొఱ్ఱలు మొదలగు విత్తనములు వేసెను. భూమి మాత్రము మహామంచిదే; పై ధాన్యములచే ఈ సంవత్సరములో భోజన సౌఖ్యము లేకుండుట మాత్రము గాక చాలా కష్టపడి జీవితము జరుగుట చూచి ఒక ఆప్తుడు చెప్పిగాని లేక స్వబుద్ధి కుశలతచే గాని ఈ సంవత్సరము రాగి, కొఱ్ఱలు వేయక వరి విత్తనము గోధుమలు వేయుటయే గాక భూమిని, చాలా అధికముగా పైరుచేసెను. ఈ కృషి చేయు సమయమున ముందు పండిన రాగి, కొఱ్ఱలు, భోజనమునకు దొరుకునేగాని ఇప్పుడు చల్లియుండు వరి గాని, గోధుమలు గాని రావుగదా ? దీని ఫలితము కొన్ని మాసముల వరకు రాదు గదా! ఆ ఫలితము వచ్చు పర్యంతము క్షమతో ఓర్చుకొని యుండవలయును. అప్పుడు వరి, గోధుమలు, సంపూర్ణముగా ఫలితమై చేతికి వచ్చును.

ఈరీతిగానే మన ఇప్పటి అనుభవమున్నది. భూమి యందు ఏ విత్తనము వేసిన ఆఫలముగాని వేరుఫలము ఫలింపదు గదా ? అనగా రాగులు చల్లిన సజ్జలు పండవు కదా ? ముష్టివిత్తనమునకు చీనీపండు ఫలింపదు కదా ? భూమియందు రెండిటికిన్ని ఫలములు కలుగును. దానిలో పాపకర్మ ఫలము ఇప్పుడు దుఃఖమున్ను, పుణ్యకర్మఫలము సుఖమున్ను కలుగుచున్నది, కావున నిప్పుడు మన అవస్థను కనిపెట్టి ఏ బీజము వేసిన వారమో తెలుసుకొని యికమీద ఆలాగు విషబీజమగు పాపకర్మము చేయక పుణ్య కర్మరతులమై యుండినచో కొన్ని దినములు పోవునప్పుడు సుఖము కలుగును.

> పాపం వినా శరీరస్య దుఃఖం నాస్తి పదే పదే ।
> యత్కించిద్దృశ్యతే దుఃఖం సర్వం పాపసముద్భవమ్ ॥
> స్థూలం చైవాథ సూక్ష్మం చ దుఃఖం పాపసముద్భవమ్ ।
> అపాపం చ యదా స్యాద్వై శరీరం సుఖభాజనమ్ ॥
> భోగం వినా న ప్రారబ్ధం గచ్ఛతీతి సునిశ్చితమ్ ॥

పాపము లేనిచో శరీరమునకు పదేపదే దుఃఖము కలుగుటకు వీలులేదు. శరీరమునకు కించిత్తైనను దుఃఖము కనుపించినచో అది పాపమందుండి ఉద్భవించినది. ఆ దుఃఖము స్థూలశరీర సంబంధము కాని, సూక్ష్మశరీర సంబంధము కాని, గొప్పది కాని, కొంచెము గాని ఉండినచో అది పాపముచే కలిగినది. ఎప్పుడు పాపము నశించునో అప్పుడీశరీరము సుఖమునకు ఆలయమై యుండును. ప్రారబ్ధకర్మము అనుభవించిన నాశమొందునే కాని వేరుమార్గముచే నశింపదని వేదశాసనము అని స్కాందపురాణము.

ఇప్పుడు కొందరు భక్తులు ధర్మాత్ములై పుణ్యకర్మపరులై యుండినను దుఃఖమే కనుపించుచున్నది. మరికొందరు దుర్మార్గులై పాపకర్మ పరాయణపరులై యుండినను బహువిధ ధన ధాన్యపరులై కనపడు చున్నారు. వీరిలో ధర్మాత్ములకు దుఃఖమునకు కారణము పూర్వము తెలిసి గాని తెలియక గాని ముష్టిచెట్టును పెట్టియుండుటయే. మదోన్మత్తులై తన స్థితిని ధన మోహముచే ఎరుంగక పాపకర్మము చేయువారు పూర్వజన్మమున అమృతబీజము వేసినవారైనను ఇప్పుడు

విషబీజము లెక్కలేక పెట్టుచున్నారు. భక్తులై ధర్మనిష్ఠయందుండి ప్రస్తుతము కష్టపడువారు జన్మాంతరమందు విషబీజము పెట్టినను ఏదో యొక గొప్పదైవానుగ్రహఫలముచే భక్తి కలిగినది. ఇప్పుడమృత బీజము వేయుచున్నారు. లేక యిప్పుడు చీనీపండు విత్తనము వేయుచున్నారు. లేక పూర్వము రాగి, కొఱ్ఱ చల్లి యిప్పుడు వరి, గోధుమలు చల్లువారు. దుర్మార్గులైనవారి కైశ్వర్యమునకు కారణము, పూర్వజన్మములో ఎప్పుడో చీనీపండు విత్తనము లేక, వరి, గోధుమలు చల్లుటయే. ఇప్పుడు ముష్టి విత్తనము వగైరా వేయుచున్నామని వారు మదముచే ఎఱుంగకుండ నున్నారు. కనుక శ్రద్ధగలవాడు కర్మము నతిక్రమించుటకు శక్తి గలవాడగును.

మరియు గడియారమందు మూడు ముల్లులు గలవు, ఒకటి ఘంటా సూచకము. మరియొకటి నిముషసూచకము. మూడవది సెకెండ్ సూచకము. ఘంటా సూచక ముల్లు ఉదయమునుండి అస్తమానపర్యంతము ఒక్క ప్రదక్షిణము చేయును. ఆ సమయములోపల నిముషములముల్లు పంౘండుచుట్లు చుట్టును. ఆ సమయము లోపల సెకెండు ముల్లు ఏడునూర్లా యిరవై (720) ప్రదక్షిణములు చేయునుకదా ? ఇదే ఉత్తమాధికారి, మధ్యమాధికారి, కనిష్ఠాధికారులయొక్క వేగశక్తి. మంద ప్రయత్నము కలవాడు అనేక జన్మములలో దాటిపోవు చుండగా శ్రద్ధాభక్తి వైరాగ్యములు గలవాడు ఒక్క జన్మములో దాటి జన్మ సాఫల్యమొందును. కనుక మూఢుల మాటలు వినక భక్తివైరాగ్యముతో నుండి సర్వదా పరమ దయాళువగు పరమేశ్వర ధ్యానమందుండి సుఖముగా నుండుము.

**వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్ ।**
**ఆయుః పరిస్రవతి బిన్నఘటాదివాంభో**
**లోకస్తథాఽప్యహితమాచరతీతి చిత్రమ్ ॥**

పెద్దపులివలె జర (ముదిమి) పట్టుకొని చంపుటకై బెదరించుచున్నది. రోగములు నానాటికి శత్రువులవలె అధికముగా పీడించుచున్నవి. ఆయుస్సు,

పగిలిన ఘటమందుండు నీళ్లు కారిపోయినట్లు నిమిష నిమిషము నశించుచున్నది. ఇది చూచి మనుజుడు ఈ జనన మరణ మహాదుఃఖమునుండి తప్పించు కొనుటకు మార్గము వెదకక కాలము వ్యర్థముగా గడుపుటెంత ఆశ్చర్యమని ఉపనిషత్తు ఆహో యని ఘోషించుచున్నది.

మన సమయమంతయును్ను ఆహార నిద్రలనెడు ఇద్దరు దొంగ లపహరించి నాశము చేయుచున్నారు. ముముక్షువు లగువారు ఆహారనిద్రలనుండి సమయము సంపాదింపవలెను. లేనిచో ఎంతవారికైనను సమయము దొరకనే దొరకదు. మన సమయము సాలెపురుగువంటిది. ఆ చిన్న జంతువు లోపలినుండి యెన్ని గజముల నూలు కావలసియుండునో అంతయు సంపాదించును. లేక సమయము గొడుగున తగిలించియుండు రబ్బరుదారము వంటిది. ఎంతలాగుదుమో అంత పొడుగుగా వచ్చును, విడిచినచో ఎంతో చిన్నదిగా మారును. కనుక ముముక్షువైనవాడు ఆహారనిద్రలనుండి సమయము జాస్తిగా సంపాదింపవలెను. ఇతరములగు వ్యర్థసంభాషణాది చేష్టలన్నిటిని వర్జింపవలయును. వ్యర్థముగా కాలము గడుపువారిని చూచునప్పుడు ప్రత్యక్షముగా వీరే యమదూతలని నిశ్చయముగా నమ్మవలెను. ఏమనగా మన ఆయుస్సు పరిమితి గలది, అనగా 30, 70, 90 ఈలాగు ఆ 'వయస్సు ప్రమాణము కలదు. ఈ మానుష జన్మమున కాయుస్సెంతో మహాత్తైన పుణ్యపుంజఫలమే కాని అల్పస్వల్పము కాదు, ఇంతగొప్ప వస్తువు మనకు తెలియకనే పగిలిన కుండయందుండు జలమొక్కొక్క బొట్టు పోయి పోయి నశించునట్లున్ను, గడియారమును జేబులోబెట్టి మనమూరకుండినను ఆ గడియారము ముల్లు చుట్టుకొని కాలముంగడుపునట్లు మన సమయము కనిపెట్టు సామర్థ్యము లేక జన్మము వ్యర్థమైపోవుచున్నది. మనకు భోజన వస్త్రాదు లెంత అధికముగా కావలసియుండునో అంత యధికముగా ధనము కూడ సంపాదింపవలయును. ధన మధికముగా సంపాదించుటచే సమయము ఎక్కువగా ప్రపంచమందు ఖర్చు పెట్టవలెను. డబ్బు తక్కువ ఖర్చుచేసినచో కొంచెము సమయము మాత్రము పనిచేసి తక్కిన సమయమంతయును్ను పరమాత్మ ధ్యాననిష్ఠతో గడపవచ్చును. అప్పుడు శీఘ్రముగా బ్రహ్మానంద ప్రాప్తి సిద్ధించును,

అనగా పరబ్రహ్మధ్యాననిష్ఠ చేయుటకు, శరీరము నిలుచుటకు మాత్రమే ఆహారము పుచ్చుకోవలెను. ఒకవేళ కుటుంబధనము హెచ్చుగా నుండినను వ్యర్థముగా భుజించి మలముగా జేయుటకంటే ఇతరులగు దరిద్రబ్రహ్మనిష్ఠులు అన్నాహారాదుల కెంత కష్టపడుచున్నారు. వారికి కొంచెము సహాయ మొనర్చినచో యెంత గొప్పఫలము. అయ్యో సంసారమందుండు కొందరు కుక్షి పూర్ణపారాయణు లొక్కరోజు భుజించు అన్నాది వస్తువులు నలుగురు భక్తులకు పెట్టవచ్చును, వీరు మూడు నాల్గు సారులు కడుపు నిండుగా భుజించి జీర్ణము చేయుటకై పాపకరమగు బ్రాందివగైరా త్రాగుటయు లేక అజీర్ణమాత్రలు తినుటయు యెంత గొప్పపాపము.

ఈలాగుననే సాధువులను పేరు వహించిన జ్ఞానహీనులు కూడ తెలివి లేని పై చెప్పిన మూఢులవలె మితము లేక భుజించి జీర్ణము కొరకు గంజా, అభిని మొదలగు నిషిద్ధ వస్తువులు కూడ స్వీకరించి అది జ్ఞానపత్రి అనియు, కల్పమనియు, గురుమూలిక అనియు చెప్పి సంసారమందుండు వారిని యెంతబాధ పెట్టుచున్నారు. ఇది యెంతయో ఆశ్చర్యము. కనుకనే ''అల్పాహారః స్వల్పనిద్రా యోగినాం పరమం వ్రతం'' అని చెప్పిరి. మరియు అతీత వైరాగ్యమున్ను, తీవ్రతర ముముక్షుత్వము కూడ నుండవలెను.

**వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే ।**
**తస్మిన్నే వార్థవంతస్స్యుః ఫలవంతశ్శమాదయః ॥**

**ఏతయోర్మందతా యత్ర విరక్తత్వముముక్షయోః ।**
**మరౌ సలిలవత్తత్ర శమాధే ర్భ్రమ మాత్రతా ॥**

ఏ ముముక్షువందు తీవ్రమైన వైరాగ్యమున్ను, అత్యధికమగు మోక్షాభిలాషయున్ను గలదో వానియందు మాత్రమే శమదమాదులయొక్క ఫలమగు జ్ఞానము ప్రకాశించును. ఈ వైరాగ్య ముముక్షుత్వములు మందమై యెవనియం దుండునో వాని శమాది సాధ్యమగు బ్రహ్మజ్ఞానము యెండమావులలో నుండు నీరువలె తోచుటే కాని ఉపయోగమునకు ఏమియు నుండదు. అనగా వేషము మాత్రమని యర్థము. మరియు,

**అత్యంతవైరాగ్యవతస్సమాధిస్సమాహితస్యైవ దృఢప్రబోధః ।**
**ప్రబుద్ధతత్త్వస్య హి బంధముక్తిర్ముక్తాత్మనో నిత్యసుఖానుభూతిః ॥**

అతీతమగు వైరాగ్యముతో కూడినవానికి మాత్రమే చిత్తసమాధాన మగును. చిత్తోపరతి కలవానికి మాత్రమే దృఢప్రబోధము ప్రకాశించును. దృఢప్రబోధము కలవానికి మాత్రమే బంధ విముక్తి గలుగును. ముక్తాత్ముడగు మహానుభావునికి మాత్రమే నిరతిశయానందము కలుగును.

అనగా వైరాగ్య మన్నిటికంటె గొప్పవస్తువు. ఈ వైరాగ్యము సంపాదించి బ్రహ్మనిష్ఠాభ్యాసము చేయు ముముక్షువునకు రెండువిధములగు పరీక్షలు తటస్థించును. అనగా అవస్థానభేదము కలుగును. దానిలో మొట్టమొదట భూతప్రేత పిశాచాసురులయొక్క పరీక్ష ప్రారంభమగును. ఆ కాలము రోగము, ధననష్టము, బంధుమిత్రులకు విరోధము, మనస్థ్సిరత్వము లేకుండపోవుట, దుర్విషయాదులలో ప్రవేశించుట, తినరానివస్తువులు తినుటకభిలాష కలుగుట మొదలుగా గల ప్రతిబంధములు బలముగా తటస్థించును. ఈ అవస్థలో అనేకులు మోక్షమార్గమునుండి జారిపడుదురు. ఈలాటి కష్టనివారణ కొరకు భగవద్భక్తి అత్యధికముగా నుండవలెను. రెండవ పరీక్షను దేవతలున్ను కొందరు సిద్ధపురుషులు ప్రారంభించెదరు. ఆ కాలము బ్రహ్మనిష్ఠుల కనేకములగు సిద్ధులు గలుగును. లోకమందుండువారు బహువిధములుగా పూజించుదురు. బహువిధములగు భోగములు వచ్చిచేరును. బ్రహ్మచారులుగా నుండువారికి గొప్పధనము నిచ్చి కన్యాదానము చేయుటకై గొప్పగొప్ప వారందరు హస్తబద్ధులై ప్రార్థించుదురు. సన్న్యాసులుగా నుండువారికి మహా ప్రభువులుకూడ వచ్చి మఠములు కట్టించుటకై తొందర పెట్టుదురు. సాధారణ బుద్ధిమంతులు పైచెప్పిన కష్టములకోర్చి బ్రహ్మనిష్ఠను సాధించుదురు, సుఖము వచ్చునప్పుడు దానిని అతిక్రమించుటకు సాధ్యముగాక సుఖభోగములందు మగ్నులై ఆ సుఖమునందు పతితు లగుదురు. ఈ అవస్థనుండి రక్షణ పొందుటకై మహాత్ముడగు గురుసన్నిధియందుండి వారి కారుణ్యము సంపాదింపవలెను. కనుకనే శాస్త్రమందు సుఖదుఃఖముల రెంటిని ఒకే విధముగా చూడవలెనని చెప్పిన రహస్యము. కృషి

వర్షము లేకయు నశించిపోవును. ఆ రీతిగా అతివర్షముచేతను నాశము కలుగును. ఆ సుఖదుఃఖములలో ఒక్కటి ఇనుప గొలుసు, రెండవది బంగారుగొలుసు. దీనిలో దేనిచే సంబంధించినను బద్ధుడే. లేక బంగారు ఇనుములచే చేయబడిన సూదులతో కుట్టినచో కన్ను పోవుటలో రెండును్ను సమానమే.

**వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు ।**
**తస్యాఽన్తరాయో మైత్రేయ దేవేంద్రత్వాదికం ఫలమ్ ॥**

ఓ మైత్రేయమహర్షీ ! జప, ధ్యాన, హోమార్చనాది నిష్ఠల నభ్యసించి వాసుదేవ పరబ్రహ్మమును పొందుటకు మనసు ప్రయత్నించు ముముక్షువైనవానికి దేవేంద్రత్వాది సమస్త ఫలభోగ ప్రాప్తియు తన మోక్షమున కంతరాయములని పరాశర మహర్షి మైత్రేయులవారికి విష్ణుపురాణమునందుపదేశించిరి.

**ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ**
**లఘ్వీ పురా వృద్ధిముపైతి పశ్చాత్ ।**
**దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా**
**ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్ ॥**

ఈ బ్రహ్మనిష్ఠాది భక్తి మార్గ ప్రవర్తనలో మంచి సద్గుణమున్ను, నిజమగు భక్తి శ్రద్ధయున్ను గల సజ్జనుండు మధ్యాహ్నానంతరము గల తన ఛాయ ( నీడ) వలె ప్రతిదినము వృద్ధి చేసికొనవచ్చును. మందగుణము గల పామరుం డుదయమందుండు తన నీడగొప్పదిగా కనుపించినను మధ్యాహ్నము రాగా రాగా ఎట్లు తగ్గిపోవునో ఆలాగున క్రమక్రమముగా భక్తిధ్యానాది జపములు తగ్గించుచు వచ్చును. వీడుత్తమ గతిని పొందడు. మొదటి వాడు శీఘ్రముగా ముక్తిని బడయగలడు, అనగా ఉదయమున ( మన) నీడ ఎంతో పొడవుగా నుండునుకదా! సూర్యుడు ఎక్కగా నెక్కగా తగ్గి తగ్గి మధ్యాహ్నము సరిగా రాగా ఛాయలేకుండా పోవునుగదా ? ఆలాగుననే దుర్జనుడు ప్రారంభములో గొప్పదిగా కావించి క్రమముగా ఏమియున్ను లేకుండపోవును. సజ్జనుడు ప్రారంభ దశయందు చిన్నదిగా ప్రారంభించి ప్రతిదినమున్ను అధిక మధికముగా వృద్ధి గావించుకొని వచ్చును. ఏలాగున మధ్యాహ్నమున తన నీడ కొంచెముగా కనుపించినను మిక్కిలి

వృద్ధి అయి సాయంత్రమునకు యెంతో గొప్పదిగా నుండునో అట్లుండునని భర్తృహరి యోగీశ్వరుండు నుడివెను.

**అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప !**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥**

ఓ అర్జునా ! మంచి శ్రద్ధలేని నరులు మహత్తరమగు ఈ మోక్షము యొక్క ఫలము నెరుంగక (శ్రద్ధాభక్తులతో భజించి ముక్తినొందక) జనన మరణమను ఈ ఘోర సంసార సాగరమను చక్రములో మాటిమాటికి తిరిగి కష్టపడుదురు అని శ్రీ భగవద్వచనము.

**అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥**

ఆత్మజ్ఞానము నెరుంగనివాడును, శ్రద్ధ కొంచెమైనను లేనివాడును గురువాక్యమునందును శాస్త్రములయందును సర్వదా సంశయబుద్ధితో కూడినవాడునగు ముముక్షువు పూర్ణసుఖము ననుభవింపక నాశమునే పొందును. అట్లు శ్రద్ధలేనివాడు ఇహలోక సుఖము గాని, పరలోక సుఖము గాని పొందక భ్రష్టు డగును. కనుక శ్రద్ధ గొప్పదిగా నుండవలెను. అనగా ఒక సమారాధనలో పులుసు చేయుటకు పప్పు కూరగాయలు వగైరా వస్తువులు దండిగా సంపాదించినను, కళాయిలేని పాత్రయందు వండిన, చిలుముపట్టి పోవునేగాని ఏమి ప్రయోజనము? డబ్బు నష్టమున్ను, శరీర కష్టమున్ను మిగులునేగాని దానిచే ఇహమందుగాని పరమందుగాని యేమి ప్రయోజనముండును ? ఆ రీతిగా అత్యధికమగు శ్రద్ధ లేనిచో జప ధ్యానాది పుణ్యకర్మములున్ను వ్యర్థ మేయని శ్రీవాసుదేవుల యుపదేశ సారము.

మరియు ఆహార విషయములయందు కూడ ముముక్షువు నిండా జాగరూకుడై యుండవలయును. మనస్సును స్వాధీనపరచుకొను విషయములో ఆహారము గొప్ప సహాయము చేయును. దీనికి బహుదూరముగా విచారింప నక్కరలేదు. ఒక్క గోవునున్ను, పులినిన్ని పరీక్షించినచో ఈ సంగతి శీఘ్రముగా తేట తెల్లమగును. గోవెంత గొప్పజంతువైనను దాని యొక్క శాంతము ఏమని

చెప్పవలయును. పులి చిన్నజంతువైనను దాని క్రూరస్వభావము చూడుము. ఆవునకు సాత్త్వికమగు తృణాది ఆహారముచే దేవత్వము సిద్ధించినది. పులికి మాంసభోజనముచే రాక్షసత్వము కలిగినది.

మరియు ఎఱ్ఱ కిరసనాయిల్ పెట్టిన దీపము యొక్క బుడ్డియు (గ్లాసున్ను) తెల్లకిరసనాయిల్ లైటును పరీక్షించుటకై ప్రయత్నించిన ఈ సంగతి అందరి కిన్ని స్పష్టమగును. ఎఱ్ఱ కిరసనాయిల్ శీఘ్రముగా బుడ్డి అంతయు పొగచే కప్పి ప్రకాశమగుపడక పోవునుగదా ? తెల్లచమురుచే నెంత ప్రకాశమై యుండును. ఈ రీతిగానే నీచ భోజనముచే హృదయము మలినమై జ్ఞానము ఆవరింపబడి పోవును. శుద్ధాహారముచే మనోనైర్మల్యము గలిగి నిరావరణ నిరంకుశ బ్రహ్మనిష్ఠ యందుండుట సులభము.

ఆహారదోషముచే గలిగిన ఒక కథను చెప్పెదను, ఏకాగ్రబుద్ధితో వినుము. ఈ కథ కర్నాటక భాషయందు గీతారహస్యమను గ్రంథమందు గలదు. బెంగుళూరు దేశమందు రామచంద్రశాస్త్రి అను పేరుగల యొక వైదిక బ్రాహ్మణుడుండెను. ఇతడు వేదవేదాంగ పారంగతుడును, పరమ దయాళువును, మహాభక్తుడును, సాధుసేవయం దత్యధిక ప్రేమగలవాడును, ఏకపత్నీవ్రతుడునగు గృహస్థుడు. ఇతని భార్య మనుష్యు ననుగమించు ఛాయ వలె భర్త యాజ్ఞయే పరమపదమని నమ్మియుండు పతివ్రతా శిరోమణి. ఆ దేశ సమీపమందొక కుటీరములో వాసుదేవానందుడను పేరుగల యొక సన్న్యాసి బ్రహ్మనిష్ఠ యందుండెను. వీరు గూడ శమదమాది సాధన చతుష్టయ సంపన్నులు, సర్వదా బ్రహ్మనిష్ఠయందుండువారు. ఒక్క దినమున పై జెప్పిన రామచంద్రశాస్త్రిగారు వీరిని దనయింటికి భిక్షకై రమ్మని ప్రార్థించెను. వీరుదయమున స్నాన నిష్ఠాది కార్యములు జరిపి గృహస్థుని యింటికి వచ్చిరి.

ఆ దిన ముదయమున తన ధర్మపత్ని యింటికి దూరమాయెను. ప్రతి దినమున్ను సాధుశుశ్రూష పరాయణురాలగు ఆ యమ్మ తన చేతిగుండా వండి పెట్టుట మామూలు. ఇంటికి దూరమైనను యతిని భిక్షకు నాహ్వానించి భంగము చేయకూడదని తలంచి యామె బహు దూరముగా బోయి కూర్చుండి యచ్చట బనిచేయు మరియొక బ్రాహ్మణస్త్రీచే వండించి స్వామివారికి భక్ష్యభోజ్యములతో

భోజనము సుఖముగా జరిపించెను. సన్న్యాసి భోజనము వేళ యందు దనకు వెండిగిన్నెయం దిచ్చిన క్షీరాన్నము భుజించి యాగిన్నెను దీసుకొనిపోయిన బాగుగ నుండునని దొంగబుద్ధి గలిగి కాషాయ వస్త్రముతో గట్టి గృహస్థుని యాశీర్వదించి కుటీరమునకు వెళ్ళిపోయెను. ఆ దినమంతయున్ను సన్న్యాసికి హృదయమం దనేకవిధములుగా దురాలోచన మాటిమాటికి వృద్ధియగుచునే యుండెను.

మరురోజుదయమున బహిర్భూమికిబోయి స్నానమాచరించి నిష్ఠయందుండు సమయములో తన హృదయమున నిట్లు విచారము గలిగెను. ఆహా ! యేమి యాశ్చర్యము. నిన్నటిరోజున మనస్సులో నెన్నో విధములుగా దుర్బుద్ధి గలిగి బాధపెట్టెను. ఈ దినమున యథాస్థితిగా శాంతముతో సుఖముగా నున్నది. ఇదియును గాక నిన్నటిరోజున నేనెంత గొప్ప క్రూర కృత్య మాచరించితిని, హా పరమాత్మా ! భగవంతుడా ! గురువరేణ్యా ! నేనెంతో అధోగతికి జారిపడిపోతిని. నేను జన్మనా యసత్యము గాని దొంగపనిగాని చేసినవాడను కానే. నాకేల ఈ పాపకర్మము సంభవించెను ? మరియు నేనెంతో మంది మహాత్ముల నోటిలో మట్టి వేసిన క్రూరుడ నైతిని. ఇకమీద గృహస్థులు సన్న్యాసులను నమ్ముదురా? అని యనేకవిధములుగా దనలో దాను విచారించి దీని యొక్క సంగతి దెలియుటకై రామచంద్రశాస్త్రిగారి యింటికి వెళ్ళి సాష్టాంగముగా నమస్కరించి దుఃఖాక్రాంతుడై నిలిచెను.

ఇది చూచి పరమభక్తుడగు శాస్త్రిగారు నిండా భయపడి అయ్యో ! సన్న్యాసి మనకు నమస్కారము జేయుచున్నారే. మనపుణ్య మంతయున్ను పోయినదే. వారికి మనము నమస్కరించి పాపము పోగొట్టుకొని వారిపుణ్యముచే పావనులు గావలసిన వారమే కదా ? అదియును గాక ఈ యతీశ్వరుడు అసాధారణ బ్రహ్మనిష్ఠుడే ? నిన్నటి భిక్షాన్నమున ఏమి తప్పులు కలిగనో అని విచారించి సన్న్యాసిపాదములను గట్టిగా పట్టుకొని అపరాధము క్షమించుటకై ఏడ్వసాగెను. సన్న్యాసి కూడ వీరిని పట్టుకొని గట్టిగా ఏడ్వసాగెను. ఈ కోలాహలమంతయు చూచి అనేకమంది గొప్పవారు వచ్చి సంగతి తెలిసికొనుటకై సమాధానపరచి వృత్తాంతము నడిగిరి. అప్పుడు సన్న్యాసి తనయొక్క జన్మనా పరిశుద్ధతయున్ను, ధర్మనిష్ఠతయున్ను చెప్పి నిన్నటిదినము జరిగిన దొంగపని కూడ చెప్పి

వెండిగిన్నెను చూపించెను. అప్పుడు వారిలో ఒక గొప్ప బుద్ధిశాలియగు బ్రాహ్మణుడు గృహస్థునితో భోజన పాకము సంగతి అడిగెను. అప్పుడు గృహస్థుడు జరిగిన సంగతి అంతయున్ను విశదముగా చెప్పెను. వీరికి వండిపెట్టిన స్త్రీకి దొంగపనియున్ను, దుర్వృత్తియున్ను ఎక్కువ గలదు. కనుక వారి హస్తముచే భుజించిన యన్న ముదరమందుండువరకును సన్న్యాసికి ఆ దోషమావరించెను. మరురోజాయన్నము జీర్ణమై బహిర్గతమైనప్పుడు తనయొక్క పూర్వస్థితి ప్రకాశించెను. కనుక నీ కథనుండి యెంతో సారము గ్రహించవచ్చును. ఈ రహస్య మెరుంగకయే మంచి బ్రహ్మనిష్ఠులు కూడ గృహస్థుల యింటియందుండి కొన్ని దినములు పోయిన తర్వాత చెడిపోవుచున్నారు. కనుక భోజన పదార్థములు శుద్ధవముగాను, వండిపెట్టువారు శుద్ధులుగాను, వండునప్పుడును వడ్డించునప్పుడును పవిత్రవిచారముతో నుండవలసినదే గాక భుజించువారు శాంతముగాను, ఈశ్వర విచారముతో భుజించవలయును. ఇట్లున్న వారికి నిశ్చయముగా పవిత్రత గలుగును.

> అన్నదోషేణ చిత్తస్య కాలుష్యం సర్వదా భవేత్ ।
> కలుషీకృతచిత్తానాం ధర్మస్సమ్యక్ న భాసతే ॥
> అభక్ష్యస్య నివృత్త్యా తు విశుద్ధం హృదయం భవేత్ ।
> ఆహార శుద్ధౌ చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః ॥
> చిత్త శుద్ధౌ క్రమాద్ జ్ఞానం త్రుట్యంతి గ్రంథయః స్ఫుటమ్ ।
> అభక్ష్యం బ్రహ్మవిజ్ఞాన విహీనస్యైవ దేహినః ॥

అన్నదోషముచే చిత్తమునకు మాలిన్యము నిశ్చయముగా కలుగును. కల్మషహృదయము కలవారికి ధర్మరహస్యమగు జ్ఞానము కలుగదు. నీచాహార వర్జనముచే హృదయము పరిశుద్ధత నొందును. శుద్ధాహారముచే స్వయముగానే మనః పారిశుద్ధ్యము గలుగును. చిత్తశుద్ధిచే జ్ఞానము నావరించియుండు గ్రంథులు (ప్రతిబంధవములు) నశించి జ్ఞానవము విస్పష్టవముగా ప్రకాశించును. ముముక్షువులకు అభక్ష్యము నిశ్చయముగా బ్రహ్మజ్ఞానమునకు నాశకారణమని పాశుపతబ్రహ్మోపనిషత్తు. ఈ ఉపనిషత్ వాణిని ముముక్షువులు సర్వదా

మరువకుండా ఉందురుగాక ! కనుకనే శాస్త్రమం దొక్కసారి శుద్ధాహారము భుజించువాడు యోగి యనియు, రెండుసారులు భుజించువాడు భోగి యనియు (గృహస్థుడనియు,) మూడుసార్లు తినువాడు రోగియనియు, నాల్గుసార్లు తిను తిండిపోతు చావని శవమనియు, అనగా ప్రాణము గల పీనుగ అనియు చెప్పబడినది.

ఏకవారం చరేద్భైక్ష్యం న ప్రసజ్యేత విస్తరే ।
భైక్ష్యప్రసక్తో హి యతి ర్విషయేష్వపి సజ్జతి ॥

సన్న్యాసి అగువాడు ఏకకాలము మాత్రమే భోజనము చేయవలయును. అధికముగా తినుటయే పని పెట్టకూడదు. అధికము తినుటలో ఆసక్తి కలవాడు నిశ్చయముగా విషయలోలు డగును. వీనికి ఇంద్రియ నిగ్రహ ముండదు.

ద్వౌ భాగౌ పూరయే దన్నై స్తోయేనైకం ప్రపూరయేత్।
మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్॥

ముముక్షువు లుదరము సగము భాగ మన్నముచేతను, పాతికభాగము జలముచేతను నింపవలెను. తక్కిన పాతిక భాగము గాలి సంచారార్థముగా నుంచువారు నిరంకుశ బ్రహ్మనిష్ఠయందు సర్వదా యుండవచ్చును. వీరికి యే యొక్క వ్యాధియున్ను గలుగదు.

అనారోగ్యమనాయుష్యమస్వర్గ్యం చాతిభోజనమ్ ।
అపుణ్యం లోక విద్విష్టం తస్మాత్తత్ పరివర్జయేత్ ॥

అతిభోజనముచే రోగవృద్ధియున్ను, ఆయుస్సు క్షయమున్ను, నరక ప్రాప్తియున్ను, పాపకారణమున్ను, లోకనిందయును కలుగును. కాబట్టి అతిభోజనము సర్వదా ఎల్లరిచేత వర్జనీయమని శ్రీ మనుదేవుడు నుడివెను. ఈ విషయ మధికముగా ఈ గ్రంథమందు ఆహార విషయమై చెప్పిన చోట చూడందగును. ఈ ఆహారవిషయము దేహకష్టము చేయువారిని అంత బాధింపదు. వారు తమ దేహకష్టము ననుసరించి భోజనము చేయవచ్చును. ముముక్షువైనవారు తన జీవితమునకు తగిన ధనము లేనిచో ఉదర పోషణము కొరకు స్వధర్మము ననుసరించి అధిక పాపములేని పని చూచి చేయవలయును.

తన జీవయాత్ర పరుల కధీనమై యుండరాదు. అది గొప్ప తప్పు. ''శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్'' అని శ్రీ భగవంతుడు గీత యందుపదేశించినారు. అనగా శరీరపోషణ కొరకై కులధర్మమైన యేపని చేసినను దానిచే దోషము కలుగదు. ఆ పని కూడ తపస్సులో నొక్క భాగము. కనుక వారివారి జీవనాధారము సంపాదించుటకై అవశ్యముగా కర్మము చేయవలయును.

ఇంకొక్క విషయముపై ముముక్షువు దృష్టినుంచి పనిచేయవలయును. అది బ్రహ్మచర్యము. దానియందు గొప్ప శక్తి కలదు. ఈ బ్రహ్మచర్య వ్రతమునందు జాగరూకత యుండకపోయినచో అచేతనమగు తోలు బొమ్మయే. 'బ్రహ్మచర్యేణ సంతిష్ఠేదప్రమాదేన మస్కరీ '.

**దర్శనం స్పర్శనం కేళిః కీర్తనం గుహ్యభాషణమ్ ।**
**సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవ చ ॥**

**ఏతన్మైథునమష్టాంగం ప్రవదంతి మనీషిణః ।**
**విపరీతం బ్రహ్మచర్యమనుష్ఠేయం ముముక్షుభిః ॥**

అని కఠ రుద్రోపనిషత్.

బ్రహ్మనిష్ఠుడు సర్వదా ప్రమాదరహితమగు బ్రహ్మచర్యమందుండి నిష్ఠను పూర్తిచేయవలయును. ఈ బ్రహ్మచర్యము ఎనిమిది విధములు. స్త్రీ యొక్క ముఖస్తనములను చూచుట, హస్తములచే తాకుట, నాట్య నర్తనాదులను చూచుట (వారితో కూడ ఆడుట పాడుట) విషయ సంబంధములగు మాటల నుచ్చరించుట, వారితో కూడ నిర్జనస్థలమందుండుట, విషయ సంబంధమైన సంగతిని విచారించుట, విషయ ప్రవర్తనకొరకు మార్గమూహించుట, స్త్రీయందు రమించుట అను నీ యెనిమిదిన్నీ మైథునమందు చేరినవి. కాబట్టి ముముక్షువులు ఈ యెనిమిది సంగతులనుండి దూరముగా నుండవలయును, అట్లుండువాడే నిజమైన బ్రహ్మచారి అనబడును. అనగా దర్శనస్పర్శనమను రెండుమూడు సంగతులను మాత్రము హృదయమందు దుర్విచారముతో చేయకూడదని భావము. ఇతరమైనవి కూడనే కూడదు. ఇది పురుషులకు చెప్పిన రీతిగా

స్త్రీలుకూడ పురుషునియందుండి బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించవలయును. రాజ్యములో రాజు దుర్బలుడైనచో దొంగలు, దుష్టులు మొదలైన దుర్మార్గులచే రాజ్య మరాజక మెొందును. అట్లే శరీరమనెడు రాజ్యములో వీర్యము రాజువంటిది. దీనికి హాని గలిగిన బుద్ధిబలము నశించి దుర్గుణముల చేతను, రోగాదులచేతను శరీరమున్ను, ఆత్మయు పాడగును. నూరుబిందువుల రక్తము నుండి ఒక్క బిందువు వీర్యముద్భవించును. బ్రహ్మచర్యముచే దృఢకాయము మాత్రమే సిద్ధించును. బ్రహ్మమునందు మనస్సును ప్రవేశపెట్టుటయే నిజమగు బ్రహ్మచర్యము.

**ముక్తిమిచ్ఛసి చేత్తాత ! విషయాన్ విషవత్త్యజ ।**
**క్షమాఽఽర్జవం దయా తోషస్సత్యం పీయూషవద్భజ ॥**

ఓ నాయనా ! నీవు ముక్తిని బడయుటకు కోరినచో సమస్త విషయములను విషమువలె త్యజింపుము. మరియు, క్షమయున్ను, నిశ్చల బ్రహ్మనిష్ఠయున్ను, భూతదయయున్ను, సర్వదా సంతోష బుద్ధియున్ను, సత్యనిష్ఠయున్ను, అమృతమువలె సేవింపదగినవి అని జీవన్ముక్తుడగు శ్రీ జనకుల కొరకు అష్టావక్ర మునీశ్వరుడు ఉపదేశించెను.

**మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥**

ఓ జనకమహారాజా ! మోక్షమనునది విషయమునుండి విరక్తిని పొందుటయే. బంధమన విషయాదులందు రుచియే. ఈ సంగతియే సమస్త వేదశాస్త్రములనుండియు, మహాత్ములగు మహర్షుల వద్దనుండియు తెలిసికొనదగినది. నీ బుద్ధిచేత విచారించి కనదగినదియు నిదియే. ఇక నేను చెప్పవలసిన దేమియున్ను లేదు. దీనిలో నీ యిష్ట మెట్లుండునో అట్లు చేయవచ్చును.

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥**

విరక్తుడై బ్రహ్మనిష్ఠ చేయువాడు వయస్సులోనుండు తల్లితోగాని, సోదరితోగాని, కొమార్తెతోగాని, ఏకాంతస్థలమున నుండకూడదు. ఎందుకనగా, ఇంద్రియముల సమూహము మహాబలము కలిగినది. మహాబ్రహ్మవేత్తల మనస్సులను కూడ ఆకర్షించి విషయమందు ప్రవేశపెట్టును. విరక్తులగు బ్రహ్మనిష్ఠచేయు స్త్రీలుకూడ విజనస్థలమందు ప్రాయమందున్న కాలమున తండ్రి, సోదరుడు, పుత్రుడు వీరలుండు స్థలమం దుండరాదని చెప్పబడినది. స్త్రీకి తండ్రి, అన్నదమ్ములు, కుమారునిపై, లేక వారికి వీరిపై ఏలాటి దుస్సంకల్పము కలుగనే కలుగదుకదా ? అట్లుండువారిని కూడ నమ్మరాదని మహర్షులు చెప్పుటలో నితరులతో గూడ నుండు విషయమై మరేమి చెప్పవలయును అని అర్థము. ఏ సమయమందు ఎట్లు జరుగునో యని భయపడి చెప్పినది. ఆలాగుననే విరక్తుడగు పురుషునకు తల్లి, అక్క, చెల్లెండ్రు, పుత్రి వీరిపై యేలాటి దుర్బుద్ధి కలుగదు గదా? వారినికూడా నమ్మరాదని మహాత్ము లుపదేశించుటలో ఇతరులగు స్త్రీలను శిష్యురాండ్రనుగాచేసి సమీపమందుంచుట యెంత అపాయకరము.

**కాయేన మనసా వాచా స్త్రీణాం తు పరివర్జనమ్ ।**
**ఋతౌ భార్యాం తదా స్వస్య బ్రహ్మచర్యం తదుచ్యతే ॥**

ఇది గృహస్థ బ్రహ్మచర్య నియమమని శ్రీ జాబాల దర్శనోపనిషత్.

వాక్కుచేతను, మనస్సుచేతను, దేహముచేతను పరస్త్రీలను విశేషముగా వర్జింపతగినది. ఋతుకాలమందు మాత్రము ధర్మపత్నితో చేరుట గృహస్థ బ్రహ్మచర్య మనబడును. ఆలాగున స్త్రీ కూడ త్రికరణములచే పరపురుష చింతను విడచి ఋతుకాలమందు స్వపతితో సంతానోత్పత్తి విచారముచే మాత్రము చేరినచో బ్రహ్మచారిణి యనందగును. ఈ విషయము విస్తారముగా ఈ గ్రంథమందు బ్రహ్మచర్యవ్రతమున చూడందగును. మరియు ముముక్షువునకు ఇంద్రియాది విషయజాతమంతయున్ను మహాగొప్ప శత్రువులని సమస్త మహర్షులయొక్క సారాభిప్రాయము. దాని ననుసరించి శ్రీ కృష్ణ భగవంతుడు గూడ ఒప్పుకొనుచున్నారు. అనగా గృహస్థులుకూడా కామోద్రేకులై విషయలోలురు కాకూడదు. అట్లైన యోగ్యసంతానములు గలుగవు.

**ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।**
**తయోర్న వశమాగచ్ఛే త్తౌహ్యస్య పరిపంథినౌ॥**

శబ్ద స్పర్శాది సమస్త ఇంద్రియములకును, దానిదాని విషయములలో రాగద్వేషాదులు కలుగుచుండును. అట్టి రాగద్వేషాదుల కధీనుడు ఎప్పటికిన్ని కాకూడదు. ఆ రాగద్వేషాది విషయములు కదా వీనికి జ్ఞాన ప్రతిబంధములగు గొప్ప శత్రువులు.

**కురంగాళిపతంగేభ మీనాస్త్వేకైకశో హతాః।**
**సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్యాజ్ఞః కుతః సుఖమ్॥**

లేడి, భ్రమరము, మిడుత, ఏనుగు, మత్స్యము ఈయైదు జంతువులు నొక్కొక్క యింద్రియ విషయమందు ప్రవర్తించి బద్ధములై మరణమొందుచున్నవి. అట్లుండు విషయములలో నైదు ఇంద్రియ వృత్తులను సంపూర్ణముగా ప్రవర్తనయందుండువారి గతి ఏమని చెప్పవలయును. వాటిలో కర్ణేంద్రియా నందముచే జింకనాశమొందును.

**గ్రామ్యగీతం న శృణు యాద్యతిర్వనచరః క్వచిత్।**
**శిక్షేత హరిణాద్బద్ధాన్మృగయోర్గీతమోహితాత్॥**

బ్రహ్మనిష్ఠుడు విషయుల నాట్య, నర్తన, గీతాది పామర శబ్దానందము చేయు విషయములో ప్రవర్తింపకూడదు. అట్లు ప్రవర్తించినచో శబ్దానందముచే మైమరచిన లేడి బోయవానిచే పట్టువడినట్లు, వీడును నాట్యగీతములచే బద్ధుడగును. అనగా అరణ్యములో కిరాతకులు పొదలయందు గుప్తముగా నుండి ఘంట, పిల్లనగ్రోవి మొదలగు కర్ణానందముచేయు శబ్దము చేయుదురు. లేళ్లు ఆనంద పరవశములై యుండు సమయము చూచి వలవేసి తంత్రముచే పట్టి చంపుదురు.

**తథాపి యువతీం భిక్షుర్న స్పృశేద్దారవీమపి।**
**స్పృశన్ కరీవ బధ్యేత కరిణ్యా అంగసంగతః॥**

స్పర్శేంద్రియముచే ఏనుగు బద్ధమగును. అనగా స్త్రీయొక్క

ఆలింగనముచే గలుగు అపాయమును చెప్పుచున్నారు. బ్రహ్మనిష్ఠుడు పైచెప్పిన రీతిగా కొయ్య, రాయి, మొదలగు స్త్రీబొమ్మలను కూడ స్పర్శించకూడదు. స్పర్శించినచో ఆడయేనుగునందు మోహితమైన మగయేనుగు బద్ధ మగురీతి వీడును బద్ధుడగును. అనగా స్వాధీనము చేయుబడిన ఆడయేనుగును అరణ్యమందు ప్రవేశపెట్టి కానన మందుండు మగయేనుగను వశపరచి గుండము మొదలగు తంత్రములలో ప్రవేశపెట్టి జనులు పట్టుకొందురు ? ఏనుగు స్పర్శ సుఖమగ్నమైన సమయమున మైమరచిపోవును. దీనియందు స్త్రీబొమ్మలును కూడ ముట్టకూడదని చెప్పుటలో స్త్రీ యొక్క యాలింగనముచే గలుగు అపాయము నూహింపవచ్చును.

**దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావైరజితేంద్రియః।**
**ప్రలోభితః పతత్యంధే తమస్యగ్నౌ పతంగవత్॥**

నేత్రేంద్రియములచే నాశము నొందు సంగతిని చూపుచున్నారు. రాత్రికాలములో అగ్నిని చూచి మిడుతలు మంచిభోజన వస్తువని తలంచి దానిలో బహు శీఘ్రముగా పడుటచే ఎట్లు నశించునో ఆ రీతిగామాయామయమగు స్త్రీలయొక్క ముఖ, స్తన, వస్త్రాభరణములను చూచి భ్రమించి దానిలో ప్రవేశించినచో మిడుత యేగతి బొందునో అదే గతి యని మరువకుందురుగాక!

**జిహ్వయాతిప్రమాదిన్యా జనో రసవిమోహితః।**
**మృత్యుమృచ్ఛత్యసద్బుద్ధిర్మీనస్తు బడిశైర్యథా॥**

రసనేంద్రియమందు ఆశగలవారు నాశమొందురీతి యిది. జిహ్వేంద్రియ చాపల్యముచే మత్స్యమాంసాది భోజనముచే నరకప్రాప్తి కలుగునట. రసనేంద్రియ చాపల్యముగల మూఢబుద్ధి గలవాడు మరణమునే పొందును. ఎట్లన గాలమందుండు మాంసముగాని, ఎఱ్ఱలను గాని చూచి మత్స్యములు సంతోషముతో మ్రింగు సమయమందు దానిని గాలముగలవాడు ఎట్లు చంపునో, ఆ రీతిగానే మత్స్యమాంసాదుల తినువారిని యముడు గాలపు వేటయాడును. మరియు ఘ్రాణేంద్రియముచే నశించు సంగతిని తెలుపుచున్నారు. చంపకపుష్పవాసనను చూచి భ్రమరము ( తుమ్మెద) ఆ పుష్పమందుండు

మధువును గ్రోలుటకై దానియందు ప్రవేశించిన వెంటనే మృతినొందును. ఆలాగుననే బహు దుర్గంధమైయుండు స్త్రీ యొక్క దేహములో అత్తరు, పన్నీరు, పుష్పము మొదలగు సుగంధ వస్తువుల వాసనగ్రహించి దానియందుండు విషమస్థితి యెరుంగక మనుజులు మరణమునకు పాలగుచున్నారు. కనుక ఇంద్రియముల వృత్తులను జయించిన వాడే ముక్తుడగును.

**ఉత్థితానుత్థితానేతానింద్రియారీన్ పునః పునః।**
**హన్యాద్వివేకదండేన వజ్రేణేవ హరిర్గిరీన్ ॥**

దేవేంద్రుడు యేలాగున వజ్రాయుధము చేతపట్టుకొని తలపైకెత్తెడి పర్వతములను మరల మరల హననము చేసెనో, ఆ రీతిగా బ్రహ్మనిష్ఠుడు హృదయమందు స్ఫురించిన ఇంద్రియము లను శత్రువులను జాగరూకుడై పునః పునః వివేకదండముచే సమూలముగా కొట్టి చంపవలయునని భగవంతు లగు వసిష్ఠులు శ్రీ రామచంద్రుల కుపదేశించెను.

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక!**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీ భవ ॥**

ఓ నాయనా ! నీవు దేహాభిమానమను పాశముతో అనేక జన్మముల నుండి సంసారమందు బద్ధుడవైనావు. ఇప్పుడు దేహేంద్రియ మనో బుద్ధులకు సాక్షియైయుండు శుద్ధబోధమే నీవను వాడి మిగల జ్ఞానమను కత్తిచే సంసార పాశములను ఛేదించి సుఖిగా నుండుదువు గాక అని అష్టావక్రగీత.

**న వైరాగ్యాత్పరో లాభో న బోధాదపరం సుఖమ్।**
**న గురోరపరస్త్రాతా న సంసారాత్పరో రిపుః ॥**

వైరాగ్యమునకు సమమైన లాభమగు ధనము లేదు. బ్రహ్మబోధకు సరియగు సుఖము లేదు. సద్గురువునకు సముడగు రక్షకుడు లేడు. సంసారమునకు సమమగు శత్రువున్ను లేదు.

**అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుద్ధ్యతే।**
**అనిద్రమజమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥**

అనాది మాయయగు అజ్ఞాన మహానిద్రయందు సుషుప్తి నొంది యుండు జీవుడు ఎప్పుడు ప్రబోధము నొందునో, అప్పుడే తాను జననము లేనివాడనియు, నిద్రలేనివాడనియు, స్వప్నములేని వాడనియు, సదా అద్వయమగు బ్రహ్మమనియు దృఢబోధ కలుగును.

వైరాగ్యతైలసంపూర్ణే భక్తివర్తి సమన్వితే।
ప్రబోధపూర్ణ పాత్రే తు జ్ఞప్తిదీపం విలోకయేత్॥

రాత్రి కాలమందు ఇంటియందుండు చీకటి తొలగుటకై దీపము కావలయును కదా ! ఆ దీపము నిలుచుటకై ప్రమిదె, తైలము, వత్తి ఎట్లు ఆవశ్యకమో ఆలాగున హృదయమందుండు అజ్ఞానాంధకారము పోవుటకు జ్ఞానదీపమే ప్రకాశించవలెను, జ్ఞానదీపముకొరకు సంపూర్ణవైరాగ్యమను తైలమున్ను, భక్తి అనెడు వత్తియున్ను, ప్రబోధ ప్రజ్ఞ అనెడు పాత్రయున్ను ఉండవలెనని శ్రీ గురుదక్షిణామూర్తులవారు సనకాదియోగుల కుపదేశించిరి. ఈ విషయము సర్వదా మననము చేయతగినది.

యది తే నేంద్రియార్థశ్రీస్స్వద తే హృది రాఘవ।
తదసి జ్ఞానవిజ్ఞానః సముత్తీర్ణో భవార్ణవాత్॥

ఓ రామచంద్రా ! ఎప్పుడు నీకు సమస్తములగు ఇంద్రియాది విషయసుఖములు విషమువలె రుచింపవో, అప్పుడు నీవు జ్ఞాన విజ్ఞాన సంపన్నుడవై జననమరణరూపమగు భవార్ణవమునుండి యుత్తీర్ణుడవైతివని శ్రీ వసిష్ఠభగవంతు డుపదేశించెను, ఇది ఆఖరి యుపదేశము.

యథాగ్నిర్దారుమధ్యస్థో నోత్తిష్ఠేన్మథనం వినా।
వినా చాభ్యాసయోగేన జ్ఞానదీపస్తథా న హి॥

ఏలాగున కట్టెయందుండు అగ్ని మథనము వినా ప్రజ్వలింపదో, ఆలాగున ధ్యాననిష్ఠాభ్యాసము లేనిచో, తనయందుండు జ్ఞానదీపము ప్రకాశింపదని యోగశిఖోపనిషత్తు.

కర్ణధారం గురుం ప్రాప్య తద్వాక్యం ప్లవ వద్దృఢమ్।
అభ్యాసవాసనాశక్త్యా తరంతి భవసాగరమ్॥

ముముక్షువులు సంసారసాగరము దాటించుటకు శక్తి గల గురువును సమీపించి వారియుపదేశము నావగా చేసుకొని అభ్యాసవాసనాశక్తిచే సుఖముగా భవసాగరమును దాటుచున్నారని అన్న పూర్ణోపనిషత్.

**యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే।**
**సర్వవస్తుపరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే॥**

ఎంతవరకు హృదయమందుండు సమస్త విషయవాసనలను విడువలేదో, అంతవరకు పరమాత్మ దర్శనము సిద్ధింపదు. సమస్తములగు కోరికలను ఎప్పుడు విడుచునో అప్పుడు పరమాత్మ మాత్రమే మిగిలి యుండును. శీతోష్ణములు తగులక ఇంద్రియములకు సుఖకరములగు సమస్తభోగములను అనుభవించి శృంగారమంచములో మృదువగు పట్టుపరుపులో భార్యాభర్తలై పడియుండినవా రెవరున్ను లోక పావనము గావించినవారిని నేనెఱుంగను. పరమ పవిత్రులైన అట్టివారి చరిత్రమును నేను చూడలేదు. మరి శీతోష్ణములను సహించి పడరాని పాట్లుపడి ఇంద్రియాది సుఖము లన్నియున్ను దుఃఖకరమని నమ్మి ఘోరమగు తపస్సు చేసిన వారే లోకపావనము గావించిరి. వారున్ను కృతార్థులైరి. అట్లుండువారి నామధేయము నోటినుండి బయలుపడుటకు ముందుగా మంగళహారతి చేత పట్టుకొని నిలుచువారిని లోకమందు మనము చూచుచున్నాము, దీనికి మొత్తముగా మన మహర్షులే నిదర్శనము. ప్రస్తుతము శ్రీ బుద్ధ భగవంతుడు, శ్రీ క్రీస్తుదేవుడు, శ్రీ నమ్మాళ్వారు, శ్రీ తరిగొండ వేంకమాంబగారు, శ్రీ గురునానక్, శ్రీ రామకృష్ణపరమహంస మొదలగు వారు సాక్షులు. ఇవి అవసానపుమాటలు, మత్స్యములను పట్టుటకై గాల మందుండు ఎఱ్ఱయున్ను, పక్షులను పట్టుటకై వలయందుంచు మాంసమున్ను, ఎలుకను పట్టుటకై బోనునందుంచు ఫలహారములు ఎట్లో ఆలాగుననే బ్రహ్మనిష్ఠులను లోపఱచుటకు స్త్రీలను, ధనమును, సుఖభోజనములను జనులు చూపి వశపఱచుకొందురు.

**మనోహరాణాం భోజ్యానాం యువతీనాం సువాససామ్।**
**విత్తస్యాపి చ సాన్నిధ్యా చ్చలేచ్చిత్తం సతామపి॥**

రుచికరములగు భోజనవస్తువులును, వస్త్రాదులచే నలంకృతులయిన యౌవనస్త్రీలున్ను, ధనమున్ను మహాబ్రహ్మవేత్తల మనస్సునుగూడ వశపరచునని యోగకల్ప ద్రుమభాష్యమందు వచించినారు. మహాత్ముల మనసును గూడా వశీకరించునని చెప్పుటలో సాధారణులైన వారి కార్యమేమి చెప్పవలయునని భావము.

మరియు ముముక్షువులకు బ్రహ్మనిష్ఠ చేయుటకై గాలి బాగుగానుండు ఒక్కగది యుండినచో నిండా మంచిది. ఆ గదియందు మహాత్ముల పటములును, చిన్న స్థితియందుండి గొప్ప వైరాగ్యము నాశ్రయించి గొప్ప జ్ఞానులైన వారి ఫోటోలున్ను, గొప్ప ధనవంతులై వైరాగ్యమవలంబించి మహాసిద్ధులైన వారి చిత్రములును, దయామూర్తులగు ఈశ్వరుల పటములున్ను ఉంచ వలయును. గొప్ప మహాత్ముల పటములను చూచునప్పుడు ఆ స్థితి గలుగుటకై మనస్సు ప్రయత్నించును. మరి ఎవరైనను అచ్చోటికి వచ్చినప్పుడు వారికి అదియే ఒక్క గొప్ప ఉపదేశమగును. మరియు దానియందు సుగంధ వస్తువులు పెట్టుట నిండా మంచిది. నిష్ఠకు మాత్రము దానిలో ప్రవేశింపవలయును. దానిలో నిద్రపోకుండుట నిండా మంచిది. క్రూరులగు యోధుల పటములుగాని, నీచదేవతల చిత్రములు గాని దుష్టగ్రంథములు గాని యుండరాదు. మనసు ఏ వస్తువును చూచునో ఆ వస్తువుల యొక్క గుణకర్మ స్వభావము హృదయమందు ప్రతిబింబించును. ఆ రూమునందు ప్రాపంచికమైన కృత్యముల నేమాత్రమున్ను జరుపగూడదు. దుష్కృత్యము చేయు మనుష్యులు గూడ దానిలో ప్రవేశింప కుండుట నిండా మేలు. అట్లుండు పరిశుద్ధ స్థలమున నిష్ఠ చేయువారికి శీఘ్రముగా మనశ్శుద్ధి కలుగును. ఆలాటి స్థలము లేనివారు వారివారి కనుకూలముగా నుండు ప్రదేశమున నిష్ఠ చేయవచ్చును. స్థలము గొప్పది కాదు, మనస్సే ప్రధానము.

నిష్ఠ చేయుటలో ప్రాతః సంధ్యాకాలములు మంచివి. ఈ విధముగా ధ్యానము చేయుటకై ప్రతిబంధమున్నవారు రాత్రి మాత్రము భోజనము కొంచెము తక్కువచేసి అందరున్ను పండుకొను సమయమున ధ్యానము చేయుట శ్రేష్ఠము. అప్పుడు ఏ యొక్క యితర చింతలుండవు. ఎవరికిని భయపడ నక్కరలేదు. పరమాత్మధ్యానమునకు నిశ్చలమగు మనస్సే సరియైన సమయము.

మరియు బ్రహ్మనిష్ఠుని ఆహారాదులు ఇతరులకు నొప్పి గలుగ చేయనివిగను, తన నిష్ఠకు హాని లేనివిగను నుండవలయును. ముముక్షువు తినుటకై జీవించియుండరాదు. జీవించుటకై తినవలయును.

మరియొక ప్రధాన విషయము. అపరోక్షజ్ఞానము ప్రత్యక్షముగ గలిగినను, ఎంత గొప్పవాడైనను గూడ వివిక్తవాసము, యుక్తాహారము, బ్రహ్మనిష్ఠ శరీర పతన పర్యంతము విడువరాదు, ఈ విషయమై ఎవరేమి అడిగినను గురువాజ్ఞయని సమాధానము చెప్పవలెను. ఈ మూడు సంగతులును ఎంతకాలము వరకు అనుష్ఠించునో అంతవరకు వాడు గురువుదగ్గర నుండినను, దూరముననుండినను సన్నిధాన మందుండి గొప్ప శుశ్రూష చేసినవాడే యగును. ఈ మూడు విషయములను ఎప్పుడు విడుచునో, అప్పుడు వాడు గురుద్రోహియే యగును. ఈ సంగతి ఎంతో దీర్ఘ విచారముతో చెప్పినది. కనుక జాగరూకుడవై యుండుము. దీనికి జ్ఞానరక్ష యనిపేరు. లేక కొందఱు మీరు చంద్రునివలె చల్లదనము గలవారనియు, సూర్యునివలె ప్రకాశము గలవారనియు, మహామేరు సమానధీరు లనియు, సముద్రమువలె గంభీరు లనియు చెప్పుదురు. తమరు ఎక్కడ నుండిన నేమి, అంతయును తమస్వరూపముగా, తానై, నిండినవారని స్తుతించెడి వారి మాటలన్నియును, వారికి ఏదో కార్యలాభముకొఱకై వారి యింటిలో నుండుటకై చెప్పు సంగతియని మరువవద్దు. అనేకులు చెడిపోయిన సంగతి మనము వినుటయును కనుటయును మన కనుభవమే. మన యొక్కరు చెడిపోయిన హానిలేదు. మనలను కనిపెట్టుకొని అనేకులు మోక్షమార్గపు మెట్లు ఎక్కుచున్నారు. మనము చెడినచో వారందఱును భ్రష్టు లగుదురు. కనుక హుషారుగా నుండవలయును. పదిమందికి మంచిత్రోవ చూపువానికి ఒకచెడ్డవృత్తి గలిగి చెడిపోవుటకంటె అరణ్యమధ్యమునందు ప్రవేశించి పాషాణము తిని చచ్చిపోవుట మేలు. ఏలన దానిచే వీనికొక్కనికి హాని గాని, తక్కిన వారందఱున్ను ధన్యులగుదురు. పైసంగతి తటస్థించునప్పుడు శ్రీ కృష్ణభగవానులుపదేశించిన ఘనమైన అర్థమును స్మరించవలయును. ''స్వధర్మే నిధనం శ్రేయః'' అనగా తన ధర్మమార్గమందుండి ప్రాణము పోయినను మంగళకరము.

అసమ్మానాత్తపో వృద్ధిః సమ్మానాత్తపసః క్షయః ।
అర్చితః పూజితో విప్రో దుగ్ధా గౌరివ సీదతి ॥

బహుమాన సత్కారాది పూజలకు లోబడినచో తపస్సు (జ్ఞానము) కృష్ణ పక్ష చంద్రునివలె క్షయించి క్షయించి అజ్ఞానాంధకారములో పడిపోవును. సత్కారపూజాదులకు లోబడనివారికి శుక్లపక్ష చంద్రునివలె జ్ఞానము దినదినము వృద్ధియగును. పాదపూజాది బహుమానములకు బ్రహ్మనిష్ఠుడు లోబడినచో పాలు పిండిన యావు పొదుగువలె చిక్కిపోవును.

ఘృతకుంభసమా నారీ తప్తాంగారసమః పుమాన్ ।
తస్మాత్ ఘృతం చ వహ్నిం చ నైకత్ర స్థాపయేద్బుధః ॥

స్త్రీ నేతికుండవంటిది. పురుషుడు మండుచుండు నిప్పుతో సమానుడు. కాబట్టి బుద్ధిమంతుడు నెయ్యి నిప్పుదగ్గర పెట్టనట్లు బ్రహ్మనిష్ఠులగు స్త్రీలు పురుషులుండు స్థలమందుండరాదు. ఉండినచో నిప్పు దగ్గఱ నుండు నెయ్యి కరుగునట్లు మనసు పరవశమగును.

నిస్సంగతా ముక్తిపదం యతీనాం
సంగాద శేషాః ప్రభవంతి దోషాః ।
ఆరూఢయోగోఽపి నిపాత్యతేఽధః
సంగేన యోగీ కిముతాల్పసిద్ధిః ॥

బ్రహ్మనిష్ఠులకు సంగరాహిత్యమే మోక్షపదము. ఎంత గొప్పవారికైనను ప్రాపంచిక మనుష్యుల సంసర్గముచే అనేకములగు దోషములు గలుగును. యోగారూఢుడు గూడ విషయాసక్త మనుష్యుల సాంగత్యమువలన అధః పతితుడగును. అట్లుండగా అల్పసిద్ధి గల ముముక్షువు కార్యమేమి చెప్ప వలయును? అని శంకరాచార్యు లుపదేశించిరి.

ఆశాయా యే దాసాస్తే దాసాస్సర్వలోకస్య ।
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః ॥

ఆశ యనెడి దానికి ఎవడు దాసుడై యుండునో, వాడు లోకమందుగల

ఎంతో చిన్నస్థితిలో నుండి నికృష్టకృత్యములు చేయువారికి గూడా దాసుడై జీవించవలెను. ఆశ ఎవనికి దాసియై యుండునో, వానికి లోకమందున్న వారందరును దాసులే అని రాజయోగరత్నాకరము.

**మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।**
**చరత్యత్ర న గచ్ఛంతు సాధవో హే ముముక్షవః ! ॥**

విషయమను మహారణ్యమందు మనస్సనెడి గొప్ప పెద్దపులి తిరుగు చున్నది. కాబట్టి సాధువులగు ముముక్షువులారా ! మీరచ్చోటికి వెళ్ళవద్దు అని వివేకచూడామణి.

నాయనా ! సంసారసాగరము దాటి శాశ్వతమగు మోక్షమును పొందుటకు మహాత్ముడగు గురునియందు అత్యధిక భక్తి యుండవలయునని అద్వైత సారోపనిషత్ చెప్పుచున్నది.

**గురురేవ పరం బ్రహ్మ గురురేవ పరా గతిః ।**
**గురురేవ పరా విద్యా గురురేవ పరాయణమ్ ॥**

**గురురేవ పరా కాష్ఠా గురురేవ పరం ధనమ్ ।**
**యస్మాత్తదుపదేష్టాఽసౌ తస్మాద్గురుతరో గురుః ॥**

ముముక్షు కర్తవ్యము సంపూర్ణము.



## గురువు గొప్పవాడై యుండవలయును

గురువు గొప్పవాడై యుండవలయును. లేనిచో శిష్యుడు గొప్పస్థితికి వచ్చుట కష్టము. గురువుయొక్క చర్యలే శిష్యుని కుండుట సహజము. ఎట్లన రైలు ఇంజను ఎంత శీఘ్రముగా బోవునో, దానికి తగిలించియుండు పెట్టెలును అంతే వేగముతో పోవుటకు సాధ్యమగును. ఆ ఇంజనులో మెయిల్, పాసెంజర్, గూడ్సు అని మూడు విధములు. ఇది సాధారణ సంగతి, ఇక విశేష సంగతియని మరియొక్క మార్గము గలదు. ఈ మార్గము సాధారణులకు సాధ్యము గాదు. ఎట్లన దీపమునుండి దివిటీ గూడ ముట్టించ వచ్చును. లేక ఒక్క చిన్నదీపము

నుండి పుట్టించిన నిప్పుచే గొప్పమంట చేయవచ్చును. అనగా గురువు సాధారణుడైనను శిష్యుడు మహా గొప్పవాడు కావచ్చును. ఇది దుర్లభము. ఇట్లున్నవారలే శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు శ్రీ మధ్వాచార్యులు, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీ కబీరుదాసు మొదలైన ప్రముఖులు. ఇట్లు అగుట దుస్సాధ్యము. పైన ఉదాహరించిన రైలుమార్గమే సాధారణముగా కలుగును. కనుక గురువు మహావైరాగ్య శీలుడును, గొప్ప జ్ఞానిగాను నుండవలయునని శ్రుతి శాసనము. దీనికి కథ యొక్కటి చెప్పెదను సావధానముగా వినుము.

దక్షిణదేశములో రాగయ్య అనియు, దామయ్య అనియు ఇద్దరు గురుపుత్రులుండిరి. వీరు పరస్పరము మహామిత్రులు. రాగయ్యగారికి గురువు గొప్పవారైనను సంసారమందుండు వారు, ఆహారాది విషయమై నిష్కర్ష లేనివారుగా నుండిరి. దామయ్య గురువు పరమ వైరాగ్యముతో గూడిన వారును, నైష్ఠిక బ్రహ్మచారియు, పరిశుద్ధ ఆచారము కలవారును, గొప్ప బ్రహ్మనిష్ఠలుగా నుండిరి. పై చెప్పిన రాగయ్య దామయ్య ఇద్దరు శిష్యులు గూడా మంచి వయస్సులో నుండువారును, బుద్ధిమంతులును, బాగుగా చదివినవారుగా నుండిరి. వీరిద్దరును శ్రీ కాశీయాత్రకై బయలుదేరిరి. కొన్ని దినములు అచ్చటచ్చట పుణ్య క్షేత్రములను, తీర్థములను సేవించుచు పోయిరి. రెండు మూడు రోజులు మనుష్యులు లేని అరణ్యామార్గము తటస్థించి భోజనమునకు కష్టపడి నడచుచు పోగా పోగా ఒక పల్లెటూరు కనబడెను. అచ్చట విశేషకార్యమేదో జరుగుచుండు ఒక ఇంటికి భోజనమునకు వెళ్ళిరి. ఆ యింటి వారు మాంసము తినువా రగుటచే కూర లన్నియును మాంససంబంధమై యుండెను. ఈ యాత్రికులు రెండు మూడు రోజులు అన్నము లేని కారణముచే ఆకలి బాధకు ఓర్వలేక అన్న మడుగగా, ఇంటివారు మేము మాంసాహారము చేయువారలము, మావద్ద భోజనము చేయువారుగా నుండిన భోజనము పెట్టెద మని చెప్పిరి.

ఈ మాటలను వినినంత మాత్రముననే దామయ్య హృదయము గుభాలుమనెను. హా ! ఆకలిబాధ చెప్పవలసినది కాదు. ఈ సమయమందు రాగయ్య హితోపదేశము ప్రారంభించెను. ఏమీ శరీరము పోయిన తర్వాత యేమి పుణ్యము సంపాదించెదవు ? నాగురువుగారు మహనీయులు గాదా ? వారు గూడా

యిదంతయును తినుట లేదా ? సాధువులైన తర్వాత ఇదంతయు చూడవలసిన పని యేమి ? ''యదృచ్ఛా లాభసంతుష్టః'' అని గీతాశాస్త్రము చెప్పినది, మనము కోరగూడదే గాని, మరేమి దొరికిన తినవచ్చును. ఇట్లు బహువిధములుగా బోధ చేయగా దామయ్య మెత్తబడెను.

ఇద్దరును భోజనమునకు కూర్చుండగా అన్ని వస్తువులు వడ్డించి నపుడు దామయ్య హృదయము నిండా పరితపించెను. వాని హృదయమందు ఈలాటి సంకల్పములు పుట్టుట కారంభించినవి. ఆహా ! యేమి ఆశ్చర్యము ! నేనెవ్వండను? ఏ కార్యార్థమై వచ్చితిని ? మన గురుడు ఎంతో పరిశుద్ధాత్ముడు, అత్యంత వైరాగ్యము గలవాడు, నాకు ఎంత బోధ చేసిరి. నీచాహారముచే నీచస్వభావమే కలుగుననియు, బ్రహ్మనిష్ఠులు నిర్మలముగా నుండవలయునని ఉపదేశించిన మాటలు ఎక్కడ అంతర్ధానమైనవి ? ఇప్పుడు చేయుటకు ప్రయత్నించిన వృత్తి యేమి ? అని తనలో తాను వితర్కించెను. ''స్వధర్మే నిధనం శ్రేయః'' అని భగవంతు డుపదేశించిన సంగతి గదా స్వామి నాకు ఉపదేశించినదని నిశ్చయించి వెంటనే లేచెను. రాగయ్యకు యెంతో ధర్మరహస్యముపదేశించినను రాగయ్య తన గురువును సాక్ష్యమిచ్చుచునే వచ్చుచు సంపూర్ణముగా భుజించెను.

మరల వారిరువురు మార్గము బట్టి ప్రయాణము ప్రారంభించిరి. మరియును అడవిదారి యగుటచే బహుదూరము జలము గూడ దొరకక కష్టపడి నడచు సమయములో, ఒక కల్లంగడి కనబడెను. అచ్చట జలమును విచారించగా నీళ్ళు లేవనియు, కల్లు కావలసినచో యిచ్చెదమనియు చెప్పిరి. కల్లంగడివాడు సాధారణముగా నీళ్ళు దగ్గర నుంచడు. ఏమన దాహార్తులు నీళ్ళు త్రాగిన కల్లు ఖర్చు కాదని సూత్రము. అచ్చట గూడ దామయ్య మనసు నిండా పరితపించినది. కాని ప్రాణము పోయినను తన గురుచర్యను విడువగూడదని పట్టుపట్టి సహనముతో నుండెను. ఆస్థలమందు గూడ రాగయ్య అంతవరకు సురాపానము చేయనివాడుగా నుండియు, మాంస భక్షణముచే మనస్సులో కొంత తమోగుణము వృద్ధియై, తన గురువు యొక్క చర్యను ఊహించి బాగుగా త్రాగెను.

కొంచెము నిదానించి పునఃప్రయాణమైరి. నడచి రాత్రియైన తర్వాత మార్గమధ్య మందుండు ఒక్క సత్రమందు చేరిరి. మంచు అధికమైయుండుటచే

చలిలో కప్పుకొనుటకు ఏమియు లేని కారణముచేత బాధ చెప్పనలవి కాకుండెను. ఆ సత్రమందు యాత్రికు లెవ్వరును ఆ దినమందు రాలేదు. సత్రమందు అన్నదానము లేమియు లేవు. కాని వచ్చేవారికి పాత్రలు ఇచ్చుటకును, అచ్చట అలికి శుద్ధిచేయుటకును ఒక ఆడుమనిషిని సత్రము వారు నియమించియుండిరి. ఆ స్త్రీ యౌవన వయస్సు గలిగి కొంచెము వ్యభిచారిణిగా నుండెను. యాత్రగా వచ్చిన రాగయ్య దామయ్యలకు కొంచెము సత్కారము చేసి వచ్చి కూర్చుండి ఏదో పాటో, పద్యమో పాడుడని చెప్పెను. వారును మంచివయస్సులో నుండి సుందరులుగా నుండిరి. రాగయ్య సురాపానముచే మతిమాలినవాడై కొంచెము సంగీతము తెలిసి యున్నందున దానిని బయటపెట్టుటకు ఆరంభించెను. ఈ సమయములో దుర్గుణురాలగు ఆమె మనస్సులో కొన్ని మార్పులు కలుగుట జూచి అన్నాహారములు లేనివాడగు దామయ్య తన మిత్రుడు చెడిపోవుకాల మాసన్నమైనదని తలంచి రాగయ్యతో మనము ఇచ్చట నుండరాదనియు, బయటకెచ్చటికైన పోవలసినదనియు చెప్పెను.

**అగ్నికుండసమా నారీ ఘృతకుంభసమో నరః ।**
**సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥**

నాయనా ! స్త్రీ అగ్నికుండతో సమానమైనది. పురుషుండు నేతికుండవంటివాడు. కనుక అగ్నివద్దనుండు నెయ్యి కరుగునట్లు స్త్రీ దగ్గర నుండు వాడు ఎంత బుద్ధిమంతుడైనను మనస్సు చలించును, కనుక ఆ స్థలము విడువవలసినదని శ్రీ దత్తాత్రేయులవా రుపదేశించిరి. కనుక మన మిచ్చట నుండుట మంచిది కాదని రాగయ్యకు ఎంత చెప్పినను వినలేదు. ఇదంతయు చూచుచుండు కామపీడితురాలగు ఆ స్త్రీ దామయ్యతో సత్రము నుండి బయటకు పొమ్మని ఒక విధముగా జెప్పెను. బయట మంచుచే ప్రాణము పోయినను ఇంతవరకు అనుష్ఠించుచు వచ్చిన బ్రహ్మచర్యము ఈ నిమిషములో చెడగొట్టగూడదని రాగయ్యతో మరల చెప్పినను విననందున తన యొక్క అతీత వైరాగ్యము గల గురువును స్మరణకు తెచ్చుకొని ఆ మంచులో సత్రమునుండి బయటకుపోయి పండుకొనెను. తర్వాత రాగయ్య సంగతి చెప్పపని లేదు.

ఉదయము దామయ్య లేచి కాశీయాత్రకై మిత్రుడగు రాగయ్యను పిలిచెను. కాని రాగయ్య ఆ స్త్రీతో గూడి విషయాసక్తుడై అక్కడనేయుండి ఆఖరుకు యిద్దరు ముగ్గురు బిడ్డలను కని ఘోరసంసారమందు పడి చెడిపోయెను. దామయ్య తన గురుచరణారవిందముల ధ్యానించి శ్రీ కాశినిం ప్రవేశించి పరబ్రహ్మ ధ్యానమందు మగ్నుడై జనన మరణములు లేని సాక్షాన్మోక్షమును పొంది నిత్యముక్తుడయ్యెను.

ఈ కథ యొక్క రహస్యమేమన, అతీత వైరాగ్యము గల గురువైనచో శిష్యుడు విచారశీలుడై యుండిన ఎంత దుర్ఘటములు తటస్థించినను ఆ గురువు యొక్క చర్యలు వీనిని చెడుమార్గమునుండి రక్షించును. ఇది ఒక్కటి. రెండవది యేమన, ఎంత పరిశుద్ధుడైనను నీచాహారాదులచే తమోగుణము వృద్ధి కాగా క్రమముగా అజ్ఞానాంధకార కూపములో పడును. రాగయ్య గురువు గూడా మహా గొప్పవారును అతీతజ్ఞానియై యుండినను, వారియొక్క ఆంతర్యస్థితి శిష్యుడెరుంగకపోయెను. వారియొక్క బహిరంగవృత్తియే వీడు చూచెను గాని ఇతరసంగతి నెఱుంగకపోయెను. కాబట్టియే మహాత్ములు శుచి ఆచారములు తనకావశ్యకము లేదని ఎఱింగియు, ఇతరులు చెడిపోవుదురని భయపడి సత్య ధర్మనిష్ఠయందున్నారు. గొప్ప నిప్పులో పచ్చి కట్టెలను వేసినను కాలిపోవును గాని, చిన్న నిప్పులో పచ్చి కట్టెలు వేసినచో ఉండిన నిప్పుకూడా ఆరిపోవును. ఈ తత్త్వము నెఱుంగకపోవుటయే ఇప్పుడుండు బ్రహ్మనిష్ఠాభ్యాసకులు చెడిపోవుటకు కారణము.

**యద్వన్మంత్రబలోపేతః క్రీడన్సర్పైర్న దశ్యతే।**
**క్రీడన్న లిప్యతే జ్ఞానీ తద్వదింద్రియపన్నగైః ॥**

మంత్రౌషధ బలముతో గూడినవాడు ఏలాగున నాగసర్పములను పట్టి ఆడించినను వానినవి కఱవవో, ఆలాగున బ్రహ్మజ్ఞానియగు మహనీయుడు శాస్త్రవిహితములగు కర్మములను ఇంద్రియములచే చేయించినను బద్ధుడు కాడని శాస్త్రమందొక్క మార్గము కలదు. మంత్రౌషధములు తెలియనివాడు నాగ సర్పమును పట్టినచో దానిచే కరువబడి మృతినొందునట్లు, పరిపక్వములేనివాడు జ్ఞాని యని నటించి నిషిద్ధమగు పనులు చేసినచో బద్ధుడగును.

**అభక్ష్యభక్షణే శ్రద్ధా తథా౽భక్ష్యస్య భక్షణమ్ ।**
**అభక్ష్యం బ్రహ్మవిజ్ఞాన విహీనస్యైవ దేహినః ॥**

శాస్త్రనిషిద్ధ మద్యమాంసాది భక్షణమునందు ఆశయు, ఆ రీతిగ నీచాహారము తినుటయు బ్రహ్మజ్ఞానమునకు హానికర మగును. అగ్ని కొంచమైనను సమిధలచేతను. నేతిచేతను ఎంతో వృద్ధియగును. గొప్ప మంట యైనను బురదనీటిని బోసినచో నశించిపోవునట్లు గొప్పజ్ఞానియైనను నీచాహారముచే అధఃపతితుడగును అని పాశుపత బ్రహ్మోపనిషత్తు.

**జ్ఞానే మమోదితే భోగాః కిం కుర్వంతీతి యే విదుః ।**
**భోగే సంగం మతేర్భంగం జ్ఞానశైథిల్యమాప్నుయుః ॥**

జ్ఞానము కలిగిన పిమ్మట భోగములు వారిని ఏమి చేయునని ఎవరైన విచారశూన్యులు తలంచియుండినచో, విషయభోగములచే మనసు చెడిపోవుననియు, జ్ఞానముగూడ గాలిచే మేఘము శిథిలమైపోవునట్లు నశించుననియు గ్రహింపదగినది. ఈవిషయమై మన ప్రాంతమందుండు శుష్కవేదాంతులు పెరుగునుండి తీసిన వెన్న మరల మజ్జిగ యందు ఎట్లు కలియునని వాదింతురు. దీనికి భగవంతుడగు శ్రీరామకృష్ణపరమహంస లుపదేశించినది ఏమనగ పాలను పెరుగుచేసి కష్టపడి మర్దించి తీసిన వెన్న తరువాత చల్లలో నుంచిన రెండుమూడు రోజులైన గబ్బుపట్టి చెడిపోవును. కావున వెన్న తీసిన వెంటనే మంచినీటిలో నుంచవలయును. లేక తక్షణమే కరిగించి నెయ్యి చేసినచో మరల ఎప్పటికిని హాని లేదని నుడివిరి. ఈ విషయము అతీతజ్ఞానము గల శ్రీ రామకృష్ణపరమహంస వచన మని విచారించి నమ్మువారు ధన్యులగుదురు.

## మనోనిగ్రహ రహస్యము

ప్రశ్న ॥ ఓ నిరతిశయానంద ప్రదాతవగు స్వామీ ! తమయొక్క కరుణా కటాక్ష వీక్షణామృతవృష్టిచే మనోదావానలము చల్లారి ధన్యుడనైతిని. నా సోదరుల మనసు స్వరూపానంద సంధానమందు స్థిరముగ నిలుచు మార్గ మనుగ్రహించవలయును. నాకు శాస్త్రానుభవము తక్కువ. కనుక తగిన యుక్తితో దయచేయవలయును.

ఉత్తరము ॥ ఓ నిరంకుశబుద్ధిగల సోదరుడా ! మంచిది, నీ యొక్క ప్రశ్న వలన విద్య లేనివారికి కూడా తెలియునట్లు చెప్పెదను. జాగరూకుడవై వినుము. మనోనిగ్రహ మల్పస్వల్పసంగతి కాదు. ఇది యెంతో గొప్పవారికి గూడ చాలా దుస్తరము. ఈ ప్రశ్నయే అర్జునుడు శ్రీ కృష్ణభగవంతుని తోడను, శ్రీ రామచంద్రుడు శ్రీ వసిష్ఠ మునీంద్రునితోడను, నిదాఘుడు ఋభువను మునీంద్రునితోడను అడిగినది. ఇది గాక అనేక మహర్షులు గురుశిష్యసంవాదముగా గూడ చర్చించిరి.

**దానం స్వధర్మో నియమో యమశ్చ**
**శ్రుతాని కర్మాణి చ సద్వ్రతాని ।**
**సర్వే మనోనిగ్రహలక్షణాంతాః**
**పరో హి యోగో మనసస్సమాధిః ॥**

అన్నదానాది సమస్తదాన ములును, స్వధర్మానుష్ఠాన నిష్ఠయున్ను, యమనియమాది అష్టాంగయోగములును, సమస్త వేదాది ప్రవర్తనయున్ను, తపో యజ్ఞాది కర్మములున్ను, పుణ్యములగు వ్రతములును గాక మరి ఏ యే అనుష్ఠానములు గలవో అవన్నియున్ను మనోనిరోధముకొఱకై ఏర్పడినవి. మనస్సు యొక్క సమాధియే ఉత్కృష్ట మగు యోగ మనంబడు నని భాగవత ఏకాదశ స్కంధము.

**చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవద్దృఢమ్ ।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥**

ఓ కృష్ణ పరమాత్మా ! ఈ మనసు అతి చంచలమైనదియు, సర్వేంద్రియములను క్షోభింపచేయునదియు, బహిర్ముఖముగా సంచరించు నదియు, బహుబలమైనదియు, విషయములందు దృఢమైనదియు, గాక వాయువును నిరోధించుట ఎంతకష్టమో అట్టి కష్టతరమై యుండునది యని తలంచెదనని అర్జునుడు తెలిపెను. దీనికి శ్రీ వాసుదేవులు మనోనిరోధ సూత్ర ముపదేశించిరి.

**అసంశయం మహాబాహో ! మనో దుర్నిగ్రహం చలమ్ ।**
**అభ్యాసేన తు కౌంతేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే ॥**

ఓ అర్జునా ! నీవు చెప్పినది సరియే గాని మహాత్ములందరున్ను మనస్సును జయించినవారే. నీవు చెప్పినట్లు మనస్సును నిరోధించుట దుస్తర మనియు, అది అతి చపలస్వభావము గలదనియు చెప్పు మాటలు వాస్తవమే. సంశయము లేదు. ఐనను అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను దానిని నిరోధింపవచ్చును. అభ్యాసమనగా పర బ్రహ్మానుసంధానమగు తీవ్ర నిష్ఠ. వైరాగ్యమనగా సమస్త విషయములందు విరక్తి. ఈ యర్థమునే శ్రీపతంజలి భగవంతుడు యోగదర్శనమందు సూత్రించియున్నారు. మరియు భ్రూమధ్య హృదయాది స్థానములలో మనస్సును నిశ్చలముగా జేసి బ్రహ్మమందైక్యపరచి ధ్యానించుట గూడ అభ్యాస మనబడును.

సూ :- అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః

అభ్యాస వైరాగ్యములచే మనోనిరోధము చేయవచ్చును. అభ్యాస మనగా పరిశుద్ధహృదయులై, యమ నియమాది అష్టాంగ యోగములను సాంగముగ అభ్యసించుట. వైరాగ్యమనగా ఇంద్రియాది విషయములయందు గల క్లేశము కనిపెట్టి దానినుండి మనసును వశీకరించి శాశ్వత సుఖకరమగు బ్రహ్మనిష్ఠయందు లయపఱచుట.

ఇక నీకు ఈ విషయమై విద్య అధికముగా లేని కారణముచే అనేక దృష్టాంతములతో బోధించెదను. మొట్టమొదట మనసు ఏయే విషయముల గోరి బహిర్ముఖముగ పోవునో, ఆ విషయ మందుండు సుఖదుఃఖములను దీర్ఘముగ విచారించినచో మనస్సు తనకు తానే విషయములనుండి వెనుకకు వచ్చి పరబ్రహ్మనిష్ఠయందు సుస్థిరముగా లయించును. ఎట్లన ఒక వ్యాపారి ఒక్క సామానుకు పోయి వెల మాట్లాడునప్పుడు, నూరురూపాయలు ఆ వస్తువు యొక్క వెలయని వారు చెప్పినచో, నూరురూపాయలకు ఈ వస్తువు కొని ఇల్లు చేరు కూలివగైరా అంతయున్ను లెక్కపెట్టి చూచినచో, దానిచే నష్టము కలుగునని తోచిన, దానిని వారు నిర్బంధించినను ఆ వ్యాపారముపై అతనికి మనసు పోదుగదా! ఈలాటి బుద్ధియోచన చేయకనే మనుష్యులు విషయములలో మగ్ను లగుచున్నారు. లేక గొప్ప ఆకలిగానుండు వాడైనను మంచి క్షీరాన్నము దొరికినను,

దానియందు విషముండునని తెలిసినచో ఎవరు ఎంత బాధపెట్టినను, దానినతడు తినునా ? మనస్సు దానికి ఆశించునా ? ఆలాగుననే ఇంద్రియాది విషయముల నొక్కొక్క దానిని పరిశోధించి దానిలో నుండు విషమస్థితి నెరింగిన మనసు తానే నిలిచి పోవును.

మరియొక సూత్రము. సామాను తూనికవేయు త్రాసులో దేనియందు సామాను లధికముగా నుండునో ఆ తట్ట క్రిందయున్ను, తక్కువగా నుండు తట్ట పై భాగమందును ఉండును. అప్పుడు దానిముల్లు సరిగా నిలువక జాసి సామాను ఉండు వైపు ముల్లు వంగి యుండును. ఈ ముల్లు మనస్సు గాను, త్రాసు పట్టు కొను కాడ (పిడి) బ్రహ్మమనియు నెరుంగుము. అప్పుడు ఆ ముల్లును సరిచేయుటకై రెండు సూత్రములు గలవు. ఒక్కటి భారమైన తట్ట యందలి సామానుక్రిందికి కొంచెము కొంచెముగా త్రోసివేయుట, లేక ఆ సామానంతయు కావలసినచో, ఇతర తట్టలో గుండ్లు పెట్టుట గాని చేసినచో ముల్లు సరిగా మధ్యస్థానమందు వచ్చి నిలుచును. ఆలాగుననే హృదయములో ప్రపంచవాసన ఒక్క తట్టగాను, జ్ఞాన భాగము మరియొక తట్టగాను, కలిగియున్న మనసు ఒక త్రాసు వంటిది. ప్రపంచవాసన, జ్ఞానవాసనకన్న అధికముగా హృదయమందుండుటచే మనసు నిష్ఠయందు నిలువక విషయమందు పోవుచున్నది. అప్పుడు విచారశీలుడు ఏయే విషయములపై మనస్సు పోవుచున్నదో దానిని కనిపెట్టి వృత్తిని కొంచెము కొంచెముగా విడుచుచు రావలెను. ఇది సామాను క్రిందికి త్రోసివేయు రీతి. లేక ఈ వృత్తులను విడిపించి జీవించుటకు కష్టముండినచో ఇతర తట్టలో గుండ్లు పెట్టినట్లు దినదినమును అత్యధికముగా ధ్యాననిష్ఠ చేయవలయును. అప్పుడు మనసు చలనరహితమై యుండును.

మరియొక్క ప్రయత్నము. ఒక సాగుబడియైన భూమిలో వరిమొదలగు పైరులు బాగా పుష్కలముగా నుండుటను జూచి ఒక్కరు సమీపమందుండు అడవి నరికి విత్తనముల చల్లినచో తాను చల్లిన విత్తనములు మొలకెత్తుటకు ముందుగా చెట్లు, కంపలు, ముండ్లు, కసవు మొదలగు నవి వృద్ధియై పైరు కనబడుటకు ప్రయాస మగును. ఆ సంవత్సర మల్పమైన పైరు పండుటయే దుస్తర మగును. అప్పుడు వీడు వారి భూమి బాగుగా పండినది, మన భూమి

పండకపోయెనని తలంచి దానికి కారణము కని పెట్టక విడిపించినచో యథాప్రకార మరణ్యమై పోవును. తన భూమియందు ముందనేక చెట్ల విత్తనవములు పడియుండుటయు. చెట్లవేర్లు నుండు కారణముచే, పండలేదని నిశ్చయించి ఎక్కువ ప్రయత్నముతో దానియందుండు వేర్లు తీయుటకై ప్రయత్నించినచో మరుసంవత్సరము ఇప్పటికన్న ఎక్కువగా పైరు వృద్ధి యగును. పునః పునః భూమి శుద్ధము చేయుచు రాగా రాగా కొన్ని సంవత్సరములలో ప్రక్కనునుండు పాత సాగుబడియైన భూమివలె దీనియందు గూడ పంట బాగుగ పండి కసవు మొదలగునవి లేకనే యుండునుగదా ! ప్రక్కనునుండు భూమిగూడ పూర్వము ఇదే రీతిగనే యుండినది. బహుకాలమునుండి శుద్ధిచేయుటచే పవిత్రమైనది. ఈరీతిగా ఇప్పుడు ఒక మహనీయుడు నిర్వికారుడై పరబ్రహ్మానుభవముతో గనబడును. మఱియొక్కడు కొంచెము సేపు నిష్ఠయందుండుటకై ప్రారంభించినచో అనేకవృత్తులు వచ్చి మనసును బహువిధములుగ పరుగిడుటకై ప్రేరేపించును. కారణ మేమన వీనిహృదయమందు బహుజన్మలయందుండి వచ్చిన కర్మబీజములు నశించలేదు. అదియును గాక వీడు క్రొత్త అరణ్యమున విత్తనము వేసినట్లు ఇప్పుడే అజ్ఞానారణ్యము కొట్టి బ్రహ్మబీజముగు నిష్ఠను అభ్యసించుటకై బూనినవాడు. నిశ్చలుడగు బ్రహ్మవేత్త ఇదేరీతిగా నుండిన వాడైనను పాతభూమివలె జన్మాంతరముననుండిగాని, లేక చిన్న కాల మందుండిగాని మనో వృత్తులను నాశనముచేయుటకై ప్రయత్నించినవాడు. కనుక మనోనిరోధము గలుగువఱకు అభ్యాసము బలముగ శీలించవలయును.

ఈ విషయమై శ్రీరామకృష్ణ పరమహంసలు ఇట్లుపదేశించిరి. వడలు గాని నిప్పట్లు గాని చేయునప్పుడు దానియందుండు నీళ్ళు నశించు పర్యంత ముడుకు నేతిలో శబ్దముగా నుండును. నీరు నశించిన తర్వాత నిశ్శబ్దముగా నుండును. అట్లే బ్రహ్మవిచారముచే ఉడికిన హృదయమందు ప్రపంచవిషయము నశించువఱకు మనసు చలించుచునేయుండును. మరియు గంగి రెద్దువారు, ఆయెద్దును ఏలాగున వశీకరించుకొని చెప్పినట్లు ఆటయు, పాటయు నేర్పించుదురుగదా ? ఆజంతువు ఆవులపై బసవయెద్దుగా నుండు కాలమున ఎంత పోకిరిగా నుండినను వారి అభ్యాస శిక్షణలచే ఎంత స్వాధీనమైనది ! ఆలాగుననే మనసును గూడ చిరకాలాభ్యాసముచే వశపఱచుకొనవచ్చును.

మరియు ఘోరారణ్యమందు మహాపరాక్రమముతో గూడిన యేనుగును తంత్రవముతో పట్టుకొని గొలుసులతో బంధించి, మితమైన తిండిపెట్టి మావటివాడు ప్రతిదినమును అభ్యాసముచే నేర్పించి, వశపఱచి వాడు చెప్పినట్లు ఆజ్ఞలో నిలిపి ఎంతో శాంతస్థితికి తెచ్చుచున్నాడు. ఆలాగుననే సంసారారణ్యము నందు సంచరించు మనసును గుర్వాజ్ఞ యను గొలుసు వేసి, సాత్త్వికమగు ఆహారము మితముగా భుజించుచు ప్రతిదిన మభ్యాసనిష్ఠను శీలించినచో ఎంతదుష్టమనస్సైనను క్రమముగా వశపడును. మృగము గూడ ఈరీతిగా స్వాధీన పడునప్పుడు తెలివి గల మనుష్యుడు ఏల మనస్సును వశపఱచుకొన గూడదు! కపిల తోలుటకై తొండము దారమునకు క్రిందవేసియుండు కొయ్యగాని. నల్లరాయిగాని ఆత్రాటిచే ఎట్లఱిగిపోయి రెండుగా భేదమందున్నదో, అట్లు, రాయిగూడ క్రమముగ తెగునప్పుడు మనసు ఏల తెగదు? ఇక మనసు నశించుటకై మరియొక సూత్రము చెప్పెదను. ఇది నిండా బుద్ధిమంతునికే గోచరమగును.

**ఆత్మనోఽన్యన్న హి క్వాపి ఆత్మనోఽన్య త్తృణం న హి।**
**ఆత్మనోఽన్యత్తుషం నాస్తి సర్వమాత్మమయం జగత్॥**

పరమాత్మునికన్న అన్యము ఎచ్చటను ఏమియు లేదు. పరబ్రహ్మమున కన్యమై తృణము గూడ లేదు. ఆత్మకు అన్యమై పొట్టుగూడను లేదు. ఈ జగమంతయు పరమాత్మమయ మను తేజోబిందూపనిషత్తు రీతిగా, అంతయున్ను బ్రహ్మమై చూచుటకు శక్తి గలిగెనేని మరల మనసు ఎక్కడికి పోవును? లేక మనస్సే లేదు గదా. ఈవిచారము స్థిరపడుట అతీత బుద్ధిగలవానికే సాధ్యమగును.

**చిదాత్మాఽహం పరాత్మాఽహం నిర్గుణోఽహం పరాత్పరః।**
**ఆత్మమాత్రేణ యస్తిష్ఠేత్స జీవన్ముక్త ఉచ్యతే॥**

నేను చిదాత్ముడను. నేను పరమాత్ముడను. నేను నిర్గుణుడను. ఇది అంతయున్ను ఆత్మయే. దాని కన్యమేమియున్ను లేదని అనుభవమునకు తెచ్చుకొని ఆత్మరూపుడై ఎవడు నిలుచునో వాడు ముక్తుడే. సంశయము లేదు. ''సర్వం ఖల్విదం బ్రహ్మ'' ''సర్వం బ్రహ్మమయం జగత్'' ''వాసుదేవమయం సర్వం,

సర్వం శివమయం జగత్'' ఈలాటి వేదవాణిని చింతించినచో అప్పుడే మనసు లేకపోవును. ఇది అతీతస్థితి. అంత పరిశుద్ధవిచారము చేయుటకై శక్తిలేనిచో ఒక్క మెట్టుక్రింద చెప్పెదను.

**దేహత్రయాతిరిక్తోఽహం శుద్ధచైతన్యమస్మ్యహమ్ ।**
**బ్రహ్మాహమితి యస్యాంతః స జీవన్ముక్త ఉచ్యతే ॥**

ఎవనికి దేహత్రయాతీతుడననియు, శుద్ధచైతన్యమాత్రుడగు బ్రహ్మమనియు అంతఃకరణమందు స్థిరబుద్ధి గలుగునో వాడు ముక్తుడు. ఇది ''బ్రహ్మాస్మి'' అను మహావాక్య చింతనము.

**నాహం దేహో న చ ప్రాణో నేంద్రియాణి మనో నహి ।**
**సదా సాక్షిత్వరూపత్వాచ్ఛివ ఏవాస్మి కేవలః ॥**

నేను దేహమును కాను, పంచప్రాణములును కాను, మనస్సు మొదలుగా గల అంతఃకరణ, ఇంద్రియములును గాను. ఏలన, వీటియన్నిటికి సాక్షిరూపుడనగుటచే కేవల శివుడను, సాక్షిగా నుండుటచే, ఘటదృష్టి న్యాయరీతిగా వీటికి అన్యుడనే. అప్పుడు ఘటాది వస్తువులు దృశ్యములు, నేను దృక్కుగా ఉన్నాను గదా ?

**న మే చిత్తం న మే బుద్ధిర్నాహంకారో న చేంద్రియమ్ ।**
**న మే దేహః కదాచిద్వా న మే ప్రాణాదయః క్వచిత్ ॥**

నాకు చిత్తము లేదు, బుద్ధియున్ను లేదు. అహంకారమున్ను లేదు. ఇంద్రియము లేవియున్ను లేవు, దేహము లేదు, ప్రాణవర్గములున్ను లేవు, కేవల శుద్ధబోధరూపుడనని చింతించినచో వృత్తిరాహిత్యము నొందవచ్చును. ఇది ''ప్రజ్ఞానం బ్రహ్మ''యను మహావాక్యార్థవిచారణము, కనుకనే ''గురవే బుద్ధిసాక్షిణే'' ''సర్వధీ సాక్షీభూతం'' అని మొదటనే గురుమంత్రం నేర్పెడు రహస్యము. ఈ స్థితియందు స్థిరముగా నిలుచుటకు శక్తి గలవానిని ఏయొక్క వృత్తులున్ను బాధింపవు. దీపమును చీకటి బాధింపనట్లు దేహాది ఇంద్రియ జడవస్తువులు బాధింపవు. దేహేంద్రియాదులలో ఆత్మబుద్ధి యుండినచో వృత్తి గలుగుచుండును. విచారణ చేసినచో తాను విలక్షణుడు.

**అనాత్మభూతే దేహాదావాత్మబుద్ధిస్తు దేహినామ్।**
**సాఽవిద్యా తత్కృతో బంధస్తన్నాశో మోక్ష ఉచ్యతే॥**

అని వేదవచనము. అనాత్మభూతములగు దేహాదుల యందు జీవులకు ఆత్మబుద్ధి యేది గలదో, అదియే అవిద్య. దానిచే బద్ధు డగును. వీటియొక్క నాశమే మోక్ష మనంబడును.

దీనికి ఒక దృష్టాంతము చెప్పెదను. విద్యుచ్ఛక్తిదీపాది యంత్రము లన్నియున్ను ప్రవృత్తియందుండునప్పుడు చేతనారూపములు. ఆదీపాది యంత్రమునుండి తంతులతో కలిసియుండు మరను త్రిప్పినచో దీపాదు లన్నియున్ను జడములుగా నిలిచిపోవును. ఆయంత్రమునకు నాల్గు భాగములు, మొదటిది మిషన (విద్యుచ్ఛక్తి). రెండవది ఆశక్తిని ఆకర్షించి నిలువబెట్టు పెట్టె. మూడవది తంతి, నాల్గవది తిరుగుచుండు యంత్రములు. అప్పుడు మొదట మరను నిలిపినచో తంతియున్ను, పెట్టెయున్ను మిషనకూడ చేతనములు. తిరుగుచుండు యంత్ర మచేతన మగును. తంతితో కలిసియుండు మరను వేరుపఱచినచో తంతి జడమగును. పెట్టెనుండి మరను వేఱుపరచినచో పెట్టె గూడ జడమగును. అప్పుడు విద్యుచ్ఛక్తి యంత్రముమాత్రము చేతనరూపమె యుండును. ఆలాగున ఈ దేహమను యంత్రమునకు గూడ నాల్గు అంతస్థులు కలవు. ప్రజ్ఞానఘనమగు బ్రహ్మమునుండి మనోబుద్ధులును, అంతఃకరణమను పెట్టెయున్ను, దానినుండి ఇంద్రియాదులను తంతులున్ను, తంతులనుండి దేహాది కరచరణములును పనిచేయు చున్నవి. కనుక దేహమునుండి బుద్ధిని వేరుపరచినచో, జడమైన దేహము ప్రత్యక్షముగా కనందగును. ఆతీరున ఇంద్రియములనుండి బుద్ధిని వేరుపరచినచో ఇంద్రియములు జడములగును. అప్పుడు మనోబుద్ధి చిత్తాహంకార వృత్తులుండు పెట్టె చేతనముగా నుండును. బుద్ధికి సాక్షియగు ఆత్మ యుండుటచే బుద్ధియొక్క నిశ్చయాత్మకవృత్తులను తెలిసికొనుచున్నాము. దానినుండి గూడా అతిక్రమించినచో ఇవి అన్నియున్ను జడములే. ఇదే వృత్తిశూన్యమగు ఆత్మశక్తి, ఇదేకైవల్యము. ఇదే జీవన్ముక్తి. కనుక విచార శూన్యులను మాత్రము వృత్తులు బాధించును. విచారశీలుడు

వృత్తిరహితుండు. ఈ అవస్థలో నిలుచుటకు బుద్ధిగలవానికి మాత్రమే సాధ్యమగును. ఇదే ఆత్మానాత్మ విచార ఫలము. ఈవిచారరహస్యము తెలియకనే శుష్క వేదాంతులు ఇంద్రియములు వాటివాటి పనిచేయుచుండునేగాని తాను చేయువాడు కాడని చెప్పి నీచమైన పనిచేయుటయు, కపటము తెలియని పరమభక్తులగు నారీమణులను గూడ భ్రష్టులను గావించుటయు జరుగుచున్నది.

**నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదంతినః ।**
**పలాయంతే న శక్తాస్తే సేవంతే కృతచాటవః ॥**

వాసనా రహితమగు సింహమును చూచినచో, మదోన్మత్తములగు విషయ గజములు నిశ్చలముగ నణగిపోవును. లేక అరణ్యమునుండి పారిపోవును. ఆస్థితి నొందినవారికి ఇష్టానుసారముగ సేవ చేయునని అష్టావక్రగీత. అనగా సింహమును చూచిన ఏనుగులు తామున్నచోట నిశ్చలముగ కూర్చుండినట్లు తాను వాసనారహితుండగు శుద్ధ బోధమును బుద్ధి గలవారి ఇంద్రియములు ఆయాస్థానమందే లయించి పోవునేగాని విషయములందు ప్రవర్తింపవు. సింగమును చూచిన లేడులవలె నిజబోధగలవారి ఇంద్రియములు స్వస్థానములో నిలచి పోవును. అనగా తాను దేహత్రయాతీతుడనను బోధ కలుగవలయును.

**దేహేంద్రియ మనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।**
**తద్వృత్తి సాక్షిణం విద్యాదాత్మానం రాజవత్సదా ॥**

తాను దేహేంద్రియ మనోబుద్ధి ప్రకృతులకన్న విలక్షణుడనియు, వీటి కన్నిటికి సాక్షియనియు తెలుసుకొనవలెను. ఎట్లన భృత్యులకన్న రాజు విలక్షణుడై వారి గుణాగుణములు చూచువానివలె ఆత్మను ఎఱింగినచో ఏ యొక్క వృత్తులును బాధింపవు. అనగా రాజు సింహాసనమందు కూర్చున్నప్పుడు భృత్యులు నిశ్చలులై స్వస్థానమందుందురు. ఆ లాగున ఈ దేహమను రాజ్యములో మనశ్చిత్త బుద్ధులను మంత్రులను, ఇంద్రియములను భృత్యులతోగూడ మోక్షసామ్రాజ్యమును పరమాత్మ ఏలుచుండును. ఇదే రాజయోగముయొక్క రహస్య సంగ్రహము. రాజు కధీనులై భృత్యులు ప్రవర్తించునట్లు, ఆత్మకు ఆధీనముగా వృత్తులను నిలుపుటయే రాజయోగ మనంబడును. ఇట్లు గాక భృత్యుల కధీనుడైన

రాజుయొక్క రాజ్యము ఎట్లు అరాజకమో అట్లే వృత్తులకు లోబడి దానికి వశులై పరుగిడు రాజయోగులని చెప్పు కొందరు దురాచారుల గతి దుర్గతి యగును.

ఈ రహస్యము తెలియకనే మనసు చలించును. కనుక పైచెప్పిన రీతిగా విచారించినచో మనోనిరోధము త్వరలో సిద్ధించును. మరియు హృదయమందు సంకల్పమునుండి మనసు ఉదయ మగును. అప్పుడు తత్క్షణమే నాశము చేసినచో సులభముగ నిరోధ మగును. లేనిచో మనస్సు హృదయమునుండి ఇంద్రియములలో వ్యాపించినచో సహస్రభాగముల దాని బల మధికమగును. ఇంద్రియములనుండి కర్మములలో ప్రవేశించినచో లక్షలభాగ మధికముగ బలపడును. అచ్చోటనుండి లోకమందు ప్రవేశించినచో కోట్లభాగము అధికశక్తితో గూడియుండును. ఎట్లన ఒకగొప్ప నూలుయంత్రము మొదట ఇంజనుచక్రము ఒక్కసారి చుట్టునప్పుడు ఉపచక్రములు నూరుచుట్లు చుట్టును. దానికన్న చిన్న ఉపచక్రములు సహస్రలక్షలధికముగా చుట్టును. మొదటుచుట్టు ఇంజను మరలు ఆపుట చిన్న బాలునికిగూడ సులభసాధ్యము. మర త్రిప్పినతర్వాత ఉపచక్రములను పట్టి నిలుపుటకు ఎవరికి సాధ్యము ? కనుక సంకల్పము స్ఫురించినచో అప్పుడే నాశము గావించవలయును. ఇది సాధారణమైన వారికి కష్టసాధ్యము. విచారపురుషులకు సులభసాధ్యము. ఒక్క చింతచెట్టు మొలకెత్తునప్పుడు నఖములచే త్రుంచి పారవేయవచ్చును గాని పెద్దవృక్షమైన తర్వాత నాశనము చేయుట కెంత కష్టము ? ఈ రీతిగానే చిత్తము చలించుట కనిపెట్టి అప్పుడే నాశనము చేసిన సులభము. లేక ఐంద్రజాలికుని మామిడిచెట్టువలె, ఒక్క నిమిషములోపల చిగిరించుట, పుష్పించుట, కాయలు కాయుట మొదలుగా గలిగి పెద్దవృక్షముగా కనిపించునట్లు మనస్సు అంత త్వరలో వృద్ధి యగును. కనుకనే ఒక్కమహనీయుడు జీవన్ముక్తి ప్రకాశికయందిట్లు చెప్పెను.

**కామ ! జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే ।**
**న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినశ్యసి ॥**

ఓ కామమా ! (మనసా !) నీయొక్క మూలము తెలిసికొంటిని గదా ? నీవు సంకల్పమునుండి గదా ఉత్పత్తి యగునది. ఇకమీద నేను సంకల్పము చేయను. అప్పుడు నీవు సమూలముగ నాశము నొందుదువు గదా ?

మరియు చిత్తము పంచావస్థలతో గూడినది. (1) మూఢము (2) క్షిప్తము (3) విక్షిప్తము (4) ఏకాగ్రము (5) నిరుద్ధము అని అది యైదు విధములు. (1) మూఢమనగా తమోగుణ ప్రధానమై కృత్యాకృత్య వివేక జ్ఞానము లేక కామక్రోధాది కార్యములయందు ప్రవర్తించునది. ఇది పిశాచరాక్షసగుణములు కలిగియుండువారికి నుండును. (2) క్షిప్తమనునది దైత్యదానవుల గుణము గలవారికి నుండును. ఇది రజోగుణ ప్రధానమై సుఖదుఃఖాది విషయములందు ప్రవర్తించునది. ఇది మిగుల చంచలముగా నుండును. దీనికి కషాయమని నామాంతరము గలదు. (3) విక్షిప్తమనగా సత్త్వగుణముతో గూడి సుఖసాధనాదులయందు ప్రవర్తించునది. ఇది దేవతల స్వభావము గలవారికి నుండును (4) ఏకాగ్రమనగా బాహ్యమందు ప్రసరించని మనసు పరబ్రహ్మధ్యానమందు నిలుచుట. ఇది మహర్షుల గుణము గల వారి కుండును. (5) నిరుద్ధమనగా వృత్తులున్ను, సంస్కారములున్ను, లేని చిత్తము. ఇది జీవన్ముక్తులగు సిద్ధపురుషులకే యుండును.

ఈ పంచావస్థలలో మూఢ, క్షిప్త, విక్షిప్తములను మూడవస్థలు గలవారికి మనోనిరోధము కలుగుట ప్రయాసము. ఇవి మూడును సంసారమందు చేరినవి. తక్కిన ఏకాగ్ర, నిరుద్ధ చిత్తములు రెండు మాత్రమే బ్రహ్మనిష్ఠ సమాధి నొనర్చును. కనుక వారివారి అవస్థలను వారువారు కనిపెట్టి మనస్సును దిద్దుకొనవలయును. ఈస్థితిలో ఇప్పుడు గల దురాచారపరులగు రాజయోగుల చిత్తము దేనిలో చేరినదని నీవే యోచించుకొనుము.

పైజెప్పిన సంగతులు పతంజలి భగవంతుల యోగసూత్ర భాష్యమందు కనందగును. మనసు ఎంతకెంత నిరోధబలముచే ఆత్మసాన్నిధ్యము నొందునో అంతకంత బ్రహ్మాకారమై మారును. ఎట్లన ఇనుమును కమ్మర వాడు నిప్పులో పెట్టి ఊదునప్పుడు ఇనుము గూడా అగ్నిమయమై మారునట్లును, ఉప్పు జలముతో ఐక్యమగునట్లున్ను, ధ్యానమందు మనస్సుగూడ బ్రహ్మాకారమగు సంగతి స్వానుభవముచే కనందగును. మనసు ప్రవృత్తి, నివృత్తియను రెండు గుణములతో గూడినది. మనసు అద్దమువంటిది, అద్దమును తన ముఖము ప్రక్కగా త్రిప్పునప్పుడు తన శరీరము మాత్రమే దానియందు కనబడును గాని

ప్రపంచమేమిన్ని కనబడదు. ఆ అద్దమును ప్రపంచము ప్రక్కకు త్రిప్పునప్పుడు తన శరీరము కొంచమైన తెలియదు. అప్పుడు దానియందీప్రపంచ మంతయున్ను స్ఫురించును గదా ! ఈరీతిగా మనసు నిరోధమునొంది అంతర్ముఖముగా తిరిగినచో, ఆత్మరూపమే దాని యందు ప్రకాశించును. విషయవాసనచే ప్రపంచముఖముగా తిరిగినచో తానెవ్వడని తెలియక ఇంద్రియభోగమే పరమ పురుషార్థమని నమ్మి యుండును. దీనికే ఊర్ధ్వకుండలి అనియు, అధఃకుండలి యనియు పేర్లు. కనుక మనసును అంతర్ముఖముగా బ్రహ్మనిష్ఠుడు యోగ బలముచే త్రిప్పవలయును. దీనికి అభ్యాస మావశక్యము.

అట్లు మనసును పరమ సమాధియందు నిలుపుటలో కష్టముండినచో గీతయందు శ్రీ వాసుదేవులు 12-వ అధ్యాయ మందుపదేశించిన రీతిగా అనుష్ఠించవలయును. మనస్సును బుద్ధిని పరబ్రహ్మ ధ్యానమందు లయపఱచుట ఉత్తమమార్గము. అట్లు బ్రహ్మనిష్ఠయందు లయమునొందు పరిశుద్ధిలేనిచో యోగాభ్యాసముచే లయపరుప వలయును. ఇది మధ్యమాధికారికి చెప్పినది. అది సాధ్యము గానిచో ఈశ్వరప్రీతికరమగు సత్ప్రయత్నము చేయవలయును. ఇది కనిష్ఠ మార్గము. ఇది కూడ సాధ్యము గానిచో, పరమాత్ముని శరణముపొంది సమస్త కర్మఫలములను విడువుము. ఇందుకు గూడ సాధ్యము గానిచో శక్త్యనుసారముగా పుణ్యకర్మము చేయుము. దీనికిని శక్తిలేనిచో పుణ్యకథలను జదువువారి వద్దకైనను వెళ్లుము. పాపకార్యము చేయకుండా ఉండుము. దీనికిని సాధ్యము గానిచో, పుణ్యకర్మములు చేయువారికి దేహముతోనైనను సహాయము చేయుము. దీనికిని సాధ్యము గానిచో, పుణ్యకర్మములను చేయుటను చూచి సంతోషపడుము. దీనికిని సాధ్యముగానిచో వ్యర్థభాషలచే గడుపు సమయమున మంచి మాట్లాడుము. దీనిలో ఏది నీకు సాధ్యమగునో దానినే చేయుచువచ్చిన క్రమముగా ఒక్కొక్క మెట్టు ఎక్కి పర్వతోపరిభాగము చేరునట్లు, మనోనిరోధము గలిగి మోక్షమును బొందవచ్చును. ఈ చెప్పిన సంగతులలో ఏదియును సాధ్యము కానిచో, ఏమియును చేయకుండా ఉండుట నిండా వేలైనది. దీనికి క్రిందనుండువాడు సంసార మహాదుఃఖమను చక్రములో తిరికి తిరిగి ఎప్పుడో ఏకాలమునవో పైకివచ్చు నను సంగతి నాకు తెలియదు.

కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః ।
పుణ్యకార్యే పాపకార్యే చత్వారస్సమభాగినః ॥

చేయించువాడును, చేయువాడును, ప్రేరణచేయువాడును, చూచిసంతోష పడువాడును ఈ నలుగురున్ను పుణ్యకార్యమందుగాని, పాపకార్యమందుగాని సమభాగస్థు లగుదురు.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయిస్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ! ॥

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి ॥

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥

దీనికన్న ఇక ఏమి ఆకరుణానిధియగు పరమాత్ముడు దయచేయ వలసినది? దీని యర్థము ఈ గ్రంథమందు మరియొక్కచోట వ్రాసియున్నాను. పైజెప్పినదిగూడ దీనియొక్క సారమే. ఇంకొక్క రహస్యము జెప్పెద. తన యందుండు ఒక్కొక్క వృత్తిని బయటకు నెట్టివేసిన ఆత్మసన్నిధానమున ఒక్కొక్క మెట్టెక్కుచున్నారని గ్రహింపుడు, అట్లే సమస్త వృత్తులను నెట్టివేసిన అన్ని మెట్లెక్కి ఆత్మస్థానమును పొందినామనుట మరువకుండుడు.

## శరీర పరిణామము

ప్రశ్న ॥ ఓ సత్యనిష్ఠులగు స్వామీ ! హీనజాతియందుండువాడు మహాత్ముడైనను, ఆత్మసిద్ధిచే బ్రాహ్మణుడైనను శరీరముయొక్క నీచత్వ మెట్లు పోవును? ఇప్పుడు వాడు మాంసాది నీచవస్తువులు తినకుండనుండినను, చిన్నకాల

మందుండి మాంసాదులతో గలిగిన శరీరము అదే గదా ? లేక వాడు జన్మనా మాంసాది ఆహారము తినకుండ నుండినను వాని తల్లిదండ్రులు మాంసాదులు భుజించియుండినందున ఆ రక్తశుక్లములచే గలిగిన శరీరమునకు మార్పు లేదు గదా! అప్పుడు శరీరమునకు తమ రానతిచ్చినట్లు బ్రహ్మత్వమెట్లు గలుగును ? వేపవిత్తనము చక్కెరపెట్టి క్షీరముచే అభిషేకము చేసినను చేదుపోయి తీపు గలుగనేరదు గదా ? అట్లుండగా తాము చెప్పినది బుద్ధిశాలురు నమ్ముదురా ?

ఉత్తరము ॥ ఓ వివేకశీలుడవగు సోదరుడా ! ఈ విషయమై నీవు అగాధ విచారము చేయక కేవలము జడబుద్ధులు చెప్పినది వింటివే గాని విచారము చేయలేదు. కాని యీ ప్రశ్న నిండా గొప్పది. ఈవిషయమై అనేకులకు సంశయము గలదు, దానిని విమర్శించెను. ఓ నాయనా ! ఈలాటి విచారశూన్యులచే గదా మన లోకము ఇంత హీనస్థితికి వచ్చినది ? జడములగు వృక్షాది వస్తువులతో చేతనములగు మనుష్యుల నుపమానము చెప్పుట విని నాహృదయమత్యంతముగా బరితపించుచున్నది. ఈ విషయము తెలియుటకై విజ్ఞాన (సైన్సు) శాస్త్రమొక్కటి గలదు. దానిలో కేవల మచేతనములగు వృక్షాదులతో సమానముగా చైతన్యముగల మనుష్యాదుల నుపమించుట నిండా అంధకారావస్థ యని తేలును. ఈశరీరమునకు ప్రతిక్షణమునను వృద్ధిక్షయములు గలవు. అనగా శరీరమందుండు పాతభాగము నశించుట, క్రొత్తశరీర మణువులచే, వృద్ధియగుట. ఇప్పుడు స్థూలాకారమై కనుపించెడి ఈశరీరము సంపూర్ణముగా ఏడు సంవత్సరములలోపల మారిపోయి క్రొత్తశరీర మేర్పడును. ఆపరిణామము ఆహారవస్తువులనుండి వచ్చి చేరును. అనగా అన్నాదివస్తువులు రసములై మారి రసమునుండి రక్తమున్ను, రక్తమువల్ల మాంసమున్ను, మాంసముచే మజ్జయున్ను, మజ్జవల్ల నరములున్ను, ఎముకలు, వీర్యము వగైరా సప్తధాతువులై దేహాకార మగును. ఈరీతిగానే ప్రతి నిమిషమందు పాతశరీరము మారుచునేయుండును. అది యెట్లనగా నొక్క అహోరాత్రము (24 గంటల) లో 21 వేలు 600 నూర్లు హంసలు (శ్వాసోచ్ఛ్వాసములు) జరుగుచుండును. అప్పుడు ప్రాణవాయువుచే పాతశరీరమంతయును ఆవిరిగా మారి క్షయించుచు వచ్చును. తక్కిన సమానవాయువు నాభిస్థానమందుండి యాహారమందుండి వచ్చు అన్నాది

రసములను రక్తముగా మార్చి శరీరమును పోషించును. ఈ రీతిగా ప్రాణాది పంచవాయువుల ప్రయత్నముచే వృద్ధిక్షయములు సర్వదా జరుగుచునే యుండును. ఇది స్థూలదృష్టిచే విచారించినను కనందగును.

ఎట్లనగా ఒక్క పాత్రయందు జలమునుంచి నిప్పుమంట వేయుటచే, అగ్ని యొక్క వేడిమిచేత జలము ఆవిరియై మారుటయే జలము తగ్గిపోవుటకు కారణము. అదే రీతిగానే శరీరముగూడ ప్రాణాగ్నిచేత ప్రతినిమిషము క్షయించుచునే యుండును. మరియు నఖకేశములచేతను, చర్మరోమములచేతను, శరీరము ఎంతశీఘ్రముగ మారుచుండునో విచారించిన దెలియందగును. ఒక్కరొక్క సంవత్సరము క్షౌరము చేయకుండినచో, ఈ సంగతి సులభముగ గోచరమగును. ఆలాగుననే ఒక్కమాసము స్నానము చేయక క్రొత్తగా స్నానము చేయునప్పుడు శరీరముందుండిన చర్మ మెంతో రాలిపోవుట జూడవచ్చును. మరియు విషయులుగా నుండు పురుషులకు రేతస్సుచేతను, స్త్రీలకు ఋతుకాలమందు రక్తముచే పాతశరీరము నశించును, ఆ నశించెడి శరీరబాగము ఆహారమందుండి మరల వచ్చి చేరును. ఇదియే ఒక్కడు రోగమందుండునపుడు వాని శరీరము కృశించుటకు కారణము. అదేమనగా రోగమందుండునప్పుడు ఆహారము నిండా తక్కువగా నుండును గదా ? అప్పుడు గూడా శరీరమందుండు ప్రాణవాయువుచే పాతశరీరము మామూలుగ క్షయించుచునేయుండును. ఆ క్షయించినంత ఆహారమునుండి వచ్చుట లేదు కనుకనే శరీరము క్షీణించును.

ఈ రహస్యమే యోగియగు వాడు సమాధినిష్ఠయందు ఎంతకాల ముండినను శరీరమునకు ఏయొక్క హానియును లేకుండుటకు కారణము. అనగా నిర్వికల్పసమాధి సమయమున ప్రాణాదివాయువులు నిశ్చలముగా నుండును. కాబట్టి శరీరము క్షీణించుటకు వీలులేదు. యోగాభ్యాసము చేయువారికి పైచెప్పిన యేడు సంవత్సరములు గూడ శరీర పరిణామమున కవసరము లేదు. అభ్యాసశక్తిచే బహుశీఘ్రముగ శరీరాణువులు మారు చుండును, కనుకనే అభ్యాసకాలమందు నెయ్యి, పాలు, వగైరా శరీరపోషణ వస్తువులు తినుటకై విధించినది. ఇప్పుడు గూడ బ్రహ్మనిష్ఠులకు ఆహారాదులు తక్కువగా (ఏకవారము) నుండినను వారి శరీరమంత శుష్కింపదు. ఏమి యన వారికి

సంసారిజనులవలె వీర్యనష్టము లేకయు, ప్రాణవాయువు గూడ అంత దీర్ఘమై చలించుటలేని కారణముచే శరీరము పుష్టిగా నుండును. యోగాభ్యాసముచే శీఘ్రముగ శరీరపరిణామము ఏర్పడును. ఎట్లన ఒక్కపాత్రయందు కొంచెము నీళ్లుపెట్టి పెద్దమంట వేసినచో దానియందుండెడి జలము శీఘ్రముగా ఆవిరియై పోవునట్లు, యోగాభ్యాసము చేయువారి కాయకీయ, మానసిక స్థితిగతులు వేగముగా మారుట జరుగును. లేక ఒక దుర్గంధమగు జలాశయములోనికి మంచినీరు వచ్చుటకై ఒక్క కాలువ ఏర్పఱచియు, చెడునీరు పోవుటకై మఱియొక కాలువయుండినచో నిర్మలజలము దానిలో వచ్చిచేరి కల్మషజలముపోయి కొన్ని దినములకు ఆ గుంటయందు జలమంతయును పరిశుద్ధ మగునట్లు, నీచమగు ఆహారములు భుజించుచు వచ్చినను కొంత కాలములో ఆ శరీరము పోయి సాత్త్విక ఆహారముగలవారి శరీరస్థితి వీరికి గలుగును.

కనుకనే ఆదికాలపు మహర్షులు అన్నిజాతులవారున్ను కలియుచుండిరి. వారు సూక్ష్మదృష్టిగలవారగుటచే స్థూలదృష్టిగల ఇప్పుడుండు వారివలె హీనబుద్ధి వారికి లేదు. ఈలాగుననే మలిన మనస్సుగలవారు గూడ నిర్మలమగు సద్గుణముల ననుష్ఠించినచో మనస్సు క్రమక్రమముగా మారిపోవును. దానికిగూడ స్థూలదేహము వలె పరిణామము గలదు. కనుకనే సూక్ష్మశరీరమను పేరు గలిగినది. జీర్ణించి నశించి పోవుటచే శరీరమను పేరువచ్చినది. దీనికి దృష్టాంతము ఇప్పుడు కొందరు పరమభక్తులు చిన్నకాలములో క్రూరులుగా నుండినను, ఇప్పుడు ఎంతో గొప్పశాంతముతో గూడిపరమభక్తులై కనబడు చున్నారు. ఈ మనస్సుయొక్క మార్పు, శరీరపు మార్పుకంటె అతి శీఘ్రముగ బుద్ధి మంతులకు గలుగును. ఎట్లన పులుపు, వగరు గల మామిడి చెట్టునకు అంటుకట్టిన నైజము పోయి దానియందు మంచికాయలు కాచునట్లు ఎంత దుర్మార్గుడైనను మహాత్ముల సంసర్గము సరిగ చేసినచో, అనగా వారుపదేశించు పరమాత్మతో మనసును లయపఱచిన జీవత్వము పోయి దేవత్వము గలుగును. దీనికి శ్రీ వాల్మీకిమహర్షియే దృష్టాంతము. కనుక నాయనా ! విచార శూన్యుల మాటలను విని మహాత్ములు నీచకులమందు జన్మించినవారలైనను ఆదరించనిచో ఘోర నరకము తప్పదు. కరుణానిధియగు భగవంతుడు తన భక్తులు ఏకులమందు జన్మించిన వారలైనను

పూజార్హులనియు, వారి మనస్సు నొప్పిచేసిన వారిని శిక్షింపక మాననవియు చాటించి యున్నారు.

మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యే నరాః ।
పద్మకోటిశతేనాపి న క్షమామి వసుంధరే ॥

## జనన రహస్యము

ప్రశ్న ॥ ఓస్వామీ! నన్ను పరమభక్తు డొక్కడు ఇట్లడిగెను. అదేమన అతడు బొందిలవారి కులమున జన్మించిన వాడనియు, బుద్ధి వచ్చుటకు ముందుగా మాంసాది వస్తువులు తినుచుండిన వాడనియు, వారి తల్లి తండ్రులు ఇప్పుడును మాంసాది వస్తువులు భుజించుచుండు వారనియు, అతనికి బుద్ధి వచ్చిన తర్వాత మాంసాది నీచ వస్తువులు తినుట పాపకరమనియు, నీచ జన్మము గలవారు భుజింతురు గాని ఉత్తములకు సరిగాదనియు, అది తినుటలో మనస్సు నిండా క్రూరస్వభావముగ నుండుటయేగాక మనబోటి జీవముగల ఆ సాధుజంతువుల యొక్క ప్రాణము తీయుట బహు సంకట కరమనియు జన్మాంతర పుణ్యవశముచే తెలివి గలిగి ఆలాటి నీచాహారము తినక, బహు రుచికర మైనదియు, బుద్ధి వికాసము చేయునదియు, జితేంద్రియత్వము సిద్ధించు నదియు, ఏయొక్క పాపము లేనిదియు, సులభముగా దొరకునదియు నగు శాకాదివస్తువులను భుజించుకొని పరమాత్మధ్యానము, జపము భక్తి చేయుచుండెను. ఇతడు ఈలాగున భక్తిమార్గమున నుండుటను జూచి క్రూరస్వభావము గలవానియొక్క తండ్రి బహువిధ బాధల పెట్టినను, తనధర్మబుద్ధిని విడువక ధ్యాననిష్ఠను అనుష్ఠించుచునే వచ్చెను. వీనియొక్క భక్తి శుక్లపక్ష చంద్రునివలె వృద్ధియగుటజూచి తండ్రి సహింప జాలక, ఈలాగున ఒక్క దురాలోచన చేసెను. అదేమన ? పతివ్రతా శిరోమణియై ధర్మనిష్ఠయందుండు తన భార్యను బిలిచి ఇట్లు చెప్పెను. "నీకుమారుడు చెప్పిన మాటలు ఏమియున్ను వినువాడు కాదు. నాకు గలిగినవాడే కాడు. నాకు కలిగినవాడైనచో నాస్వభావమే యుండవలయును గదా. నేనున్ను నీవున్ను మాంసాది మంచి ఆహారములు తినునప్పుడు, మనకు గలిగిన పుత్రుడైనచో ఏల తినడు ? కనుక నీవు వ్యభిచారిణివి. ఏదో సాధువులకు

గలిగినవాడు వీడు. కనుక కుమారునిచే మన భోజనము తినునట్లు చేయించినచో మన కుమారుడే. లేనిచో వ్యభిచారిణివగు నిన్ను చంపెదనని'' అజ్ఞాపించెను. చింత చెట్టు కాయ పులుపగునే గాని చీనీపండువలె తీపు ఎట్లగును. ఇదే దృష్టాంతము. జాగ్రతగానుండుమని భయపెట్టెను.

అప్పుడు సాధ్వియగు తన భార్య భయపడి కుమారునితో ఇట్లు దుఃఖాక్రాంతురాలై చెప్పెను. ''నాయనా ! నేను పరపురుషుని జూచిన దానను కాను. నీవు గలుగుటచే ఈలాటి పాపవాక్యము వినుటకు కారణమైనది. మీ తండ్రి నన్ను జీవముతో నుంచరు. నీవు మాతృహత్యకు కారణమై పుట్టినవాడ వయ్యెదవు,'' ''మాతృదేవోభవ'' ''పితృదేవో భవ'' అని వేదము చెప్పుచుండగా నీవు నన్ను బాధపెట్టి ఏగతి పొంద గలుగుదువో'' యనెను. తల్లి చెప్పిన మాటలు విని, భక్తుడగు కుమారుడు నిండా భయభ్రాంతుడై ఏమియు తెలియక ఇట్లు చెప్పెను. మాతృవాక్య పరిపాలనము చేయనిచో మాతృహత్య తటస్థించును, మాతృ ఆజ్ఞ పాలించినచో తననిష్ఠకు భ్రష్టత్వము కలుగును. కనుక ఈధర్మ సంకటమందు ఎట్లుండవలయునో దానిని సెలవియ్యవలయును.

ఉత్తరము ॥ ఓ సాధువగు ప్రియసోదరా ! ఇదిన్నీ మంచి ప్రశ్నయే, కనుక లోకోపకారము. ఇచ్చట జీవదేహముల విచారము చేసినచో ఈ సంశయము నివృత్తి యగును. వాని తండ్రి కేవలము బుద్ధిహీనుడు. శరీరమే ఆత్మ యను పాపపుతలంపు గలవాడు. తల్లిగాని, తండ్రిగాని, గురువుగాని, ఆఖరుకు ఈశ్వరుడుగాని అజ్ఞాపించినను ధర్మముతో గూడినది మాత్రమే అనుష్ఠింపందగినది గాని, అధర్మమైనచో వారిని గూడ విడువ వచ్చును. దీనిలో ఏలాటి దోషమున్ను లేదు. ఉత్తములగు తల్లి, తండ్రి, గురువైనచో, కుమారుని శ్రేయస్సును కోరుదురే గాని దుఃఖమునకు కారణమగు పాపకార్యమును కోరుదురా? దీనికి శ్రీ ప్రహ్లాదుడే సాక్షి. భగవన్నామోచ్చారణము చేసి జన్మ సాఫల్యము పొందుటలో అతడు తల్లి, తండ్రి, గురువులను గూడ విడువలేదా ? మరియు విభీషణుడు తన వంశమంతయును నాశము చేయుటకై శ్రీరామపరమాత్మకు సహాయపడెను. తల్లిదండ్రులు దొంగపని చేయుటకై చెప్పిన అట్లు చేయుట నీతియా ? తల్లిదండ్రులకు శుశ్రూష చేయుట పుత్రుల ముఖ్యధర్మము. ధర్మ సంబంధమగు

ఏపని చెప్పినను అవశ్యముగ చేసి వారిని తృప్తి పఱచుట పుత్రుల ప్రధానకర్తవ్య మేగాని, అధర్మము చేయ నక్కఱలేదు. పైతండ్రిచెప్పిన చింతకాయ దృష్టాంతము సరిగాదు. చింతకాయ చింతచెట్టు అంశ మైనది. సరియే గాని ఆలాగుననే తల్లితండ్రుల అంశము శరీరమే గాని జీవుడు శరీర విలక్షణుడు. ఈలాటి ఎన్నో జన్మములు ఎత్తినవాడు. మనుష్యునియొక్క సుకృత దుష్కృత గుణములు జీవునియందుండునే గాని శరీరమందుండవు.

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।**
**తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి ॥**

దేహమునకు విలక్షణుడు జీవుడను సంగతి పసిబిడ్డలకు గూడ దెలిసిన విషయము. కనుక దీనికి శాస్త్ర మనావశ్యకము. మరియు తండ్రిగూడ మాతృహత్య చేయమనే చేయడు. వీని నిష్ఠను భంగపఱచుటకై చెప్పి భయపెట్టియుండునేగాని వారికి మాత్రము తెలియదా ? వారు సంసార తాపత్రయముచే పుత్రుడు సంసార మంతయును విడిచి విరాగియై ఎచటకైనను వెళ్ళిపోవునేమో అను సంశయముచే అట్లు చెప్పియుండవచ్చును. లేక తల్లి దండ్రుల అంశమే పుత్రుని శరీరముగాన, జీవు డనాదిగ వచ్చి వానివాని సుకృతదుష్కృతము ననుసరించి ఈ లోకమునందు ప్రవేశించును గాని, తల్లిదండ్రుల స్వభావ ముండవలసిన పని లేదు. ప్రహ్లాదు డసురకులమందు జన్మించినను మహాభాగవతోత్తముడైనది తల్లియొక్క వ్యభిచార దోషమని ఎవ్వరైనను తలంచుదురా ? ఇప్పుడు గూడ పండితుల కుమారులు పామరులు గాను, పామరులగు తల్లి దండ్రుల పుత్రులు పండితులుగానున్నారు. దరిద్రుడగు తండ్రి పుత్రుడు ధనవంతుడును, ధనవంతునికుమారుడు దరిద్రుడును, జ్ఞానవంతుడగు తండ్రి పుత్రుడు జ్ఞానహీనుడును, జ్ఞానహీనుడగు తండ్రి కుమారుడు మహాజ్ఞానియును అగుట సంభవించుచున్నది. గ్రుడ్డిముగ వార్లకు సొంగులగు పుత్రులును, సొంగులగువారికి అంగహీనులగు పుత్రులును జన్మించుట అందరున్ను ఎఱింగిన విషయమే. అట్లు జన్మించుటలో తల్లియొక్క వ్యభిచారదోష మని తలంచువార లెవ్వరైనను గలరా ? లేదుగదా ? కనుక శరీర విలక్షణుడే జీవుడనుటకు ఇదే దృష్టాంతము. అట్లు జన్మించుట పూర్వ

జన్మఋణానుబంధము ననుసరించి యుండును. స్వప్నావస్థయందు శరీరము జడముగా పడియుండినను, అనేక స్థలములయందు సంచరించి అనేక విధములగు సుఖదుఃఖముల ననుభవించునట్లుండువాడు వాడు ఈశరీరమందు గనుపించుట నిదర్శనము. తల్లి దండ్రుల అంశమనుటకు చింతచెట్టు నిదర్శనమైనచో చింతచెట్టు ముదిరి భూమియందు లయించి పోవునట్లు మానవుడు గూడనట్లైనచో పుణ్య పాపకర్మఫల మెవ్వ రనుభవింతురు ? ఇట్లు చెప్పుట శాస్త్రవిరుద్ధము. కనుక శాస్త్రవిరుద్ధ మెప్పటికిని చేయరాదు. శాస్త్రము దైవనియమము. శరీరముతో కష్టపడి ధర్మమార్గముతో తల్లిదండ్రుల సేవచేయుట మహా ఫలము. తల్లి దండ్రుల అనుగ్రహము పొందనివాడు ఇహసుఖముగాని, పరసుఖముగాని పొందక దుఃఖసాగరమందు మునిగి దుఃఖపడును. కనుక తల్లిదండ్రులకు నొప్పి గలుగజేయరాదు. పైచెప్పిన దానియొక్క అర్థమును సరిగా గ్రహించకపోయినచో ప్రమాదమునకు కారణమగుటయే గాక జన్మము గూడ వ్యర్థమగును.

> భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేన చ।
> సేతుస్నాన శతైర్యచ్చ తత్ఫలం మాతృవందనే ॥

## మోక్షమునకు శాస్త్రము మాత్రము చాలదు

ప్రశ్న ॥ శాస్త్రజ్ఞానము లేనివారికి మోక్షము దొరకదని పండితులు గర్వించి శాస్త్రజ్ఞానము లేని పరమభక్తులను భయపెట్టుచుండు సంగతి నిజమా?

ఉత్తరము ॥ శాస్త్రజ్ఞాన ముత్తములకు మోక్షము కొరకు కొంచెము సహాయము చేయవచ్చునుగాని, గర్వులకు ఆ శాస్త్రము అస్త్రమువలె బాధాకరమే. ముక్తినొందుటలో జ్ఞానమే ప్రధానము. ఈజ్ఞానము జన్మాంతర సుకృతముచే మహాత్ముల అనుగ్రహము కలిగి సిద్ధింపవలయును. శాస్త్రము లేనివారికి మోక్షము లేదని చెప్పువారు వైద్యశాస్త్ర పాండిత్యము లేనివారి కౌషధము సేవించినను రోగశాంతి కానేరదనియు, వైద్యశాస్త్రము జదివిన వారికి ఔషధపథ్యములు లేకుండినను రోగశాంతి గలుగునని చెప్పినచో, ఎవరు నమ్మెదురో వారితో చెప్పవలసిన సంగతి. మోక్షమునకు చదివిన వారున్ను, చదవనివారున్ను

సమానాధికారులే ఈసంగతిలో చదువనగా పుస్తకముల జదువుట యను నర్థము గాదు. ముక్తికొరకు మనోనిర్మలతయే ముఖ్యకారణము. సమస్త శాస్త్రముల జదివినను. అగ్రజన్మమందు జన్మించినవారైనను మనో నిర్మలత్వము లేనిచో ప్రయోజనము లేదు. అనగా ఉత్కృష్టకులమందు జన్మించి వేద వేదాంగములు జదివిన వాడొక్కడు, ఏమియున్ను శాస్త్రము జదువని అంత్యజాతియందు పుట్టిన వాడొక్కడు, వీరిద్దరికిని ఒకే విధమగు మేహజాడ్యము కలిగియుండెను. ఆవ్యాధి నివారణకొరకగ్రజాతియందు జన్మించి సమస్త శాస్త్రములను చదివినవాడైనను, మందు తిని పథ్యము లేనిచో రోగము గుదురునా ? అంత్యజాతియందు జన్మించి చదువులేనివాడైనను ఔషధపథ్యములతో గూడియుండినచో రోగశాంతి లేకుండ పోవునా ? కనుక అజ్ఞాన రోగముచే పీడితుడైన వానికి బ్రహ్మనిష్ఠ యను ఔషధము, శమదమాది గుణములను పథ్యమే కావలయును గాని మరేమియు ఆవశ్యకము లేదు. ఇవి లేనిచో తక్కిన దంతయును ఈ బ్రహ్మనిష్ఠ కుపయోగపడదు. బ్రహ్మజ్ఞానము చదివితే వచ్చునది కానేరదు. అది హృదయమునం దుదయించిన తర్వాత శాస్త్రములు ఆ హృదయమునుండి కరిగి బయటవచ్చు సారము. శాస్త్రము జదివిన జ్ఞానము గలుగునని చెప్పువారు ఆ సంగతి నెరుంగనే యెరుంగరు. శాస్త్రము జదివిన జ్ఞానము కలుగుచో, శ్రీ శంకరాచార్యులవారున్ను, శ్రీ రామానుజాచార్యులవారున్ను, శ్రీ మధ్వాచార్యులవారున్ను, శ్రీ బుద్ధదేవులున్ను, శ్రీ క్రీస్తు దేవులున్ను, శ్రీమహమ్మదునబిగారున్ను, శ్రీగురునానక్ వారున్ను, శ్రీరామకృష్ణ పరమహంసలవారున్ను వచించిన గ్రంథములను చదివి నేటివరకు ఎవరైనను ఉదాహరించిన వారి స్థితిని జెందలేదు కదా ! మరియు విద్య యను మాటకర్థము, గ్రంథములు జదువుట గాదని శ్రీకృపానిధియగు వాసుదేవులు గీతయందుపదేశించిరి. ''అధ్యాత్మవిద్యా విద్యానామ్'' అనగా విద్యలలో ఆత్మవిద్యయే విద్య యగును. మరియు ఉపనిషత్తులు గూడ నిట్లు చెప్పుచున్నని.

అనేకాని చ శాస్త్రాణి స్వల్పాయు ర్విఘ్నకోటయః ।
తస్మాత్సారం విజానీయాత్ హంసః క్షీరమివాంభసి ॥

శాస్త్రము లనంతములు, ఆయుస్సో అత్యల్పము. దీనిలో, కోట్లకొలది

విఘ్నములు, కనుక శాస్త్రసారము మహాత్ములను ఆశ్రయించి గ్రహించతగినది. ఎట్లన, రాజహంసము నీళ్ళును, పాలును ఒకటిగా కలిసియున్నను నీటినుండి క్షీరమును మాత్రము గ్రహించునట్లు సారమును గ్రహింపవలయును.

**అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః ।**
**బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీ పాకరసం యథా ॥**

నాల్గువేదముల జదివినను, సమస్త ధర్మశాస్త్రములను చూచినను, బ్రహ్మతత్త్వము సద్గురుని ప్రాపించి తెలుసుకొనక పోయినచో, వాడనేక పక్వాన్నాదులలో తిరుగుచు అందలి రుచి తెలుసుకొనజాలని గరిటెకు సమానమే.

**బహుశాస్త్రకథాకంథారోమంథేన వృథైవ కిమ్ ।**
**అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతరమ్ ॥**

అనేక శాస్త్రములను మాటిమాటికి పాఠ ప్రవచనముల చేత నావృత్తిచేసినందున ప్రయోజన మేమియును లేదు. తత్త్వజ్ఞులగు సత్పురుషులచే తన హృదయ పుండరీకమందుండు స్వప్రకాశస్వరూపమైన పరబ్రహ్మము ప్రయత్నపూర్వకముగా దెలుసుకోదగియున్నది.

**సపురాణాన్ పంచవేదాన్ శాస్త్రాణి వివిధాని చ ।**
**జ్ఞాత్వాప్యనాత్మవిత్త్వేన నారదోఽతిశుశోచ హ ॥**

శ్రీ నారదమహర్షులు సర్వ పురాణములను, పంచవేదములను, తర్క వ్యాకరణాది సమస్త శాస్త్రములను జదివియు ఆత్మజ్ఞానము గలుగని కారణముచే అధిక దుఃఖమును పొందినవారైరి. అనగా శాస్త్రమును అభ్యాసము చేసినను తాపత్రయాది దుఃఖములు పూర్వాధికముగా వృద్ధి యయ్యెను.

**వేదాభ్యాసాత్పురా తాపత్రయమాత్రేణ శోకితః ।**
**పశ్చాత్త్వభ్యాసవిస్మారభంగగర్వైశ్చ శోకితః ॥**

ఆ నారదుడు వేదముల నభ్యసించుటకు ముందుగా తాపత్రయముల చేత మాత్రము దుఃఖము గలవాడాయెను. వేద శాస్త్రములు జదివినపిమ్మట (1) వేదపాఠాద్యావర్తన చేతను (2) చదువబడిన దానిని మరచుటచేతను

(3)తనకన్న అధికునిచేత తిరస్కారము నొందుటచేతను (4) తనకన్న విద్యలేనివాని జూచునపుడు తాను గొప్పవాడనని అహంకారబుద్ధి గలుగుట చేతను దుఃఖ మత్యధిక మైనది. ఆశాస్త్రపాఠమునకు ముందు అజ్ఞానమనెడి దుఃఖమొకటి మాత్రమే యుండెను. తరువాత మూడు దుఃఖములధిక మైనవని భావము. పుట్టెడు పొట్టు దంచినను, చిట్టెడు గట్టిగింజలు దొరకవను న్యాయమురీతిగా శాస్త్రాభ్యాసముచే గర్వ మధికరించి నశించునని అర్థము. (దీనిని తుషావఘాత న్యాయమని చెప్పుదురు) అని పంచదశి.

**అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రా ధీతిస్తు నిష్ఫలా ।**
**విజ్ఞాతేఽపి పరే తత్త్వ శాస్త్రాధీతిస్తు నిష్ఫలా ॥**

పరమాత్మానుభవము తెలియరాని వానికి శాస్త్రాభ్యాసము నిష్ప్రయోజనము. ఆలాగున పరమాత్మానుభవము గలిగిన వానికిగూడ శాస్త్రాభ్యాసము నిష్ప్రయోజనమని శ్రీశంకరాచార్యుల వారు చెప్పిరి. విద్యాగర్వముచే నెట్లు పాపము సంభవించునో దానిని వినుము. విద్యలేనివాడు మహాజ్ఞానిగా నుండినను, జ్ఞానహీనుడు విద్యావంతుడైనచో ఆ మహాత్ముని కుతర్క వాదముచేత తిరస్కరించును. అపుడు ఆ మహనీయుని మనస్సు నొప్పినొందినచో, ఘోర పాపము గదా ? ఉక్కు ఉలిచే బంగారమును తునకలు తునకలుగా నరుకవచ్చునేగాని, బంగారు ఉలిచే ఉక్కు నరుకబడదు గదా ? లేక వ్యాఘ్రముచే గోవు హత మగునేగాని ఆవుచే పులి చంపబడునా ? లేదుగదా ? ఈలాగుననే క్రూరులగు కుతర్కవాదులు మహనీయులను వివాదముచే జయించినను, సద్బుద్ధులగు బుద్ధిశాలురు సత్యాసత్య మెరుంగ గలరు. కనుక శాస్త్రవాదముచే జయము నొందుట గొప్పతనము కాదు. అనుభవమే గొప్పతనము. ఒక్క మూగవాడు పంచభక్ష్య, పంచామృత, పరమాన్నాదులచే తృప్తుడైయుండినను యితరులకు చెప్పుటకు సాధ్యములేని కారణముచే వాడు పంచామృతాది, వస్తువుల రుచి తెలియనివాడనియు, ఆకలిచే తపించువాడనియు, నెంచుట యెంత తెలివిలేని తనమో ఆరీతిగా మహాత్ము లనుభవముచే బ్రహ్మానంద మగ్నులై ఆనందభరితులై యుండినను శాస్త్రాభ్యాసము లేని కారణముచే, వివాదము చేయుటకు శక్తిలేనప్పటికిన్ని తన అనుభవమునకు యేలాటి హాని యుండదు. వారు జీవన్ముక్తులు.

**అన్యవిద్యాపరిజ్ఞానమవశ్యం నశ్వరం భవేత్।**
**బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మ ప్రాప్తికరం భవేత్॥**

ఎంత కష్టపడి చదివినను బ్రహ్మవిద్య కన్యమైన చదువు తన పొట్టకొరకే. ఈశరీరావసానముతో గూడ ఆ విద్యయున్ను వ్యుతి నొందును. బ్రహ్మవిద్యమాత్రమే శరీరముతోగూడి యుండునప్పుడును, శరీర పతనానంతరమున్ను ఉపయోగ కరమైనది. ఆ బ్రహ్మవిద్యమాత్రమే దుఃఖ నివృత్తికిన్ని, ఆనందప్రాప్తికిన్ని కారణ భూతము అని శుకరహస్యోపనిషత్తు, విద్యయను శబ్దమునకు అవిద్యను నాశము జేసెడి జ్ఞానమని అర్థము. విద్య చదివియు ఈ జ్ఞానము లేనివాడు నిరక్షరకుక్షి యనియు, విద్యాభ్యాసము లేనప్పటికిని అధ్యాత్మజ్ఞానము గలిగినవారు వేదవేదాంతములు చదివిన వారనియు మరువకుడు.

**ఇదం జ్ఞానమిదం జ్ఞేయం యత్సర్వం జ్ఞాతుమిచ్ఛతి।**
**అపి వర్ష సహస్రాయుః శాస్త్రాంతం నాధిగచ్ఛతి॥**

ఇది జ్ఞానము, ఇది జ్ఞేయము అని యిట్లు సమస్త శాస్త్రములను తెలిసి కొనుటకై ప్రయత్నించినచో, వేయి సంవత్సరములైనను చాలదు. అనగా శాస్త్రమంతయును జదివి సారము గ్రహించుటకై వేయి జన్మము లెత్తినను సాధ్యము గాదు. మన జీవితము స్వల్పకాలము. దానిలో అనేక విఘ్నములు. దానిలో మిగిలియుండు అత్యల్పమగు జీవితకాలము వ్యర్థము చేయక పరమాత్మ తత్త్వమెరింగి ముక్తు డగుటకై ప్రయత్నించ వలెనని శ్రీ కృష్ణస్వామి ఉత్తర గీతయం దుపదేశించిరి.

**విజ్ఞేయోఽక్షర సన్మాత్రో జీవితం చాపి చంచలమ్।**
**విహాయ సర్వశాస్త్రాణి యత్సత్యం తదుపాస్యతామ్॥**

సమస్త శాస్త్రములను విడిచి సత్తామాత్రమైన, అక్షర పరబ్రహ్మము అతిత్వరలో గ్రహింపందగినది. జీవితమో నీటిపై బుగ్గవలె క్షణభంగురము కనుక సత్యమై, నిత్యమై, ఆనంద ఘనమైన బ్రహ్మము నుపాసింపవలెను.

అతివేగముగా, విషయాశయ యను మహాపాశమునుండి, ఎవ్వడు ముక్తుడగునో, వాడొక్కడు మాత్రము మోక్షార్హుడు గాని ఇతరుడు షట్ఛాస్త్రవేత్త యైనను, విషయాసక్తి విడువనిచో ముక్తుడు గానే కాడు. ఇట్లు చెప్పుటచే విద్య అవసరము లేదని భావము కాదు. విద్యాభ్యాస మవశ్య ముండవలయును. లేనిచో శాస్త్రమందుండు సారము గనిపెట్టుట కష్టము.

**విద్యానామ నరస్య రూపమధికం, ప్రచ్ఛన్నగుప్తం ధనం**
**విద్యా భోగకరీ యశఃసుఖకరీ విద్యా గురూణాం గురుః ।**
**విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా**
**విద్యా రాజసు పూజ్యతే న హి ధనం విద్యావిహీనః పశుః ॥**

మానవున కన్ని రూపముల కంటె విద్య అతిమనోహర మగు సౌందర్యము. అది దొంగలచే అపహరింపబడని ధనము. దానము చేయగా చేయగా అంతకంతకు వృద్ధియగు ధనము. విద్య అన్ని భోగములను ఇచ్చునది. యశస్సును, సుఖము నొసంగునది. విద్య గురువులకు గురువు. విదేశ గమన మందు విద్య బంధువులవలె సహాయము చేయునది. విద్య అన్ని దేవతల కంటే గొప్ప దేవత. విద్య రాజులచే పూజింపంబడినది. ఈధనము ధనము కాదు. విద్యాధనమే ధనము. విద్య లేనివాడు పశువుతో సమానుడు అని శ్రీభర్తృహరి నుడివిరి.

**శునః పుచ్ఛమివ వ్యర్థం జీవితం విద్యయా వినా ।**
**న గోపయతి గోప్యాంగం న వారయతి మక్షికాః ॥**

విద్య లేని మానవజన్మము కుక్కతోకవలె వ్యర్థము. అనగా కుక్కతోక దానియొక్క మర్మస్థానము కప్పియుంచుటకున్ను, దేహమందు బాధించెడు ఈగలను తోలుటకును ఉపయోగపడదు. ఇతర జంతువుల తోకలు ఈగల తొలగించుటకును, గోప్యస్థలమును కప్పియుంచుటకును ఉపయోగపడును. కనుక విద్య లేనివాడు కేవలము భారమే గాని యుపయోగపడడు.

**గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।**
**పలాలమివ ధాన్యార్థీ త్యజేత్ గ్రంథమశేషతః ॥**

బుద్ధిమంతుడు శాస్త్రాభ్యాసము చేసి జ్ఞానవిజ్ఞాన తత్పరుడై కర్షకుడు ధాన్యమును త్రొక్కించి తీసుకొన్న తరువాత గడ్డిని పారవేయునట్లు, శాస్త్రముయొక్క సారమును గ్రహించిన తరువాత శాస్త్రబుద్ధి విడువవలయును. అనగా చెరుకుతోటవాడు చెరకు నాడించి సారము తీసికొనిన తరువాత పిప్పిని పారవేయునట్లు, శాస్త్రసారమును గ్రహించి పరమాత్మధ్యానమందుండుటకై శాస్త్రవిచారము కూడ విడువవలయును, లేనిచో శాస్త్రవాసన ప్రతిబంధమగును.

**ఉల్కాహస్తో యథా కశ్చిత్ ద్రవ్యమాలోక్య తాం త్యజేత్।**
**జ్ఞానేన జ్ఞేయమాలోక్య జ్ఞానం పశ్చాత్ పరిత్యజేత్॥**

మేధావి యగువాడు శాస్త్రము జదివి జ్ఞానముచే జ్ఞేయమగు పరబ్రహ్మము నెరింగిన తరువాత ఆ శాస్త్ర విచారము కూడ విడువవలయును. ఎట్లన ? చీకటిగదియందుండు వస్తువును దీపము చేతపట్టుకొనిపోయి తీసుకొన్న తరువాత దీపమును గూడ విడుచునట్లుండవలెనని భావము.

**నావార్థీహి భవేత్తావత్ యావత్ పారం న గచ్ఛతి।**
**ఉత్తీర్ణేతు సరిత్పారే నావా కిం వా ప్రయోజనమ్॥**

నదిని దాటుట కభిలాషగలవాడు ఆవలయొడ్డు చేరు పర్యంతము పడవను ఎట్లు కాపాడునో, ఆరీతిగా సంసారసాగరము దాటుపర్యంతము శాస్త్రవిచారమను పడవను విడువక కాపాడవలెను. దాటిన తరువాత పడవ అవశ్యము లేదని శ్రీవాసుదేవు లుత్తరగీతయం దుపదేశించిరి.

హరిః ఓమ్.

## సర్వసంగ్రహము

జ్ఞానులు విధి ననుసరించుట :- ఓ జితేంద్రియుడవగు సోదరుడా! ఈ విషయము కొంచెము సావధానముగ వినుము.

**ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి ద్వివిధం పౌరుషం స్మృతమ్।**
**తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్॥**

పురుషుల ప్రయత్నము, శాస్త్రీయ మనియు, అశాస్త్రీయ మనియు రెండుతెగలు. వాటిలో అశాస్త్రీయము నరకమునకు మార్గము, శాస్త్రీయము మోక్షమునకు కారణమని శ్రీ వసిష్ఠ లుపదేశించిరి. ఈతీరున గీతయందు కూడ శ్రీకృష్ణభగవంతు లుపదేశించిరి.

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।**
**న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

ఎవడు శాస్త్రమునందు చెప్పబడిన విధుల నతిక్రమించి యథేచ్ఛగా, సోమరియై సంచరించునో వాడు తత్త్వజ్ఞాన మొందడు, స్వర్గఫలమును గూడ ననుభవింపడు. ఇహలోక సుఖము గూడ పొందలేడు. మరి యేమన నరకమందే ప్రవేశించును. యథేష్టాచరణయనగా సాధువులైనవారలు జితేంద్రియత్వము నొందక కేవలము పైశాచిక వృత్తియగు మద్యమాంసాదులను భుజించి మదోన్మత్తులై దానిచే దోషములు లేవని పుణ్యపురుషులతో వాదించుట.

**సర్వే బ్రహ్మ వదిష్యంతి సంప్రాప్తే తు కలౌ యుగే।**
**నానుతిష్ఠంతి మైత్రేయ ! శిశ్నోదరపరాయణాః ॥**

ఓ మైత్రేయుడా ! కలియుగము ప్రబల మగునప్పు డందరున్ను వేదాంతు లగుదురు. సర్వదా అచలభావమగు బ్రహ్మభావమే చెప్పుదురు. బ్రహ్మనిష్ఠులు చేయవలసిన అనుష్ఠాన నిష్ఠాదులు కొంచెమైనను చేయరు. మరియు నెట్లుందురనగా, శిశ్నోదర పరాయణులై ప్రబలముగ తిరుగుదు రని పరాశరవచనము.

**సుఖమిచ్ఛంతి యే మూఢాః నేచ్ఛంతి సుఖ కారణమ్।**
**నేచ్ఛంతి దుఃఖలేశం వా తద్ధేతోస్సతతం యతాః ॥**

వివేకశూన్యులగు జనులు సుఖమునే సర్వదా కోరుచుందురు. కాని సుఖమెట్లు కలుగునో, దాని కారణమును విచారణ చేయరు. దుఃఖమొక్క లేశమైనను కోరరు గాని దుఃఖకారణమగు పాప కర్మము మాత్రము తన శక్తికి మిగిలినంత చేయుదురు. ఆహా ! ఏమి ఆశ్చర్యము. చీనీపండ్లు దినుట కభిలాషగల్గి ముష్టివిత్తనము పెట్టుచున్నారు. గంగాస్నానము చేయుటకై కాశికిపోవలెనన్న

అభిలాషతో దిగ్భ్రమగలిగి దక్షిణమునకు వేగముగ నడచుచున్నారు. దిగ్భ్రమ మనగా కొండలమధ్యయందు పోవువారికి, తూర్పు పడమరగాను, ఉత్తరము దక్షిణముగాను దోచుట అని వాసిష్ఠము.

**పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః ।**
**న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః ॥**

మానవులు, పుణ్యఫలమగు సుఖమునే కోరుచుందురు. కాని పుణ్య కారణమగు పని యేమిన్ని చేయరు. పాపఫలమగు దుఃఖము నొక్కరైనను ఆశింపరు. కాని ప్రయత్నపూర్వకముగా పాపకార్యము విశేషముగ చేయుదురు. ఆహా ! ఏమి ఆశ్చర్యము. ఇది యిప్పుడు దృష్టాంతము గదా ? కర్తలు గురుపుత్రులే. విచారమా పరమ పవిత్రమగు మోక్షముకొరకే, కాని, గురు ఆరాధనయందు చేయు కృత్యములు మాత్రము ఘోరనరకమునకు కారణమగు ప్రాణిహింసయు, అసురులు సేవించెడి దోషకరమగు మద్యపానమున్ను.

**బోధాదూర్ధ్వం చ తద్ధ్యేయం జీవన్ముక్తి ప్రసిద్ధయే ।**
**కామాదిక్లేశ బద్ధేన యుక్తస్య న హి ముక్తతా ॥**

బ్రహ్మనిష్ఠాబలముచే తత్త్వబోధమగు బ్రహ్మజ్ఞానము కలిగిన పిమ్మట గూడ, జీవన్ముక్తి దృఢపడుటకొరకు మరల మరల బ్రహ్మచింతనము తదేకధ్యాన మవశ్యముగా జేయవలెను. రాగద్వేషములు, నికృష్ట భోజనములందభిలాష మొదలగు విషయా సక్తితోగూడిన మనస్సు గలవానికి పైబ్రహ్మబోధము కృష్ణపక్ష చంద్రునివలె క్షీణించి ముక్తి సిద్ధింపక బద్ధుడగు నని శ్రీవిద్యారణ్య గురుండు పంచ దశియందు చెప్పెను.

**తత్త్వం బుధ్వాపి కామాదీ౯ నిశ్శేషం న జహాసి చేత్ ।**
**యథేష్టాచరణం తే స్యాద్ధర్మశాస్త్రాతిలంఘినః॥**

బ్రహ్మనిష్ఠుడు పరతత్త్వము నెరింగియు ( బ్రహ్మబోధ కలిగినను) విషయాసక్తి, కామక్రోధాదులను నిశ్శేషముగ విడువకుండెనేని, ధర్మ శాస్త్రము నతిక్రమించిన కారణముచే జ్ఞానభ్రష్టుడై, స్వేచ్ఛాప్రవర్తనము గలుగును. అనగా

బ్రహ్మవేత్తయని అహంకారము గలిగి విధి నిషేధరూపమగు ధర్మశాస్త్ర మతిక్రమించి కామాది విషయములకు లోనై చెడిపోవును. కనుక యథేష్టాచరణము కూడనే కూడదు. అట్టి యథేష్టాచరణము ధూర్తలక్షణ మని అర్థము. కనుక నిశ్శేషముగ వాసనారాహిత్యము గలవాడై యుండవలెను.

సుబుద్ధాద్వైత తత్త్వస్య యథేష్టాచరణం యది ।
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచిభక్షణే ॥

అద్వైత పరబ్రహ్మజ్ఞానవేత్త స్వేచ్ఛాచరణము గలిగి విధి నిషేధముల నతిక్రమించి మద్యమాంసాది భక్షకుడైనచో కుక్కకును, పరమ పావనుడగు మహాత్మునకును ఏమి భేదము ? అనగా మహాత్ములు ఆలాటి నికృష్టమైన పని చేయరని శ్రీ సురేశ్వరాచార్యులు వేదాంత వార్తికమందు వ్రాసిరి.

తితిక్షా జ్ఞాన వైరాగ్య శమాది గుణవర్జితః ।
భిక్షామాత్రేణ యో జీవేత్ స పాపీ యతివృత్తిహా ॥

ఎవడు ఇంద్రియాది నిరోధము, జ్ఞానము, విషయ వైరాగ్యము, శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము మొదలుగాగల సద్గుణములు లేనివాడై పెద్దలమని పేరుజెప్పి నీచాచారముతో జీవించునో, ఆమహాపాపి మహాత్ముల మార్గమును ఆక్షేపించిన వాడైన కారణముచే ఘోరనరకమందు పతితు డగునని ఉపనిషద్వాణి.

యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।
తదైవ సన్న్యసేద్విద్వానన్యథా పతితో భవేత్ ॥

ఏ సమయమున ఇంద్రియాది సమస్తవస్తువులయందు సంపూర్ణ వైరాగ్యము గలుగునో, అప్పుడే సన్న్యసింపవలయును. (గృహము త్యజింపవలెను) విషయవిరక్తి సంపూర్ణముగా లేనిచో, సన్న్యసించిన తరువాత విషయవాసన గలిగినచో, అధోగతికి పాత్రు డగును అని ఆత్మబోధోపనిషత్తు.

వాసనాయాస్తథావహ్నే ఋణవ్యాధిద్విషామపి ।
స్నేహవైరవిషాణాం చ శేషః స్వల్పోఽపి బాధతే ॥

విషయవాసన, అగ్ని, అప్పు, వ్యాధి, శత్రువు, పుత్ర కళత్రాదు లందు ప్రేమ, ఇతరులయందు విరోధము. విషము - ఇవి కించిత్ మిగిలి యుండినచో క్రమముగా వృద్ధియై బాధించును. అనగా ఇల్లుగాని, అడవిగాని దహించునపుడు నిప్పును చల్లార్చినను ఒక్కరవ్వ మిగిలియుండినచో, మరల గాలిచే వృద్ధియై అంతయున్ను దహించును. ఆలాగుననే బ్రహ్మనిష్ఠుని హృదయమున కొంచెమైనను విషయవాసన యుండినచో, ప్రపంచ జన సంసర్గమను గాలిచే వృద్ధియై సంపాదించిన జ్ఞానమంతయున్ను నశించునని అన్నపూర్ణోపనిషత్తు.

ఒక్క చెరువునుండి జలము నిండుగ నుండునపుడు, సన్న ద్వారముతో నీరు పోవుచుండినచో వెంటనే ఆ ద్వారము ఆపవలయును. లేనిచో క్రమముగా వృద్ధియై చెరువుకట్టను తెంపి జలమంతయు పోవును గదా! ఆలాగుననే జ్ఞానామృతమను జలము హృదయమున నిండియుండినను విషయవాంఛ యను ద్వారము స్వల్పముండిన తత్క్షణము నివృత్తి చేయవలెను. లేనిచో నింతకాలము కష్టపడి సంపాదించిన దంతయును జారిపోవును.

**సూ ॥ ఆవృత్తి రసకృదుప దేశాత్ ॥**

అవిద్యకు నివృత్తిగలిగి ఆనందప్రాప్తిపర్యంతము విషయవాసన యుండినచో, మరల మరల మనన నిదిధ్యాసనాదుల నవశ్యముగా జేయవలయునని, వేదశాసనము గలదని శ్రీ వేదవ్యాస మహర్షి వేదాంత (బ్రహ్మ) సూత్రములో సూత్రించిరి.

**స్వశరీరే స్వయంజ్యోతిః స్వరూపం సర్వసాక్షిణమ్ ।**
**క్షీణదోషాః ప్రపశ్యంతి నేతరే మాయయావృతాః ॥**

తన హృదయమునందు, సర్వసాక్షియై, స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మను సమస్తదోషములు నశించిన బ్రహ్మనిష్ఠులు దర్శించుదురు. విషయ వాసన కించిత్తు గలవారికి ఆత్మదర్శనము సిద్ధించదు. నేత్రరోగము గలవారు ప్రకాశమానమైయుండు సూర్యుని దర్శించుదురా?

**అవాసనత్వాత్సతతం యదా న మనుతే మనః ।**
**అమనస్కా తథోదేతి పరమోపశమప్రదా ॥**

ఎప్పుడు సమస్త విషయవాసన నశించి మనసు విషయములను మననము చేయదో, అప్పుడు సమస్త దుఃఖరహితమైన, బ్రహ్మానంద ప్రాప్తియగు అమనస్కము ప్రకాశించునని అన్నపూర్ణోపనిషత్తు. వృత్తుల యొక్క సమూహమే మనస్సు అనబడును. ఆ వృత్తులు ఒక్కొక్కటి నశించినచో మనోనాశనము తనకు దానే కలుగును. ఇదే అమనస్కమనియు, అచలమనియు, మన రాజయోగులు జెప్పు గొప్పమెట్టు.

జన్మాంతరశతాభ్యస్తా మిథ్యా సంసారవాసనా ।
సా దినాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్ ॥

జీవులకు మిథ్యయను సంసార విషయవాసన అనేక శతవర్ష కాలముల నుండి ప్రవర్ధమానమై వచ్చుచున్నది. అది బహుదినాభ్యాస యోగధ్యానము లచే నశించునే గాని వేరుమార్గము లేదని ముక్తికోపనిషత్. ఇప్పుడు మన రాజయోగులు తారక, సాంఖ్యము లనావశ్యకము లనియు, అమనస్క మొకటియే చాలు ననియు చెప్పునప్పుడు ఆశ్చర్యము గలుగనివారు గలరా?

బ్రహ్మానందే నిమగ్నస్య విషయాశా న తద్భవేత్ ।
విషం దృష్ట్వాఽమృతం దృష్ట్వా విషం త్యజతి బుద్ధిమాన్ ॥

బ్రహ్మానందమందు మగ్నుడై అమృతమును చూచిన వాడు అమృతమును భుజింపక విషము ననుభవించునా ? ఆలాగున బుద్ధిమంతుడు విషయమందుగల విషమస్థితిని, ధ్యానమందుగల ఆనందామృతమును చూచిన పిమ్మట విషయమందు ప్రవర్తింపక జ్ఞానామృతమగు ధ్యానమునే చేయునుగాని, విషయములలో ప్రవర్తింపడు అని ఆత్మబోధోపనిషత్ .

ఊర్ధ్వబాహుర్వదామ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మామ్ ।
ధర్మాదర్థశ్చ కామశ్చ స ధర్మః కిం న సేవ్యతే ॥

నేను రెండు చేతులను పైకెత్తి చెప్పుచున్నాను. ధర్మ మార్గమున ప్రవర్తించెడివారికి చతుర్విధ పురుషార్థములు గలుగును. అధర్మ ప్రవృత్తియగు ప్రాణిహింస, మద్యపానము చేయువారికి నరక ప్రాప్తియే కలుగును. అయ్యో నా

మాటలు ఎవ్వరున్ను నమ్ముట లేదే. హా ! ఎంతకష్టము. జనులు ధర్మమును సేవించుట లేదని వేదవ్యాస మహర్షులు రెండు చేతులు పై కెత్తి దుఃఖముతో చాటించిరి.

**యథా నిరింధనో వహ్నిః స్వయమేవోపశామ్యతి ।**
**తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయ మేవోపశామ్యతి ॥**

ఏలాగున కట్టెలు నశించునపుడు అగ్ని స్వయముగా నశించునో ఆలాగున వృత్తులు నాశమవునప్పుడు మనస్సు తనకు దానే మాయమైపోవును.

**అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః ।**
**విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః ॥**

ఏలాగున మదించిన దుష్టయేనుగు అంకుశము వినా స్వాధీనపడదో, ఆలాగున విషయములలో ప్రవర్తమానమైయుండు మనస్సు వైరాగ్యపరమగు ధ్యాననిష్ఠాభ్యాసము వినా స్వాధీనపడదు. అనగా, మనోనిరోధమునకు వైరాగ్య పరమగు ధ్యానయోగమే ముఖ్యసహాయ మని భావము.

**ఉత్తమాం వృత్తిమాశ్రిత్య నీచవృత్తి సమాశ్రితః ।**
**ఆరూఢపతితో జ్ఞేయః సర్వకర్మ బహిష్కృతః ॥**

ఎవడు పరమపావన మగు బ్రహ్మనిష్ఠాది సద్వృత్తులను ఆశ్రయించి మరల నీచులవృత్తియగు మద్యమాంసాది భోజనపరుడై విషయలోలుడై యుండునో, వాడు ఆరూఢపతితుడని తెలియందగినది. మరియు వాడు సమస్త పుణ్యకర్మములనుండి బహిష్కారము చేయందగినవాడు. అనగా భ్రష్టుడని భావము.

**ఇంద్రియాణాం విచరతాం విషయేషు స్వభావతః ।**
**బలాదాహరణం తేషాం ప్రత్యాహార స్స ఉచ్యతే ॥**

ఇంద్రియములకు స్వభావముగా విషయములందు సంచరించుట నైజగుణము. ఆ యింద్రియములను ధ్యానబలమగు బుద్ధిచే ఆకర్షించి పరబ్రహ్మనిష్ఠయందు నిలుపుట ప్రత్యాహారమని పెద్దలు చెప్పుదురు.

**ఏకో విశుద్ధబోధోఽహమితి నిశ్చయవహ్నినా।**
**ప్రజ్వాల్యా జ్ఞానగహనం వీతశోకః సుఖీభవ॥**

మనోనిగ్రహము కొరకు కష్టావక్ర మునీశ్వరుడు జనకుల కిట్లుపదేశించెను. ఓ నాయనా ! నీవు ఏకమగు విశుద్ధబోధ రూపమను నిశ్చయమగు జ్ఞానాగ్నిచే అజ్ఞానారణ్యమును దహనము చేసి శోకరహితుడవై సుఖిగా నుండుదువుగాక! అని గ్రహించవలెను.

**యావన్నాధిగతం జ్ఞేయం యావత్ క్షీణా న చిత్తభూః।**
**యావత్తీర్ణో న సంసారస్తావన్నః కుశలం కుతః ?॥**

ఎంతకాలమువరకు జ్ఞేయ మగు బ్రహ్మతత్త్వము పొందబడలేదో, ఎంతవరకు చిత్తమందుండు వృత్తులు నశింపలేదో, ఎంతవరకు సంసార సాగరము దాటబడలేదో అంతవరకును ఒక్క ప్రాణికైనను సుఖము గలుగదు.

**శాస్త్రార్థైర్బుధ్యతే నాత్మా గురోర్వచనతో న చ।**
**బుధ్యతే స్వయమేవైష స్వబోధవశతస్స్వయమ్॥**

ఈ బ్రహ్మము బహువిధ శాస్త్రచర్చలవల్ల బొందుటకు సాధ్యము గాదు. మహాగురువుల యుపదేశముచే నైనను సిద్ధింపదు. మరియెట్లు సిద్ధించుననన, విషయవాసనా రహితమగు ప్రబోధ బుద్ధిగల వానికి మనశ్శూన్యమగు ధ్యానబలముచే స్వయముగ బోధకు వచ్చును. అనగా గొప్ప గురూపదేశ ముండినను అనేక శాస్త్రములు జదివినను, మనః పారిశుధ్యము లేనిచో జ్ఞానము గలుగదని భావము.

**ముక్తిస్తు బ్రహ్మణస్తత్త్వ జ్ఞానాదేవాస్య నాన్యథా।**
**స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే కథమ్॥**

మోక్షాభిలాషగలవారకి బ్రహ్మతత్త్వ జ్ఞానోదయముచే మాత్రము ముక్తి సిద్ధించును. ఇతరములగు యే యొక్క విద్యలచేత తరము కాదు. ఎట్లన స్వప్న సమయమందు గనిన కలలు జాగ్రదవస్థ గలుగక ఎట్లు నశించవో ఆలాగున మిథ్యాభూతమగు సంసార స్వప్నము నశించుటకొరకు బ్రహ్మప్రబోదము గలుగవలెను.

అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్ష జ్ఞానమేవ తత్ ।
అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే ॥

దేహత్రయ విలక్షణుడు, సర్వసాక్షియగు ఆత్మయే తానని వేదాంత శ్రవణము చేయుట పరోక్ష జ్ఞానము మాత్రమే. ఆ శుద్ధ బ్రహ్మమే తానని దృఢబోధ మనన నిదిధ్యాసనములచే స్వానుభవపరచుట సాక్షాత్కారమని ఉపనిషత్తుల అభిప్రాయము. పరోక్ష జ్ఞానమనగా ఈ రోగమునకు ఈ ఔషధమని తెలిసికొనుట. మరల పథ్యముతో రోగశాంతి గలుగువరకౌషధము సేవించి సుఖముగా నుండుట అపరోక్షజ్ఞానమని వేదమతము. ఇప్పుడుండు శుష్కవేదాంతులు శ్రవణముచే సంపూర్ణులైన వారమని సంతోషపడుచున్నారు. రోగమందుండు వారు ఔషధము పేరు మాత్రముచే తృప్తిపడినచో రోగము కుదురునా ?

శ్రుతి ॥ ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిది
ధ్యాసితవ్యః । తమేవం విదిత్వాతిమృత్యుమేతి నాన్యః
పంథా విద్యతేఽయనాయ ॥

ఓ మైత్రేయి ! ఆత్మయగు పరబ్రహ్మము మొదట శ్రవణము చేయతగినది. తరువాత మననము చేయందగినది. పిమ్మట నిదిధ్యాసము చేయందగినది. ఆపై దర్శింపదగినది అని నాలుగుమెట్లుగా యాజ్ఞవల్క్య మహర్షి చెప్పిరి. ఇప్పుడు మనన నిదిధ్యాసనములు సాక్షాద్దర్శనము ఈ మూడును చేయువారు లేకపోయిరి. శ్రవణము మాత్రముచే ధన్యులమైతిమని తలంచుచున్నారు.

గుహాయాం నిహితం సాక్షాదక్షరం వేదచేన్నరః ।
ఛిత్వాఽవిద్యామహాగ్రంథిం శివం గచ్ఛేత్సనాతనమ్ ॥

నరుడు హృదయ గుహాయందు గూఢముగా నుండు అక్షర బ్రహ్మము నెరింగినచో, అవిద్యాగ్రంథులు నశించి శాశ్వతమగు శివత్వము నొందునని ఋభుగీత.

**న కర్మణా న ప్రజయా న చాన్యేనాపి కేనచిత్ ।**
**బ్రహ్మవేదనమాత్రేణ బ్రహ్మాప్నోత్యేవ మానవః ॥**

మానవుడు ముక్తినొంది సుఖించుట కర్మముచే సాధ్యము గాదు. పుత్ర సంతానముచేత సిద్ధింపదు. మరియు ఇతరములగు ఏ విద్యలచేతను సాధ్యము గాదు. మరి యెట్లు సిద్ధించుననన, బ్రహ్మజ్ఞాన మను నొక్క మార్గముచే పరబ్రహ్మము నొందగా శాశ్వత సుఖము గలుగునని కఠరుద్రోపనిషత్తు.

**యస్మిన్కాలే స్వమాత్మానం యోగీ జానాతి కేవలమ్ ।**
**తస్మాత్ కాలా త్సమారభ్య జీవన్ముక్తో భవేదసౌ ॥**

బ్రహ్మనిష్ఠుడు ఏసమయమున కేవలుడగు తన ఆత్మను శుద్ధబ్రహ్మమని తెలిసికొనునో, అప్పటినుండి జీవించియుండినను ముక్తుడైన వాడని యాజ్ఞవల్క్యోపనిషత్. అనగా యోగియగు వానికి బ్రహ్మజ్ఞానము గలిగిన సమయముననే సమాధిగలవాడగును. దేహపతనము సమాధి గాదని అభిప్రాయము. ఈ రహస్యము తెలియకనే ఉత్తరాయణ దక్షిణాయనాది విషయమై భక్తులు భ్రమించుచున్నారు.

**మౌనాన్న మునిర్భవతి నారణ్యవసనాన్మునిః ।**
**సల్లక్షణం తు యో వేత్తా స మునిశ్రేష్ఠ ఉచ్యతే ॥**

మాటలాడకుండుటచే మాత్రము వాడు మౌనికాడు. అరణ్యమందును కొండ గుహయం దుండుట చేతను ముని గాడు. సత్తామాత్రమగు బ్రహ్మము నెరింగినవాడు గృహస్థాశ్రమమందుండినను శ్రేష్ఠుడగు మహర్షియని ఉపనిషత్ వచనము.

**ఏక మేవాద్వితీయం యద్గురోర్వాక్యేన నిశ్చితమ్ ।**
**ఏత దేకాంత మిత్యుక్తం న మఠో న వనాంతరమ్ ॥**

ఏక మేవాద్వితీయమగు పరబ్రహ్మమును గురోరనుగ్రహముచేతను, తన స్వబోధముచేతను, తెలిసికొనుట యేదిగలదో, అది యేకాంత మనబడును. ఈ రహస్యము తెలియక సంసారము విడచి అరణ్యమందుండుట, నదీతీరమున

నివసించుట మఠముకట్టి దానియందుండుట మొదలగునవి యేకాంతము కాదు. ఏకాంతమనగా మనస్సు ఇతర సంకల్పములు లేక యేకమగు బ్రహ్మమునందు స్థిరముగా నిలుచుటయే. ఇట్లుండువాడు అనేక జనస్తోమమందుండినను యేకాంత మందుండువాడు. ఏకాంతమగు అరణ్యమందుండినను హృదయమున నితరసంకల్పముండినచో వాడనేక జనుల నడుమనుండువాడు అని మైత్రేయ్యుపనిషత్.

ఉపనిషత్తు ఇట్లు చెప్పుటచే ఈ కాలము ననుసరించి అన్నము తినక ఫలాహారములు తినువారిని, మౌనమందుండువారిని బాగా శోధించి దగ్గర చేరవలెను. అట్లుండు వారిలో నిప్పుడు గొప్పవారు తక్కువగా నుండుదురు. ఒక్కవేళ నుండినచో వారు ఎచ్చటను తిరుగక ఒక్క స్థలమందే నివసించు చుందురు. ఆలాగున విశేషజడలున్ను, విభూతియున్ను, పావుకోళ్ళు, యోగదండము, జింకచర్మముతో గూడినవారిని గూడా నిండా పరీక్షించవలెను. రావణుడున్ను, అర్జునుడున్ను సన్న్యాసులైన కథలను మనము వినియున్నాము. ఒక్క పతివ్రతా శిరోమణియగు నారీరత్నమునకు వస్త్రాభరణాదులు ఎట్లుండును, దుర్వృత్తిగల భోగము దానికి వస్త్రాభరణము లెట్లుండునని విచారించినచో ఈ సంగతి తేట తెల్లమగును. గొప్ప మహాత్ముడు నోట్లవలె నుండును. దానికి ఏ యొక్క శృంగారము లేనప్పటికిన్ని ఆ కాగితపు తునకకు వేలుకువేల వెల కలుగును. సబ్బు బిళ్ళపైనుండు అతి శృంగారమైన కాగిత మొక్కదమ్మిడిగూడ వెలచేయదు. ఈ సంగతి జనులెరింగినచో సుఖముగా గాలము గడుపవచ్చును. బ్రహ్మనిష్ఠ పూర్తిచేయవలెనని యభిప్రాయము గలవారు ధర్మనిష్ఠయందుండు ఒక్క బ్రాహ్మణ వితంతువును గురువుగా భావించవచ్చును. ఆమె సుమంగలియై యుండినపుడు ఎట్లుండినది. ఈ స్థితి వచ్చిన తరువాత ఏమి యేమి విడిచినది! అని దీర్ఘముగా విచారించినచో భక్తు డెట్లుండవలెనని తెలిసికొని ముక్తినొంది సుఖింపవచ్చును.

**యథాఽగాధనిధేర్లాభే నోపాయః ఖననం వినా ।**
**మల్లాభేఽపి తథా స్వాత్మచింతాం ముక్త్వా న చాపరః ॥**

భూమి యొక్క అగాధ భాగమందుండు ధనము (నిక్షేపము) తీయుటకై గడ్డపారచే త్రవ్వుట వినా మరియేయొక్క యుపాయ మెట్లు లేదో, ఆలాగున బుద్ధి గుహయందుండు జ్ఞానధనము లభించుట కొరకు బుద్ధియను గడ్డపారచే, తదేకధ్యానమగు నిరంతర చింతనము వినా వేరుపాయము లేదని ఆత్మగీత చెప్పుచున్నది.

విచారితమలం శాస్త్రం చిరముద్గాహితం మిథః ।
సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్ ॥

మేము చిరకాలము గురు శిష్యులద్వారా శాస్త్రములను బహువిధము లుగా మరల మరల చర్చించితిమి. దానిలో తేలిన దేమన, వాసనారహితమగు మనస్సు స్వరూపానందమందుండుటకన్న శ్రేష్ఠమగు పదము ఏమియు కనుపింపలేదని శ్రీ విద్యారణ్యగురుడు నుడివెను.

తపసా ప్రాప్యతే సత్త్వం సత్త్వాత్సంప్రాప్యతే మనః ।
మనసా ప్రాప్యతే హ్యాత్మా ఆత్మనా ననివర్తతే ॥

ఇంద్రియనిరోధమగు తపోధ్యానమువల్ల రజోగుణ తమోగుణములు నశించి శుద్ధసత్త్వము కలుగును. శుద్ధసత్త్వము కలుగునప్పుడు మనసు ప్రశాంతమై స్వాధీనపడును. స్వాధీనమైన మనసును బ్రహ్మధ్యానములో ప్రవేశపెట్టినచో ఆత్మస్వరూపము గనుపించును. ఆ స్థితిని ప్రాప్తించినవారికి పునరావృత్తి రహితమగు మోక్షము కలుగును. తపస్సనగా,

మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః ।
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే ॥

కృచ్ఛ్ర చాంద్రాయణాది అనేక విధములగు తపస్సులలో దశేంద్రియములతో మనస్సును ఐక్యపరచి నిర్విచార బ్రహ్మనిష్ఠయందుండుట గొప్ప తపస్సనంబడును. ఇది అన్ని ధర్మములకన్న శ్రేష్ఠతమమగు ధర్మము. దీనికన్న గొప్ప తపస్సు మరియొకటి లేదని మనువు నుడివెను. (మనుస్మృతి)

ధర్మోపదేశసమయే జనాస్సర్వేఽపి పండితాః ।
తదనుష్ఠానసమయే మునయోఽపి న పండితాః ॥

పరుల కుపదేశించెడి సమయములో జనులందరున్ను మహాపండితులు. కాని తానుపదేశించినట్లు అనుష్ఠించెడి విషయములో మునీశ్వరులు గూడ అసమర్థులు. అనగా ఒక్కరు, మనలో వేదాంత ప్రసంగము చేయునప్పుడు ఆయన అట్లుందురా అని గమనించి ఆదరించవలెనని భావము.

**పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణామ్ ।**
**ధర్మే స్వకీయేఽనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః ॥**

వేదాంతము పరుల కుపదేశించుట జనుల కందరికిని బహుసులభము. ఆ చెప్పెడు విధముగ కొంత అనుష్ఠాన మందుండు మహాత్ముడు ఎక్కడనో ఒకానొకడు మాత్రము కనబడును. కనుక గురువులను నిండా శోధింపవలెనని భావము. లేనిచో కొన్ని విధములగు చిక్కులు కలుగును.

**అంధేనైవ యథా చాంధా నీయమానాస్సుదారుణే ।**
**అంధాః కూపే పతంత్యేవ తథా పాపరతా జనాః ॥**

ఏలాగున గాఢాంధకారమందు గ్రుడ్డివానిని ఆశ్రయించి వానిచే నితరులగు పుట్టంధులు దోవచూపింపబడినచో అందరున్ను కూపములో గాని, పల్లములోగాని, అడవిలో గాని పోయి పడి కష్టపడుదురో, ఆలాగున పాపకృత్యములగు మధు, మాంసములు, గంజాయి వగైరా సేవించువారిని ఆశ్రయించినచో ఇప్పుడుండుట కంటె మరింత సంసారకూపములో పడిపోవుదురు. గంజాయి త్రాగువారి యొద్దకు సంసారమందుండు సదాచారులు పోయినచో జ్ఞానపత్రియని చెప్పి చిన్నగ చిన్నగ కొంచెము కొంచెము నేర్పించి మోసము చేయుదురు. ఎందుకట్లు నేర్పించుటనగా, రేపు వాడు పత్రి తీసుకొని వచ్చుటకై యుండు సూత్రము. ఒక్కదినము గంజాయిపుచ్చు కొనువారికి మరల తొలగించుట కష్టము. అది పక్షులపట్టు తంత్రమగు వలవంటిది.

ఎప్పుడు ఒక్క విధమగు విచారమందుండు సమయమున అతి ప్రేమ కలవారు గాని, లేక చాలా గొప్పవారు గాని వచ్చి సమీపమందు నిలబడి యుండినప్పుడు వారితో మందలించుటకొరకు నూరు సార్లు యేమి వీరితో ఒక్క మాటైనను చెప్పవలసినదిగదా, అని మరల మరల విచారము చేసినను చెప్పుటకై

మనస్సు గలుగదో, ఆలాగుననే ఆహారకాలమతిక్రమించినను, అతి ప్రేమగలవారు మంచి భోజనవస్తువులు దగ్గర తెచ్చి పెట్టుకొని తినుటకై ప్రార్థించినను మనస్సు నిరోధసుఖము నుండి బహిర్ముఖమై భుజించుటకు కూడ మహా కష్టతరముగా తోచునో, కూర్చుండు స్థలములో నెండవానలచే బాధగలిగినను అచ్చోటనుండి లేచి మరియొక స్థలమున కూర్చుండుట కూడా మహా బాధకరముగా తోచుట యెప్పుడు తటస్థ మౌనో అప్పుడు మనస్సు ప్రకృతి నతిక్రమించి మనోనిరోధమగు ఆనంద మనుభవించు చుండునని తెలుసు కొనవచ్చును. ఎట్లన దూడను ఇంటిలో కట్టివేసి మేతకొరకు విడచిన తల్లి ఆవు సంధ్యా సమయము వచ్చునప్పుడు పాలు పితుకుటకై దూడను విడచిపెట్టి పొదుగున పాలు త్రాగుచుండగా ఆ దూడను వెనుకకు లాగునప్పుడు దానికి పొదుగును విడచి వచ్చుటకెంత సంకటముగా నుండునో ఆలాగుననే మనస్సు నిరోధధ్యాన సుఖమునుండి బహిర్ముఖముగా తిరుగుటకై కష్టపడును. ఇది బ్రహ్మానంద సుఖము యొక్క లేశ మాత్రమని తెలుసుకోతగినది. ఈ స్థితి సోమరులై తిరుగు వారికి సాధ్యము కానేరదు. ఎట్లన, పాత్రమునకు సెగ తగులక సుండలుడుకునా, అనగా శరీరమను పాత్రము ధ్యానశక్తియగు అగ్నిచే సెగతగిలి మనస్సనెడు నీరుడికిన తరువాత కర్మబీజములను చనగ లుడుకునే గాని, అలస పురుషులు కర్మము నశించి ముక్తులు కానేరరు. అనగా శరీరకష్టముతో మనోనిరోధము చేసి ధ్యాననిష్ఠ చేయువారు ధన్యు లగుదురు.

అహింసా సత్యమస్తేయ మకామక్రోధలోభతా ।
భూతప్రియహితేహా చ ధర్మోఽయం సార్వవర్ణికః ॥

అహింస, సత్యము, అపరిగ్రహము, కామరాహిత్యము, క్రోధరాహిత్యము, లోభము లేకుండుట, సమస్త భూతములయందు దయ మొదలగు సద్గుణము లన్ని వర్ణముల వారికిన్ని, అన్ని ఆశ్రమముల వారికిన్ని, అన్ని మతస్థులకున్ను సమానముగా అనుష్ఠించవలసిన ప్రధానధర్మము లని శ్రీ శుకులువారు ఆనతిచ్చియున్నారు.

అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యాపరిగ్రహౌ ।
అక్రోధో గురుశుశ్రూషా శౌచం దుర్భుక్తివర్జనమ్ ॥

హింసచేయకుండుట, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, పరిగ్రహవర్జనము, కోపములేకుండుట, గురుశుశ్రూష, బహిరంతరశుద్ధి, నీచాహార వర్జనము - ఈ గుణములు బ్రహ్మనిష్ఠుల కవశ్య ముండవలసినవి.

**బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధిర్మతః ।**
**దేహాత్మవత్ పరాత్మత్వ దార్ఢ్యే బోధః సమాప్యతే ॥**

వైరాగ్య మెంతవరకుండవలసిన దను ప్రశ్నకున్ను, ధ్యాననిష్ఠ ఎంతవరకు చేయవలసినదను ప్రశ్నకు విద్యారణ్యగురుండు సమాధానము చెప్పుచున్నాడు. బ్రహ్మలోకమువరకు గల సమస్త భోగములను తృణీకరించుట వైరాగ్యము యొక్క అవధి. మూఢుడైనవాడు దేహమే తానని దృఢమగు నమ్మకముతో నున్నట్లు శుద్ధచైతన్య బ్రహ్మమే తానని దృఢబోధ గలుగు పర్యంతము బ్రహ్మవిచారనిష్ఠను జేయవలయును.

**కిం విద్యయా కిం తపసా కిం త్యాగేన శ్రుతేన వా ।**
**కిం వివిక్తేన మౌనేన స్త్రీభిర్యస్య మనో హృతమ్ ॥**

ఎవనిమనస్సు విషయవాసన చే, స్త్రీలచే హరించబడునో, వారికి విద్యచేతను, తపస్సుచేతను, సన్న్యాసముచేతను, వేదాంత శ్రవణము చేతను, ఏకాంతవాసముచేతను, మౌననిష్ఠచేతను, ఏమి ప్రయోజనము ? అనగా విషయ విరక్తి లేనిచో పై జెప్పిన వన్నియున్ను నిష్ప్రయోజనమని శ్రీ శుకులవా రుపదేశించిరి.

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణమ్ ।**
**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥**

ప్రతిబంధము లుండినచో జ్ఞాన మనుభవమునకు రానేరదు. ప్రతిబంధములు మూడువిధములు. అవి వర్తమాన ప్రతిబంధమ్మనియు, భూత ప్రతిబంధ మనియు, భవిష్యత్ ప్రతిబంధమనియు చెప్పబడినవి. ఇవి వేదాంత పంచదశిలో కనందగును. వాటిలో వర్తమాన ప్రతిబంధము గొప్పది. దీనిలో అన్నిటి కన్నా గొప్పది విషయాసక్తి గనిపించుట, రెండవది ప్రజ్ఞామాంద్యము. మూడవది కుతర్కబుద్ధి, నాలుగవది అన్నిటికిని విపరీతమైన అర్థము చేయుట.

ఐదవది నీచవములగు వస్తువులను భుజించుటకై ఆసక్తిగలుగుట. ఇవి ప్రతిబంధవములని బ్రహ్మనిష్ఠులు గమనించి వైరాగ్యవముతో విడచినచో ధన్యులగుదురు.

వైరాగ్యహీనస్య న సాంఖ్యవేదనం
న ముక్తిసిద్ధిర్న చ బంధనచ్ఛిదా ।
న ధర్మసిద్ధిశ్చ తతః పురాతనై
రిదం విశిష్టం కథితం శ్రుతేర్బలాత్ ॥

అన్నిటికిన్ని వైరాగ్యవము ముఖ్యకారణమని చెప్పుచున్నారు. తీవ్రవైరాగ్యము లేనివారికి సాంఖ్యతత్త్వమగు బ్రహ్మము కనుపింపదు. ముక్తిసిద్ధియున్ను గలుగదు. సంసారసాగరముయొక్క దరిచేరరు. ధర్మసిద్ధియు కలుగనేరదు అని పురాతనమగు వేదము బలముగా నొక్కి వక్కాణించు చున్నది.

అవిజ్ఞాతః పశుస్సో హి సృష్టిధర్మసమాశ్రితః ।
విజ్ఞాతః శాశ్వతః శుద్ధః స శివో నాత్ర సంశయః ॥
న జీవో జీవవత్ భాతి సాక్షాద్బ్రహ్మైవ కేవలమ్ ।
అజ్ఞానాజ్జీవరూపేణ భాసతే న స్వభావతః ॥

వైరాగ్యము నవలంబించి ఆత్మానాత్మ విచారము చేయని కారణముచే శుద్ధబ్రహ్మమగు తాను సృష్టి ధర్మమగు మాయను ఆశ్రయించి జీవుడననియు, తాను పశుప్రాయుడననియు, జనన మరణములు గలవాడననియు, నిత్య సంసారి ననియు భ్రమించి దుఃఖించుచున్నాడు. ఆత్మానాత్మ విచారముచేసి జ్ఞానము గలుగునప్పుడు తాను శాశ్వతుడననియు, శుద్ధుడననియు, శివుడననియు బోధనిశ్చయము గలుగును. దీనియందు కించిత్తైనను సంశయములేదు. జీవుని వలె తోచుచుండువాడు వాస్తవముగా జీవుడు కాడు. సాక్షాత్ బ్రహ్మమే. అజ్ఞాన ముచే జీవరూపముగా తోచినను కేవల శివుడే. అది యెట్లన,

గ్రహావిష్టో ద్విజః కశ్చిచ్ఛూద్రోఽహ మితి మన్యతే ।
గ్రహనాశాత్ పునః స్వీయం బ్రాహ్మణ్యం మన్యతే యథా ॥

**మాయా విష్టస్తతో జీవో దేహోऽహమితి మన్యతే।**
**మాయానాశా త్పునః స్వీయం రూపం బ్రహ్మాస్మి మన్యతే॥**

ఒక్క వేదబ్రాహ్మణుని శూద్రగ్రహము పట్టుకొని ఆవేశ సమయమున నెవరడిగినను శూద్రుడనని చెప్పును కదా ? వారికి కూడా గ్రహావేశసమయమున బ్రాహ్మణుడను బుద్ధిపోయి తాను శూద్రుడనే బుద్ధి యుండును. ఆగ్రహము తొలగిన పిమ్మట నేలాగున తన నిజస్థితియగు బ్రాహ్మణుడను నిజబోధ నిశ్చయముగా గలుగునో, ఆలాగున మాయ అను గ్రహముచే జీవుడు పట్టుపడుటచే తాను దేహ మనియు, బద్ధుడననియు, అల్పుడగు జీవుడననియు, తలంచి దుఃఖించుచున్నాడు. ఆ మాయ తొలగిన పిమ్మట నిజరూపమగు బ్రహ్మతత్త్వము ప్రకాశించి తాను నిత్యముక్తుడననియు, బ్రహ్మమే అనియు బోధ గలుగును అని గరుడపురాణము.

**సంసారదీర్ఘ రోగస్య సువిచారోऽయమౌషధమ్।**
**కోऽహం కస్య చ సంసారో వివేకేన విలీయతే॥**

ఆ బ్రహ్మకారస్థితి గలుగుటకు చెప్పుచున్నారు. ఈ సంసారమను దీర్ఘరోగమునకు బ్రహ్మవిచారమొక్కటి తప్ప వేఱు ఔషధము లేదు. వివేక బుద్ధిచే నేనెవ్వడు, ఈ సంసారమెవ్వనిది, నాకును ఈ దేహమునకు సంబంధమెట్లు గలిగియున్నది ? అని విచారించినచో రోగము నశించును. దీనికి గురుశిష్యు లిద్దరున్ను యోగ్యులుగా నుండవలయును.

**జ్ఞానం ప్రత్యక్షమేవేదం గురుశిష్య ప్రయోజనమ్।**
**ఉభావపి యతో యోగ్యౌ సర్వేషామీదృశామపి॥**

**శిష్యప్రజ్ఞైవ బోధస్య కారణం గురువాక్యతః।**
**మలత్రయమపక్వం చేత్ కథం బుధ్యతి పక్వవత్॥**

ఈ బ్రహ్మజ్ఞానము స్వబోధమగుట కొరకు గురువున్ను, శిష్యుడున్ను సమానసమర్థులై యుండవలెను. లేనియెడల జ్ఞానము గలుగదు. ఇది అన్ని విషయములకున్ను సమానమగు ధర్మము. దీనిలో గురువాక్యము ధారణము

చేయుటకై శిష్యునియొక్క మహా ప్రజ్ఞయే ముఖ్యకారణము. మలత్రయము నశింపని శిష్యుడైనచో బోధ గలుగుట కష్టము. పరిపక్వ బుద్ధిగలవానికి ప్రకాశించునట్లు మందవైరాగ్యముతో విషయవాంఛగలవానికి ప్రకాశింపదు. ఎట్లన చమురులో దడిసిన కాగితముపై బాగుగా వ్రాసినను ఎట్లు ప్రకాశింపదో అట్లుండును విషయవాంఛ గలవారికి బోధచేసినచో.

**ధ్యాతృధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరమ్ ।**
**నివాతదీపవచ్చిత్తం సమాధి రభిధీయతే ॥**

ధ్యాననిష్ఠచేయువాడు, తాను ధ్యానించెడు బ్రహ్మము, ధ్యానము చేయువాడగు తాను - అను భేదము నశించి ధ్యేయాకారము మాత్రము గోచరమై గాలి లేని చోటు నందుండు దీపమువలె స్వస్వరూపియై యుండుస్థితి ఏది గలదో అది సమాధి యని చెప్పబడును. ఇదే నిజమగు బ్రహ్మాకారవృత్తి.

**బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః ।**
**ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ ॥**

కేవలమగు సత్తామాత్ర బ్రహ్మమే తానని సర్వసాక్షిమాత్రుండై స్వస్వరూపమందు స్థిరముగా నిలుచుటయే ధ్యానశబ్దమునకు అర్థము. ఈ స్థితియే పరమానంద ప్రదమగు పరబ్రహ్మ ధ్యానము.

**నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః ।**
**వృత్తి విస్మరణం సమ్యక్ సమాధిః జ్ఞానసంజ్ఞకః॥**

నిర్వికారవృత్తి (విషయానుసంధానము లేని మనస్స్థితి), మరల బ్రహ్మాకారముగా చక్కగా (కించిత్ అయినను బ్రహ్మాకారవృత్తికి అన్యము తోచకుండుట) ధ్యానధ్యేయ మనువృత్తి శూన్యముగా నుండుట (ద్వైతాను సంధానము లేకుండుట) ఏది గలదో, అది జ్ఞానమనెడు సమాధి యగును అని అపరోక్షానుభూతి. ఈ స్థితి ధ్యానయోగముచేతను, బ్రహ్మవిచార జ్ఞానముచేతను పొందదగును.

**అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిద్ జ్ఞాననిశ్చయః ।**
**ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః ॥**

ఒక్కరికి యోగాభ్యాసానుష్ఠానము సాధ్యము గాక పోవచ్చును. మరియొక్కరికి బ్రహ్మవిచార జ్ఞానమున రుచి గలుగక పోవచ్చును. కనుక ఈ రెంటిలో ఏదైన యొక్కటిని మాత్రము వైరాగ్యపరముగా ననుష్ఠించినచో ముక్తి నొందవచ్చునని శ్రీ పరమశివుడు మొదటనే రెండు మార్గము లుపదేశించిరి. అనగా ఒక్కటి రాజయోగము, మరియొక్కటి సన్న్యాసయోగము. ఇద్దరున్ను సమమగు వైరాగ్యముతో అనుష్ఠించినచో ఒకే స్థానమందు చేరుదురు. వారిద్దరి ప్రయాణమార్గము వేరువేరుగా నుండినను విరోధము లేదు. ఆ మార్గములు రెండు రోడ్డు వంటివి. ఒక్కరు కుడిప్రక్కను, మరియొక్కరు యెడమ ప్రక్కను ప్రయాణముచేసినచో మధ్యస్థలమున ఇద్దరున్ను చేరుదురు గదా ! కాని నడచుట మాత్రము ఇద్దరికిన్ని సమకార్యము. దీనికి వైరాగ్యము మొట్టమొదటి సాధనము.

**ఆదౌ త్యజ భవాసక్తిం దారాన్ సుతగృహాన్ ధనమ్ ।**
**విస్మృత్య విషయాన్ సర్వాన్ రాగద్వేషౌ విషం యథా ॥**

బ్రహ్మవిచారములో మొట్టమొదట విషయాసక్తిని విడువవలయును. తరువాత పుత్రకళత్ర గృహధనములలో నుండు ఆశ యను పాశములను కోసివేయవలయును. మరల వస్త్రాభరణ సుఖ భోజనాది రాగద్వేషములను విషమువలె విడువవలయును.

**సంప్రబోధవతీ తీక్ష్ణా కళంకరహితా మతిః ।**
**సర్వసామగ్ర్యహీనాపి పదమాసాదయత్యలమ్ ॥**

సమస్తవిషయ మాలిన్య రహితమగు మనస్సునన్ను, తీక్ష్ణమగు బుద్ధియునున్ను, ప్రబోధ బోధయగు మనస్సున్ను గల వారికి ఇతరములగు యోగానుష్ఠాన నిష్ఠలు లేనప్పటికిన్ని ఆత్మవిచార మొక్కటి యుండినచో మోక్షము నిశ్చయముగ సిద్ధించును. అనగా వైరాగ్యపూర్ణముగా నుండిన ఇతరానుష్ఠానములు పనిలేదు. ఇతరానుష్ఠానము లనేకములుండినను వైరాగ్యము లేనిచో వ్యర్థమని భావము.

**సర్వాశాః కిల సంత్యజ్య ఫలమేతదవాప్యతే ।**
**యేనాశావిషవల్లీనాం మూలమాలా విలీయతే ॥**

అన్యవస్తువులయందు గల అభిలాషను చక్కగా విడిపించి విషయములను విషలతలను సమూలముగ వైరాగ్యమను కత్తిచే ఛేదించినచో వారిని మోక్షపదము తనకుదానే వచ్చి సేవించును. అనగా విషసమానమగు విషయలతలను సమూలముగా పాడుచేసిన వారియొద్దకు మోక్షపదము వచ్చి నన్ను స్వీకరింపుము స్వీకరింపుమని ప్రార్థించును అని సిద్ధగీత.

> సశాంతసర్వసంకల్పా యా శిలావదవస్థితిః ।
> జాగ్రన్నిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరా ॥

సమస్త సంకల్పములు నశించి జాగ్రన్నిద్ర లేనిదగు శిలబోలె (విగ్రహము వలె) నిర్వికార నిశ్చలస్థితియు, స్వస్వరూపముమాత్రము దానని శేషించు స్థితి ఏది గలదో అదే పరమగు బ్రహ్మాకారము. అనగా చిత్రపు బొమ్మవలె నుండుట. అదే వృత్తి రహితము యొక్క లక్షణము.

> వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ ।
> నైవాఽజితేంద్రియ స్యేహ సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్ ॥

ఇంద్రియ నిగ్రహము లేనివారికి వేదాధ్యయనముచే గాని, సన్న్యాసముచే గాని, యజ్ఞాదిక్రతువులచేగాని, యమనియమాది అష్టాంగ యోగముచే గాని, తపస్సుచేగాని, ఒకప్పుడున్ను మోక్షము కలుగనే కలుగదని అష్టావక్రమునీంద్రుడు జనకులతో చెప్పిరి.

> మణిమంత్రౌషధైర్వహ్నిః సుదీప్తోఽపి యథేన్ధనమ్ ।
> ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబద్ధ స్తథైవ చ ॥
> జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోఽపి చ ।
> ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబంధస్తు కల్మషమ్ ॥

మండుచుండెడి అగ్నిని మణిమంత్రౌషధములచే కట్టు గట్టునప్పుడు ఎట్లు దహనశక్తి లేకుండపోవునో, ఆలాగున జ్ఞానాగ్ని ప్రకాశించి దృఢబోధ గలిగినను విషయవాసన యుండినచో కర్మబీజములను దహించుటకు శక్తి యుండదు. అనగా విషయవాసన అంత చెడ్డదని పరాశరమతము.

**స్మృత్వాపి శుద్ధచైతన్యమాత్మాన మతిసుందరమ్ ।**
**ఉపస్థేఽత్యంతసంసక్తో మాలిన్యమధిగచ్ఛతి ॥**

అతి మనోహరమగు పరమాత్మను శుద్ధచైతన్యమగు ఆత్మయని తలచుకొన్నను ( ఆత్మతత్త్వ మెఱింగినను) ఉపస్థేంద్రియ ( మర్మేంద్రియ) ములతో సంసర్గము కలిగి విషయాసక్తుడైనచో జనన మరణమగు సంసార మాయయందు పతితుడగును.

**అన్యథా సంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే ।**
**కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా ॥**

మహాత్ములు విషయవిరక్తి సదాచార పరముగ అనుష్ఠించువారు మోక్షార్హులని చెప్పుచుండగా , శుష్కవేదాంతులు పై చెప్పిన విషయవిరక్త్యాదు లవసరము లేదని చెప్పుటయు, పై శాచిక వృత్తి యందుండుట రాజయోగమని బోధించుటయు ఎంత ఘోరమైన పాపము. ఆ ఆత్మవంచకులగు మహాపాపులగు వారు మరి యే పాపము చేయకుండుదురు ? అనగా దైవకృతమగు వేదమునకు విరుద్ధార్థము చెప్పునప్పుడున్ను ఋషి పరంపరగా వచ్చు సదాచార నిష్ఠలను నిరసించునప్పుడు, ఇతర పాపకార్యములు చేయుటలో సంశయముండునా యని భావము.

## జీవన్ముక్తి ప్రకాశిక

**కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాః సురాగిణః ।**
**తేఽప్యజ్ఞానతమా నూనం పునరాయాన్తి యాన్తి చ ॥**

బ్రహ్మమును గూర్చి మాట్లాడుటయందు మహాసమర్థులును, సదాచారహీనులును, విషయాసక్తులున్ను, ఎవరు గలరో వారు నిశ్చయముగ అజ్ఞానాంధకారమగు తమస్సులో పడి మరల మరల చచ్చుచును, పుట్టుచునుందురు గాని మోక్షమును బొందజాలరు.

**యేషాం వృత్తిః సమా వృద్ధ్యా పరిపక్వా చ సా పునః ।**
**తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మవాదినః ॥**

ఎవరియొక్క మనోవృత్తి బ్రహ్మైత్వ సమముగా వృద్ధి నొందినదిగాను, పరిపక్వమైనదిగను నున్నదో వారు మాత్రమే సత్తా మాత్రమగు బ్రహ్మమును బొందినవారు. విషయాసక్తులై శబ్దబ్రహ్మ వాదులైన దొంగ వేదాంతులు బ్రహ్మమును ఎఱింగినవారు కారు.

**యే హి వృత్తిం విహాయైనాం బ్రహ్మాఖ్యాం పావనీం పరామ్ ।**
**వృథైవ తే తు జీవన్తి పశుభిశ్చ సమా నరాః ॥**

ఎవరు ఈ శ్రేష్ఠమున్ను, పరిశుద్ధమైన బ్రహ్మధ్యాన వృత్తిని త్యజించి, విషయలోలురై వేదాంతప్రసంగము చేయుదురో, పశువులకు సమానులైన అట్టి మానవులు వ్యర్థముగ జీవించుచున్నారని శ్రీ జగద్గురువగు శంకరాచార్యు లపరోక్షానుభూతియందు చెప్పిరి.

**బుద్ధ్వాఽప్యత్యంతవైరస్యం యః పదార్థేషు దుర్మతిః ।**
**బధ్నాతి భావనాం భూయో నరో నాసౌ స గర్దభః ॥**

ఇంద్రియాది విషయములలో వైరాగ్యము నొందియు, వేదాంత శాస్త్రములను వినియు, కొంతకాలము బ్రహ్మవిచారము చేసియు, మరల విషయములలో ప్రవర్తించు మూఢుడు ఎవడు గలడో, వాడు మానవుడు కాడు, మరి ఎవరన పెద్ద గార్ధభమునకు సమానమైనవాడు అని ఉపశమ ప్రకరణము.

**యథా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి ।**
**తథాఽఽత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే ॥**

ఏలాగున అగ్నియందు వేగించిన విత్తనమున కంకురత్వము (మొలక) నశించియుండునో, ఆలాగున మాయ నశించిన ఆత్మజ్ఞానికి ప్రపంచవాంఛ శూన్యమై యుండును. అనగా వేగించిన విత్తనమున్ను పచ్చివిత్తనమున్ను చూచునప్పుడు ఒక విధముగా నుండినను పచ్చి విత్తనము నీటిలో తడిసినప్పు డంకురించును. వేగించిన విత్తనము నేల యందుగాని, నీటియందుగాని యుండినను అంకురింపక అట్లనే యుండి నశించిపోవును. బ్రహ్మనిష్ఠుడగు మహాత్ముడున్ను, బద్ధుడగు మానవుడున్ను ఒకేవిధముగా నుండినను జ్ఞానికి వృత్తి

నశించి యుండును. అజ్ఞానికి విషయానుకూల సమయము తటస్థించి నప్పుడు విషయబుద్ధి చిన్నగ బయలుదేరును. కుమ్మర పురుగు బురద యందుండినను బురద దాని కంటనట్లున్ను, తామరాకు నీటియందుండినను తడియనట్లున్ను, మజ్జిగలో నవనీతము కలియకుండునట్లున్ను, జ్ఞానులగు బ్రహ్మవేత్తలు సంసారములో నుండినను బద్ధులు కారని శ్రుతి చెప్పు సారము. ఈ శ్రుతిని ఉదాహరించి శుష్కవేదాంతులు విషయములో ప్రవర్తించినను బద్ధులు కారని చెప్పి కపటము తెలియని పరమభక్తులగు నారీమణులను గూడ భంగపఱచుచున్నారు.

ఈ అర్థము నాకు గోచరము గాకుండెను. అప్పుడు నేను పవిత్రమగు ఏకాంతమందు గూర్చుండి నామనసులో నేనే ఈ లాగున వితర్కము చేసితిని, శాస్త్రములో కుమ్మరపురుగు పంకముందుండినను బురదతో అంటకుండు నట్లున్ను, పాలనుండి తీసిన వెన్న మరల దానిలో కలియ కుండునట్లున్ను, జ్ఞాని యగువారు సంసారమందుండినను బద్ధులు కారనియు శాస్త్రములలో కొన్ని చోటుల జ్ఞానికి వృత్తి లేదనియు చెప్పబడియున్నది. దీని యొక్క నిజార్థము ఎట్లుండునో! మరియు ఇప్పుడు శుష్కవేదాంతులు దురాచార పూరితకుక్షులుగా నుండియు మహా బ్రహ్మజ్ఞానియొక్క స్థితిని మాటలచే చాటించుచు తాము విషయములో ప్రవర్తించినను, కుమ్మర పురుగువలెను, మజ్జిగలో వెన్నవలె నుండువారమనియు, చెప్పుచున్నారే ! ఇది నా మనసును నిండా బాధించెను. ఇట్లుండగా అగాధ విచారములో నుండునప్పుడు దైవకృప వలన దానియొక్క నిజార్థ ముదయమయ్యెను. అదేమన ఉడుకబెట్టిన సెనగలున్ను, పచ్చి సెనగలున్ను చూచినప్పుడు ఒకే విధమున నున్నను, నీటిలో తడిసినప్పుడు పచ్చిది మొలకె త్తును. ఉడికినది మొలకరాదు. ఆలాగు ననే బ్రహ్మజ్ఞాని ప్రాపంచిక జనమధ్య నుండినను (విషయాసక్తులగు జనమధ్యనుండినను) నిర్వికారుడై చిత్రపుబొమ్మవలె నుండును. కుమ్మరపురుగు బురదయందుండినను బురదతో సంబంధము లేకుండును. అట్లే వేశ్యాజన మధ్యమున జ్ఞాని యుండినను వికార రహితుడై యుండును. అచ్చోట విషయబుద్ధి గలిగినచో కుమ్మర పురుగు స్థితి అంతర్ధానమై కంబళి పురుగగుననియు, అదేరీతిగా మజ్జిగయందుండు వెన్న సంగతి

గ్రహించదగినది. అనగా విషయబుద్ధి యుండినచో మజ్జిగలో వెన్న గాదు, సున్నము అని గ్రహించవలసినది. అనగా సున్నము నీటిలో లయించి పోవును. అట్లు విషయములో మనసు చలించినచో జ్ఞాని కాదు, అజ్ఞాని యని తప్పక తలంచ వలయును. ఇది గొప్ప సంగతి, సాధారణమగు వారికి గోచరము కాదు.

యేన లబ్ధోఽద్వయశ్చాత్మా తస్య భోగరతిః కుతః ।
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా ! దీనతాం స కిమావహేత్ ॥

ఎవనిచే అద్వితీయమగు పరమాత్మ స్వానుభవముగ లభింపబడునో ఆ మహాత్మునికి భోగ వాసన యెట్లు గలుగును ? సాక్షాత్ శుద్ధమగు ఆత్మ స్వరూపమే తానని తెలిసికొనిన తర్వాత వాడు హేయమగు దీనకృత్యములకు ఎట్లు పోవును? అనగా అమృతము భుజించి తృప్తి నొందినవాడు అమేధ్యము తినుటకు తిరుగునా? అని విచారమాల.

చాతకో ధావితో ధూమం మత్వా స్వాతీయవిప్లుషమ్ ।
మౌర్ఖ్యావిచారాత్పతనే దృశోస్తత్రాన్ధతా భవేత్ ॥

చాతకపక్షి మూర్ఖతతో పొగను చూచి నల్లని మేఘమని తలంచి తాను దానిలో ఆనందముతో ప్రవేశించిన తరువాత పొగచేతను, వేడిమిచేతను నేత్రము కనుపడక క్రిందనుండు అగ్నియందు పడుచున్నట్లు విచారశూన్యులగు మానవులు దుఃఖకరమగు విషయమును చూచి ఆనంద ముండునని భ్రమించి దానిలో ప్రవేశించిన తరువాత దిక్కు తెలియక మోహాంధులై చచ్చుదురు.

యత్ర యత్ర భవే త్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై ।
ప్రౌఢవైరాగ్యమాశ్రిత్య వీతతృష్ణః సుఖీ భవ ॥

ఎవరెవరి యందు ఎంతెంతకాలమువఱకు హృదయమున విషయవాసన యుండునో, అంతవరకు సంసార ముండనే యుండును. కనుక గొప్పబలమగు వైరాగ్య మవలంబించి తృష్ణ లేని వాడవై నిత్యసుఖిగా నుండుదువు గాత అని జనకులకు తన గురువగు అష్టావక్ర మహామునీంద్రు డుపదేశించెను.

ఈ జీవన్ముక్తుడగు జనకుని మన రాజయోగులు దృష్టాంతము

చెప్పుచున్నారు. సూర్యుడెక్కడ ? మిణుగురు పురుగెక్కడ ? సముద్రమెక్కడ, జలబిందు వెక్కడ ? మహామేరు వెక్కడ, ఇసుక యెక్కడ ? జనకుడు ఎంతకాలము తపస్సు చేసినవారని శాస్త్రము చదివినవారికి గదా యెరుక !

**యస్త్వాత్మ సుఖముత్సృజ్య సుఖం బాహ్యామపేక్షతే ।**
**కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరమ్ ॥**

ఎవడాత్మసుఖమగు బ్రహ్మానందము నుపేక్షించి, బాహ్య సుఖమగు యింద్రియాది విషయములలో గలుగు ఆనంద మనుభవించునో, ఆమూఢుడు చేతియందుండు క్షీరాన్నమును పారవైచి మోచేయి నాకు వివేకశూన్యుని వంటివాడు.

**యత్కించిదపి సంకల్ప్య నరో దుఃఖే నిమజ్జతి ।**
**న కించిదపి సంకల్ప్య సుఖ మక్షయమశ్నుతే ॥**

నరుడు కించిత్తైనను విషయసంకల్పము చేసినచో, నిశ్చయముగ దుఃఖసాగరమున మునుగును. సంకల్పము సమూలముగ నాశము చేసి నిస్సంకల్పు డైనచో, అక్షయ మగు శాశ్వత మోక్షమును పొందగలడు.

**భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥**

విషయభోగములయందును, ధనాది ఐశ్వర్యములయందును, ఆసక్తి గలవారికి హృదయము వాసనాసహితముగా నుండుటచే సమాధి నిష్ఠయందు బుద్ధి సుస్థిరముగా నిలువ సాధ్యము కాదని శ్రీ కృష్ణభగవంతులు గీతయం దుపదేశించిరి.

**ఇంద్రియాణాం ప్రసంగేన దోషాన్నృచ్ఛత్య సంశయమ్ ।**
**సన్నియమ్యతు తాన్యేవ తతః సిద్ధిం నిగచ్ఛతి ॥**

చక్షుః, శ్రవణాది, ఇంద్రియములు వాటియొక్క విషయములలో ప్రవర్తించుచున్నచో, అనేకవిధములగు దోషములను ఆ విషయములనుండి నిశ్చయముగ తీసుకొని వచ్చును. కనుక, ఆ ఇంద్రియములను హృదయమునను నియమించి ధ్యానము చేసినచో ఆత్మసిద్ధిని పొందగలడు.

**యావద్విషయభోగాశా జీవాఖ్యా తావదాత్మనః ।**
**అవివేకేన సంపన్నా యా సాఽప్యాశా న తు స్వతః ॥**
**వివేకవశతో యాతా క్షయమాశా యదా తదా ।**
**ఆత్మా జీవత్వముత్సృజ్య బ్రహ్మతామేత్యనామయః ॥**

బ్రహ్మనిష్ఠుల హృదయమున ఎంతవరకు విషయాదిలో భోగేచ్ఛ గలదో, అంతవరకు ఆత్మకు జీవుడని (సంసారియని) పేరు. ఆ భోగాసక్తి వివేకశూన్యత్వముచే గలిగినదే గాని స్వయముగా ఆత్మకు విషయాశ లేనే లేదు. ఆత్మానాత్మ వివేకబలముచే, ఎప్పుడు విషయాసక్తి సంపూర్ణముగా నాశము నొందునో, అప్పుడు అనామయుడగు ఆత్మ జీవత్వమును (మాయను) విడిచి (బంధము ద్రుంచి) బ్రహ్మత్వము నొందును. అనగా విషయవాసనతో గూడియుండునపుడు జీవుడనియు, వాసనారాహిత్యము నొందునప్పుడు ముక్తుడగు ననియు భావము అని శ్రీ వసిష్ఠ మునీంద్రుడు నిర్వాణ ప్రకరణమందు బోధించెను.

**అబ్ధివద్ధృతమర్యాదా భవన్తి విగతాశయాః ।**
**నియతిం న విముఞ్చంతి మహాంతో భాస్కరా ఇవ ॥**

మహాత్ములగు విగతాశయులు సముద్రమువలె మర్యాదను గాపాడుదురు. మహాత్ములగు సూర్యాదులవలె విధి ప్రకారము మార్గము తప్పక నడచుదురు అని శ్రీ వసిష్ఠ మతము. అనగా సముద్ర మపారశక్తి గలిగి యుండియు చిన్నదగు కట్టను ఎట్లు దాటక స్వస్థానమందే నిలిచియుండునో ఆలాగున గొప్పజ్ఞానశక్తి కలిగియుండిన వారైనను తాముండవలసిన విధి ప్రకారముందురే గాని శాస్త్ర నిషిద్ధములగు మధుమాంసాది నీచాహారపరులై స్వేచ్ఛావిహారులై నడువరు. మరియు నెంతో గొప్ప శక్తిగల సూర్యాది గ్రహములు, తమనిశ్చయ మార్గములగు జ్యోతిశ్చక్రమున నిలుచునట్లు అపారయోగ శక్తి యుండినను పెద్దలు శాస్త్రనిషిద్ధ మార్గమందు సంచరింపరు. దీనిని చూచునప్పుడు మన రాజయోగులు నిప్పులో ఏ వస్తువు వేసినను దహించునట్లు రాజయోగులు చేసిన పాపమంతయున్ను నశించునని చెప్పుచు పాపకృత్యము లొనరించుట ఎంత తప్పు పని ! నిప్పులో

కట్టెలు వగైరా దహించునే గాని బంకమట్టియు, నీరును కలసి పోసినచో వుండు నిప్పుకూడ ఆరిపోవునట్లు, నికృష్టమగు పని చేసెడి పాపముచే నుండెడి జ్ఞానము గూడ నశించి, నరకమున ప్రవేశించెదరు.

**ముకురే రవిసంయోగాద్యథోద్గచ్ఛతి పావకః ।**
**శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురుసంగతః ॥**

సూర్యకాంత రత్నముపై సూర్యరశ్మి పడునపుడు అగ్ని జ్వలించు నట్లు, నిర్మల హృదయముగల శిష్యునకు సద్గురుకృపచే జ్ఞానాగ్ని ప్రజ్వలించును. అనగా సూర్యరశ్మి భూమియందు అన్ని స్థలములలో ఒకే విధముగ పడునప్పటికిన్ని, మట్టిపై గాని, బండపై గాని, పలకపై గాని యెట్లు అగ్ని జ్వాల గలుగక, సూర్యకాంతముపై సూర్యరశ్మి పడునపుడు ప్రజ్వలించునో, అదే రీతిగా మహాత్ముడగు గురువు శిష్యులు కందరికిని ఒకే విధముగా నుపదేశించినను విషయవాసన గల హృదయములో జ్ఞానము ప్రకాశింపదు. వైరాగ్య, జ్ఞాన, తత్పరులకు మాత్రమే జ్ఞానము గలుగును. కనుకనే ఒక్క గురువునకు కొందరు శిష్యులు గొప్పవారుగను, కొందరు అయోగ్యులుగను గనపడుట గలదు. ఆభేదము గురువు యొక్క దోషము గాదు. శిష్యుల పరిపక్వతా తారతమ్యము ననుసరించియుండును. ఆలాగున పరబ్రహ్మము సమస్త జనుల హృదయమందుండినను నిర్మల హృదయమందు మాత్రమే ప్రకాశించును.

**చంద్రకాంతమణిస్సోఽయం ద్రవతే చంద్ర సన్నిధౌ ।**
**శిష్యానుభవనైర్మల్యం తథా సద్గురుదర్శనాత్ ॥**

చంద్రకాంత మణిమాత్రము చంద్రోదయ సమయమున అమృతధార వర్షించునే గాని, ఇతరములగు రాతిలో చంద్రిక పడినను ఎట్లు అమృతబిందువు కనుపింపదో, ఆలాగున పరిశుద్ధ హృదయము గల శిష్యులకు మాత్రమే సద్గురుసాన్నిధ్యముచే ఆనందామృతము ప్రవహించును గాని, విషయాసక్తులై ధ్యాననిష్ఠ చేయనివారికి గలుగదు. అదిన్ని గురువుయొక్క భేదబుద్ధియని చెప్పగూడదు. అది మనః పరిశుద్ధ్యము యొక్క భేదము. చంద్రుని యొక్క చంద్రిక భూమి యందంతట ఒక్క విధముగా నుండినను అమృతధార

వస్తుభేదముచే కలుగుచుండును. ఆకాశమందుండి పరిశుద్ధమగు మేఘజలము భూమియం.నన్ని చోట్ల ఒక్క విధముగ వర్షించినను, ఉప్పుభూమి, గంధకభూమి సున్నపుభూము, మంచి భూమిలో గలుగు జలభేదమువలె సద్గురు పందరిపై సమదృష్టి నుంచినను మనఃపక్వము ననుసరించి శిష్యులకు మార్పు గలుగు చుండును.

జ్ఞానే మమోదితే భోగాః కిం కుర్వంతీతి యే విదుః ।
భోగే సంగం మతేర్భంగం జ్ఞానశైథిల్యమాప్నుయుః ॥

కుబుద్ధులగు వారెవరైనను జ్ఞానము గలిగినపిమ్మట విషయభోగములలో ప్రవర్తించినచో ఏమి విరోధమని యడిగిన యెడల విషయభోగముల వలన ప్రవృత్తి మార్గముగా మనసు దిరిగి చిత్తము చెడిపోయి జ్ఞానము నశించునని గ్రహించందగినది. ఎట్లన ఆవుపాలు బాగుగా కాగనిచ్చి చక్కర వేసి త్రాగినచో సుఖకరముగా నుండును. ఉప్పు వేసినచో విరిగిపోయి అదే విషమగును. అది త్రాగినచో రోగము గలుగును. అలాగున జ్ఞానము గలిగినను వైరాగ్యముతో నుండువారు నిత్యసుఖులుగా నుందురు. విషయులైనచో నాశము నొందుదురు.

తస్మాద్వాసనయా యుక్తం మనో బద్ధం విదుర్బుధాః ।
సమ్యగ్వాసనయా త్యక్తం ముక్తమిత్యభిధీయతే ॥

కనుక విషయ వాసనతో గూడిన మనసుగలవారు, నిశ్చయముగా బద్ధులగుదురని వేదవేదాంత మెరింగిన పెద్దలు తెలుసుకొనియున్నారు. కాబట్టి నిశ్శేషముగా విషయవాసననశించిన మనస్సుగలవారు మాత్రమే ముక్తులగుదురని వేదము చాటించుచున్నది అని ముక్తికోపనిషత్తు.

రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు ।
కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః ॥

ఈ శ్లోకముచే ముక్తుని యొక్కయు, బద్ధుని యొక్కయు భేదము విశదీకరింప బడుచున్నది. బ్రహ్మబోధ గలుగనివాని మనస్సు విషయభోగములో ప్రీతితో గూడి విషయానందముచే సంతోష భరితమై యుండును. బ్రహ్మబోధచే

నిజానందమును గలిగిన ముక్తుడు విషయాదులయందు తుచ్ఛబుద్ధి గలిగి ఆత్మధ్యానపరుడై బ్రహ్మానంద భరితుడై యుండును. దృష్టాంత మేమన, నిండా ముదిరిన మ్రానుయొక్క తొర్రలో నిప్పు మండుచుండగా, ఆ వృక్షమున ఏలాగున ఫల పల్లవ పుష్పాదులుండవో, ఆలాగున వైరాగ్యముతో పరిపక్వమయిన హృదయమున జ్ఞానాగ్ని మండుచుండుగా, ఇంద్రియాది విషయభోగములగు కాము, పుష్ప, పల్లవాదులు ఎట్లుండును ? విచారవూల విచారింపుడని చెప్పుచున్నది.

**తపోదానాదినష్టాఘో నీరాగో హృది శీతలః ।**
**భోగానాం వాసనాం హిత్వా ముముక్షుర్బహుభాగ్యవాన్ ॥**

తపోదానాది ధ్యానయోగములచే శమించిన పాపము గలవాడును, విషయ రాగము లేనవాడును, హృదయమున చల్లదనము గలవాడును, సమస్త విషయ భోగవాసనలను వివేక బలముచే పార తోలినవాడగు ముముక్షువు ఎవడైన నుండినచో ఆ పుణ్యాత్ముడు మహాభాగ్యవంతుడు.

**అవినాశినమాత్మానమపారమజరాద్వయమ్ ।**
**జానతస్తే జగత్సక్తిర్నో చితా శృణు తత్త్వతః ॥**

అవినాశియై, అద్వయమై, అజరుడై, అపారసుఖరూపియైన ఆత్మను అనుభవమునకు తెచ్చిన మహనీయులకు జగములో నుండు విషయ వాసనాదు లుండతగవు. దానిని బాగుగా వినుము. ఎట్లన ఒక సంసారి యింటికి ఎరుకల కులమందుండు ఒక ఆడ మనిషి యుదయమున బోయి ''అమ్మా నేను ఆకలి కోర్వజాలను. నాకు మీ చల్ది అన్నము పెట్టుడు. మీకు ఆకలి లేక ఉండునట్లు ఒక మూలిక నిచ్చెదను'' అని చెప్పినట్లున్నది. దురాచారులగు కొందరు రాజయోగుల యొక్క యిప్పటి స్థితి. అనగా వారు విషయ లోలురై యుండియు నితరులగు సంసారులకు పరిపూర్ణము బోధించుదు రనుట.

**యావదాత్మాన లబ్ధోఽయం శుద్ధో జ్ఞానం చ నోదితమ్ ।**
**మలినే విషయే రాగస్తావదజ్ఞానినో భవేత్ ॥**

ఎంతకాలమువరకు పరిశుద్ధమగు ఆత్మస్వరూపము లభ్యపడదో అంతవరకు శుద్ధమగు బ్రహ్మజ్ఞాన ముదయింపదు. ఎంతకాలము వరకతిమలినమగు విషయాదులయం దాసక్తియుండునో ( అనగా మాంసభక్షణము, మద్యపానము, స్త్రీ విషయము వగైరా నికృష్ట విషయములు ) ఉండునో, అంతవరకు కేవలము అజ్ఞాని యని నిశ్చయింపందగినదని విచారమాల చెప్పుచున్నది.

**అధీత్య వేదాన్ చతురో విధురో జ్ఞానసంపదా ।**
**విజ్ఞేయః కర్మహీనశ్చ స వై బ్రాహ్మణగార్ధభః ॥**

నాలుగు వేదములున్ను, వేదాంగోపనిషత్తులున్ను, చక్కగ చదివి దాని అర్థములను బాగుగ మాట్లాడుటలో సమర్థుడైనను, సదాచారహీనుడై యుండినచో వాడు బ్రహ్మజ్ఞానికాడు. మరి యెవరన, మానవ వేషమును ధరించిన గార్ధభము.

**జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః ।**
**యథాఽదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని ॥**

మానవులకు పాపము నిశ్శేషముగా నశించునపుడే జ్ఞానోదయము గలుగును. ఎట్లన అద్దమందుండు ధూళిని తీసివేయునపుడు నిర్మలమైన అద్దమున తన ముఖము స్పష్టముగా గనుపించునట్లు నశించిన పాపము గల హృదయమున తన ఆత్మ తేజస్సు స్వయముగా ప్రకాశించును.

**రససిద్ధం యథా తామ్రం హేమత్వం ప్రతిపద్యతే ।**
**తథాత్మజ్ఞానసంబద్ధః శివత్వం ప్రతిపద్యతే ॥**

ఏలాగున రసవిద్యచే రాగి బంగారమగునో, ఆలాగున మలిన మనస్సు గలవాడైనను జ్ఞాన నిష్ఠాభ్యాసముచే జీవత్వము బోయి శివత్వ ( బ్రహ్మత్వ) మొందును. అనగా దీనియందొక్క గొప్ప రహస్యము గలదు. అది యేమన, తామ్రమునందు చిలుము కలదు. ఆ రాగి సువర్ణమైన తరువాత తామ్రావస్థ యందుండు మాలిన్య మెట్లుండదో ఆలాగున జీవ దశ యందుండు మాయా సంబంధ విషయవాసన యుండినను బ్రహ్మాభ్యాసముచే జ్ఞానియైన తరువాత

విషయవాంఛా శూన్యుడై శుద్ధబోధరూపుడై యుండును. ఇదే జ్ఞానికి అజ్ఞానికిని గల తారతమ్యము. అనగా రాగికిని, బంగారమునకు నుండు భేదమువలె నుండును.

**జ్ఞప్తిస్సా సాక్షిణీ విద్యా కుర్యాత్సర్వశ్రుతీరితా।**
**విషయజ్ఞప్తిసంత్యాగాత్ ప్రాప్యతే విబుధైః స్వతః॥**

సమస్త వేదశాస్త్రములచే చెప్పబడిన విద్య (జ్ఞానము) జ్ఞప్తి (బోధ) అనంబడును. అదే సర్వసాక్షి, అదే తుర్యము, అదే బ్రహ్మము. ఈజ్ఞానజ్ఞప్తి విషయువాసనయగు చింతను సమూలముగా త్యజించుటవల్ల ప్రబుద్ధ బుద్ధిమంతులచే స్వయముగా పొందబడును.

**నిర్మమత్వం విరాగాయ వైరాగ్యాద్యోగ సంగతిః।**
**యోగాచ్చ జాయతే జ్ఞానం జ్ఞానాన్ముక్తిః ప్రజాయతే॥**

బ్రహ్మవిచారము చేయువారికి మమత్వ శూన్యత్వముచే వైరాగ్యము గలుగును. వైరాగ్యమువల్ల యోగము సిద్ధించును. యోగనిష్ఠచే జ్ఞానమున్ను, జ్ఞానమువల్ల జీవన్ముక్తియు సిద్ధించును.

**ప్రాప్య చాప్యుత్తమం జన్మ లబ్ధ్వా చేంద్రియసౌష్ఠవమ్।**
**న వేత్త్యాత్మ హితం యస్తు స భవేదాత్మ ఘాతకః॥**

ఉత్తమమగు మానవజన్మము దొరికియు, చక్షుః శ్రవణాది సర్వేంద్రియములు పుష్టిగా గలిగియు, ఎవడు ఆత్మజ్ఞానము పొందుటకొరకు ప్రయత్నము చేయకుండునో వాడు ఆత్మ ఘాతకుడని చెప్పంబడును.

**దేహోఽయం మానుషో జంతోః బహుకర్మైకసాధనమ్।**
**సదా సత్కర్మ సేవేత దుష్కర్మ సతతం త్యజేత్॥**

ఎనుబదినాలుగు లక్షల ప్రాణికోటులలో ఈ మానవ జన్మము దొరకుట అనేక పుణ్యకర్మముల యొక్క సంచయముచే సిద్ధించినది. ఈ జన్మము పుణ్యకార్యములను చేయుటకొరకు భగవంతుడిచ్చెను. కనుక సర్వదా పుణ్యకర్మములను జేసి కడతేరుటకు ఇది మంచితరుణము. పాపకర్మ విషయమై తలంచుట కూడ గొప్ప దోషము.

**ధీరోఽప్యతి బహుజ్ఞోఽపి కులజోఽపి మహానపి ।**
**తృష్ణయా బధ్యతే జంతుః సింహః శృంఖలయా యథా ॥**

గొప్ప బుద్ధిశాలియైనను, అనేక విధ శాస్త్రసారమెరింగిన వాడైనను, గొప్పకులమందు జన్మించినవాడైనను. మఠాధిపతి యైనను, గొప్పవాడైనను విషయవాసన యుండినచో నిశ్చయముగా బద్ధుడగును. ఎట్లన మహాపరాక్రమము గల సింహమైనను గూడ సంకెళ్ళచే బంధింపబడినచో ఎట్లు దుఃఖమునకు కారణమగునో ఆలాగున విషయవాసన యను సంకెళ్ళచేనె వరికైనను దుఃఖమే కలుగును.

**లోక ఏష విషయానురంజనం**
**దుఃఖగర్భమపి మన్యతే సుఖమ్ ।**
**ఆమిషం బడిశగర్భ మప్యహో**
**మోహతో గ్రసతి యద్వదండజః ॥**

మానవులు విషయభోగములు మహాదుఃఖ భూయిష్ఠములైనను సుఖకరమని మోహముచే తలంచుచు విషయభోగముచే నశించుచున్నారు. ఎట్లన మత్స్యములు, మాంసఖండము, ఎర మొదలగుదాని యంతర్భాతమందుండు గాలమును తెలియక సుఖభోజ్య వస్తువని భ్రమించి భుజించి చచ్చునట్లున్నది. నరుల యొక్క స్థితి ! ఆహా ! ఏమి ఆశ్చర్యము.

**యథా ఖగో బలిం దృష్ట్వా స్వయం బంధాయ గచ్ఛతి ।**
**తథా భోగసుఖం లబ్ధ్వా వశ్యతాం యాతి మూఢధీః ॥**

ఏలాగున బోయువాడు వలయందుంచిన బలిని ( అనగా పక్షుల పట్టుటకు తగుతిండి వస్తువును) చూచి పక్షులు భ్రమించి బంధములో చిక్కి నశించునో ఆలాగున వివేకశూన్యుడు విషయభోగము నందుండు విషమస్థితి తెలియక సంసారపువలలో చిక్కుబడు చున్నాడు. ఇది ఇప్పుడు ప్రత్యక్షానుభవము. కొందరు విరక్తులై యుండియు గృహస్థుల యిండ్లలో భోజనసుఖము చూచి నిలిచిపోవుటచే చెడిపోవుచున్నారు.

**స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లభతే పరమ్ ।**
**స్వాతంత్ర్యాన్నిర్వృతిం గచ్ఛే త్స్వాతంత్ర్యాత్పరమం పదమ్ ॥**

పరుల కధీనులుగాక స్వతంత్రులై యుండువారు నిత్యసుఖము నొందుదురు. స్వాతంత్ర్యమువల్ల పరమపదము లభించును. స్వాతంత్ర్యముచే నిర్వాణము నొందుదురు. అనగా భోజనసుఖాదులను జూచి ముముక్షువులు పరుల యధీనమందుండరాదని అష్టావక్ర మునీంద్రుడు నుడివెను. అనగా మహాత్ము లగు గురువుల సేవ చేయక తిరిగినచో చెడిపోవును. ఇచ్చట భోజనసుఖము నాశించి సంసారుల యింటిలో నుండరాదని భావము.

మరియు దీని గూఢార్థము ఇంద్రియాదులకు లోపడక స్వస్వరూప మందు స్వతంత్రుడై యుండవలెనని భావము. చిలుకలను పంజరమందుంచి పండ్లు, తేనె, పాలు, శర్కరాదులు నిచ్చినను వానికి సుఖము లేదు. వానికి స్వేచ్ఛగా ఆకాశమందు విహరించి ఆకులు గాని, నీరు గాని దొరికినను పరమానందము. ఆలాగున నిజమగు బ్రహ్మనిష్ఠులకు పరులకు వశపడియుండి పాలు, పండ్లు ఫలాహారాదులు దండిగా దొరికినను సుఖముండదు. ఏకాకియై ఆకు గాని, నీరు గాని, మరిస్వల్పమైన భిక్షాహారము గాని దొరికినను ఏకాంత మందుండి బ్రహ్మనిష్ఠ చేయుట మహా సుఖకరము.

**సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినస్సుఖమ్ ।**
**సుఖార్థీ వా త్యజేద్విద్యాం విద్యార్థీ వా త్యజేత్ సుఖమ్ ॥**

ఇంద్రియాది విషయములతో సుఖాభిలాష గలవారికి విద్యజ్ఞానము యెక్కడిది ? విద్యాభిలాష గలవారికి సుఖమెక్కడిది ? సుఖాభిలాషియైనచో విద్యనభ్యసింపకుండుట మేలు. లేక విద్యార్థియై గొప్ప స్థితి గలుగవలెనని వివేకముండినచో ఇంద్రియాది సుఖములను విడువందగినది అని శ్రీ వ్యాసవచనము.

**త్యక్తసంగో జితక్రోధో లఘ్వాహారో జితేంద్రియః ।**
**పిధాయ బుద్ధ్యా ద్వారాణి మనో ధ్యానే నివేశయేత్ ॥**

బ్రహ్మవిచారవము చేయువాడు సంగరహితుడై, జితక్రోధుడై, అల్పాహారము కలవాడై, యింద్రియములను స్వాధీనపరచు కొన్నవాడై యుండి సర్వేంద్రియ వృత్తులను వివేక బుద్ధిచే నిరోధించి మనస్సును అంతర్ముఖము చేసి ధ్యానము చేయవలయును.

త్యజ దుర్జనసంసర్గం భజ సాధుసమాగమమ్ ।
కురు పుణ్యమహోరాత్రం స్మర నిత్యమనిత్యతామ్ ॥

మద్యమాంసములు గంజాయి వగైరా నీచాచారముగల దుర్జనుల సాంగత్యము విడచి శమదమాది జీవకారుణ్యములు గలిగి జితేంద్రియులగు సాధువు లతో సంసర్గము చేయవలయును. రేయింబవలు సాధ్యమైనంత పుణ్యాకార్యమే చేయుచుండవలెను. సర్వదా యీ పుత్ర మిత్ర కళత్రగేహాది సమస్త వస్తువులు అశాశ్వత మని మరవక ఉండవలెను. ఎందుకిట్లు చెప్పిన దనగా తపోధ్యాననిష్ఠాదులు చేయువారిని భంగపరచుటకై కొన్ని చైతన్యము గల విఘ్నదేవతలు గలరు. వారి విఘ్నమునుండి రక్షింపబడుట కొరకు మంత్రములచే దిగ్బంధమున్ను, కవచమున్ను జపించి తాపసులు తపోధ్యాన మందుండుదురు. ఆ విఘ్నదేవతలతో నిప్పుడు కొందరు స్థూలమగు మానవదేహములను ధరించి యున్నారు. వారెవరన నీచాచారపరులై పుణ్యకర్మములను చేయువారిని గూడ చేయకుండునట్లు చేయుచు రాజయోగుల మని చెప్పువారు. వీరు పరిశుద్ధమగు నిర్మలాచారముతో గూడి పరబ్రహ్మ ధ్యానము చేయువారిని చెరచుటకై సంచరించుచుందురు. కనుక ముముక్షువులు నిండా జాగరూకులై యుండవలసిన కాలమిది. వీరు పుణ్యకార్యము లన్నిటిని నిషేధము చేయుదురు. మద్య మాంస భోజన ప్రియులై యుండుదురు. ఇంద్రియములు వాటి వాటి పనిచేయుచున్నవే గాని తాను యేమియు చేయువాడు గాదని బోధించి నికృష్టకృత్యములు గుప్తముగా చేయుదురు. వీరి కృత్యము లంతయును పరీక్షించినచో పైశాచిక వృత్తి ననుసరించి యుండును.

# జీవకారుణ్యము

'మద్యపానరతో దైత్యః' అనగా సురాపానరతులు మనుష్య రూపులగు అసురు లనియు, ''మాంసాశీ చ నిశాచరః'' అనగా జంతువులను జంపి తినువారు మానవ రాక్షసులనియు నారాయణ స్మృతి గలదు. ఆహా ! మనుజులకు తినుటకై సర్వేశ్వరుడు సారవంతమైన గోధుమలు వగైరా ఎన్నో ధ్యానములున్ను, మధురమైన అనేక విధములగు పండ్లు, ఫలహారాదులున్ను, మనోబలము, దేహబలము గూడ గల్గించెడి ఉర్లగడ్డవగైరా యెన్నియో విధముల గడ్డలున్ను, కందిపప్పు వగైరా బుద్ధి గొప్పదిగా చేయు అనేక విధములగు పప్పు వగైరాలున్ను సృజించి యుండగా, వీటి నన్నిటిని తిని మానవులవలె నుండక జానెడు పొట్టకొరకు ఎన్నో లక్షల జీవములను చంపి తినుట ఎంత క్రూరకృత్యము ! ''పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా విశ్వదాభిరామ వినురవేమ'' అని శ్రీ వేమన యోగీంద్రుడుపదేశించెను. పందిని అత్తరు, పన్నీరు, కస్తూరి మొదలగువాటిచే అలంకరించినను దానికి దుర్గంధమైన బురదలో పొరలుట సంతోషము. అలాగున మన రాజయోగులలో కొందరికి అనేక విధములగు పిండివంటలతో భోజనము పెట్టినను శిష్యులపై ప్రీతి లేదు. మాంసము లేనిచో అన్నము తృప్తి లేదు. క్రూరస్వభావము గల పులికి కూడ వారాని కొక్కసారి యొక జంతువు దొరికినచో మరల పదిరోజులు ఆహార మావశ్యకము లేదు. మన రాజయోగులకు ఎన్ని జంతుహింసలు వారము లోపల జరుగుచున్నవి చూడుడు. అప్పుడు క్రూరజంతువగు పెద్దపులి గొప్పదా, రాజయోగి గొప్పవాడా, విచారింపుడు, ఆహా ! జంతువుల మెడలు గోయునప్పుడున్ను, మెడను విరుచునపుడును దాని యొక్క పరమదుఃఖఘోరదీన రోదనమున్ను, కాలుచేతులతో తన్నుకలాడి, గిర, గిర, చుట్టు తిరుగుటయు, మహాభయంకరముగా నెత్తురు చిల్లుటయు గాక ఈలాగు భయంకర కృత్యము చూచినచో యేపాపాత్ముని హృదయమైనను గరుగకుండునా ? హా ! ఘోర కృత్యము!

**జీవి జీవి జంపి జీవికి వేయగా**
**జీవివలన నేమి జిక్కియుండు,**

జీవహింసకులకు జిక్కునా మోక్షంబు ?
విశ్వదాభిరామ ! వినుర వేమ !

ప్రాణరక్ష కిలను పరమశివుని మీద
ధ్యాన మొనరలేక తగిలి నరుడు,
పుట్టి చచ్చుచుండు పుడమిలోపల పుట్టు
చదలుగాను వాడు జెందు వేమ !

నొసలు భక్తుడైన నోరు తోడేలయ్యె
మనసు భూతమువలె మలయుగాని,
శివుని గనియె నన్న సిగ్గాట గాదొకో
విశ్వదాభిరామ ! వినుర వేమ !

లలాటస్థలమున పరమభక్తునివలె విభూతియున్ను లేక నామము ధరించియుండినను, నోరుమాత్రము తోడేలు వలె జంతువుల పట్టి తినుటకై తెరచి పట్టుకొనియు, మనసు పిశాచివలె నీచకృత్యముల యందు సర్వదా సంచరించు చుండువారు శివుని ( బ్రహ్మము) నెరింగి యుండువారని చెప్పుటలో సిగ్గు లేదా అని వేమన యోగీశ్వరుడు చెప్పెను.

ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా భూతానామపి తే తథా ।
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః ॥

ఏలాగున తన ప్రాణములపై తన కత్యధికమైన ప్రేమ యుండునో, ఆలాగుననే సమస్త ప్రాణులకు వానిప్రాణములయందు ప్రేమ గలదు. కనుక సాధువులైనవారు తనవలెనే సర్వప్రాణులయందును దయయుంచి యుందురు.

మాంస భక్షైః సురాపానై ర్మూర్ఖైశ్చాక్షరవర్జితైః
పశుభిః పురుషాకారై ర్భారాక్రాంతాఽస్తి మేదినీ ॥

మాంసభక్షకులై, సురాపానరతులై, నిరక్షరకుక్షులై, మూర్ఖులై, మానవాకారము దాల్చియుండు పశువులను మోయుటవల్ల భూదేవి భారము సహింపలేక దుఃఖించుచున్నది.

అతిభోజనములు ఆహారనిద్రలు
సతితోను పొందుట పాపమిలను,
యిన్ని విడినవాడు వేదాంతపురములో
తన్నెరుగవచ్చు సత్యముగ వేమా !

ప్రాణిహింసాపరాణాం తు కల్ప కోటిశతం మునే ।
తత్ర తైలకటాహేషు గాఢం బధ్వా పదద్వయమ్ ॥
క్షిప్యతే యమ దూతేన . . . . . . . . . .

ఓ మునిసత్తమా ! ప్రాణిహింస చేయువారు కల్పకోటి శతము వరకు యమలోకమున తైలము బాగుగ గాచిన పెనములో రెండు పాదములను ధృఢముగా గట్టివేసి యమదూతలచే బాధింపంబడుదురు.

ఆత్మవత్సర్వభూతేషు కాయేన మనసా గిరా ।
అనుకంపా దయా సైవ ప్రోక్తా యోగాంగవేదిభిః ॥

బ్రహ్మవేత్తలచే సమస్త భూతములయందు తనవలె కర్మణా, మనసా, వాచా అనుకంపయే దయమని చెప్పంబడును. కనుక దయాళుడవై యుండుము. ఒక్కవేళ మాంసాహారముచే శరీర బలము కొంత హెచ్చుగా నుండునని కొందరు చెప్పుదురు. శరీర బలముండియు బుద్ధి లేనిచో ఏమి ప్రయోజనము ? బలిష్ఠుడుగ మూటలు మోయువానికి నెలకు పదునైదు రూపాయలు దొరకుట దుర్లభము. గొప్పబుద్ధి గలవారలు నెలకు పదివేలు సంపాదించుట మనము చూచుచున్నాము కదా! కనుక బుద్ధిశక్తి శాకభక్షణముచే కలుగునని అన్ని మతస్థులలో బుద్ధిశాలురు చెప్పుచున్నారు. దీనికి మనకు ఋషీశ్వరులే దృష్టాంతము. మాంసభక్షణకన్న శరీరబలములు శాకభక్షకులకు ఎక్కువ కలుగునని సైన్స్ శాస్త్రజ్ఞులు స్పష్టముగా నిరూపించుచున్నారు.

## పుణ్యకర్మము

సతాం సత్కర్మసంవేగః పురాణం ప్రణుదన్నయమ్ ।
వర్షౌఘ ఇవ భూతానాం దవానల మసేచయత్ ॥

సజ్జనుల సత్కర్మయొక్క పుణ్యజలముచే జన్మాంతరము నుండి వచ్చుచుండు సమస్త పాపకర్మములగు తాపత్రయాగ్ని, వర్షజలముచే దావాగ్ని శమించునట్లు నాశమొందునని శ్రీ గణేశగీత.

**క్షాలయంతి మలేనైవ మలం క్షాళనకోవిదాః ।**
**వారయంత్యస్త్రమస్త్రేణ విషం ప్రతివిషేణ చ ॥**

పాపకర్మములు పుణ్యకర్మములచే నశించి మనశ్శుద్ధి గలిగిన పిమ్మటనే జ్ఞాన ముదయించును. ఎట్లన చవిటిమట్టిచే వస్త్రమందుండు మాలిన్యము పోవునట్లును, ఆగ్నేయాస్త్రము వారుణాస్త్రముచే నశించునట్లును, విషము మరియొక పాషాణాది విషముచే నశించునట్లును, పుణ్యకర్మముచే పాపమంతయు నశించి నిర్మలుడై ముక్తుడవునని శ్రీ వసిష్ఠు లుపదేశించిరి. పుణ్యకర్మ మనగా బ్రహ్మనిష్ఠను చేయువారికి దేహపోషణ కొరకు తగు ధనము లేనిచో తపోధ్యాననిష్ఠ పూర్తి కొరకన్నవస్త్రాదు లిచ్చుటయు, సద్గుణ శీలురగు విద్యార్థులను గమనించి విద్య నేర్పుటయు, జలమునకు కష్టముగా నుండు స్థలములలో నీటి ఆధారము చేయుటయు, క్షామకాలములో కడుపేదలను గనిపెట్టి తగు సహాయము చేయుట మొదలగునవి గొప్ప పుణ్యఫలమేగాని కాశీ, రామేశ్వరములకుపోయి అచ్చట నుండు తీర్థవాసులకు గోదానము, భూదానము గౌరవము కొరకు ఇచ్చుట గాదు. ''దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతం'' అని శ్రీ భగవద్వచనము. దేశమనగా, జలాధార వసతులు లేక కష్టపడు స్థలము. కాలమనగా క్షామము చేతను, రోగముచేతను, జనులు తపించు సమయము. పాత్రమనగా బ్రహ్మనిష్ఠాది ధ్యాన యోగము చేయువారికి ఆహారాదులకు కష్టముండినచో, సహాయము చేయుట. ఈలాటి కార్యములు గమనించి చేయువా రుత్తములని శ్రీ వాసుదేవుల అభిప్రాయము. ఈ భగవదాశయము తెలియక కొందరు వివేక శూన్యులు పేరుకొరకు పెద్ద సమారాధనలు చేసి, కొందరికి మాత్రము అనేక విధములగు పిండి వంటలు తిని మిగులునట్లు జాస్తిగా పెట్టి విస్తళ్ళలో శేషింపించుటయు, కడుపేదవారు అనేకులు సమీపమందుండి ఆకటిబాధచే దీన స్వరముతో చూచి యేడ్చుటయు గొప్ప పుణ్యమని తలంచుట ఎంత గొప్ప బుద్ధిహీనత ! మరియు ఒక్క జాతిలో జన్మించిన వారిలో క్రూరులు గాని, పాపాత్ములు కాని యుండినను

మహాపరిశుద్ధ లని తలంచి అన్న వస్త్రాది దానములు చేయుటయు, ఇతరజాతియందు జన్మించు వారిలో మహాబ్రహ్మనిష్ఠులును, సదాచారాది సత్యధర్మనిష్ఠులును, ధనములేని వారును పరిశుద్ధులుగా నుండినను నీళ్ళు గూడ నివ్వరాదని తలంచుటయు మహా గొప్పతప్పు. ఇట్లు చెప్పువారు మహాధూర్తులు.

**యత్ఫలం లభతే మర్త్యః కోటిబ్రాహ్మణభోజనైః ।**
**తత్ఫలం సమవాప్నోతి జ్ఞానినం యస్తు భోజయేత్ ॥**

కోటి బ్రాహ్మణుల మృష్టాన్నభోజనముచే ఏ ఫలము గలదో, ఆ పుణ్యఫలము ఒకానొక బ్రహ్మనిష్ఠునకు భోజనము పెట్టినచో గలుగునని శ్రీశివగీత.

**కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే ।**
**కులాంస్తారయతే తేషాం దశ పూర్వాన్ దశాపరాన్ ॥**

పరమాత్మ ధ్యానము చేయువారి హృదయమునందు పడిన అన్నము ధ్యాననిష్ఠచే జీర్ణమైనచో ఆ ఫలము ఆ అన్నము పెట్టిన వారి పదితరముల మృతినొందిన వారిని, రాబోవు పదితరముల వారిని గూడ ధన్యుల గావించునని శ్రీ కృష్ణభగవంతు లుత్తరగీతయం దుపదేశించిరి.

**పరమాద్వైత విజ్ఞాన నిష్ఠస్యైవ మహాత్మనః ।**
**శుశ్రూషా క్రియతే యేన తత్పాదౌ మమ మస్తకే ॥**

ఎవడు పరమాద్వైత పరబ్రహ్మ విజ్ఞాన ధ్యాననిష్ఠయందుండు మహాత్మున కన్నవస్త్రాదు లిచ్చి శుశ్రూష చేయునో ఆ పుణ్యాత్ముని యొక్క రెండు పాద కమలములున్ను నాశిరముపై ధరించుచున్నానని శ్రీ బ్రహ్మదేవుడు బ్రహ్మగీతయం దుపదేశించెను. పాత్రాపాత్రముల యొక్క భేదము ఎట్లుండు ననగా మంచి సత్తువగల భూమి యందును, సామాన్య భూమి యందును, చవిటి భూమియందును విత్తనము చల్లిన ఏ ఫలమును కర్త పొందునో, అట్లుండునని విచారము చేసినచో ఒక్కరు చెప్పకనే అన్ని సంగతులు గ్రాహ్య మగును.

## సాధుసేవ

**న తపాంసి న తీర్థాని న శాస్త్రాణి జపశ్చ న ।**
**సంసారసాగరోత్తారే సజ్జనాసేవనం వినా ॥**

బ్రహ్మనిష్ఠులును, సదాచారసంపన్నులును అగు సజ్జనుల సేవ వినా తపస్సుచే గాని, తీర్థయాత్రలచే గాని, శాస్త్ర పఠనముచే గాని, జపముచే గాని మోక్షము పొందుటకు సాధ్యము కాదని శ్రీ వసిష్ఠుల మతము.

**స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాఽపి దత్తాఽవనిః**
**యజ్ఞానాం చ సమగ్రమిష్టమఖిలా దేవాశ్చ సంతర్పితాః ।**
**సంసారాచ్చ సముద్ధృతా స్స్వపితర స్త్రైలోక్య పూజ్యోఽప్యయం**
**యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥**

ఎవని మనస్సు పరబ్రహ్మధ్యానమం దొక్క క్షణమైనను స్థిరత్వము నొంది యుండునో, వాడు గంగ, యమున, గోదావరి మొదలుగా గల భూలోక మందుండు సకల తీర్థముల యందు విధి ప్రకారము స్నానముచేసిన ఫలమున్ను, ఉత్తమకాలమందు పరబ్రహ్మనిష్ఠులకు శ్రీ కాశిలో ఏకచ్ఛత్రాధిపతి సమస్త భూలోకమును దానము చేసిన ఫలమున్ను, వేయి యజ్ఞాదిక్రతువులు చేసిన ఫలమును, బ్రహ్మ, విష్ణు, శివాది సమస్త దేవతలను పూజించి తృప్తిపరచిన ఫలమున్ను పొందును. మరియు ప్రేతలోక మందున్న (పితృలోకము) తన వంశస్థులగు సమస్త పితరుల నుద్ధరించిన వాడగును. మరియు ఆ మహాత్ముడు ముల్లోకములయందు పూజింపబడిన వాడగును అని శ్రీ బాదరాయణవచనము.

**కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన ।**
**అపారసంవిత్సుఖసాగరేస్మిఁ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ॥**

ఎవనియొక్క మనస్సు అపారసంవిత్సుఖ సాగరమగు ఆ పరబ్రహ్మమందు లీనమై యుండునో, ఆ పుణ్యపురుషుని మహిమచే వారి కులము గూడ పావన మగును. తల్లి ధన్యురా లగును. లోకము గూడ పవిత్ర మగును.

**నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్ ।**
**అను వ్రజామ్యహం నిత్యం పూయేయే త్యంఘ్రిరేణుభిః ॥**

అపేక్షారహితుడై, శాంతుడై, ఒక్కరియందును వైరము లేనివాడై ప్రాణులయందు దయగలవాడై, బ్రహ్మవిచారములో సర్వదా మననము

చేయువాడగు మహాపుణ్యాత్ముని యొక్క వెనుక సర్వదా నేను తిరుగు చున్నాను. ఆ మహాత్ముని పాదధూళివల్ల లోకము పావన మవునని శ్రీ కృష్ణభగవంతుడు శ్రీ భాగవతమునం దుపదేశించిరి.

**సుగోత్రో యో ద్విజో యజ్ఞాన్ కృత్వాంతే యత్ఫలం లభేత్ ।**
**గచ్ఛతః సాధుసాన్నిధ్యం తత్ఫలం స్యాత్పదే పదే ॥**

మంచి గోత్రమున జన్మించిన బ్రాహ్మణుడు విధి ప్రకారము యజ్ఞములు చేసిన దాని అంత్యమందు యేయొక్క గొప్ప పుణ్యము గలుగునో, ఆ పుణ్య ఫలము మహాత్ములను దర్శించుటకై ప్రయాణమై పోయెడు ఒక్కొక్క కాలి అడుగునకు లభించునని విచారమాల.

**దయాజపాదిదర్మైర్భ్యస్తపస్సంయమ దానతః ।**
**యత్ఫలం ప్రాప్యతే తద్ధి నిశ్చితం సాధుసంగతః ॥**

జీవకారుణ్యము, మంత్రజపము, తపస్సు, ఆత్మసంయమము, దానము వగైరా ధర్మములచే యే యొక్క ఫలము గలుగునో, ఆ ఫల మంతయును నిశ్చయముగా బ్రహ్మనిష్ఠులగు సాధువుల సాంగత్యము చేసిన సిద్ధించును.

**యస్య గేహం సముద్దిశ్య జ్ఞానీ గచ్ఛతి సువ్రత ।**
**తస్య క్రీడంతి పితరో యాస్యామః పరమాం గతిమ్ ॥**

ఓ నాయనా! జ్ఞానియగు మహాత్ముడు సంతోషముగా ఎవరి గృహమునకు వచ్చునో, ఆ గృహస్థునియొక్క మరణించిన పరంపరగానుండు పితరులు పరమగతి పొందుదుమని ఆనందభరితులై తాండవము చేయుచున్నారు.

**సత్సంగ కల్పవృక్షోఽసౌ సర్వాభీష్ట ఫలప్రదః ।**
**సువాక్యామృతవర్షేణ త్రీంస్తాపాన్ హరతే క్షణాత్ ॥**

సాధుసంగమనెడి కల్పవృక్షము సర్వాభీష్టము నిచ్చునది. మరియు సాధువుల యొక్క వాక్యామృత వర్షముచే తాపత్రయాగ్ని క్షణములో నశించును.

**గురుభక్తిం సదా కుర్యాచ్ఛ్రేయసే భూయసే నరః ।**
**గురురేవ హరిస్సాక్షాన్నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ॥**

మహా శ్రేయస్కరమగు శుభముకొరకు నరుడు సర్వదా గురుభక్తిని చేయవలయును. గురువు సాక్షాత్తు నారాయణుడని వేదము జెప్పుచున్నది. గురుడు సాధారణ మానవుడని తలంపరాదు అని బ్రహ్మ విద్యోపనిషత్.

**సర్వేషామపరాధానాం యతినిందా గరీయసీ।**
**యతిర్నారాయణస్సాక్షాత్తస్మాత్తాం పరివర్జయేత్॥**

అన్ని అపరాధములలో బ్రహ్మనిష్ఠులను నిందించుట గొప్ప పాపము. జ్ఞానియగు బ్రహ్మనిష్ఠుడు సాక్షాత్ నారాయణ స్వరూపుడు. ''సాధుబాధా కులక్షయం'' గనుక సాధువులను ఎప్పుడును దూషణ చేయరాదు.

**ఉత్తమస్యాపి వర్ణస్య నీచోఽపి గృహమాగతః।**
**పూజనీయో యథాయోగ్యం సర్వ దేవమయోఽతిథిః॥**

ఉత్తముడగు బ్రాహ్మణ గృహమునకు చండాలుడు అతిథిగా వచ్చినను తనయొక్క యోగ్యతానుసారముగా పూజించవలెను. అతిథి సర్వదేవతల యొక్క స్వరూపుడని శ్రుతి చెప్పుచున్నది.

**కపిరపి చ కాపిశాయనమదమత్తో వృశ్చికేన సందష్టః।**
**అపి చ పిశాచగ్రస్తః కిం బ్రూమ స్తస్య వైచిత్ర్యమ్॥**

మనస్సు యొక్క చంచలత్వము చెప్పుచున్నారు. కోతి స్వాభావికముగ అతి చంచలమైనది. మరియు అది కల్లుగూడ త్రాగెను. అట్లుండు కోతిని ఒక పిశాచి కూడ పట్టెను. ఇదియును చాలక తేలు కుట్టెను. అదియును గాక పిచ్చి పట్టెను. అప్పుడు ఆకోతియొక్క చపలత్వము ఎంత విచిత్రముగా నుండునో అంత విచిత్రమైనది మనస్సు. అట్టి మనస్సు నిశ్చలమొందినచో జీవన్ముక్తి కలుగును. దీనికి భక్తియే ముఖ్యసాధనము.

## దైవభక్తి

**సత్యం సత్యం పునస్సత్యం ఉద్ధృత్య భుజముచ్యతే।**
**ప్రసాదాదేవ సర్వేషాం సర్వసిద్ధి ర్మహేశితుః॥**

నేను సత్యముగాను, సత్యముగాను, మరల, మరల సత్యముగా చేతులు పైకెత్తి చెప్పుచున్నాను. అదేమన సమస్త ప్రాణులకును సర్వేశ్వరుని యొక్క

ప్రసాదమువల్ల, మనోనిశ్చలత కలిగి మోక్షము దొరకునే గాని మరి ఏయొక్క విధముచేతను సాధ్యము గాదని సూతసంహిత.

**శివప్రసాదేన వినా న సిద్ధిః శివప్రసాదేన వినా న బుద్ధిః ।**
**శివప్రసాదేన వినా న యుక్తిః శివప్రసాదేన వినా న ముక్తిః ॥**

పరమశివ ప్రసాదము లేనిచో, ఏ యొక్క సిద్ధియు కలుగదు. పరమేశ ప్రసాదహీనులకు బ్రహ్మబోధయను బుద్ధియుండదు. దైవ కరుణ లేనివారికి యోగసిద్ధియును గలుగదు. ఈశ్వర ప్రసాదము లేనివారికి ముక్తియును సిద్ధింపదు.

**భక్తిరేవ పరమార్థదాయినీ భక్తిరేవ భవరోగనాశినీ ।**
**భక్తిరేవ పరవేదన ప్రదా భక్తిరేవ పరముక్తి కారిణీ ॥**

భక్తియొకటియే పరమార్థమగు బ్రహ్మజ్ఞాన మిచ్చునది. భక్తియొకటియే జనన మరణ భవరోగమును నాశము జేయునది. భక్తియొకటియే పరమతత్త్వమును ప్రకాశము చేయునది. భక్తియే పరమముక్తికి కారణము. కావున భక్తియే చేయవలసినది.

**శుకాద్యాః సనకాద్యాశ్చ పురా ముక్తా హి భక్తితః ।**
**భక్త్యైవ మామనుప్రాప్తా నారదాద్యా శ్చిరాయుషః ॥**

భక్తివలననే పూర్వము శుకాదులగు బ్రహ్మ ఋషులును, సనక్కాదులగు యోగీంద్రులును ముక్తులైరి. భక్తివలననే నారదాది మహర్షులు పరమాత్మను బొంది శాశ్వత సుఖస్వరూపులైరి.

**వృక్షస్య మూలసేకేన శాఖాః పుష్యంతి వై యథా ।**
**శివధ్యానేన దేవాశ్చ తథా తృప్తా భవంతి హి ॥**

ఏలాగున వృక్షముయొక్క మూలమున (మొదలు) జలము పోసినచో అన్ని శాఖోపశాఖలున్ను చిగురించి పుష్పించునో, ఆలాగున పరమేశ్వర ధ్యానము వల్ల బ్రహ్మ, విష్ణు ఆది సమస్త దేవతలున్ను తృప్తు లగుదురు.

**నారాయణేతి యస్యాస్తే వదనే నామ మంగళమ్ ।**
**నారాయణ స్తమన్వేతి వత్సం గౌరివ వత్సల ॥**

ఓ నాయనా! ఎవనియొక్క జిహ్వాగ్రమందు పరమమంగళమగు నారాయణ నారాయణ అను పవిత్రనామము వసించునో-వాని యొక్క వెనుక, పరమాత్ముడగు శ్రీమన్నారాయణుడు దూడను వెదకు గోవు వలె తిరుగుచునే యుండును.

**క్రిమికీటపతంగాశ్చ క్షుద్రా అపి చ జంతవః ।**
**సర్వమాత్మతయా భాతి ప్రసాదాత్ పారమేశ్వరాత్ ॥**

క్రిమి, కీటం, మిడుత మొదలుగాగల సమస్త జంతువులలో గూడ పరమేశ్వర ప్రసాదము గలిగినచో పరబ్రహ్మరూపము ప్రకాశించును.

**పశవశ్చ మృగాశ్చైవ పన్నగాః పాపయోనయః ।**
**సర్వమాత్మతయా భాతి ప్రసాదాత్ పారమేశ్వరాత్ ॥**

పశువులు మొదలుగా గల సమస్త మృగములున్ను, పాప యోనులగు సర్పాదులున్ను పరమేశ్వర ప్రసాదము గలిగినచో సమస్తము ఆత్మరూపమై ప్రకాశించును.

**అనేక కర్మసక్తోఽపి శివజ్ఞానవివర్జితః ।**
**శివభక్తివిహీనశ్చ సంసారీ నైవ ముచ్యతే ॥**

అనేకములగు పుణ్యకర్మములు చేసిన వాడైనను పరమ శివునియందు భక్తిలేనివాడై శివునియొక్క మహిమ తెలియక యుండినచో, సంసారచక్రము నందు తిరుగుచుండవలయునే గాని మోక్షము నొందజాలడు.

**యథా తోయప్రవాహానాం సముద్రః పరమావధిః ।**
**తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠా మహేశ్వరః ॥**

గంగ, యమున, తామ్రపర్ణి, సింధు, నర్మద మొదలగు సమస్త నదులును ఉత్తర, దక్షిణ, పూర్వ, పశ్చిమాది ముఖమై ప్రవహించుచుండినను, అంతయు మహాసముద్రములో పోయి కలియునట్లు ఏయే దేవతలను భక్తితో పూజించి ధ్యానించినను సాక్షాత్ పరమశివుని యందైక్యము గలుగును.

**చతుర్వేదార్థ తత్త్వజ్ఞా శ్చతుశ్శాస్త్రవిశారదాః ।**
**యజ్ఞదాన తపోనిష్ఠా న మే రూపం విదంతి తే ॥**

భక్తిలేనిచో నాలుగు వేదములు జదివి అర్థము తెలుసుకొన్నను, ఆరు శాస్త్రములలో పాండిత్యముండినను, యజ్ఞదానాది తపోనిష్ఠలో కుశలుడైనను పరమాత్మస్వరూప మెరుంగజాలడు.

**సర్వభూతేషు కారుణ్యం ప్రియభాషణమేవ చ ।**
**సర్వభూతహితే శ్రద్ధా సాక్షాత్ భక్తిశ్శివస్య తు ॥**

పరమ శివునియొక్క సాక్షాత్ భక్తియేది యన సమస్త భూతముల యందు కారుణ్యము, అందరియందు ప్రేమయు, సర్వభూతహితమై యుండుటలో శ్రద్ధయు, అన్ని జీవరాసులయందు ఈశ్వరుని జూచుటయు అనునదే సరియైన భక్తియనంబడును. ఈనిర్మల భక్తిగల వారికి మరియేయొక్క దైవభక్తి యుండపనిలేదు. ఈపరిశుద్ధ భక్తిలేనిచో తక్కిన భక్తి యంతయు వ్యర్థము.

**సర్వమేతత్పరం బ్రహ్మ పశ్యేత్ స్వానుభవేన చ ।**
**ముచ్యతే ఘోరసంసారాత్ సద్య ఏవ న సంశయః ॥**

ఎవడు స్వానుభవనిష్ఠచే ఇదియంతయును బ్రహ్మరూపముగా జూచుచుండునో, వాడు జననమరణరూప మగు ఈ సంసారము నుండి అప్పుడే ముక్తుడగును.

**వ్యవహారదృశా మాయా కల్పితా నైవ వస్తుతః ।**
**వస్తుతః పరమాద్వైత బ్రహ్మైవాస్తి న చేతరత్ ॥**

అజ్ఞానదృష్టిచే మాయ యుండును. అది వ్యవహారావస్థ యనియు, మాయచేత కల్పితమనియు, వాస్తవముగా లేదనియు గోచర మగును. వాస్తవస్థితిలో పరమాద్వైతమగు బ్రహ్మ మొకటియే గాని యితరము లేదు.

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి ॥**

ఏలాగున ఆకాశమునుండి వర్షించు జలబిందువులు అనేక మార్గములుగా ప్రవహించినను ఏకమగు సముద్రములో ఐక్యమగునో, ఆలాగున ఏయే దేవతలను భక్తితో సేవించినను శ్రీమన్నారాయణునియందే పోయి చేరును.

**ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।**
**సర్వదేవనమస్కారః శంకరం ప్రతి గచ్ఛతి ॥**

దీనియర్థము అందరున్ను ఏలాగున భజించినను శ్రీ పరమేశ్వరునే పొందుచున్నారనుట. ఇట్లు చెప్పుటచే శివకేశవులను భేదబుద్ధితో విచారము చేయకూడదని భావము.

## ఏకం సత్

''ఏకం సత్ విప్రా బహుధా వదంతి'' అని శ్రుతి. అనగా సత్తామాత్రుడగు బ్రహ్మమొక్కటియే నిత్యమైయుండునది. ఆ బ్రహ్మ యొక్క సత్యసంధత. సమత్వము, దయాళుత్వము, నిత్యత్వము, ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయాదులనుబట్టి పండితులు అనేక విధములుగాను, పలు పేర్లుగాను చెప్పుదురు.

**యే నమస్యంతి గోవిందం తే నమస్యంతి శంకరమ్ ।**
**యేఽర్చయంతి హరిం భక్త్యా తేఽర్చయంతి వృషధ్వజమ్ ॥**

ఎవరు శ్రీమన్నారాయణునికి నమస్కారము చేయుదురో వారు శ్రీపరమశివునిగూడ నమస్కరించిన వారౌదురు. ఎవరు భక్తితో హరిని పూజించుదురో వారు ఈశ్వరునిగూడ పూజించిన వారలే.

**యే ద్విషంతి విరూపాక్షం తే ద్విషంతి జనార్దనమ్ ।**
**యే రుద్రం నాభిజానంతి తే న జానంతి కేశవమ్ ॥**

ఎవరు విరూపాక్షుడగు ఈశ్వరుని దూషించెదరో, వారు జనార్దనుడగు నారాయణుని గూడ దూషించిన వారే. ఎవరు శివుని భక్తితో పూజించి తెలుసుకొనరో, వారు నారాయణుని గూడ పూజించి తెలిసికొన జాలరు అని రుద్రహృదయోపనిషత్.

**యో మాం గురుం పాశుపతం వ్రతం ద్వేష్టి నరాధిప ।**
**విష్ణుం వా స న ముచ్యేత జన్మకోటిశతైరపి ॥**

ఓ నరాధిపా ! ఎవడు పశుపతి అనువ్రతమును ధరించియుండు నన్ను

(శివుని) దూషించునో, ఆలాగుననే నాయందు భక్తిగలవాడై శ్రీమన్నారాయణుని దూషించునో వాడు శతకోటి జన్మము లెత్తినను సంసారమునుండి విముక్తుడు కాడు.

**యే చ మూఢా దురాత్మానో భిన్నం పశ్యంతి మాం హరేః ।**
**బ్రహ్మాణం చ తదా తేషాం భ్రూణహత్యాసమం త్వఘమ్ ॥**
**హరిరేవ శివస్సాక్షాచ్ఛివ ఏవ హరిస్స్వయమ్ ।**
**తయోర్భేదం ప్రకుర్వాణో రౌరవం నరకం వ్రజేత్ ॥**

ఏ దురాత్ములగు మూఢాత్ములు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను భేద భేదముగా చూచుదురో అట్లుండు క్రూరులు గర్భిణీస్త్రీని జంపిన పాపము ఏది గలదో ఆ పాపమునకు పాత్రులగుదురు. సాక్షాత్ హరియే సాక్షాత్ శివుడు, వారి యిరువురిలో భేదము గల్పించు పాపి రౌరవ నరకమును పొందును అని భవిష్యత్ పురాణము. ఇది తెలియక దైవదూషణపరులై అనేకులు నరకము నొందుచున్నారు. మానవులలో విద్యాభ్యాస సద్గుణములు గల వివేకులగు బ్రాహ్మణాదులందు దైవ దూషణ అంత అధికము లేదుగాని విద్యావిహీనులున్ను, జాతిలో తక్కువ స్థితియందుండు వారలు దైవ దూషణ నిండుగ చేయుచున్నారు. వీరిలో వైష్ణవులలో కొందరు శివుని దూషించుదురు. శైవులలో కొందరు విష్ణువును దూషించుచున్నారు. ఎంత బుద్ధిహీనత !

ప్రశ్న ॥ పతివ్రతయగు నారీరత్నము ఇతర పురుషునితో చేరునా ? ఒకవేళ చేరినచో భర్త అప్పుడే త్యజింపడా !

ఉత్తరము ॥ ఈ తెలివి లేని మాటలను వినిగదా మానవులకు పరస్పర సహోదరస్నేహ మంతరించి ఈ దేశమున ఆవులకున్ను పులులకున్ను, మార్జాల మూషికములకు గల కలహము రీతిగా విషజ్వాలతో సమమగు వైరము జనించినది. ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్క పురుషు డుండుట్లు ఈశ్వరులుగూడ అనేకు లున్నారా ? ఆహా ! ఎంత అంధకారము ! రాగ, ద్వేష, కామ, క్రోధయుక్తుడైన మానవునితో సమానముగ ఒక్కడై. నిత్యుడై, వ్యాపకుడై, శుద్ధుడై, దయాళువైన ఈశ్వరుని ఇట్లుపమించు టెంత బుద్ధిహీనత ? ఒక్క స్త్రీ తనపతియందు

భక్తిగానుండియు, ఆ పతియొక్క అన్న దమ్ములను, మామలను ఇతర పురుషులను గూడ దూషించుట మంచిదని తలంచువా రెవరైన గలరా ? ఆహా ! ఎంత బుద్ధిహీనత నాయనా, ఈశ్వరు లనేకులు లేరు. ఈశ్వరుం డొక్కడే. ఈశ్వరుని ఒక్కొక్క మతస్థులున్ను వేరు వేరు పేరుబెట్టి పిలిచినను ఆ భగవంతుడు ఒక్కడే. తన భార్యకు యజమానుడు ( లేక భర్త) యని చెప్పుట సమాజము, కాని వానిని యింకొక్కరు అన్న యనియు, మరియొకడు తమ్ము డనియు, కొడుకు నాయన యనియు, మరియొకడు మామ యనియు, ఒక్కడు మిత్రుడనియు వాని స్వదేహసంబంధులు పిలుచుట విని అందరతోను ''యజమానుడని పిలువుడు. భర్తయని చెప్పుడు'' అని ఆ జనులతో పోట్లాడు స్త్రీయొక్క బుద్ధి గొప్పతనము ఏమి చెప్పవచ్చును ! ఆలాటి పాపోపదేశము గుప్తముగా నుపదేశించుట గదా మనదేశము పాడగుటకు కారణమైనది.

దీని కొక కథ శ్రీదయానంద సరస్వతీస్వాములు సత్యార్థప్రకాశిక యందు వ్రాసిరి. అది యేమన, ఉత్తర దేశమున ఒక బైరాగి యుండెను, అతనికి ఇద్దరు శిష్యులుండిరి. వారిరువరకున్ను పరస్పర విరోధము గలదు. ఒక్కరు గురువుయొక్క ఎడమకాలును, మరియొకడు కుడికాలును రాత్రియందు పట్టుకొని సేవ చేయుచుండిరి. ఒక్క దినమున సేవాసమయమందు ఒక్క శిష్యుడు బజారునకు పోయియుండెను. మరియొకరు మామూలు ప్రకారము తన భాగమగు పాదమును బట్టి పిసుకుచుండెను. గురువుయొక్క రెండవపాదము వీడు పిసుకుచుండు పాదముపై బడెను. అప్పుడు యితరుని భాగమగు పాదము తన భాగముపై పడినందున కోపముచే కఱ్ఱ తీసు కొని ఈడ్చి గొప్ప దెబ్బ వేసి ఆపాదమును దూరముగ విసరివేసెను. ఈ మధ్యలో బజారునకు పోయినవాడు వచ్చెను. వాని భాగమగు గురుపాదము చూడగా నిండా వూది యండెను. కారణ మడుగగా గురువు దగ్గరనుండు మూర్ఖశిష్యుని యొక్క వృత్తాంతము చెప్పెను. అప్పుడు బజారునకు పోయి వచ్చినవాడు వీనిపై కోపోద్దీపితుడై నీభాగమగు కాలు చూడుము అని చెప్పి వాడు పిసుకుచుండు పాదమును పెద్దకొయ్య తీసుకొని బాగుగ మర్దించెను. వీడున్ను మరి యొక్క కొయ్యతీసుకొని బజారునకు పోయిన వాని భాగమగు గురుని పాదమును విరుగగొట్టెను. అప్పుడు గురువు వీరి బాధ

కోర్వలేక పెద్ద కేక వేసెను. అప్పుడు సమీపమందుండు మనుష్యులు పరుగెత్తుకొని వచ్చి వృత్తాంతము తెలిసికొని ''ఒరే మూర్ఖులగు శిష్యులారా! ఏమి పని చేసితిరి? మీ యొక్కొక్కరికిని గురుపాదములు వేరువేరుగా సేవించుటకు దొరికినను పాదములు రెండును ఒక్క గురునివేగదా ! ఆహా ! ఏమి మూర్ఖత్వము'' అని సమాధానము చెప్పిరి.

ఇప్పుడు ఈరీతిగా శైవులున్ను, వైష్ణవులున్ను ఈశ్వరు డొక్కడని తెలియక పై మూర్ఖ శిష్యులవలె పోట్లాడి చచ్చుచున్నారే. ఆ బైరాగిశిష్యులెంత వివేక శూన్యులో వీరును అలాటివారే. మరియు నలుగురు పుట్టంధులు ఏనుగులను చూడ వలయునని అభిలాష గలవారైరి. ఆ సంస్థానాధి పతియగు వాజు ఏనుగును పాలించెడి మావటివానితో ఏనుగును వారికి చూపమని చెప్పెను. అప్పుడు ఒక గొప్ప ఏనుగుయొక్క మావటివాడు ఒక్క గ్రుడ్డివానిని కడుపు దగ్గరనున్ను, మరియొకరిని తొండమువద్దను, ఇంకొకరిని పాదముల సమీపమునను, ఒక్కరిని తోక సమీపమునను నిలిపి ఏనుగును చూడుడు అని చెప్పగా అందరున్ను వారివారి చేతికందు స్థలమంతయును తడవి చూచిరి. అప్పటినుండి నలుగురున్ను ప్రయాణము చేసి ఒక్కమార్గమధ్యమున గూర్చుండి యేనుగును వర్ణన చేయుటకు ప్రారంభించిరి. ఉదరము చూచినవాడు ఏనుగు గుండ్రముగా నుండు బండరీతియనియు, కాలు తడివిన వాడు ఏనుగు రోకటివంటి దనియు, తొండము పట్టినవాడు ఏనుగు అట్లు కాదు చిన్న స్తంభమువలె నుండుననియు, తోకచూచినవాడు మీరు చెప్పిన దంతయు తప్పు, నేను బాగుగా జూచితిగదా ఏనుగు వీధిలోఊడ్చు పొరకవలె నుండుననియు వాదము చేసికొని కలహించుచుండిరి. మార్గమధ్యమున ఒక ఆప్తుడు వచ్చెను. వాడు వీరి కలహకారణము తెలిసికొని ''అంధులారా ! మీరు ఏల వాదులాడుచున్నారు. మీరెవరున్ను ఏనుగును సంపూర్ణముగా జూచిన వారుకారు. కాని మీరు చూచినదంతయును ఏనుగు యొక్క యొక్కొక్క భాగములు. ఆ యంగము లన్నియును జేరినది ఏనుగని గ్రహింపుడు'' అని చెప్పెను.

ఆలాగున ఈశ్వరు డనంతుడు, అవ్యక్తుడు, వ్యాపకుడు, పరిశుద్ధుడు, మనోవాక్కుల కతీతుడు. కనుక ఒకరును ఈశ్వరుని సంపూర్ణముగా ఎరుంగ

జాల కుండుటచే అంధులవలె వాదించుచున్నారు. కాని వారు వాదించిన దంతయు సత్యము. మరియు ఒక్కమార్గమధ్యమున చెట్టు క్రింద ఒక్కసాధువు తపస్సు చేయుచుండెను. ఆచెట్టునందు ఒక్క యూసరవెల్లి యుండెను. ఆదారిలో ఒక్కరు వచ్చేటపుడు ఆజంతువు ఎఱ్ఱరంగుగా నుండెను. మరి యొకరు రాగానే నలుపువర్ణ మాయెను. ఇంకొకరు చూచునపుడు ఊదావర్ణముగా నుండెను. వీరు ముగ్గురున్ను ఒక్క స్థలమందుచేరి ఆచెట్టులో నుండు జంతువు నలుపనియు, మరియొకడు కాదు కాదు ఎరుపువర్ణ మనియు, మూడవవాడు పసుపువర్ణ మనియు వాదించిరి. అప్పుడు అచ్చటనుండువారు వీరి వాదమునకు కారణ మడుగగా దీనినిశ్చయము తెలిసికొనుటకై ఆచెట్టు క్రింద ఒక్క సన్న్యాసి యున్నారనియు వారిని విచారించినచో సంశయము నశించు ననియు చెప్పిరి. వారు ఆసాధువు వద్దకుపోయి ''ఓస్వామీ! దీనియందుండు జంతువు ఎఱ్ఱవర్ణము గలది గదా!'' సాధువు ''అవును''. మరియొకడు ''ఏమి స్వామీ అది నల్లనివర్ణము గలదిగదా ?'' సాధువు ''అవును''. మరియొకడు. ''ఏమండి అయ్యా సాధుగారూ ! ఆజంతువు పసుపురంగు గలదిగదా ?'' సాధువు ''అవును'' ఇట్లుండగా ఇతరజనులు ''ఏమి స్వామిగారూ ! అందరితోను సరిసరియని చెప్పుచున్నారే !'' సాధువు ''ఓ నాయనలారా ! ఈజంతువు ఊసరవెల్లి, దీనికి యింక అనేక వర్ణములు యిష్టానుసారముగా నెత్తు శక్తి గలదు. మీరు చూచిన జంతువు ఒకటియే. దానికే యిన్ని రంగులు గలవు. దీనిని నేను బహుకాలమునుండి చూచుచునేయున్నాను'' అని సమాధానము చెప్పి అందరిని సంతోషపరచెను.

ఆచిన్న జంతువునకు ఇంత శక్తియుండునపుడు సర్వేశ్వరుడగు భగవంతునకు ఎన్నో వేషములున్ను, రూపములున్ను ఎత్తుటకై శక్తి గలదని తెలియక మానవులు వాదము చేయుచున్నారు. ఒక్కనాటకశాలయందుండు ఒక్కవేషధారి ఒక్కరాత్రియందు ఎన్ని వేషములు వేయుచున్నాడు ! ఈలాటి విచారము చేయక మానవులు పశుప్రాయులై వాదులాడుచున్నారు. ఎన్నియో స్థలములలో శంకరనారాయణ క్షేత్రములున్ను, గొప్ప గొప్ప హరిహరాలయములున్ను గలవు. కొడుగుదేశములో ధర్మస్థలమున శంకర నారాయణ క్షేత్రమొకటి గొప్పది గలదు. ఈలాగుననే యుత్తరదేశములో హరిహరాలయము లనేకములు గలవు. ఈలాటి

వివాదముచే యితర మతస్థులు పవిత్రమైన హిందూమతమును పరిహాస పాత్రముగా జేసిరి.

**సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితమ్ ।**
**బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్ ॥**

సమస్తజాతి వర్ణాశ్రమములయందును. సమస్త ప్రాణులయందును సముడై, సాక్షిమాత్రుడైన పరబ్రహ్మరూపమును ధ్యాన విచారాదులచే జూచువాడు బ్రహ్మకారుడై స్వయముగా ముక్తుడగును.

## జపము

**ఏకాంతే విజనే రమ్యే గుహాయాం పుణ్యభూమిషు ।**
**రహితే మశకైర్దంశై ర్దేవాయతన కేఽపి వా ॥**

**సిద్ధక్షేత్రే మహాతీర్థే ధ్యానసిద్ధిః ప్రజాయతే ।**
**తత్ర సిద్ధాసనం బద్ధ్వా ఋజుకాయస్తు కారయేత్ ॥**

ఏకాంతమందును, లేక జనశబ్దములేని ఇంటియందును, మనోహరమగు ఇతర స్థలమందును, కొండగుహయందును, పుణ్య భూమియందును, దోమలు మొదలగు జంతువులచే బాధలేకుండుచోటునను, దేవపూజాదులు చేయు స్థలమందును, సిద్ధక్షేత్రమందును ( నిర్మలభూమి), పుణ్యతీర్థ తీరమందును ధ్యానము చేయువారికి శీఘ్రముగా ధ్యానసిద్ధి నిర్విఘ్నముగా సిద్ధించును. ఆలాటి స్థలములలో దేనిలో అనుకూలముగా సిద్ధించునో అచ్చోట సిద్ధాసనమందు కూర్చుండి శిరసు, మెడ, శరీరము చక్కగ నిలిపి ఏకాగ్రచిత్తము గలవారై ధ్యానము చేయవలయునని యోగమార్తాండము చెప్పుచున్నది.

**యేన కేన ప్రకారేణ సుఖం స్థైర్యం చ జాయతే ।**
**తత్ సుఖాసనమిత్యుక్తమశక్తస్తత్ సమాశ్రయేత్ ॥**

పై చెప్పిన సిద్ధాసనమందుండి ధ్యానము చాలాసేపు చేయుటకై సాధ్యము లేనివారు పద్మాసనము గాని, వీరాసనము గాని, లేకయే యేప్రకార మధిక సమయము స్థిరముగ కూర్చుండి ధ్యానము చేయుట సాధ్యమగునో ఆలాటి ఆసనమందు కూర్చుండి ధ్యానము చేయుట శ్రేష్ఠము. దీనికి సుఖాసనమని పేరు.

**నద్యాస్తీరే పుణ్యదేశే దేవతాయతనే తథా ।**
**గృహే వా సుశుభే దేశే విజనే జంతువర్జితే ॥**

నదీతీరమందును, పుణ్యస్థలమందును, హోమ యజ్ఞాదులుచేయు పుణ్యస్థలమందును, స్వగృహమందును, శుచియగు ప్రదేశమునందును, విజనస్థలమందును, పులి, పాము, తేలు మొదలగు దుష్టజంతువుల బాధలేని ప్రదేశమందును ధ్యానము చేయవలయును.

**యుంజీత యోగీ సతతమాత్మానం మత్పరాయణః ।**
**జపమాలాం గృహీత్వా తు ప్రణవార్థమనుస్మరేత్ ॥**
**జపేద్ద్వాదశసాహస్రం ప్రణవస్య ప్రయత్నతః ॥**

ఆలాటి స్థలమునం దాసీనుడై ధ్యానయోగి మనస్సును పరమాత్మ యందు సంయోగపరచి, బ్రహ్మభావనతో జపమాలను గ్రహించి ప్రణవార్థ మగు బ్రహ్మమును తదేక ధ్యానముతో గూడినవాడై ప్రయత్న పూర్వకముగ ప్రణవ మంత్రమును 12 వేలు దిన మొక్కింటికి జపముచేయుట యుత్తమ జపమనంబడును.

**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః ప్రత్యాహృత్య మనశ్చలమ్ ।**
**ప్రత్యగాత్మని సంస్థాప్య ధ్యానం కుర్యాద్యతిః సదా ॥**

ఇంద్రియాది విషయములనుండి యింద్రియములను వశీకరించి, ప్రత్యగాత్మయందు లీనపరచి బ్రహ్మనిష్ఠుడు సర్వదా ధ్యానము చేయవలయును.

**సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః ।**
**తథాత్మమనసోరైక్యం సమాధిరభిధీయతే ॥**

ఏలాగున ఉప్పునీటిలో గలియునపు డుప్పురూపము గనుపడక జలమయమ్మై యుండునో, ఆలాగున ధ్యానమందు మనోవృత్తులు నశించి బ్రహ్మాకారమ్మై యుండు స్థితియే సమాధి యనంబడును.

**మృద్వాసనే సమాసీనో జితచిత్తేంద్రియక్షమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ ప్రసీదతి ॥**

మెత్తని ఆసనమందు గూర్చుండి యింద్రియాది వృత్తులను నిశ్చలముగా చేసుకొని, మనస్సు లీనమై బ్రహ్మాకారమగు పర్యంతము ఓంకార మంత్రమును పరమాత్మ పరముగా భావనచే ధ్యానము చేయవలయును.

**ప్రణవాదపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి।**
**ఓంకారస్సర్వమంత్రాణాముత్తమః పరికీర్తితః॥**

ఓంకార ( ప్రణవ) మున కన్యమగు మంత్రము లెన్ని జపించినను ఎప్పుడు ముక్తి గలుగును ? అనగా ప్రణవోపాసన లేని వారికి ముక్తినొందుట దుస్తరమని భావము. ఓంకారము సప్తకోటి మహామంత్రములలో నుత్తమోత్తమము అని సూతసంహిత. అనగా తదేక ధ్యానము చేయుటకై ప్రణవము తప్ప యితర మంత్రముచే సాధ్యము గాదు. ఏమన ఇతరమంత్రము లేవి యైనను, జిహ్వాచే గాని, కంఠముచే గాని, హృదయమందు గాని చలనశక్తి లేక జపింప సాధ్యము గాదు. మరియు ఓంకారధ్యానముచే మూలాధారమునుండి సహస్రారము వరకు తదేకరూపముగా నుండును. ఓంకారము తన్మయమంత్రము. తక్కిన మంత్రములు పుల్లింగముగాని, స్త్రీలింగముగాని, నపుంసక లింగముగాని, ప్రథమాది విభక్తులలో ఏదైన నొకటిగాని లేక ఏకవచన ద్వివచన బహువచనములలో ఏదైన నొకటిగా నుండును. ఓంకారమునకు స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగములు, ఏకవచనాదులు గాని, సప్తవిభక్తులు గాని లేవు. నామరూపములు గలదంతయును నశించును. కనుక ఓంకారము నామరూప గుణరహితము. ఓంకార విమర్శ మాండూక్యోపనిషత్తు నందును, విచారసాగరము నందును విశదముగా గనందగును.

**ఋషిచ్ఛందోఽధిదైవం చ ధ్యాయేన్మంత్రస్య సత్తమే।**
**యస్తు గార్గి ! జపేన్మంత్రం తదేవ హి ఫలప్రదమ్॥**
**భవేద్వీర్యవతీ విద్యా గురువక్త్రసముద్భవా।**
**అన్యథా ఫలహీనా స్యాన్నిర్వీర్యాఽప్యతిదుఃఖదా॥**

ఓ గార్గీ ! ఎవడు మంత్రధ్యానమునకు ముందుగా ఋషిఛందస్సు దేవతాదులను న్యాసముచేసి ధ్యానించునో ఆమంత్రము మాత్రమే ఫలసిద్ధి

యగును. అనగా మంత్రమునకు ఋషి, ఛందస్సు, దేవత, బీజం, శక్తి, కీలకం, అంగన్యాస కరన్యాసములు మొదలైనవి గలవు. ఇవి యన్నియున్ను అంత అత్యావశ్యకము లేదు కాని ఋషి, ఛందస్సు, దేవత మాత్రము తప్పక ఉండవలెను, ఇది జ్ఞానకాండ సమ్మతము. ఇతరములు కర్మకాండములో చేరినవి. మరియు బ్రహ్మనిష్ఠుడగు గురుముఖమునుండి మంత్రశ్రవణము చేసెడిమంత్రము ప్రకాశమానమై శక్తియగు వీర్యముతో గూడినదిగా నుండును. లేక పుస్తకములో నుండునవి గాని, ఇతరులు చెప్పుట విని గాని, స్వయముగా జపించు మంత్రములు ఫలహీనమైనవియు, ప్రాణశక్తిలేనివియు, దుఃఖము గలుగ జేయునవిగా నుండునని యాజ్ఞవల్క్య మహర్షి శివసంహితయం దుపదేశించెను. కనుక ఏమంత్రమైనను ఒక్క గురుముఖమునుండి గ్రహించందగినది. ఎట్లన, ఒక్క దరిద్రుడు స్వయముగా ధనము సంపాదించి ధనికు డగుటకు ఎంతకాలము పట్టును ? ఒక్క గొప్పధనికుని సహాయ ముండినచో శీఘ్రముగా ధనవంతు డగును గదా ! ఆలాగున బ్రహ్మనిష్ఠ లుపదేశించు మంత్రము వారు జపించి సిద్ధియైయుండును. కనుక వారిముఖమునుండి గ్రహించినచో త్వరలో ఫలసిద్ధి గలుగును. నిర్మలమైన భక్తితో ఈశర్వుని గురువుగా భావించి ధ్యానించెడి వారికి పైజెప్పిన విధి పనిలేదు, ఈశ్వరుడు భక్తసంరక్షకుడు.

**అశిష్యాయాఽవిరక్తాయ యత్కించిదుపదిశ్యతే ।**
**తత్ప్రయాత్యపవిత్రత్వం గోక్షీరం శ్వదృతావివ ॥**

పరిశుద్ధమగు మంత్రమైనను శుచి ఆచారము లేనివారి కుపదేశించినచో ఆమంత్రము ఆవుపాలు కుక్క చర్మమందు వేసినచో నెట్లపవిత్రమైపోవునో, ఆలాగున అపవిత్రమగును.

**విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ।**
**ఉపాంశుస్స్యాచ్ఛతగుణః సాహస్రో మానసఃస్మృతః ॥**

విధిప్రకారము చేయు యజ్ఞముకన్న పదిభాగములు ఫల మధికముగా గలది జపము, ఆజపము వాచాశబ్దము చేయక కంఠకుహరమున చేసిన ఫలము నూరుభాగము లధికము. పెదవులు కదలింపక హృదయమున ధ్యానించుట వేయిభాగము లధిక ఫలము నిచ్చును.

**త్రివిధో జపయజ్ఞ స్స్యాత్తత్ర భేదాన్నిబోధత ।**
**వాచికశ్చ ఉపాంశుశ్చ మానస స్త్రివిధస్స్మృతః ॥**

జపములు మూడు విధములు, దానిభేదములు వినుము. వాచిక జపమనియు, ఉపాంశు జపమనియు ( కొండనాలుక లేక చిరునాలుక సమీపమున జపించుట), మనోజప మనియు మూడువిధములు.

**ఉత్తమం మానసం జాప్యముపాంశుర్మధ్యమం స్మృతమ్ ।**
**అధమం వాచికం ప్రాహుః సర్వమంత్రేషు వై ద్విజాః ॥**

వానిలో మానసిక జపముత్తమ మనియు, ఉపాంశు జపము మధ్యమ మనియు, వాచిక జపము అధమ మనియు మహర్షులు చెప్పుదురు. ఇది అన్ని మంత్రములకు నన్వయించిన దని పండితులు తలంచుదురు అని మనుస్మృతి.

**ఉచ్చైర్జపాదుపాంశుశ్చ సహస్రగుణ ఉచ్యతే ।**
**మానసస్తు తతో పాంశోస్సహస్రగుణ ఉచ్యతే ॥**

వాచాజపము వేయింటికి నుపాంశు జపమొకటి సరిపోవును. ఉపాంశు జపము వేయింటికి మనోజప మొకటి సరియగును అని సూతసంహిత.

**జపేత్పంచాక్షరంచైవ సంసారతరణ క్షమమ్ ।**
**త్రిసప్తకులముద్ధృత్య శివలోకే మహీయతే ॥**

ఎవడు వైరాగ్యభక్తితో గూడి సంసారసాగరోత్తారణ శక్తిగల శ్రీశివపంచాక్షరము జపించునో, వాడనేకకులముల (21 వంశముల) నుద్ధరించి శివలోకమున పూజింపబడును.

**క్షణం బ్రహ్మాహమస్మీతి యః కుర్యాదాత్మచింతనమ్ ।**
**స సర్వపాతకం హంతి తమః సూర్యోదయో యథా ॥**

ఎవడొక్క క్షణమైనను పరమాత్మానుభవము గలిగి తాను శుద్ధమగు ఆత్మ యని చింతనచేయునో వాడు సూర్యోదయము చీకటిని నశింపజేయునట్లు సమస్తపాతకములను నాశనము చేయును.

ప్రతిబంధే పరిజ్ఞానం నేహ ముక్తిం ప్రయచ్ఛతి।
విశుద్ధబ్రహ్మవిజ్ఞాన విశుద్ధస్యైవ సిద్ధ్యతి ॥

బ్రహ్మవిచారమును జేయువాడైనను విషయవాసనాది ప్రతిబంధము లుండినచో ముక్తుడు గాజాలడు. పరిశుద్ధమగు పరబ్రహ్మజ్ఞాము నిర్మల హృదయము గలవారికి సిద్ధించునేగాని, వైరాగ్యాది గుణములు లేనివారికి గలుగదు.

శాంకరీయం మహాశాస్త్రం న దేయం యస్య కస్యచిత్।
నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే ॥

పరమశివునికి సంబంధించిన బ్రహ్మవిద్య నాస్తికునకు, కృతఘ్నునకు, దుర్వృత్తునకు, దురాత్ముడు మొదలుగాగల నిష్ఠానియమము లేనివారి కెప్పుడున్ను చెప్పరాదు.

గురుభక్తి విశుద్ధాంతః కరణాయ మహాత్మనే।
సమ్యక్ పరీక్ష్య దాతవ్యం మాసం షణ్మాసవత్సరమ్ ॥

గురుభక్తియు, పరిశుద్ధ హృదయమున్ను, గొప్పబుద్ధియు గలవారిని చక్కగా సంవత్సరము గాని, ఆరు మాసములు గాని, ఆఖరున ఒక నెల గాని బాగుగ పరీక్షించి ఉపదేశముచేయవలయును. ఈ గుణములు గలవారు ఏ కులమందున్న వారు గాని, స్త్రీలు గాని అయినను విరోధము లేదు. ఉపదేశము చేయవచ్చును.

## శరీరబలనిరూపణము

ప్రశ్న ॥ స్త్రీలబలలు గాను, బుద్ధిలేనివారు గను నుండుటయే గదా వారికి బ్రహ్మవిద్య కూడదని పూర్వమునుండి మహర్షులు చెప్పుటకు గారణము.

ఉత్తరము ॥ స్త్రీలకు బ్రహ్మవిద్య కూడదని మహర్షులు చెప్పిరను మాట సర్వదా అసత్యము. విషయ లంపటులగు కపట పురుషులు వ్రాసియుండవచ్చును. అట్లు వ్రాసిన పాపపురుషులు గదా సర్వోత్కృష్టమగు మనదేశమును జడత్వమునకు దెచ్చినవారు ! పూర్వకాలమున గార్గేయి, మైత్రేయి, విశ్వవర మొదలగు స్త్రీరత్నములు వేదపాఠములలో గూడ మహా గొప్ప విదుషీమణులని

కపటములేని పండితు లెరుంగగలరు. యాజ్ఞవల్క్య మైత్రేయి సంవాదమగు బృహదారణ్యకోపనిషత్తును గదా యిప్పుడు మహా బ్రహ్మనిష్ఠులున్ను, యతీశ్వరులున్ను మననము చేయుచున్నారు. కలియుగమున మండనమిశ్రుని భార్యయగు ఉభయభారతి శ్రీజగద్గురువగు శంకరాచార్యులతో బ్రహ్మవాదము చేసిరి. ఈలాటి కథలు ఎన్నియో గలవు. స్త్రీలబలలని చెప్పునది ఒక్కవిధమున నిజము. అబల యనగా పురుషునకుండు దేహబలమంత దేహబలము స్త్రీలకు లేదని అర్థము. బ్రహ్మవిద్యకు దేహబలము ముఖ్యకారణమని చెప్పుట ధూర్తుల మాటలు. దేహబలము గొప్పదని ఒప్పిన పక్షమున మూటలు మోయువార లెంత జ్ఞానులని నమ్మవలెను. మూటలు మోయు బలిష్ఠులకొక్క దినమున కష్టపడినను ఎనిమిది అణాలు దొరకుట లేదు. ఆ మూటలు మోయువారి శరీర శక్తిలో పది భాగములలో ఒక్క భాగము శరీరబలము లేనివారైనను గొప్ప బుద్ధి వంతులగు వకీళ్ళకు గాని, గొప్ప ఉద్యోగులకు గాని దినవెుక్కింటి కెన్నిరూపాయలు దొరకును. కనుక బ్రహ్మవిద్యకు బుద్ధి శక్తి ప్రధానమే గాని, దేహశక్తి ప్రధానము గాదు. స్త్రీలలోగూడ నిప్పుడు వకీలు పనులయందుండు వారును, డాక్టరు పనులయందుండు వారును, బ్రహ్మవిద్యలో నిపుణులున్ను ఎందరో గలరు. స్త్రీల బుద్ధిని వికసింప జేయుటకు పురుషు లొప్పని కారణముచే వారు పురుషులకు ఆటలాడుటకై తగువైన తోలుబొమ్మలైరి. ఒక్కవృక్షము యొక్క బీజము మూటగట్టిపెట్టినచో ఎన్ని సంవత్సరములు పోయినను అట్లే యుండును గదా ! ఆ విత్తనమునకు తగువగు భూమియున్ను, జలమున్ను, వాయువున్ను, సూర్యరశ్మియున్ను కావలసినంత దొరకు నపుడు ఎట్లు ఫల పల్లవ పుష్పాదులతో గొప్పవృక్షమై మారునో ఆలాటిదే బుద్ధియొక్క స్థితి. బుద్ధి వికాసమునకు గూడ విద్యాభ్యాసమున్ను, భగవద్భక్తిన్ని, బ్రహ్మనిష్ఠయున్ను, విషయ విరక్తియున్ను, శరీరమునకు కొంతపనియును నుండవలెను. ఒక పెద్ద బండరాతికి ఎంత వెలపట్టును, ఒక చిన్నదగు మాణిక్యమున కెంతవెల పట్టును. శ్రీగంధపు చెట్టెంత చిన్నది. బలిసియుండు మర్రిచెట్టెంత గొప్పది, దీనిలో దేనికి వెల అధికమో వివేక శక్తి యుండినచో నెరుంగగలరు. ''స్త్రీణాం బుద్ధిశ్చతుర్గుణం'' స్త్రీలకు బుద్ధి పురుషుల బుద్ధికన్న నాలుగు రెట్లధికమని చాణక్యసూత్రమందు గలదు.

''కీర్తిః శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా'' - శ్రీకృష్ణ భగవంతుడు పురుషులకున్ను, రాజులకున్ను, మహర్షులకున్ను భగవదంశ మొక్కొక్క అంశమే యుండునని చెప్పి స్త్రీలలోగల కీర్తియు, శ్రీయు, వాక్కున్ను, (శాంతవచనములు) స్మృతి (దీర్ఘవిచారము) మేధ, (జ్ఞానధారణశక్తి) ధృతి (కార్యధారణాశక్తి) క్షమ (సహనశక్తి) అను ఈ భగవదంశము లన్నియు స్త్రీలలో అధికముగానుండునని చెప్పునప్పుడు పామరుల మాటలకేమి ? నీకు చెప్పుటకు లజ్జ లేదా ? గీత అ. 10, శ్లో, 14, చూడుడు. దీనికి దృష్టాంతము శ్రీకృష్ణావతారమున స్త్రీలా, పురుషులా స్వామికధిక శిష్యులని చూచిన తెలియును. వారిలో ఎవరెక్కువగా ముక్తులైరి భాగవతము చూడుడు.

ప్రశ్న ॥ తమరు చెప్పినది సరి. స్త్రీలలో భగవదంశ మధికముండినచో ఏమి యిప్పుడు గొప్ప విదుషులున్ను, జ్ఞానులున్ను గనుపడుట లేదే ?

ఉత్తరము ॥ నాయనా ! ఆ సంగతి వినినచో రాతివలెనుండు మనసైనను కరుగును. కాలక్రమముగా మనవారు విషయ లంపటులై చిన్నవయస్సునందు వివాహము చేయుటచేతను, విద్యాభ్యాసము చేయింపని కారణముచేతను హీనస్థితి గల్గినది. అగ్గిపుల్లగీచి మొదట చిన్న చిన్న కట్టెలు పెట్టి తరువాత పెద్దకట్టెలు పెట్టగా నిప్పు గొప్పగ నుండును. అట్లే హృదయ మందుండు జ్ఞానశక్తిని వికసింపించి తగువగు అనుష్ఠాన నిష్ఠయుండినచో అందరున్ను గొప్ప బుద్ధిమంతు లగుదురు. ఆలాటి మనస్సంస్కారప్రయత్నము చేయని కారణముచే స్త్రీలు జడులై రబ్బరు బొమ్మలైరి. దీనికి కారణము పురుషులయొక్క నిర్దయత్వమున్ను, వివేక శూన్యత్వమే కాని మరియొకటి కాదు. ఈ లాగుననే శూద్రాదులలో గూడ అధః కృతవర్గములవారు గలరు. వారితోను (శూద్రులతోను) సంస్కృతాది గ్రంథములు చదువరా దనియు, బ్రహ్మవిచారము చేయరా దనియు, సేవక వృత్తియే వారికి మోక్ష పదమని వేద ప్రమాణ మనియు చెప్పుటకు ప్రారంభించినప్పటినుండి మనరాజ్యము పరులపాలై దుఃఖసాగరమున మునిగినది. చదువుటకై అధికారము గలవారమని చెప్పువారు చదువకనే పోయిరి. ఇతరులకు చెప్పకపోయినందున మన భారత భూమి ఇంత జడత్వమునకు వచ్చినది. కాని గిల్టునగ బంగారమని చెప్పినచో ఎన్ని దినము లుండును ? ఆలాగున అసత్యము శాశ్వతముగా నుండునా ? కరుణానిధి యగు భగవంతుడున్నాడు.

ప్రశ్న ॥ స్త్రీలకు విద్యయుండినచో వ్యభిచారిణులై పరపురుషులకు జాబులు వ్రాసి వారిని తెప్పింపరా ? కనుక విద్య లేనిచో పతివ్రతలై చెప్పిన పనిచేసి ఇంటియందే యుండిపోవుదు రని మనపండితులు చెప్పునది మంచిది గదా ?

ఉత్తరము ॥ ఓ పాపాత్ముడా ! ఎంతఘోరమగు పాపపు మాటలను చెప్పితివి. ''విద్య'' అను శబ్దమునకు జ్ఞానమని అర్థము. జ్ఞానమనగా ''ఇది చేయవచ్చును. ఇది చేయందగదు. ఇది పుణ్యకార్యము, ఇది పాప కార్యము. దీనిచే బంధము గలుగును. దీనిచే మోక్షము గలుగును'' అని తెలుసుకొనుట. ఇది విషము, అమృతము అని తెలిసిన తరువాత విషమును తినువారు ఎవరైననుందురా? ఆలాగున తెలివిలేని కారణముచే పాపకృత్యములు చేయుదురేగాని, తెలిసి యుండినచో చేయనే చేయరు. సూర్యు డుదయించిన అంధకారము నశించునా ! లేక వృద్ధి యగునా ? సూర్యు డుదయించిన అంధకార మధిక మగునని చెప్పువారుగదా విద్య యుండినచో చెడిపోవుదు రను చెప్పుమూఢులు ! విద్య యుండిన భర్తమాట అతిక్రమించు నని భయము గలవారికి మరియొక్క సులభసూత్రము గలదు. అదేమన నేత్రము లుండుటచే గదా స్త్రీలు పరపురుషులను చూచి మోహించెదరు. కనుక కన్నులే లేకుండ చేసినచో మన పిల్లలాటబొమ్మలవలె ఒక్క మూలయందే పడియుందురు గదా ? ఇదే మంచి కార్యము. అప్పుడు పాతివ్రత్యము శాశ్వతముగా నుండును.

స్త్రీలకు విద్య యుండినచో తమ భోగసుఖమునకు భంగము గలుగునా అని సంశయము గల విషయలోలురు ద్విపాదపశువులగు పురుషు లెక్కువమంది యున్నా రనుమాట నిజము. దీని కొక కథ గలదు. ఉత్తరదేశమున ఒక జమీందారువారికి ఒకానొక కుమారు డుండెను. వాడు కురూపియు, నిరక్షరకుక్షియు, దురాచారపరుడుగా నుండెను. వాని యొక్క ధనమును మోహించి ఒక్క ధనికుడు తన కొమార్తె నిచ్చి పెండ్లిచేసెను. ఆమె మహాలావణ్యవతియు, విద్యావంతురాలును, సద్గుణస్వరూపిణిగా నుండెను. జమీందారు ( కురూపుడైన భర్త) ఈభార్య నాయొక్క జన్మాంతర పుణ్యముచే దొరికినదని మహా సంతోషముతో నుండెను. కొన్ని దినములు పోయిన తరువాత వాని కీలాటి దుర్బుద్ధి గలిగెను. నాభార్య సాక్షాత్ లక్ష్మీదేవివలె నున్నది. నేను మహా

కురూపిగా నున్నాను. కనుక ఈ స్త్రీమంచి సుందర పురుషులను చూచినచో నాపై ప్రీతి పోయి వ్యభిచారిణియై పోవును. దీని కుపాయ మొకటి గలదు. నేత్రము లుండుటచే గదా పరపురుషులను చూచి మోహించును. గనుక ఏ ప్రకారమైన నంధురాలుగా జేయవలెనని యుద్దేశించి అగ్నిద్రావకము తెచ్చి రాత్రి నిద్రపోయెడు సమయమున రెండుకళ్లకు పూసెను. వెంటనే ఆమె మంటకు సహింపక లేచెను. కాని దీపము ముట్టించుటకు సాధ్య పడకపోయెను. సమయ మధికమైన కారణముచే నేత్రములు దగ్ధమైపోయినవి. వెంటనే ఈసంగతి తెలిసికొని బంధు మిత్రులు వచ్చి గొప్ప వైద్యులకు చూపి దీని కారణ మడిగిరి. అప్పుడు భర్త ఏదో విషపురుగు వ్రాలి యుండవచ్చునని చెప్పెను. వైద్యులు "కాదు కాదు అగ్ని ద్రావకముచే నెవరో శత్రువులు నేత్రముల జెడగొట్టి" రని నిశ్చయముగ జెప్పిరి. అప్పుడా స్త్రీయొక్క అన్న దమ్ములు "అంతఃపురమున ఇతరు లెవరును రానే రారు. యజమానుడు దీనిపై క్రూరత్వముచే చేసిన పని" యని చెప్పి కోపోద్రేకులై భర్త కన్నులుకూడ పొడచుటకు ప్రారంభించిరి. అప్పుడు ఈసంగతి తెలిసియుండిన భార్య తన భర్త కురూపి యనియు నేను సుందరిననియు, భర్తను కురూపత్వముచే ప్రియముతో చూడననియు, సుందర పురుషులను చూచి మోహించెదననియు, భర్తకనుమానము మొదటనే గలదని తెలిసి చేసినపని యిది. కాని పతియొక్క యిష్టానుసారముగ నుండుటయే పరమ ధర్మము, మోక్షోపాయమనియు తనలో తాను నిశ్చయించుకొని అన్నదమ్ములతో "ఓ సోదరులారా! నాపతి ఏకపత్నీ వ్రతుడు. నాపైనెంతో ప్రేమ గలదు. ఒక్కనిమిష మైనను నన్ను విడిచియుండరు. నాజీవితమున్ను వారి జీవితమున్ను ఒకటేయని నమ్మువారు. వీరునిండా మంచివారు, మీరు వీరి నేమి చేయరాదు. మీ రిట్లు చెప్పుటచే నాభర్తకు ఎంత సంకటము కలిగెనో తెలియదు. వారు మహా ఉత్తములు, వారిపై దోషారోపణము మీరు చేయుట నాకు నిండా అవమానకరము. నేను చెడ్డదానినిగా నుండిన మాత్రమున నన్ను నాభర్త కష్టపెట్టునే గాని, లేనిచో ఏల చేయును ? నేను చెడ్డదాన నైనచో మీకు గూడ ఎంతో అవమాన మని చెప్పి ఇది యేదో విషపురుగు వ్రాలినదనియు, రాత్రిలో ఉష్ణమధిక మగుటచే గాలి వచ్చుట కొరకు తలుపుతీసి యుండినదనియు తన బుద్ధి కుశలతచే సమాధానపరచి తన

ప్రారబ్ధ కర్మమని నిశ్చయించుకొని అనేక శాస్త్రములను వారికి చెప్పి భర్తపాదములకున్ను, అచ్చట నుండు పెద్దల చరణములకున్ను నమస్కరించి పతి యిష్టానుసారముగా కాలము గడిపి సత్ సంతానములను గని భగవద్ధ్యానము చేయుచు సుఖముగా నుండెను.

ఇప్పుడు విద్య యుండు ఆడుది యోగ్యురాలా ? కాదా ? విద్య లేనివాడు మూర్ఖుడా ? కాదా ? అని తెలియును. కనుక విద్య అందరికిన్ని అత్యావశ్యకము, నేత్రము గలవాడు గుంటలో ముండ్లలో పడి చెడి పోవు ననియు, నేత్రము లేనివాడు ముళ్ళలోను పల్లములోను పడక మంచిమార్గములో నడచుననియు చెప్పువా రెవరైనను గలరా ? అట్లు చెప్పు వారే విద్యయను జ్ఞాననేత్రము గలిగినచో చెడిపోవుదురని చెప్పువారు.

శిఖిధ్వజ మహారాజు వైరాగ్యముతో రాజ్యము త్యజించి వనవాసమునకు పోయినపుడు తన భార్యయగు చూడాల, జ్ఞానవతి యగుటచే రాజ్యము చక్కగ పరిపాలించి ఆఖరున యోగశక్తిచే సిద్ధవేషము ధరించి ఆకాశమార్గమున బోయి వనమందు తపస్సు చేయుచుండు తన భర్తకు బ్రహ్మోపదేశము చేసిన కథ వాసిష్ఠమందు గలదు. గృహస్థధర్మ మంతయును స్త్రీపై భారమై యుండును, దానిని చక్కగ పరిపాలించుట గొప్ప ప్రయాసమైన పని. గృహస్థాశ్రమమున అనేకవిధ ధర్మసంకటములు తటస్థించునపుడు వాటిని చక్కపరచుటకు గొప్పబుద్ధియున్ను, అనేక నీతిశాస్త్రములున్ను స్త్రీలకు తెలిసియుండవలెను. ఇది లేని కారణముచే సంసారము దుఃఖసాగరమైనది. ''నివృత్తరాగస్య గృహం తపోవనమ్'', అనగా రాగ, ద్వేషాదులు లేని గృహస్థుల యిల్లు తపోవనమువలె పావనమైన దని మహర్షులు చెప్పు చున్నారు.

**యేషాం న విద్యా న తపో న దానం**
**జ్ఞానం న శీలం న గుణో న ధర్మః ।**
**తే మృత్యులోకే భువి భారభూతా**
**మనుష్యరూపేణ మృగాశ్చరంతి ॥**

ఏ మానవులకు విద్యయున్ను, తపస్సున్ను, దానమున్ను, జ్ఞానమున్ను,

శాంతశీలమున్ను, సద్గుణమున్ను, ధర్మబుద్ధియున్ను లేవో అట్లుండు నరులవల్ల భూమికి భారమేగాని సుఖములేదు. వారి రూపము మాత్రము మానవాకారముగా నుండినను ద్విపాదపశువులై తిరుగుచున్నా రని భర్తృహరి చెప్పిరి. స్త్రీల ఆత్మకు పురుషుల ఆత్మకు కించిత్తైనను భేదము గలదని యేశాస్త్రము చెప్పదు. చెంబునీరు, బిందెనీరు, లోటానీరు, సీసాలోని నీరు అని చెప్పుటలో నీరు అన్నిటిలో ఒకేవిధముగ నుండునట్లు స్త్రీ ఆత్మ, పురుషుని ఆత్మ, శూద్రుని ఆత్మ, బ్రాహ్మణుని ఆత్మ అని చెప్పు నప్పుడు ఆత్మ అన్నిటిలో ఒకేవిధముగా నుండును. మధ్యాహ్నమున నాలుగు గిన్నెలలో నీరు నింపిపెట్టిన అన్ని పాత్రము లందును సూర్యు డొకే రీతిగా ప్రతిబింబించినట్లు దేహములు వేరు వేరుగా నున్నను ఆత్మ అన్నిటిలో ఒకే విధముగా నుండును. ఆ పాత్రములలో గుండ్రముగాని, చదరముగాని ముక్కోణాకృతిగాని, నలుపుగాని, తెలుపుగాని ఇట్లు భేదము లుండినను సూర్యుని ప్రతి బింబము ఒకేవిధముగా కనబడునట్లు పరమాత్మ అన్నిటిలోను సమముగ నున్నాడు. ''సమోఽహం సర్వభూతేషు'' ''ఈశ్వరస్సర్వభూతనాం హృద్దేశేఽర్జున తిష్ఠతి'' అను మొదలగు శాస్త్రములు పెక్కులు గలవు. ఒకే అగ్నియే అనేక రూపములుగానున్నది. లైటులయందు నుపాధి భేదములచే వేరువేరు వర్ణములుగా చిన్నది పెద్దదిగా, గనుపించినను అగ్ని యొక్కవిధముగా నుండును. ఆత్మ పురుషుడు గాని, స్త్రీగాని, శూద్రుడు గాని, బ్రాహ్మణుడు గాని కాదు. ఆత్మ స్వరూపము శుద్ధము, చైతన్యము, సూక్ష్మము. జన్మాంతరమున బ్రాహ్మణుడుగా నున్నవాడు ఇప్పుడు శూద్రుడుగాను. జన్మాంతరమున శూద్రుడుగా నున్నవాడు ఇప్పుడు బ్రాహ్మణుడుగాను, ఇప్పుడు స్త్రీగాను జన్మించ వచ్చును. ఈ జన్మములయందుండు వారు పాపపుణ్యముల ననుసరించి పునర్జన్మములో మారి మారి పుట్టుదురు. స్థూలదేహమునకు మాత్రమే స్త్రీపురుష భేదము గనుపించును. గాని సూక్ష్మదేహమునకు గాని, కారణ దేహమునకు గాని ఏలాటి భేదము లేదు. ఆత్మ దేహత్రయాతీతుడు. స్థూల దేహాకృతిలో భేద ముండినను వస్తుభేదము లేదు. ఒక్క బంగారముచే చేయింపబడిన కటకకుండల కిరీటాదులలో కార్య భేదములు గలిగినను ఆవస్తు భేదము లేశమైనను లేదు. ఆలాగున ఒక్క కొయ్యచేత ఆడబొమ్మయు,

మగబొమ్మయు, ఒక్క కంచుచేత లక్ష్మి విగ్రహమును, నారాయణ విగ్రహమును చేసినచో శిల్పికృత్రిమ భేదమే గాని వస్తుభేద ముండదు. అట్టిదే స్త్రీపురుషుల భేదము.

ఆత్మ పంచ కోశాతీతుడు. పంచకోశములనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములని ఐదు విధములు. కోశమని ఒరకు పేరు. కత్తికిని ఒరకును గలభేదము ఆత్మకును దేహమునకు గలదు. ఇద్దరు పురుషులు ఐదు చొక్కాయలు వేసి యుండిరి. దానిలో ఐదవ పై భాగమందుండు కోటునకు మాత్రము చిత్రవిచిత్ర భేదము గలదు అన్నిటికిని పైభాగమున నుండు చిత్రవిచిత్రపు కోటు తీసివేసినచో తక్కిన నాలుగు కోట్లకున్ను, ఇద్దరి పురుషులకున్ను ఏలాటి భేదము కనిపింపదు. ఆలాగుననే స్త్రీపురుషుల అన్నమయ కోశములలో భేదము లుండినను వస్తుభేదమున్ను, ఇతర మగునే యొక్క భేదమున్ను గనుపింపదు. అన్నమయ కోశమనగా, మాతాపితరులచే భుజింపబడిన అన్నము వలన పుట్టిన రజస్సు, వీర్యము, వీనివలన మాతృగర్భమందు శరీరము పుట్టుచున్నది. మరల అన్నముచే వృద్ధి యగుచున్నది. మరణానంతరము అన్నమయకోశము పృథ్వియందు లయమగుచున్నది. ఇట్టి యే స్థూలశరీరము గలదో దానిని అన్నమయ కోశ మందురు.

ప్రాణమయకోశ మనగా, పంచ కర్మేంద్రియములతో చేరిన పంచప్రాణములు. పంచజ్ఞానేంద్రియములతో గూడిన మనస్సు మనోమయ కోశము. పంచజ్ఞానేంద్రియములతో గూడిన బుద్ధి విజ్ఞానమయకోశము, ఆనందమయ కోశమనగా పుణ్యకర్మ ఫలానుభవ కాలమందు బుద్ధి వృత్తి అంతర్ముఖమై ఆత్మస్వరూప భూతమగు ఆనంద ప్రతిబింబమును ధరించి ప్రియ, మోద, ప్రమోద రూపానుభవము చేసి కారణాజ్ఞానరూప సుషుప్తియందు విలీన మగుచున్నది. ఆ వృత్తి ఆనందమయకోశము.

స్థూలదేహవిహీనాత్మా సూక్ష్మదేహ వివర్జితః ।
కారణాదివిహీనాత్మా తురీయాదివివర్జితః ॥

అన్నకోశ విహీనాత్మా ప్రాణకోశవివర్జితః ।
మనఃకోశ విహీనాత్మా విజ్ఞానాదివివర్జితః ॥

**ఆనందకోశహీనాత్మా పంచకోశవివర్జితః ।**
**నిర్వికల్పస్వరూపాత్మా సవికల్పవివర్జితః ॥**

ఆత్మస్వరూపము స్థూల దేహాతీతము, ఆత్మ సూక్ష్మ దేహము నతిక్రమించినవాడు. ఆత్మ కారణదేహమునకు పైనున్నవాడు. ఆత్మ తురీయాదిని దాటినవాడు. ఆత్మ మనోమయ కోశాతీతుడు. ఆత్మ విజ్ఞాన కోశమునకు ఎగువ నుండువాడు. ఆత్మ ఆనందమయకోశమునకు సాక్షిగానుండువాడు. ఆత్మస్వరూపము ఐదు కోశములకు పైగా నుండి సాక్షిమాత్రమై యుండునది. ఆత్మ నిర్వికల్ప స్వరూపుడు. ఆత్మ సవికల్పవివర్జితుడు. అన్నిటికిని సాక్షిగానుండుటచే ఘటదృష్టి న్యాయమురీతిగా వీటి అన్నిటికిని దృక్కుగానుండి సాక్షియై ప్రకాశించెడి శుద్ధస్వరూపుడు అని తేజోబిందూపనిషత్.

**నైవ స్త్రీ న పుమానేష నైవచాయం న పుంసకః ।**
**యద్యచ్ఛరీరమాదత్తే తేన తేన స యుజ్యతే ॥**

ఈ ఆత్మ స్త్రీయున్ను గాదు. పురుషుడున్ను గాదు. మరి యేమన, ఏ యే శరీరమును జీవుడు ధరించునో ఆయారూపముతో గూడి ప్రకాశించువాడు. అవధూతగీత.

**యథా శుద్ధరసస్పర్శాత్ తామ్రో భవతి కాంచనమ్ ।**
**గురూపదేశశ్రవణాత్ శిష్యః సత్త్వమయో భవేత్ ॥**

ఏలాగున శుద్ధ రసవాదమగు రసస్పర్శమాత్రముచే తామ్రము బంగారమగునో ఆలాగున బ్రహ్మనిష్ఠుడు అగు గురువు యొక్క యుపదేశముచే శిష్యుడు సత్తామాత్రుడై ప్రకాశించును.

**యథా చ నటకః కశ్చి ద్వేషాంతరసమీహయా ।**
**గృహ్ణాతి వివిధం వేషం వస్తుత్వే నట ఏవ చ ॥**

ఏలాగున నాట్యముచేయు పురుషుడు నానావిధములగు స్త్రీపురుషుల వేషము ధరించినను వాస్తవముగా శరీరమందుండు దుస్తులను తీసివేయునప్పుడు పురుషుడే అగునో, ఆత్మ యొక్క స్థితియును అట్టిదే.

**దేహీ వస్త్రాణ్యనేకాని దధాతి వివిధేహయా।**
**వస్త్రాణి వివిధానీహ ధారకస్త్వేక ఏవ సః॥**

ఒక పురుషుడు వేషానుసారముగ అనేక వస్త్రములచే వేషమును ధరించినపుడు స్త్రీ పురుషాది అనేక వేషములు గనుపించినను ధరించెడి పురుషుడొకడే యౌనట్లు ఒక్క ఆత్మయే అనేకములగు స్త్రీపురుషాది దేహములను ధరించుచున్నాడు.

**ఏకమృత్పిండవిజ్ఞానాత్సర్వమృణ్మయధీర్యథా।**
**తథైకబ్రహ్మబోధేన జగద్బుద్ధి ర్విభావ్యతామ్॥**

కుమ్మరవాడు ఒక్క మట్టిముద్దచే అనేక పాత్రము లనేకవిధములుగా చేసియుండినను ఒక్క పాత్రముయొక్క గుణములు తెలిసికొన్నచో అన్ని పాత్రముల గుణములు తెలియునట్లు తనయొక్క ఆత్మస్వరూపము తెలిసికొనిన జగమందున్న దంతయును తెలియగలదు.

**న గోత్రం న కులం సూత్రం న విభుత్వం న శూన్యతా।**
**న స్త్రీర్న యోషిన్నోవృద్ధా న కన్యా న వితంతుతా॥**

గోత్రము, కులము, సూత్రము, గొప్పది, చిన్నది, స్త్రీ, యువతి, వృద్ధస్త్రీ, కన్య, వితంతువు మొదలుగాగల భేదము లేకయే బ్రహ్మవిద్యాభ్యాసము, అనుష్ఠానము చేయవచ్చునని ఋభు మహర్షి నిదాఘునకు బోధించెను.

ప్రశ్న ॥ పెద్దలుగా నుండువారు చెప్పునది ఏమన ''ఆత్మ ఒక వస్తువును కోరినచో అప్పుడే దానిననుభవించుట శ్రేష్ఠము. ఆత్మ తృప్తి చేయనిచో అది దోషము కదా ? కనుక మాంసము, మద్యము ఆశ కలిగినచో తినుటలోను, విషయములో ప్రవర్తించుట లోను దోషమని చెప్పువా రెవరు గలరు ? నీవు చేయుచున్నా వని అజ్ఞానముచే తలంచుచున్నావు. అది గదా ! మాయ'' అని చెప్పునది నిజమా ?

ఉత్తరం ॥ నాయనా ! యీలాటి పాపము గల మాటలు ఎచ్చటి నుండి విన్నావు ? ఇది నాస్తికులగు చార్వాకుల మతము. ఈలాటి నీచములగు కోరికలు

పిశాచస్వభావము గలవారికి గలుగునే గాని మానవులకు గలుగవు. ఒక్కవస్తువును ఆత్మ కోరినచో సాధించవలెనని చెప్పుటలో నొక దురాత్మునకు గురుపత్నియందు మనసు పోయినచో అదియునుగూడ సాధింప వలసినదిగదా? ఆలాగున నొక చండాలునకు పతివ్రతా శిరోమణియగు బ్రాహ్మణ స్త్రీయందు మోహము జనించినచో సాధించవలసినదా ? లేక ఒక్కరికి ఇతరుల ధనముపై ఆశ బొడమినచో చోరత్వము చేయవలసినది గదా ? ఏమి ఇదిన్ని ఆత్మ గదా కోరుచున్నది ! అయ్యో! ఇట్లు చెప్పువారి భార్యను గాని, కుమార్తెలగాని యెవరెవరు మోహించియున్నారో, మరియు వీరిధనము నెవరు కోరుచున్నారో అట్లున్నవారిని వెదకి యివ్వవలసినది గదా ! అట్లు చేసినచో పై చెప్పిన రాజయోగుల మాటలు నమ్మందగినది. విమూఢులు తన మనసు పోయెడి మార్గముగా పోవువారు. వీరికి సంసార సాగరమునకు విశాలమైన దోవ యేర్పడును. సజ్జనులు హృదయమందు గలిగెడు వృత్తులు పాపకరమై యుండినచో కనిపెట్టి త్యజించువారు. అట్లున్న వారు ధన్యు లగుదురు. నదీ ప్రవాహమున వచ్చెడి దూలములు, కొయ్యలు వగైరాలను ప్రవాహము నెట్టుకొని పోయి సముద్రములో చేర్చునట్లు వాసనారూపమగు నదికి మానసేంద్రియములు లోబడినచో దుఃఖసాగరములో శీఘ్రముగా తీసుకొని పోయి పడవేయును. జల ప్రవాహమునకు వ్యతిరేకముగా బోటులున్ను, పడవలున్ను తీసుకొని పోవునట్లు విషయవాసనారూపమగు ప్రవాహమునుండి వైరాగ్య ధ్యాన నిష్ఠయగు చుక్కాణిచేతను, తెడ్లచేతను మనసును త్రిప్పి పరమాత్మధ్యానమందు చేర్చువారు శాశ్వతసుఖమగు మోక్షము నొందగలరు.

మఱియు ఆత్మ యొక వస్తువును కోరినచో, తృప్తి చేయవలె ననుట ఎంత తెలివిహీనత, ఆత్మశబ్దార్థమేమి ? ఆత్మ పిశాచివలె నీచవస్తువులను కోరుట యన ఇది ఆత్మానాత్మ విచారము చేయని కారణముచే కలుగుదోషము. ఆత్మ సర్వగతుడు. శుద్ధుడు, పూర్ణ కాముడు. స్వయంప్రకాశుడు. సచ్చి దానంద స్వరూపుడు, నిత్య ముక్తుడు. ఆత్మయొక్క సాన్నిధ్య లేశమాత్రముచే నెవరికైనను ఏ సుఖమైనను గలుగుచుండును. ''ఆనందో బ్రహ్మ'', ''బ్రహ్మైవేదం'' ''బ్రహ్మవేదన మాత్రేణ బ్రహ్మైవ భవతి స్వయం'' ''సర్వమేతద్బ్రహ్మ'' ఇత్యాదిగా శ్రుతులు చెప్పుచుండగా ఆత్మకు కోరిక గలదని వేద దూషణమే కాక

సర్వజ్ఞు డగు పరమాత్మను పిశాచివలెచేయుటేగాని మఱియేమి ? ఏకచక్రాధిపతి వీథిలో తిరిగి భిక్ష మెత్తును అని చెప్పుట సార్వభౌముని దూషణ గాని మఱియేమి?

**ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తై రేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః ॥**

ఆత్మను ప్రాకృతములైన గుణములలో గూడి యుండునపుడు జీవుడని వ్యవహరింతురు. ఆ ప్రాకృతగుణములనుండి విముక్తి పొందునపుడు పరమాత్ముడని చెప్పుదురు. అనగా హృదయమునఁ నెంతవరకు విషయవాసనయగు వృత్తులుండునో అంతవరకు బద్ధుడు, సంసారి అని మహాభారతము శాంతిపర్వము.

**అపహాయ నిజం కర్మ కృష్ణకృష్ణేతి వాదినః ।**
**తే హరేర్ద్వేషిణః పాపాః ధర్మార్థం జన్మ యద్ధరేః ॥**

ఎవరు ఏయే స్థితియందుండుదురో ఆయా స్థితి ననుసరించిన నిష్ఠలను వదలి హరిహర నారాయణ నారాయణ అని సర్వదా ఉచ్చరించుకొనుచుండినను వారు హరికి శత్రువులనియు, పాపాత్ము లనియు నారాయణుండు తలంచును. ఏలన, నారాయణునియొక్క అవతారము అధర్మము నణగద్రొక్కుటకును, ధర్మము నుద్ధరించుట కొరకు గదా అని శూద్రకమలాకరము. వారి నామోచ్చారణము చేసుకొని అధర్మము జేయుట మహాతప్పు. ఎట్లన, రాజభటు లమని చెప్పుకొని రాజాజ్ఞ నతిక్రమించి నడచుటలో దండన తప్పునా ? ఈలాటి మోసములో జనులు భ్రమించుటకు విద్యలేమి కారణము. గిల్టునగలను బంగారమని చెప్పువాడు స్వర్ణపరీక్షకునివద్ద చిక్కుపడు నట్లు నిజమగు బ్రహ్మనిష్ఠుల సమీపమున వీని మోసము తెలియును.

**ఏకమేకం కాలకూటమింద్రియం నాశకృత్పునః ।**
**తదేవం శోధితం సాక్షాద్విషమప్యమృతం యథా ॥**

ఇంద్రియములలో నొక్కటియైనను, విషయమందు ప్రవర్తించినచో కాలకూట విషమువలె మనుజుని చంపుచుండును. అట్లుండగా నన్ని

ఇంద్రియములు వాటివాటి విషయములో ప్రవర్తించినచో ఆమానవునియొక్క కథయేమి చెప్పవచ్చును. హృదయములో ఇంద్రియములను పరిశుద్ధముచేసి విషయములనుండి మరలించి పరమాత్మధ్యానమందు నిలిపినచో ఆయింద్రియములే అమృతమువలె జననమరణ భవమునుండి రక్షించి అమృతునిగా జేయును.

**ఇంద్రియాణ్యేవ తత్సర్వం యత్స్వర్గనరకావుభౌ ।**
**నిగృహీతవిసృష్టాని స్వర్గాయ నరకాయ చ ॥**

మానవుని యొక్క ఇంద్రియములే స్వర్గమునకును, నరకమునకును కారణములు. అనగా, పాపకృత్యములో ప్రవేశించెడు మనసును, వివేకముచే నిరోధించి పరమాత్మధ్యానమందు నిలిపినచో అదే స్వర్గమునకు మార్గము. లేక మనస్సు ఇష్టానుసారముగా విడిచి పెట్టినచో నరకమున పడుదురు.

**భృష్టబీజోపమా భూయో జన్మాంకురవివర్జితా ।**
**హృది జీవద్విముక్తానాం శుద్ధా భవతి వాసనా ॥**

జీవన్ముక్తులగు మహాత్ముల హృదయమున ఇంద్రియములు వృత్తిరహితముగా నుండును. ఎట్లన, వేయించిన విత్తనములు మొలకెత్తని రీతిగా మహాత్ముల ఇంద్రియములు శుద్ధమై నామకార్థముగా నుండునేగాని అపరిశుద్ధమై విషయాంకురము లుండెడి పచ్చి విత్తనములవలె విషయవృత్తులతో గూడియుండవు. ఇదే ముక్తునకున్ను, బద్ధునకున్ను గల తారతమ్యమని శ్రీవసిష్ఠు లుపదేశించిరి. కనుక దురాచారపరులై వేదాంతము మాట్లాడు వారిని ముక్తులని నమ్మరాదు. వారుపై నుదాహరించిన విఘ్న దేవతలు, భక్తులను భంగపరచుటకై జన్మించియుండు నీచ దేవతలగు పిశాచులు.

ప్రశ్న ॥ సరి దీనికి యేమి విరోధము? అనగా శ్రీరామ ధ్యానము చేయువారు ఎంత పాపము చేసినను అగ్నియందు కట్టెలు భస్మ మవునట్లు మేము యేమి పాపము చేసినను మాకంటదు. మామతావలంబులకు భోగమున్ను, యోగమున్ను గలదు. కనుక మాయిష్టానుసారముగా నెంతపని యైనను చేసి శ్రీరామధ్యానమగు తారకమంత్రము జపించెదము చూడుడు. ''జపతో నాస్తి పాతకం'' అని చెప్పుమాటలలో సారమేమైన కలదా ?

ఉత్తరము ॥ వీరున్ను పై జెప్పిన విఘ్నదేవతలలో ప్రధానులే. ఈలాటి పాపాత్ములు జన్మించుటచే లోకము పాడైనది. వీరు పాపకార్యములు చేసి జపముచే పాపము నాశము చేయు శక్తిగల వారని చెప్పుట నిజమైనచో పాషాణము నిచ్చి చూడుడు. లేక మద్యపానమునకు బదులు అగ్ని ద్రావకము నిచ్చిచూడుడు. వ్యభిచారదోష నివృత్తికొరకు జపము చాలునని చెప్పినచో నిప్పులో పడవేసి చూడుడు. చూతము. ఈ మూడు పనులలోను వారికి హానిలేనిచో వారు నిజముగా యోగశక్తి గలవారు. చేయు పాపము పరిహరించుటకు శక్తిగలవారనుట నిశ్చయము. వేమనయోగీంద్రు డొకసమయమున సమస్తమున్ను భక్షింతునని చెప్పెను. అప్పుడు ఆదేశ మందొక్కరు గెడ్డ పారను తునకలుగా నరికి నిప్పులో నెఱ్ఱగా కాల్చి యిచ్చెను. అగ్నివలె జ్వలించుచుండు ఆ ఇనుమంతయున్ను మంచిపండ్లవలె ఆ యోగిపుంగవుడు గుటుక్కున నొక్కొక్కటి మ్రింగెను. మరియు, ఆ మహాత్ముడు వెఱ్ఱిపుచ్చకాయ విత్తనమువేసి రత్నరవలను పండించెను. మరియు జాలంధ్ర యోగీశ్వరునకు గోపీచందన మహారాజుగారు పరీక్షార్థముగా కాలువీశ పాషాణము భాంగు ( అనగా నీదేశములో రామరసమని చెప్పుదాని) లో నూరి యిచ్చిరి. ఆమహాత్ముడు దానిని మంచిపాలవలె త్రాగి యథాప్రకారముగా నుండెను. మఱియొక్క దినమున నాగసర్పముల విష మొకచిట్టెడు తెప్పించి యథాప్రకారము రామరసములో కల్పియిచ్చిరి. దానిని కూడ పాలవలె త్రాగి సుఖముగా నిష్ఠయందుండిరి. ఈ చరిత్రము మైనావతి జీవచరితమను గ్రంథమున కనందగున. ఈ లాటిపరీక్ష చేయుగల మనోబలముగల్గు పురుషులు లేని కారణముచే దురాచారులై రాజయోగులమని చెప్పువారి ఆటపాటలు సాగుచున్నవి.

ప్రశ్న ॥ ఏమి శ్రీతారకనామము పాపమును నాశము చేయదా ?

ఉత్తరము॥ శ్రీరామ తారకమంత్రము భక్తిజ్ఞానవైరాగ్య సదా చారములతో గూడ విధిప్రకారము జపము నాచరించువారి జన్మాంతర మందుండు సమస్తపాపములను నశింపజేయునని చెప్పుట నిజము. కాని దురాచారపరులై మోసకారులైన వారికి పాపము నధికరించును. ఎట్లన, కుష్ఠవ్యాధిగలవానికి పాషాణభస్మము, తామ్ర భస్మము, గంధకరసాయనము వగైరా కొన్ని యౌషధములు విధి ప్రకారము సేవించినచో రోగము సుఖపడును కాని,

యౌషధసేవకాలములో నపథ్యము చేసినచో శరీరమూరి రోగమధికమై శీఘ్రముగా యమదూతల దర్శన భాగ్యము గలుగును. ఆలాగున పాపముగల వారు శ్రీరామధ్యానము విధిప్రకారము చేసినచో పాపములో కొన్నిభాగములు నశించును. కాని రామధ్యానకాలములో పాపము చేయువారికి తప్పక పాపమధిక మగును. పాలు మంచి వస్తువైనను ఉప్పువేసి త్రాగినచో ఆపాలే విషమగును. నిమ్మపండురసము పిత్తశమనము గాని, ఆ రసము రాగిపాత్రమందుంచి త్రాగినచో నిశ్చయముగా విషమగును. ఈలాగున శ్రీ రామమంత్రము పరమపావనమైనను, విధి నతిక్రమించి యనుష్ఠించువారికి నిశ్చయముగా చెరుపుచేయును. ఎట్లన అంటుజాడ్యముగల స్త్రీతోచేరి ఆరోగముచే పీడితుడగు పురుషుడు రోగ నివారణార్థమౌషధసేవ చేయు కాలమున ఆస్త్రీతో సంసర్గముచేయు చుండిన రోగ మధిక మగునే గాని, శమింపదు గదా ! మరియు నాలుగణాలు సంపాదించువాడొక్క రూపాయ ఖర్చు పెట్టినచో ఎట్లు ఋణస్థుడౌనో, ఆలాగున పుణ్యకార్యము చేయువారు గూడ ఆ పుణ్యఫలముకన్న పాప మధిక మైనచో పాప కర్మముచే బద్ధుడగును. అదియునుంగాక, తెలియక పూర్వము చేసిన పాపము శ్రీరామ ధ్యానముచే నశించును. తెలిసిన తర్వాత చేసిన పాపమునకు నరక మనుభవింపవలసి వచ్చును.

**కృత్వా పాపం హి సంతప్య తస్మాత్ పాపాత్ప్రముచ్యతే।**
**నైవం కుర్యాత్పునరితి నివృత్త్యా పూయతే తు సః ॥**

తెలివిలేని కాలమందు జేసిన పాపముచే కష్టమందున్న వాడు పశ్చాత్తాపముతో భగవంతుని ప్రార్థించినచో ఆ పాపము నుండి విముక్తినొందును. మరల యెప్పటికిని ఆలాటి పాపకార్యము చేయక సత్యనిష్ఠయందుండినచో, పరిశుద్ధుడగును అని మనుస్మృతి. అనగా తెలివిలేని కాలమందు జేసిన పాపము శ్రీరామధ్యానాది జపముచే నశించునేగాని తెలిసి చేసిన పాపము నశింపదు.

దీనికొక కథ చెప్పెద. ఈ సంగతి నేను తిరుపతికి వచ్చిన తరువాత సంభవించినది. అది ఏమన ఐరోపా మహాసంగ్రామమున గవర్నమెంటు కొందరు గూఢచారులగు పోలీసువారిని ఏర్పరచియుండెను. ఆసమయమున

బెంగుళూరినుండి సి. కృష్ణయ్యర్ అను పేరుగల యొక బ్రాహ్మణుడు తిరుమలకు వచ్చెను. ఈయన ఇంగ్లీషులో ఎఫ్.ఎ. వరకు చదివినవారు. తిరుమలకు వచ్చి పోలీసుస్టేషనులో తనకు నివాసము ఏర్పరచుకొని తాను పోలీస్ ఇన్స్పెక్టరనియు, గూఢచారియై ఎచ్చటెచ్చట ఏమేమి జరుగుచుండునో అని కనిపెట్టుటకై గవర్నమెంటునుండి పంపబడినవాడనని వెల్లడి చేసెను. అప్పుడప్పు డొక్కొక్క సందులో తిరిగి, ఎవరైనను యుద్ధసంబంధమై మాట్లాడుచుండినచో వారి పేర్లు వ్రాయుచుండెను. అచ్చటచ్చట శోధనచేసి కొందరి పేర్లను నోటు పుస్తకములో వ్రాసిపెట్టి యొక్కరిని తమకు జవానుగా చేసుకొని పేరువ్రాసిన వారివద్దకు జవానును పంపి మిమ్ములను రాజద్రోహము క్రింద కేసుచేయుటకై మా యిన్స్పెక్టరు వారు ప్రారంభించి యున్నారని విద్యలేనివారికి చెప్పి భయము పెట్టి చాలా డబ్బు సంపాదించెను. తరువాత తిరుత్తనికి పోయి యీలాటి పని ప్రారంభించెను. అప్పుడు తిరుత్తనిలోనుండు పోలీస్ యిన్స్పెక్టరుగారు వీరిపై సంశయము గలిగి పోలీస్ నిబంధనలు కొన్ని అడుగగా ఏమిన్ని తెలియని కారణముచే నిర్బంధింపబడెను. అతని దేశమునకు తంతి యిచ్చునపుడు ఇతడు మహాదొంగయనియు, గ్రామగ్రామమునకు పోయి యీలాటి తంత్రముచే డబ్బుసంపాదించు వాడనియు తెలిసెను. అప్పుడు చిత్తూరుజడ్జి విచారణ చేసి ఇతడు కపటవేషధారి యగుటచే మూడు సంవత్సరములు కఠినశిక్ష విధించెను.

ఆలాగుననే ఇప్పుడుండు రాజయోగులని చెప్పువారిలో పాపకృత్యములు చేయువారికి ఘోరనరకము తప్పదు. వీరివేషము పవిత్రమగు గోవు వంటిది. కృత్యము క్రూరమగు పులి వంటిది. వీరి మాటలంతయు విద్యలేని జనులు నమ్మెదురు. శాస్త్రాభ్యాసము లేని కారణముచే జనులు మోసపోవుచున్నారు. పోలీసు నిబంధనలు తెలిసియుండిన తిరుత్తణి యిన్స్పెక్టరుగారిచే ఆవేషధారి పట్టుబడినట్లు విద్యావంతులచేతిలో దొరికినప్పుడు ఈదురాచారుల గుట్టు బయటపడును. కనుక పరమపవిత్ర మగు శ్రీరామనామమును పాడుచేయుటచే వీరి స్థితి కష్టతర మగును.

సంగం న కుర్యాదసతాం శిశ్నోదరతృషాం క్వచిత్।
తస్యానుగస్తమస్యంధే పతత్యంధానుగాంధవత్॥

ముముక్షువులు శిశ్నోదర పరాయణులున్ను, పాపకృత్యములను చేయువారునగు వారి సంసర్గము నెప్పటికిని చేయరాదు. అట్లున్నవారిని పెద్దలుగా దలచి సాంగత్యము చేసినచో చీకటిలో పోవుచుండెడి గ్రుడ్డివాని చేయిపట్టుకొని మరియొక అంధుడు పోయినచో, ఏలాగున గమ్యస్థానము చేరక మార్గము తెలియక తిరుగునో అట్లు కష్టములో పడుదురు అని శ్రీమద్భాగవతము.

శ్రుతి ॥ తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్।
తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ ॥
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ ॥

సత్యజ్ఞానము కొరకు ముముక్షు వగువాడు సమిత్పాణియై ( రిక్తహస్తుడు కాక) వేదార్థము నెరింగినవాడును. బ్రహ్మనిష్ఠ కలవాడును, పరమాత్మ నెరింగినవాడును నగు గురువు వద్దకు పోవలయును. అనగా దురాచారుల వలయందు చిక్కకూడదనుట. అట్టి జిజ్ఞాసువు విద్వాంసుని యొద్దకు పోయిన నాతడు శాంతచిత్తుడును, జితేంద్రియుడును నగు జిజ్ఞాసువుకు యథార్థమగు (అనగా సదాచార నిర్మల నిష్ఠతో గూడిన) బ్రహ్మవిద్య నుపదేశింపవలెను. మరియు వానికి ధర్మార్థ కామ మోక్షములకును, పరమాత్మని గురుతెఱుంగుటకును తగిన సాధనములను చెప్పవలయునేగాని దురాచారమునకు పాలగునట్లు దుష్టకృత్యములు చెప్పరాదు అని ముండకోపనిషత్తు.

ప్రశ్న ॥ ఇంద్రియములకు విషయములు స్వాభావికముగా నుండునపుడు వాటి వాటి విషయములలో ఆయా ఇంద్రియములు ప్రవర్తించినచో సాక్షియై యుండు ఆత్మకు ఏమి హాని?

ఉత్తరము ॥ ఇంద్రియములకు విషయములు స్వాభావికమని చెప్పుట గొప్ప తప్పు. ఇది విచార శూన్యతచే గలిగిన భ్రమ. ఇంద్రియములకు విషయములు

స్వాభావికమని చెప్పినచో ముక్తునికిన్ని, బద్ధునికిన్ని ఏలాటి భేదము వుండరాదు. స్వాభావికగుణము వస్తువుతో అన్వయము కానిది. ఎట్లన, చక్కెరకు తీపు స్వాభావికము. మధురము తీసివేసినచో చక్కెర యుండదు. పిండివంటలో తీపు ఆగంతుకము. కనుక నిప్పట్లు వగైరా ఫలహారము నీటిలో కలిపి పిసికినచో తీపి వేరు పడును. కనుక ఇంద్రియములకు విషయములు స్వభావము కాదు. ఆగంతుక మని చెప్పుట సరియైనది. ఏలన బద్ధావస్థయందుండు విషయాది దోషములు ముక్తావస్థలో లేవు. ఇదే దృష్టాంతము. స్వాభావిక గుణమైనచో ఎప్పుడున్ను మార్పు రాదు. సూదంటు రాతికి ఆకర్షణ శక్తి గలదు. తల్లియందును, సోదరియందును, భార్యయందును. ఇనుము కొంచెము కొంచెము చేతులలో పెట్టి యొక్కనిచేతియందు సూదంటు రాతి నుంచినచో తల్లి, సోదరి, భార్య, ఇత్యాది భేదము లేకనే అందరి చేతియందుండు యినుమును ఆకర్షించును కదా? అదేరీతిగా ఇంద్రియములకు విషయములు స్వాభావికమైనచో తల్లియందును, సోదరి యందును, భార్యయందును ఒకేవిధముగా మనోవృత్తి యుండవలయును. అట్లు కనపడుట లేదు. కనుక స్వాభావికమని చెప్పుట బుద్ధిహీనత. ఆ సూదంటురాతియందుండు ఆకర్షణశక్తి నిలిచి యుండు పర్యంతమే ఆకర్షించును. ఆ శక్తి నశించినచో ఆకర్షించుటకు సాధ్యము కాదు. ఆలాగున హృదయమున విషయవాసనలుండు పర్యంతము ఇంద్రియములద్వారా విషయము లనుభవించుటకు బుద్ధి యుండును. అంతవరకు వాడు ముక్తుడు కాలేడు. ఇంద్రియములకు విషయములు స్వాభావికమా? లేక ఆగంతుకమా? అని తెలుసుకొనుట దుస్తరము. ఇది ప్రత్యక్షముగా ఇంద్రియముల నతిక్రమించిన సమాధి అవస్థయందు గోచర మగును. ఆ యవస్థలో ఇంద్రియములు జడము లనియు, తానొక్కడే చైతన్యస్వరూపుడగు ఆత్మయనియు ప్రత్యక్షముగా బోధ గలుగును. సమాధి అవస్థయందుండు మహాత్ముని కర్ణనేత్రము లను ఇంద్రియములు తెఱచియుండినను ఏమిన్ని యెఱుంగజాలవు. సాధారణ సుషుప్తి అవస్థయందు గూడ నేత్రకర్ణేంద్రియాదులన్నియు నుండినను విషయముల గ్రహించుట లేదు. ఇంద్రియముల ద్వారా మనస్సు బహిర్ముఖముగా ప్రవేశించి విషయములను ఆత్మ సాన్నిధ్యమునకు తెచ్చుచుండును. అన్ని యింద్రియములకు

వృత్తి లేదు. చక్షురాదీంద్రియములు వృత్తులను గ్రహించుటకొరకు జడములగు సాధనములు.

**మనో దశేంద్రియాధ్యక్షం హృత్పద్మే గోళకే స్థితమ్ ।**
**తచ్చాంతఃకరణం బాహ్యేష్వస్వాతంత్ర్యాద్వినేంద్రియైః ॥**

మనసు హృదయ పద్మగోళమందుండి దశేంద్రియములను ప్రేరేపించి స్వతంత్రవములేని యింద్రియంవములద్వారా బహిర్ముఖవముగా ప్రవేశించి విషయములను స్వీకారము చేయుచుండును.

**శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ ।**
**అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥**

ఆత్మ, శ్రోత్రము, చక్షుస్సు, స్పర్శనము, రసనవము, ఘ్రాణము మొదలగు ఇంద్రియములను, మనస్సును ఆశ్రయించి శబ్దము, రూపము, స్పర్శము, రసము, గంధము అను విషయముల ననుభవించుచుండును. ఇచ్చట మనస్సు గూడా బాహ్యేంద్రియములవలె జడము.

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥**

అసుర స్వభావము గలవారు, ధర్మమార్గమందెట్లు ప్రవర్తించవలెనో ఆ ధర్మమునుండి యెట్లు నివర్తించవలెనో ఆసంగతి నెఱుంగరు. అట్లు ప్రవృత్తి నివృత్తి మార్గమెఱుంగని అసుర స్వభావముగలవారికి శుచియున్ను, శుద్ధాచారమున్ను, సత్యనిష్ఠయు, జీవకారుణ్యము మొదలగు దైవగుణము లుండవు.

**చింతామపరిమేయాం చ ప్రళయాంతాముపాశ్రితాః ।**
**కామోప భోగవరమా ఏతావదితి నిశ్చితాః ।**
**ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ॥**

ప్రళయమువరకనుభవించినను చాలకున్నట్లు, విషయాశ గలవారై యిష్టానుసారముగా భోగములనుభవించుటయే పురుషార్థమని తలంచువారై,

యింతకన్న మానవుడు పొందవలసిన భాగ్యము మఱియేమిన్ని లేదని విచారించువారై, వందలకొలదిగా ఆశాపాశములతో గట్టుపడి, ఇటునటు నాకర్షింపబడినవారై, కామక్రోధ పరాయణులై కామోపభోగముల కన్యాయముగా ధనముసంపాదించు వారలు అసురులగు మానవులని శ్రీకృష్ణభగవంతుడు గీతయందుపదేశించిరి.

**అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।**
**సర్వార్థాꣳ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ॥**

తమోగుణ బుద్ధిగలవాడు అధర్మములగు మద్యపాన ప్రాణిహింసాదులు ధర్మమనియు, ధర్మమగు బ్రహ్మచర్యము, జీవకారుణ్యము, బ్రహ్మనిష్ఠాదులు పనిలేదనియు, సాధుసజ్జనులు చేయదగిన అన్ని సదాచారములు త్యజించి పాపాత్ముడు చేయు ప్రాణిహింస, మద్యపానము, విషయలంపటము మొదలగు దురాచారములను సదాచారములనియు చెప్పుదురు. వీరు తమోగుణ భూయిష్ఠులని భగవద్వచనము.

**వనితానందన చందనాదివిషయవ్రాతంబులం బొంది చ**
**య్యనసంతంతకు జొక్కు నెమ్మనము బ్రహ్మానంద వారాశివా**
**సన యొక్కించుక సోకనేని బ్రవినాశం బొందు నానాద్రుపు**
**ష్పనటద్భృంగము చంపకప్రసవ సంస్పర్శాప్తి గూలుంగతిన్.**

**చక్కెరయును లవణంబును**
**గ్రక్కన నుదకములయందు గరిగిన రీతిన్,**
**మిక్కిలి తనుగను ఘనుమది**
**చొక్కుచు నానందజలధి మడిసి నశించున్.**

**ఇను డస్తమించు తఱి నా**
**తని కిరణము లతనితోడ దగ జనురీతిం,**
**బెను మానసంబు పొలిసిన**
**మునుకొని తద్గతవికారములు పొలియు గదుꣳ.**

వేదశాస్త్రంబులు వివరించి బుధులచే
జదివింపవచ్చు దా జదువవచ్చు
యజ్ఞదాన తపంబు లధికారి జనముచే
చేయింపవచ్చు తా జేయవచ్చు
నిలలోన గల తీర్థములకేగ నన్యుల
బోధింపవచ్చు తా బోవవచ్చు
నష్టాంగ యోగవిద్యల నార్యులకు నుప
దేశింపవచ్చు సాధింపవచ్చు

గాని యెవ్వారికైన విజ్ఞాన యోగ
గతిని దేహేంద్రియము లరికట్టి మనము,
నాపి యంతర్ముఖము జేసి యనవరతము
నిశ్చల సమాధి నిష్ఠచే నిలుపరాదు.

మరియు వేదశాస్త్రాదులను శిష్యులకు బోధించుటయు, దా నభ్యసించుటయు గూడ సాధ్యమైన పనియే. యజ్ఞదాన తపోరూపములైన కర్మల దగినవారలచే నాచరింపజేయుటయు, స్వయముగా నాచరించుటయును సులభమే. పుణ్యతీర్థములకు నవశ్యముగ బోవలయునని పరులకు బోధ చేయుటయును, స్వయముగ నట్లాచరించుటయును శక్యమే. యమ నియమాద్యష్టాంగ యుక్తములగు యోగముల బరులకు బోధించి వారిచేత ననుష్ఠింప జేయవచ్చును. తానును సాధింపవచ్చును. ఇట్లెన్ని కార్యములనైన జేయ గలిగియున్నను, ఇంద్రియముల నిగ్రహించి మనస్సును నిరోధించి లోనికి దిప్పి సర్వకాలములయందును నిర్వికల్ప సమాధి నిష్ఠుడై యుండుట (ఉపరతిని జెందుట) యెట్టి వారికైనను అశక్యము.

కొందఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు
గర్వులై నిక్క చిత్తనిగ్రహము లేమి,
నుపరతి సుఖంబు గానక విపులవిషయ
రాగలోలత జెడుదు రూరక మహాత్మ !

శ్రీసీతారామాంజనేయ సంవాదమున నీలాగున స్వానుభవము గల మహాత్ములు ఘోషించుచుండు సంగతి మన రాజయోగులు రవంత విచారము చేసిన వ్యామోహము నుండి విడుద లగుదురని నేను దలంచుచున్నాను.

## పూర్వాచారము

ప్రశ్న ॥ పూర్వీకులచే పరంపరగా చేయబడుచు వచ్చిన కర్మ మవశ్యమాచరణీయ ముగదా? వారంత తెలివి లేనివారా? అనగా, కొందరు గురుపూజ మొదలగు, పరిశుద్ధకర్మములను చేయునప్పుడు మద్యమాంసముల నుపయోగించుచు వచ్చినది పరంపరగా శిష్యులనుష్ఠించినచో నేమి విరోధము? పూర్వాచారము తప్పనెదరా?

**శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥**

బాగుగ నాచరింపబడిన పరధర్మమునకన్న గుణహీనమైనను తన ధర్మము మిక్కిలి మంచిది. ఏమన, తనధర్మము తప్పక నడుచుటలో మరణము తటస్థించినను మేలు, పరధర్మము నరకాది రూపమగు భయమును గలుగజేయునది అని శ్రీ గీతయందు శ్రీ భగవంతుడే చెప్పుచుండగా పూర్వాచార మేల చెడ్డదని చెప్పవచ్చును?

ఉత్తరము ॥ భగవద్వచనము సరి గాని, దాని చెప్పువాడు నాస్తికుడైనచో, నరకము ననుభవించును. మీరు పూర్వీకులని జెప్పుచున్నారు. నిన్న మొన్న చనిపోయిన తండ్రులు, తాతలైన వారినా? లేక పరమాత్మ అంశమైన బ్రహ్మసృష్ట్యాదియందుండు మహర్షులనా?

**మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।**
**మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥**

భృగువు మొదలగు సప్తఋషులు, వారికన్న పూర్వీకులగు సనక సనందన సనత్కుమారాది నల్గురు యోగులున్ను, మనువులు వీరందరున్ను నా మానసభావముగలవారై అనగా నా అంశములై నాసంకల్పమాత్రమున బుట్టిరి.

ఈలోకమందలి ఈ ప్రజలందరు వారివలన బుట్టిరి. కనుక గురు పరంపరగా జూచినచో వసిష్ఠ, వ్యాస, శుక, వామదేవ, దత్తాత్రేయాది మహర్షుల పరంపరగా నుండవలెను. లేక తండ్రివంశ పరంపరగా విచారిం చినచో బ్రహ్మదేవుడు, సనకాది ఋషులు, మన్వాది తపోనిధులుగానే యుండవలెను. మనువునుండి జన్మించిన కారణముచే మానవుడని పేరుకలిగినది. కనుక గురుపరంపరగా జూచినను సత్య, ధర్మ తపోనిష్ఠులుగానే యుండవలెను. లేక వంశపరంపరగా జూచినను బ్రహ్మచర్య, అహింసా, యోగ, ధ్యాన నిష్ఠాద్యనుష్ఠానములతో నుండవలయునే గాని, నిన్న మొన్న గల శుష్కవేదాంతులై, వేదభ్రష్టులై, యుండు కుయోగులగు గురువులకు శిష్యులుగా నుండువారు పూర్వీకులు గారు. వీరు పూర్వీకులగు మహర్షులను, వేద ప్రమాణములను త్యజించిన స్వేచ్ఛా విహారులగు దొంగ వేదాంతులు.

ఈలాటి నీచులు లోకమందు వ్యాపించిన కారణముచే ఇతర మతస్థులు పావనమగు వేదమును నిందించుటయే గాక మహర్షులను గూడ దూషించు చున్నారు. ఇతర మతస్థులు ప్రస్తుతము నడచు జనుల ఆచారమును చూచుదురే గాని, వేదములను, మహర్షులను వారెరింగియుండరు. మరియు పూర్వీకులు నడుచునట్టి నడతయే ఒక్కడు నమ్మియుండినచో ఒక్కడు పేదరికముచే భిక్షమెత్తి జీవించుచుండగా, వాని అదృష్టము వలన ఒక్క కుమారుడు గొప్ప భాగ్యశాలిగాను, మహాధనవంతుడు గాను గలిగినచో కుమారుడు గూడ ధనమును పరిత్యజించి తండ్రివలె భిక్షమెత్తుట మంచిదని తలచువారును, గ్రుడ్డివాడైన ఒక్కనికి సర్వాంగముతో నేత్రముగల పుత్రుడు జన్మించిన పుత్రునకు గూడ నేత్రములు గ్రుడ్డిగా చేయవలయు ననియు, విద్యాహీనుడై దరిద్రునిగా నుండిన ఒక్కనికి మహా పండితుడై కీర్తిమంతుడైన పుత్రుడు జన్మించిన వారుగూడ కూలి పని చేయవలెనని చెప్పు మూఢు లెవరైన గలరా ? వారు గదా పూర్వాచారమని చెప్పి దురాచార పరమగు మద్యము, మాంసము, గంజాయి వగైరాలతో గురుపూజ మొదలగు పవిత్రకార్యములు జరుపుదురు.

మరియు ఒక్క చిన్నగ్రామమున నుండు జనులు కడుపేదరికముచే నుండుకాలమున ఆ యూరిలో త్రాగునీ రుప్పునీరుగా నుండెను. కాలాంతరమున ఆ గ్రామములో దైవకృపవల్ల ఒక్కడు గొప్పవాడై క్రొత్త బావి త్రవ్వగా మంచి

కాశీ గంగాజలమువలె నీరు పడెను. దానికి ముందుప్పునీరు త్రాగి జనులు వ్యాధిగ్రస్తులై యుండిరి. ఈ మంచిజలము త్రాగుటచే ఆరోగ్యవంతులై జీవితము గడుపుచుండిరి. అప్పుడు మన పూర్వీకులుప్పు నీరు త్రాగిగదా జీవించిరని చెప్పినచో మంచినీరు త్రాగి సుఖముగా నుండనివారెవరైన గలరా? వారు గదా కొంతకాలము క్రిందట మహర్షుల పరిశుద్ధమార్గమునుండి జారిపడి పిశాచారాధన చేయువారి వృత్తులను పూర్వాచారమని చెప్పుదురు. ఇట్లు వారు చెప్పు కారణమేమన జిహ్వాచాపల్యము నిలుప సాధ్యము గాక తెలివి లేనివారితో ఈలాటి కుయుక్తులు చెప్పుదురు. మరియు ఒక్కని తండ్రి దొంగవాడైయుండి చచ్చిన తర్వాత పుత్రుడు చోరత్వము చేసినచో వానిని దొరతనము వారు దండింపరా ? లేక తండ్రి చోరుడైయుండిన కుమారుడుకూడ అట్లుండుట శ్రేష్ఠమని తలంచువారు కలరా ? ఆహా ! ఎంత తెలివిలేని మాటలు ? సిగ్గులేదా యిట్లు చెప్పుటకు ?

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

ఈశ్లోకమున కనేకులు వారి వారి మనఃపరిపక్వత ననుసరించి అర్థము చెప్పుదురు. ''స్వధర్మమనగా'' బ్రహ్మచారిగా నుండునపుడు గురుశుశ్రూష, బ్రహ్మచర్యము, వేదాధ్యయనము, భిక్షాహారము, తపస్సు వారికి స్వధర్మ మగును. ఆ బ్రహ్మచారియగు వాడు గృహస్థాశ్రమము సందుండు నపుడు అగ్నిహోత్రాది పంచ యజ్ఞములు, ఋతుకాలమున భార్యతో చేరుట, నిత్యనైమిత్తికాది కర్మలు చేయుట, స్వధర్మ మనబడును. మరియు వానప్రస్థాశ్రమమున చేయు కృత్యములు గృహస్థాశ్రమముకంటె భిన్నమైనవి. వారికి అది స్వధర్మ మగును. మరల సన్న్యాసాశ్రమము స్వీకరించునపుడు ఇంతవర కనుష్ఠించిన మూడు ఆశ్రమములలోగల సకల కర్మములను పరిత్యజించి భిక్షాహారము, బ్రహ్మనిష్ఠ వగైరా చేయుట సన్న్యాసికి స్వధర్మమగును. ఇప్పుడొక్కనికి ఒక కాలమున కర్మము చేయుటయు, మరియొక కాలమున కర్మను త్యజించుటయు వృత్తిగా తటస్థించును. అప్పుడు స్వధర్మము యొక్క అర్థమేమి ? కనుక ఎవరెవరు ఏయేస్థితి

యందుండుదురో వారికి దాని ననుసరించి చేయవలసినపని చేయుటలో ప్రాణము పోయినను మోక్షకర మని దృఢబుద్ధిగలిగి యుండుట స్వధర్మము యొక్క నిజార్థము. కనుక నిచ్చట గురుపూజ చేయునపుడు సన్న్యాసాశ్రమము విధి ననుసరించి యుండవలెను. శిష్యులు గూడ గురుపుత్రులై నందున బ్రహ్మనిష్ఠ, జీవకారుణ్యము, తపస్సు, వైరాగ్యము మొదలగు సదాచారములను ప్రాణము పోయినను తప్పక అనుష్ఠించవలెనని స్వధర్మము బోధించుచున్నది. కాని రాక్షసుల వలె జీవులను జంపి తినుట, అసురుల వలె సురాపాన పరులై మదోన్మత్తులై యుండుట, సోమరులవలె బంగిపత్రి త్రాగి నిద్రపోవుట, అహంకారులవలె (కసరత్తుచేయువారు) రామరసము (భంగ్) త్రాగుట, తిండిపోతువలె జీర్ణము కొరకు అభిని (నల్లమందు) సేవించుట మొదలగు వృత్తులు గురుపరంపరయున్ను గాదు. స్వధర్మమున్ను గాదు. అది గురునిందయు అధర్మము. దీనిని ఈశ్లోకములో ఆఖరున ''పరధర్మో భయావహః'' అని శ్రీకృష్ణభగవంతులు లుపదేశించిరి. అనగా రాక్షసుల కృత్యమగు అధర్మమున ప్రవర్తింపరాదని అర్థము.

మరియు ''స్వస్య ధర్మః, స్వధర్మః'' స్వశబ్దము తనయొక్క ఆత్మను నిరూపించుచున్నది. అనగా ఆత్మకు బంధకరమగు పని ప్రాణము పోయినను చేయరాదని భావము. మరియు ఆత్మస్వరూపస్థితి బొందుటలో మరణమొందినను మంగళకరము.

**యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి।**
**అన్యత్తృణమివ త్యాజ్యమప్యుక్తం పద్మజన్మనా ॥**

బాలకుడు గాని, చిన్నస్థితియందుండువాడు గాని చెప్పు మాటలు యుక్తియుక్తముగాను, శాస్త్రసమ్మతముగాను నుండినచో శిరసావహింపవలెను. బ్రహ్మదేవుడు గాని, గురువు గాని, తల్లిదండ్రులు గాని చెప్పిన మాటలు యుక్తియుక్తము కాక, శాస్త్రసమ్మతము కాక సత్యనిష్ఠాప్రతి బంధముగ నుండినచో నిశ్చయముగ తృణీకరించవలెను అని వసిష్ఠ భగవంతులు శ్రీరాములకొరకు వాసిష్ఠమున నుపదేశించిరి.

పై జెప్పిన దోషములు సాంగత్యదోషముచే గలుగుచున్నవి. దీనికొాక

కథగలదు. ఒక్కచిలుక రెండుపిల్లలు చేసియుండు కాలమున ఒక బోయవాడు ఆపిల్లలను పట్టుకపోవుటలో ఒకటి తప్పించుకొని ఒక ఋషి ఆశ్రమమున జేరెను. ఈపక్షి చిన్నదిగా నుండుటచే, బయట పెట్టినచో డేగ మొదలగు పక్షులు చంపునని తలచి ఋషి శిష్యులు వారి ఆశ్రమమున భద్రముగా కాపాడుచుండిరి. మరియొక దానిని బోయవాడు కసాయి కమ్మెను. ఆ కసాయివాడు పంజరమందుంచి తనమాటలు నేర్పుచుండగా ఎట్లనో ఆపక్షి తప్పించుకొని పోయి మార్గమున ఒకచెట్టుపై కూర్చుండెను. అప్పుడు ఆమార్గముగా ఒక బ్రాహ్మణుడు కాశీయాత్ర పోవుచు వచ్చి ఆచెట్టునీడను గూర్చుండి సమీపమందుండు నీటిని చూచి వంటచేయుటకు ప్రారంభించెను. వృక్షముపై నుండు ఆచిలుక ''ఏమాంసము కావలెను. పంది మాంసము శేరు రెండు అణాలు. మేక మాంసము మూడు అణాలు, కోడిది నాలుగు అణాలు కావలయునా తీయుడు ! లేక పొం'' డని చెప్పెను. ఈలాటి శబ్దము వినగా బ్రాహ్మణుడు ఇదేమి ఆశ్చర్యము ? ఈవృక్షమందు పిశాచి పక్షిరూపమై యుండునని భయబడి శీఘ్రముగా పోయి మరియొక ఆశ్రమసమీపమున నుండు చెట్టుక్రింద భోజనము చేయుటకు కూర్చుండగా ఆ చెట్టుపై అదే రీతిగ ఒక చిలుక కూర్చుండి ''కుశలమా ! స్వాగతము ! స్వస్తిరస్తు, సత్యం వద, ధర్మం చర, ఓమ్ తత్ సత్, బ్రహ్మ సత్యం జగత్ మిథ్యా, అహింసా పరమోధర్మః, సంసారం సాగరం దుఃఖం'' అని యిట్లు పవిత్రమగు వేదశబ్దములు పలికెను. ఆ బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి ఏమి యున్ను తెలియక సమీప మందుండు ఋష్యాశ్రమమునకు పోయి, అచ్చట తపస్సు చేయుచుండు మునికి నమస్కరించి ఈ రెండుపక్షుల కథ చెప్పుమని ప్రార్థించెను. అప్పుడా మహర్షి దివ్యచక్షుస్సుచే కనుగొని ''నాయనా ! ఈపక్షులు రెండు ఒక్కతల్లి బిడ్డలు, ఒక్కదానిని కసాయివాడు పెంచిన కారణముచే వాని స్వభావము దానికి గలిగినది. ఈపక్షి ఈ ఆశ్రమమందుండిన కారణముచే దానికి పావనమగు ఈగుణములు గలిగినవి. కనుక మనుజుడు ఏ సంసర్గము చేయునో, ఆగుణమే గలుగు'' నని చెప్పి ఋషి ధ్యాననిష్ఠయందు మగ్నుడయ్యెను.

కావున ఈ శుష్క వేదాంతులు ఋషుల పరంపరయైనను మధ్యకాలమున నీచ సంసర్గము చేయుటచే ఘోరకృత్యములగు ప్రాణిహింస,

బంగిపత్రి, గురుపరంపర యని చెప్పుచున్నారు. పులుపుమామిడి ముట్టెయైనను మల్గోబ చెట్టుతో అంటుగట్టినచో నైజగుణమగు పులుపుబోయి దానియందు అంటుకాయలు కాచును. మల్గోబ ముట్టెయైనను పులుపు మామిడిచెట్టుతో అంటుకట్టిన స్వభావగుణమగు తీపుపోయి యితర గుణము గనుపించును. అదే సంసర్గ తారతమ్యము. కనుక మంచి సంసర్గము చేయవలెను.

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥

ఓమ్



## నిర్వాణకాల భేదము

ప్రశ్న ॥ ఉత్తరాయణములో ప్రాణము పోవువారికి ఆవృత్తిరహిత మగు మోక్షమనియు, బ్రహ్మనిష్ఠుడైన గూడ దక్షిణాయనమున ప్రాణము పోయినచో, మరల ఆవృత్తి గలుగు ననియు చెప్పుదురు. కావున భక్తులు దక్షిణాయనములో ప్రాణము పోవుటలో నిండా భయపడుచున్నారు. దీని యందుండు రహస్యము నాపై దయ యుంచి సెలవివ్వవలెను. దీనికి వేద శాస్త్రమే ప్రమాణము.

**అగ్నిర్జ్యోతిరహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥**

ఏమార్గమున అగ్న్యభిమాన దేవతయు, దినాభిమాన దేవతయు, శుక్లపక్షాభిమాన దేవతయు, ఉత్తరాయణాభిమాన దేవతయు ప్రాపకులుగా నుందురో, ఆమార్గమునం బోయిన బ్రహ్మవేత్తలగువారు క్రమముగా బ్రహ్మము నొందుదురు. అనగా ముక్తులై మరల తిరిగిరారు.

**ధూమో రాత్రి స్తథా కృష్ణష్షణ్మాసా దక్షిణాయనమ్ ।**
**తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥**

ఏమార్గమున చంద్రాభిమానదేవతయు. రాత్ర్యభిమానదేవతయు, కృష్ణపక్షాభిమానదేవతయు, ప్రాపకులుగా నుందురో ఆమార్గమునం బోయిన

యోగులు చంద్రలోకమునకు బోయి స్వర్గమనుభవించి కర్మఫలము క్షీణించినతోడనే మరల వచ్చుచున్నారు. అనగా పునర్జన్మ మెత్తుచున్నారు.

ఉత్తరము ॥ ఈ విషయములలో అతి గూఢమగు రహస్యార్థముండును. బ్రహ్మవేత్త ఉత్తరాయణమున గాని, లేక దక్షిణాయనమున గాని శరీరము విడిచినచో పునరావృత్తి గలుగదు. ఈ దక్షిణాయన ఉత్తరాయణ విధు లుపాసకుల గురించి చెప్పినది. లేనిచో ఉత్తరాయణమున పాపాత్ములుగూడ ఎందరో చచ్చుచున్నారు. వారి కందరికిని పునర్జన్మము లేని మోక్షము గలుగునా? లేదు. మరి దక్షిణాయనములో అనేక బ్రహ్మవేత్తలు శరీరము విడుచుచున్నారు. వారికి పునరావృత్తి యని చెప్పుటలో శ్రుతి. యుక్తి, అనుభవములకు విరోధము వచ్చును. కావున గీత అష్టమాధ్యాయమున 5, 6వ శ్లోకములను చూడుడు. ఈశ్లోకములో బ్రహ్మవేత్తల గురించి చెప్పబడినది.

**అన్త్యకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥**
**యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।**
**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥**

ఎవడు మరణకాలమున నన్నే (బ్రహ్మభావమును) స్మరించుచు దేహమును విడుచునో వాడు నాయందైక్యమగును. అనగా తన్మయమగును. ఇందుకు సంశయము లేదు. శ్లోకమున చివర ''నాస్త్యత్ర సంశయః'' అని విశేషముగా శ్రీభగవంతుడే చెప్పి యుండగా సంశయమున కవకాశము లేదు. దక్షిణా యనమునందొక్కరు మరణకాలమున పరమాత్మ ధ్యానముతో దేహము విడిచిన వానికి ముక్తి లేనిచో భగవంతునిచే జెప్పంబడిన ఈశ్లోకమున కర్థమేమి ? సాక్షాత్ భగవంతుని మాట లబద్ధమైనచో ఈ జగము నిలుచునా ? కనుక ఈశ్లోకముచే ఉత్తరాయణమందునాని, దక్షిణాయనమందుగాని ప్రాణము పోయినను ప్రాణప్రయాణసమయములో బ్రహ్మభావన యుండవలెనని భావము.

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

పరబ్రహ్మమును తెలిపెడి ఓం అను ప్రణవము నుచ్చరించి దాని అర్థమగు బ్రహ్మమునను భావించి దేహము విడుచు వారలు పరమపదమగు మోక్షమొందుదురు. 'స యాతి పరమాం గతిం' అని చెప్పుటలో నుత్కృష్టమగు ముక్తి నొందుదురని తాత్పర్యము. ఇట్టి భగవద్వచనముండగా సంశయమునకు మార్గము లేదు. ''బ్రహ్మ వేదన మాత్రేణ బ్రహ్మైవ భవతి స్వయం'' అనగా బ్రహ్మము నెప్పు డెరుగునో అప్పుడే బ్రహ్మరూపుగలవాడై ముక్తుడగుననియు, ''బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి'' బ్రహ్మవేత్తయగువాడు బ్రహ్మమేయగుననియు శ్రుతి ఘోషించుచుండగా, ఉత్తరాయణ, దక్షిణాయన మార్గము లుపాసకుల గురించి చెప్పిన వనుట నిశ్చయము.

**వస్త్వేకత్వమహావాక్యాదేవ జానంతి యే నరాః ।**
**తే ముచ్యంతే హి సంసారాద్యథా స్వప్న ప్రబోధవత్ ॥**

ఏ మానవులు మహావాక్య శ్రవణ, మనన, నిదిధ్యాసనముచే ఏకమై అద్వితీయమగు బ్రహ్మము నెరుంగుదురో, వారు జనన మరణాత్మకమగు ఘోర సంసారమునుండి అప్పుడే ముక్తు లగుదురు. ఎట్లన స్వప్నసమయములో కలలో గన్న విషయములు మేల్కొన్న తరువాత అప్పుడే ఎట్లు అసత్యమని తలచి నిర్భయు లగుదురో, ఆలాగున మాయాకల్పిత జగద్భ్రాంతి జ్ఞానోదయ సమయమున నివృత్త మగును.

**రససిద్ధం యథా తామ్రం హేమత్వం ప్రతిపద్యతే ।**
**తథాత్మజ్ఞానసంబద్ధః శివత్వం ప్రతిపద్యతే ॥**

ఏలాగున తామ్రము రసవాదవిద్యచే స్వర్ణత్వము బొందునో, ఆలాగున మాయాకల్మషముతో గూడిన జీవుడైనను ఆత్మజ్ఞాననిష్ఠ కలిగినప్పుడే జీవత్వము బోయి శివత్వము (పరిశుద్ధ బ్రహ్మము) నొందును. శ్రీమద్భగవద్గీత యుపదేశించిన తరువాత శ్రీకృష్ణభగవంతుడు గీతయందుండు నిగూఢ రహస్యము నుత్తర గీతయం దర్జునునికొరకు మరల నుపదేశించెను. దానికి నుత్తరగీతయను పేరుగలదు. దానిలో ఉత్తరాయణ దక్షిణాయన విషయమై భక్తులు సంశయించెద రని భగవంతుడూహ చేసి దాని రహస్యము ఈగీత యందుపదేశించిరి.

**దక్షిణే పింగళా నాడీ వహ్నిమండలగోచరా ।**
**దేవయానమితి జ్ఞేయం పుణ్యకర్మానుసారిణీ ॥**

దేహముయొక్క దక్షిణపార్శ్వమందు అగ్నిమండల గోచరమై పుణ్యకర్మములచేతనే ప్రాప్తంబగుటకు యోగ్యంబైన పింగళ నాడియనునది దేవయానమనియు, పునరావృత్తి రహితమనియు తెలియందగినది. ఇదియే అర్చి రాది మార్గమనంబడును. అనగా ప్రాణప్రయాణసమయమున ధ్యాన శక్తిచే పింగళనాడిద్వారా ప్రాణము విడుచువారికది ఉత్తరాయణమనియు, దేవయాన మనియు, పునరావృత్తి లేనిదియనియు తెలియందగినది.

**ఇడా చ వామనిశ్వాసా సోమమండలగోచరా ।**
**పితృయానమితి జ్ఞేయం వామమాశ్రిత్య తిష్ఠతి ॥**

ఇడానాడి యనునది వామనిశ్వాస మార్గము. ఇది చంద్రమండల గోచరంబై, వామనాసాపుటమువలన చంద్రమండలము పొందును. అది వామభాగము నాశ్రయించి యుండును. ఈనాడీయే పితృయానమనియు, పునరావృత్తి గలది యనియు, ధూమాది మార్గంబనియు, దక్షిణాయనమనియు తెలియందగినది. అనగా దేవయానమగు ఉత్తరాయణమున పోవువారంద రున్ను ముక్తులు గారు. వీరుపాసనా మూర్తులగు బ్రహ్మ విష్ణు శివాదిలోకములగు బ్రహ్మలోక, విష్ణులోక, కైలాసలోకములను బొంది అచ్చటనే యుండి ఆ దేవతల సృష్ట్యాది కాలము వరకుండి వారితో సహా యుండిగాని లేక వారివల్ల బ్రహ్మోపదేశము నొంది బ్రహ్మాత్మైక్యమును నొందుదురు. ఇహలోకమందుండి ముక్తులగువారి సంగతి చెప్పబడుచున్నది.

**ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ ।**
**సర్వం ప్రతిష్ఠితం తస్మిన్ సర్వగం సర్వతో ముఖమ్ ॥**

ఇడాపింగళల నడుమ సుషుమ్న యను సూక్ష్మంబైన నాడి గలదు. అదియే మూలాధారము మొదలు సహస్రారము పర్యంతము కుండలినీ శక్తియని ప్రసిద్ధినొందిన సుషుమ్న నాడి. తదగ్రమందు సర్వాత్మకంబై. సర్వ వ్యాపకమై, విశ్వతోముఖమై యుండు బ్రహ్మ జ్యోతియను తేజస్సు ప్రతిష్ఠితంబై యున్నది.

యోగశక్తిచే యీ సుషుమ్నా నాడిద్వారా ప్రాణమును లయముచేయువారు ముక్తు లగుదురు. వీరు ఎచ్చోటికైనను పోవువారు కారు. వీరే విదేహ ముక్తులు. ఇతరు లుపాసకులగు భక్తులు.

**యత్ర యత్ర మృతో జ్ఞానీ యేన కేనాపి మృత్యునా ।**
**యథా సర్వగతం వ్యోమ తత్ర తత్ర లయం గతః ॥**

సర్వవస్తువుల యందవిచ్ఛిన్నమైయుండు ఆకాశమువలె జ్ఞాని యగువాడు ఎచ్చటెచ్చట అనగా నుత్తరాయణమందుగాని. దక్షిణాయనమందు గాని, కాశి యందు గాని, చండాలవీథి యందుగాని యే యేవిధంబున అనగా, సిద్ధాసనారూఢుడై స్వేచ్ఛామరణము గాని, లేక మహావ్యాధిపీడితుడై గాని మృతి నొందినను అచ్చటచ్చట నాయావిధంబుననే సర్వపరిపూర్ణ స్వరూపమున లయమగుచున్నాడు. అనగా ఘట మఠంబులకు నాశము సంభవించినను వాటియందుండు ఆకాశము మహాకాశముతో గలియు విధంబున జ్ఞాని శరీరో పాధులతో గూడి యెచ్చోటున నెవ్విధంబున దేహము విడిచినను పరిపూర్ణ బ్రహ్మాత్మైక్యము గలిగి ముక్తుడగును అని శ్రీ భగవద్వచనము.

## ప్రాణప్రయాణనియమము

ప్రశ్న ॥ జ్ఞానులకు శరీరము విడుచుటలో కాల దేశములు చూడంబని లేనిచో గొప్పవారగు భీష్మాచార్యులు ఏల ఉత్తరాయణ పర్యంతము శరతల్పమున నుండి ప్రాణము విడిచిరి ?

ఉత్తరము ॥ భీష్మాచార్యులు కారణపురుషుడు. మరియు భీష్మునియొక్క చరిత్రము చూడగ వారు జ్ఞానియైనను జనకాదులవలె కర్మానుష్ఠాన మనుష్ఠించువారు. జనకులు గూడ విదేహులైనను వేదవిధిప్రకారము కర్మ కాండము కించిత్తైనను విడువక అనుష్ఠించినవారు. ఆలాగుననే శ్రీరామచంద్రులుగూడ సాక్షాత్ నారాయణావతారమైనను కర్మకాండము విధిప్రకార మనుష్ఠించినవారు. భీష్ములు కర్మమును విడుచుట ధర్మము గాదు. ఏలన బ్రహ్మచర్య వ్రత

మందుండువారికి శిఖాయజ్ఞోపవీతము లుండు పర్యంతము విధిప్రకారము కర్మ అనుష్ఠేయము. భీష్ములు సన్న్యాసాశ్రమము స్వీకరించినవారు కారు కనుక కర్మ అవశ్య మనుష్ఠించుట విధిచోదితము. భీష్ములు కర్మసన్న్యాసియైనచో యుద్ధము చేయుట సరికాదు. మరియు అతీతజ్ఞానశక్తియు. యోగశక్తియు గలవారైనను క్షత్రియ ధర్మము ననుసరించి యుద్ధము చేసిరి. భీష్ములు క్షత్రియధర్మము ననుసరించి దుర్యోధను డధర్మప్రవర్తకు డనియు, పాండవులు ధర్మతత్పరు లనియు, శ్రీ కృష్ణభగవంతుడు పరమాత్ముడనియు, యుద్ధమున జయము గలుగదనియు తెలిసియుండియు క్షత్రియ ధర్మమగు యుద్ధము చేసిరి. ఆలాగుననే శ్రుతిస్మృతులలో ఉపాసకులకు ఉత్తరాయణము ప్రాణప్రయాణమునకు శ్రేష్ఠమని చెప్పియుండుటచే భీష్ములున్ను అట్లనే ఆచరించుకొనిరి. వారికి బ్రహ్మాకారమగు జ్ఞానము గలుగక చేసినవారనియో లేక ఉత్తరాయణమున ప్రాణము పోయినచో, మంచి గతి గలుగుననియు, లేనిచో దుర్గతి తటస్థించుననియు భయపడి శరీరము నిలిపినవారుగారు. ఈవిషయమై అనేకులు అనేకవిధములుగా చెప్పుదురు. కొందరి మతమేమన, యుద్ధము చేయు సమయమున మనస్సు రజోగుణముతో గూడియుండుటచే అప్పుడే ప్రాణము పోయినచో మంచిగతి గలుగుట దుస్తరమగుటచే మనస్సును యోగశక్తిచే పరబ్రహ్మధ్యానమునందు నిలుపుట కొరకు చేసినదనియు, మరి కొందరు యుద్ధ మెట్లవసానించునో అది తెలుసుకొనుటకొరకు శరీరము నిలిపినారనియు, మరికొందరు భక్తులు అయ్యో భీష్ములు దక్షిణాయనమున ప్రాణము విడుచుటచే మంచి గతి దొరకక పోయినదని చింతతో దుఃఖింతురనియు, మరికొందరు భీష్ములు యోగశక్తిగలవారని చెప్పినమాటలు తప్పు, ఆతనికి యోగశక్తియుండినచో ఏల ఉత్తరాయణమువరకు శరీరము నిలుపరాదనియు దూషింతురు గనుక అనేక ఊహలుజేసి భీష్ములు యీపనిచేసిరి కాని ముక్తికి హాని గలుగునని భయపడి చేసినది కాదని చెప్పుదురు. మరియు భీష్ములకు తండ్రియొక్క వరప్రసాదముచే స్వేచ్ఛామరణము సిద్ధించి యున్నది.

స్వరో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥

ఓంకారము ధనుస్సుగాను, ఆత్మ శరముగాను బ్రహ్మము లక్ష్యమనియు మహర్షులు చెప్పుదురు. ఇది ప్రమాదరహితునిచే భేదించుటకు శక్యమగును. అప్పుడు శరమువలె తన్మయత్వము నొందును. ఇచ్చోట భీష్ముల వారి శరతల్పమునకు ఇదే రహస్యార్థమని అనేకుల మతము. భీష్ములు ప్రణవమను ధనుస్సులో ఆత్మయను శరమును లయపరచి స్వస్వరూపాను సంధానపరులై యుండుటయే శరతల్పమున కర్థము. ఈస్థితి యుద్ధమందుండి శరీరము వెంటనే విడుచుటలో సాధ్యము గాదు. కనుక ధ్యానము స్థిరపడుటకు కాల తామసము చేసిరి.

**తనుం త్యజతు తీర్థే వా శ్వపచస్య గృహేఽథవా ।**
**జ్ఞానసంపత్తిసమయే ముక్తోఽసౌ విగతాశయః ॥**

బ్రహ్మనిష్ఠునియొక్క అజ్ఞాననివృత్తియే శరీరమువిడుదల యనంబడును. ఆస్థితి జీవించుచున్నప్పుడైనను గలిగిన అదే సమాధి యగును. శరీరము గంగాతీరమునగాని, మాలపల్లెయందుగాని వీడిపోయినను విరోధము లేదు. జ్ఞానోత్పత్తిసమయమునందే అతడు ముక్తుడైయున్నాడు.

**దేహస్య మోక్షో నో మోక్షో న దండస్య కమండలోః ।**
**అవిద్యా హృదయగ్రంథిమోక్షో మోక్షో యతస్తతః ॥**

జ్ఞానులు దేహము విడుచుసమయమే మోక్షమని చెప్పుట సరికాదు. దండకమండలములు విసర్జించుటయు మోక్షము కాదు. మరి మోక్షమన నేమన, అవిద్యయను హృదయగ్రంథిలోని ముడి వీడి పోవుట యే సమయమున గలుగునో, అప్పుడే ముక్తుడగును. ఆస్థితి యే కాలమునకు గాని, సమయమునకు గాని, స్థలమునకుగాని సంబంధించినది గాదు.

**యత్ర క్వాపి విశీర్ణం సత్పర్ణమివ తరోర్వపుః పతతాత్ ।**
**బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ హి తచ్చిదగ్నినా దగ్ధమ్ ॥**

ఒక్క చెట్టునుండి వాలిన ఆకు ఎచ్చట పడిననేమి ? దానివలన చెట్టు నకు ఏమి హాని కలుగును ? అట్లు బ్రహ్మవేత్త యగు మహాత్ముని దేహము

మొదటనే జ్ఞానాగ్నిచే కాలియున్నది. లేనిచో ఎట్లు విదేహు డగును, అట్టి దేహమెచ్చట పడిపోయినను బ్రహ్మవేత్తయగు యతికి ముక్తి కేలాటి హాని లేదు.

**క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే।**
**సంయుక్తమేకతాం యాతి తథాఽఽత్మన్యాత్మవిన్మునిః ॥**

పాలలోఁగలిసిన పాలున్ను, నూనెలోఁ చేర్చిన నూనెయు, నీటిలోఁజేర్చిన నీరును భేదపడక ఐక్యము నొందునట్లే ఆత్మయందు లీనమైన యాత్మవేత్తయగు ముని యాత్మగానే యగుచున్నాడు.

**శైలూషో వేషసద్భావాభావయోశ్చ యథా పుమాన్।**
**తథైవ బ్రహ్మవిచ్ఛ్రేష్ఠః సదా బ్రహ్మైవ నాపరః ॥**

నటనముచేయువాడు, తాను స్త్రీ వేషముదాల్చి నపుడు, దాల్పనపుడును నెట్లు మగవాడో, అట్లే బ్రహ్మవేత్త తానుపాధితోఁకూడి యున్నప్పుడును, లేనప్పుడును, బ్రహ్మముగాని వేరు గాదు. కనుక బ్రహ్మవేత్త యేకాలమందు గాని, ఎచ్చోట గాని శరీరము విడిచినను అత్మభావనమునకు హాని లేదు.

**అహిర్నిర్లయనం వాయం ముక్త్వా దేహం తు తిష్ఠతి।**
**ఇత స్తతశ్చాల్యమానో యత్ కించిత్ ప్రాణవాయునా ॥**

సర్పము కుబుసమును విడిచినట్లు బ్రహ్మవేత్త ఈ దేహమును వదిలియున్నాడు. అయితే ఆ కుబుసము గాలిచే గదలింపబడినట్లు ఈ శరీరము సహితము, ప్రాణవాయువు మూలమున నిక్కడి కక్కడికి పోవుచున్నను బ్రహ్మవేత్త తానును సర్పమువలెనే సంబంధము లేనట్లు ఉన్నాడు. అనగా సర్పము కుబుసమును ఎచ్చోట గాని, ఏ కాలమందు గాని విడిచినను సర్పమున కేలాటి హానియుండదు గదా ! ముక్తునియొక్క అవస్థ ఆలాంటిదే.

**ఏవం విదేహకైవల్యం సన్మాత్రత్వమఖండితమ్।**
**బ్రహ్మభావం ప్రపద్యైష యతిర్నావర్తతే పునః ॥**

యోగి ఈ విధమున విదేహముక్తిని, పూర్ణమైన, బ్రహ్మమాత్రమై యుండు ఆ బ్రహ్మత్వమునొంది మరల పునర్జన్మమునకు రానే రాడు. అనగా

అతనికి పునర్జన్మము లేని శాశ్వతమోక్షము గలుగునని భావము. జ్ఞానమను జ్యోతితో కూడి ప్రాణము విడుచుట ఉత్తరాయణ మనియు, అజ్ఞానముచే స్వరూపజ్ఞాన మావరణమై మోహముతో ప్రాణము విడుచుట దక్షిణాయన మనియు గ్రహించదగినది.

## ప్రాణప్రయాణకాల సమయస్థితి

ప్ర ॥ మరణసమయమున సిద్ధాసనాది ఆసనములలో కూర్చుండి స్వేచ్ఛామరణము గాని, లేక సుఖమరణము గాని, చేయువారు మహాత్ము లనియు, మరణకాలమున కష్టముతో ప్రాణము విడుచువారు పుణ్యాత్ములు కారనియు జనులు చెప్పు మాటలు నిజమా ?

ఉత్తరము ॥ సిద్ధాసనాదులలో ఆసీనుడై స్వేచ్ఛగా ప్రాణమువిడుచువారు మహాత్ములనియు, రోగాది బాధలచే ప్రాణము విడుచువారు దుష్టులనియు లోకులు చెప్పెడి మాటలు నిజము కాదు. శరీరావిర్భావమునుండి, మరణ పర్యంతము జ్ఞానికి జరుగు కృత్యములన్నియును ప్రారబ్ధకర్మల ననుసరించి యుండును. ముక్తుడా ? లేక బద్ధుడా ? అని తెలిసి కొనుటకు వారు జీవముతో గూడియుండు సమయములోనుండెడి అవస్థను బట్టి చెప్పుట కనుకూలముగాని ప్రాణ ప్రయాణ సమయములనుబట్టి కనుగొనుటకు సాధ్యము గాదు. ప్రాణప్రయాణ స్థితిగూడ వారి ప్రారబ్ధకర్మ ననుసరించి జరుగును. కొందరు క్రూరులు మరణకాలమున సుఖముగా పోవుదురు. మరి కొందరు మహాత్ములు మరణకాలమున రోగపీడితులై దుఃఖపడి పోవుదురు. ఇదంతయును శరీరావస్థలు గాని ఆత్మసంబంధము కాదు.

**రాగేచ్ఛాసుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే ।**
**సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్బుద్ధేస్తు నాత్మనః ॥**

రాగము, ఇచ్ఛ, సుఖము, దుఃఖము మొదలుగా గల సమస్తదేహాదివృత్తులున్ను, బుద్ధియందుండునే గాని వీటికి సాక్షియగు ఆత్మయందుండవు. ఏలననగా అవి యన్నియున్ను సుషుప్తికాలమందు లేవు. కాబట్టి ఆత్మయందుండవు. మరియు దేహేంద్రియాది సమస్త వృత్తులకు ఆత్మ సదా సాక్షియై

యుండుటచే తనకన్యములు. జ్ఞానియైనవానికి దేహము తాను గాదని దృఢబోధ యుండుటచే, దేహాదులయందు జరుగు కృత్యములు తాను గాదనియు, తాను నిత్య శుద్ధముక్తస్వయంప్రకాశుడనియు బోధ యుండుటచే సూర్యుని సమీపమున చీకట్లు ఎట్లు చొచ్చుట లేదో ఆలాగున జ్ఞానియైనవానికి శరీరాది బాధలు గలిగినను చలింపడు అని ఆత్మబోధము. దీనికి దృష్టాంతములన్నియు ముందుదాహరించి యున్నాము.

**నీరోగ ఉపవిష్టో వా రుగ్ణో వా విలుఠ౯ భువి ।**
**మూర్ఛితో వా త్యజత్యేషః ప్రాణా౯ భ్రాంతిర్న సర్వదా ॥**

బ్రహ్మజ్ఞాని, సమాధికాలమం దేయొక్క శరీరబాధ లేక గాని, సిద్ధాసనాసీనుడై అందరితో నేను వెళ్ళుచున్నానని చెప్పి గాని, లేక మహావ్యాధిగ్రస్తుడైగాని, లేక రోగబాధచే భూమియందు పొరలు చుండిగాని, లేక మూర్ఛితుడైగాని, ప్రాణములను విడిచినను విరోధము లేదు. ఏలన శరీరపతన పర్యంతము ప్రారబ్ధ కర్మము ననుసరించియే జరుగును. కనుక దేహవియోగ సమయస్థితి గొప్పది గాదు. వారు జీవించియుండు సమయమున ముక్తుడా? లేక, బద్ధుడా? అని తెలిసికొనందగినది. ఒకవేళ మరణ సమయమున బోధరహితుడై యుండు వానివలె జనులకు గనుపించినను విరోధము లేదు. ప్రాణము పోయిన తరువాత దేహశ్రమ శమించిన పిమ్మట నిజమగు బోధ యందుండును. ఎట్లన పగలొక్కడొక్క పద్యమును జదివి నిద్రయందు స్మృతిలేక యుండినను మరల జాగ్రత్త వచ్చునప్పుడు ఎట్లు స్మృతివచ్చునో ఆలాగున జీవన్ముక్తుడు గూడ ప్రాణముపోయిన తరువాత నిజస్థితియందుండును.

## తీర్థయాత్ర

ప్రశ్న ॥ అయ్యా తీర్థయాత్ర సేవించుటలో గొప్పపుణ్యఫల మని తలంచి ముముక్షువులు తిరుగుచున్నారే ! దీనియందు రహస్య మేమైన నుండునా?

ఉత్తరము ॥ తీర్థయాత్ర మహాపుణ్యకరము. దానిలో ఒక్క రహస్యము తెలిసికొని యుండినచో మంచిది. ఆది కాలమున ఈరహస్యము తెలుసుకొని భక్తులు తీర్థయాత్రలు పాదచారులై చేసి పరిశుద్ధులైరి. ఇప్పుడు పేరుకొరకు

రైలుబండిలో పోవుచున్నారు. వీరికి మంచిగతి గలుగుననుట సందేహాస్పదము. గంగాది తీర్థములలో స్నానము చేసిన మాత్రముచే గతియని నమ్ముటలో యేయొక్క ముక్తిన్ని లేదు. అట్లు గతియుండినచో ఆ దేశస్థులందరున్ను మంచి వారలై కనపడవలయును. అట్లు లేదు. అచ్చట గూడ క్రూరులున్ను, పాపులున్ను, భక్తులున్ను, ముక్తులున్ను గలరు. ఆలాగుననే యిచ్చటను ఉన్నారు.

కాని తీర్థయాత్రచే ఫలముండనిచో నుత్తర దేశస్థులందరున్ను రామేశ్వరాది దక్షిణ పుణ్య తీర్థక్షేత్రములకున్ను, దక్షిణదేశస్థులు గంగాది పుణ్యతీర్థములకున్ను, కాశ్యాది దివ్యక్షేత్రములకున్ను యేల తిరుగుదురు ? ఒక్కస్థలమందుండిన చాలదా? తీర్థయాత్రచే ఫలము లేదని చెప్పజాలను. తీర్థ తీరములోను, పుణ్యక్షేత్రములోను అనేక మహాత్ములుందురు. వారిని దర్శించి అనేక ధర్మ రహస్యములు గ్రహించవచ్చును. మరియు భక్తుడైన వాడు ఎట్లుండ వలెనో, ఎట్లు ఆశ్రమము నుంచవలెనో, ఏలాగున అతిథి సేవ జేయవలయునో, యేలాగున ధ్యాననిష్ఠాద్యనుష్ఠాన మాచరింపవలెనో, అను ఈలాటి ధర్మములన్ని యున్ను, ఒక్కొక్క మహాత్ముల ఆశ్రమము నుండి, ఏలాగున తేనెటీగలనేక పుష్పములనుండి తేనెను సంపాదించునో, అట్లు సంగ్రహింపవచ్చును. మరియు లోకముయొక్క స్థితిగతులు తెలిసికొనుటకై ముఖ్యముగా సంచారము చేయవలయును. లేనిచో కూపమండూక న్యాయరీతిగా తనకేమియు తెలియక పోయినను, తాను గ్రహించినదే యుండును గాని, మరియేమిన్ని లేదని గర్వించి చెడిపోవును. పుణ్యస్థలములలో ననేక మహాత్ములుందురు. వారిని చూచునప్పుడు ఆరీతి తనకు గలుగుటకై ప్రయత్నము జరుగును. మరియు అనేక విధ జ్ఞాన ధ్యాన యోగరహస్యములు గూడ పెద్దలవల్ల సంపాదింపవచ్చును. ఈ సంచారములో తనకు తగిన గురువు లేనిచో గొప్పవారిని కనిపెట్టి ఉపదేశము పొందవచ్చును.

ఇప్పుడు ఇంగ్లీషులో ఐ. సి. యస్. పరీక్ష విజయమొందిన వారిలో గొప్పవారలు ఈ భూలోకమంతయున్ను ఒక్కసారి తిరుగుదురు. అది లోకమందుండు నానాస్థితిగతు లెరింగి తానెట్లుండవలెనను ఉద్దేశముతో సారము గ్రహించుట కొరకు మాత్రమే.

మరియు హరిద్వారము, హృషీకేశము, నర్మదాతీరము మొదలుగా గల స్థలములలో తనకనుకూలమగు చోటనుండి ధ్యానము చేయవచ్చును. కొన్ని స్థలములలో తీర్థము ధ్యాన నిష్ఠాది తపస్సు చేయువారికి నిండా మంచిది. ఆలాటి స్థలములందుండు భూమియొక్క ధాతువులుగూడ బ్రహ్మనిష్ఠ కనుకూలముగా నుండును. కొన్ని చోటుల జలమున్ను, భూసారమున్ను బ్రహ్మనిష్ఠ కనుకూలపడదు. భూసారము మంచిదిగా నుండిన మొదటి గుణము (1) జితేంద్రియత్వము గలుగును. (2) ధ్యానమందెంత సేపుండినను నిష్ఠయందుండి మనస్సు బహిర్ముఖముగా ప్రసరింపదు. (3) సత్త్వగుణము శీఘ్రముగా గలుగును. (4) యోగసిద్ధి త్వరలో సిద్ధించును. ఎట్లన, సిద్ధోటము భూమిలో పండుపగిలి పండ్ల (దోసపండ్ల) యొక్క విత్తనము మరియొక్క భూమియందుంచిన అంత మధురము కానేరదు. కారణమేమన? ఆ భూమియందుండు ధాతు భేదము. కొన్ని స్థలములలో మంచి తియ్యమామిడి చెట్టు పెట్టినను కాయ పులుపుగా నుండును. కొన్ని భూములందు పులుపు మామిడి విత్తనము బెట్టినను కాయ తియ్యగా నుండును. సింహళదేశములోను, హృషీ కేశములో కొన్ని స్థలముల యందు బిల్వపండ్లు మధురముగా నుండును. ఈ దేశమందుండు మారేడిపండ్లు తినుట కుపయోగించవు. ఈలాగున గోవులకు కూడ కొన్ని స్థలములలో కసువు తిన్నచో పాలెక్కువగాను, సారవముగాను, రుచిగానుండును. కొన్ని స్థలములందట్లుండదు. ఇదంతయున్ను భూసారమును బట్టి మారుచుండును. కావున తపస్సున కనుకూలమగు స్థలమున మహర్షులు చేరిరి. ఆ స్థలములనే యిప్పుడు పుణ్యస్థలములని చెప్పుచున్నారము. ఆలాటి పుణ్యతీర్థములలోను, దివ్యక్షేత్రములలోను మహర్షుల తపోమహిమ యిప్పుడున్ను ప్రకాశించుచున్నది. భక్తివైరాగ్యముతో అక్కడికి పోవు పరిశుద్ధాత్ములు ఆపావన ఫల మనుభవింపగలరు.

మరియు వానకాలమున బుద్ధిచే పదిగంటల సమయము పనిచేయు వారు ఎండకాలమున నాలుగుగంటలు పనిచేయుట సాధ్యము గాదు. కారణ మేమన శీతోష్ణము ననుసరించి యుండును. కనుక పుణ్యస్థలమని వ్యవహరించెడి కొన్ని చోటులలో ధ్యానము చేయువారికి నిండా సహాయముండును. శరీరమునకు బాధ యుండదు. ఈలాటి యుష్ణపు దేశము కాదు. ఆలాటి అనుకూల స్థలము గనిపెట్టి

నిష్ఠ చేయుటకొరకు తీర్థయాత్ర యేర్పడినది. మరి కొన్ని స్థలములలో నిష్ఠకనుకూలమగు ఆహారముగూడ సులభముగా దొరకును. ఈ తీర్థయాత్ర సద్గురువు దొరికి యుపదేశము పొందువరకే యుండవలెను. మరల మరల దిరుగుట 'బుద్ధిహీనత యని శాస్త్రమున్ను, పెద్దలున్ను చెప్పుచున్నారు. సంచరించువారికి ధ్యాననిష్ఠాదుల చేయుటకు సమయము దొరకదు. మరియు ఆహారము గూడ సమయమున దొరకక కష్టపడుదురు. స్నానసంధ్యాది జపములు జరుగవు. మరియు ఈ కాలమున సంచారము నిండా కష్టము. ధర్మము క్షీణించి పోయినది. మంచివారిని, పెద్దవారిని గనిపెట్టుట సాధ్యము గాకపోయినది. అనేకులు దురాచారులున్ను, క్రూరకృత్యములకు భయము లేనివారున్ను తిరుగుచుండుట యను సంగతి సత్యము. వీరి క్రూరకృత్యములచే మంచి వారిని గనిపెట్టి సహాయము జేయుటకై గృహస్థుల కవకాశము లేకపోయినది. కనుక ప్రస్తుతకాలమున సంచారము చేయక నిష్ఠ కనుకూలమగు స్థలమందుండి ధ్యానము చేయువారు పుణ్యాత్ములని తలంచుచున్నారు.

**నాస్తి ధ్యానసమం తీర్థం నాస్తి ధ్యానసమం తపః ।**
**నాస్తి ధ్యానసమో యజ్ఞస్తస్మాద్ధ్యానం సమాచరేత్ ॥**

ధ్యానమునకు సమమైన మరియొక తీర్థస్నానము లేదు. పరబ్రహ్మ ధ్యానమునకు సమమైన తపస్సు లేదు. నిరంతర పరమాత్మ ధ్యానమునకు సమమైన యజ్ఞాదిక్రతువులు లేవు. కావున సర్వదా చిత్తనిరోధము చేసి ధ్యాననిష్ఠయందుండ వలెనని శ్రీ బాదరాయణులు శ్రీశుకుల కుపదేశించిరి.

**నిమిషం నిమిషార్ధం వా యత్ర తిష్ఠంతి యోగినః ।**
**తత్ర తత్ర కురుక్షేత్రం ప్రయాగో నైమిశం వనమ్ ॥**

బ్రహ్మనిష్ఠులు ఏస్థలమునందుండి ఒక్క నిమిషముగాని అర్ధనిమిషము గాని ధ్యాన యోగనిష్ఠల ననుష్ఠించుదురో ఆస్థలము కురుక్షేత్ర మనియు, ప్రయాగమనియు, పావనమగు నైమిశారణ్యమనియు మహర్షులు తలంతురు.

**సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతి యే ।**
**తే రత్నమభివాంఛంతి త్యక్త్వా హస్తస్థకౌస్తుభమ్ ॥**

ఎవరు తన హృదయమందు ప్రకాశించు పరమాత్మను ధ్యాన యోగముచే పొందక ఇతరస్థలమున దేవుడున్నాడని భ్రమించి తిరుగుదురో, వారు తన కరమందుండు కౌస్తుభమణి ఎరుంగక పారవేసి యితరస్థలమున రత్నముకొరకు వెదకుచుండువారివలె బుద్ధిహీనులు.

**సంత్యక్త్వా తాదృశం దేవం యః సేవేతాన్య దేవతామ్ ।**
**స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్ ॥**

ఎవడు తనయందుండు పరమాత్మ సమానమగు ఆత్మను విచారము చేసి తెలిసికొనక ఇతర స్థలములలో దైవ ప్రాప్తికొరకు తిరుగుచుండునో, వాడెట్టివాడనగా, గంగాతీరమున నున్నవాడు ఆ పరమపవిత్రజలము మంచిది గాదని నిశ్చయించి యెండ మావులలో గనుపించెడి జలభ్రమను జూచి భ్రమించి యిది పరిశుద్ధతీర్థమని పరుగెత్తెడి మూఢునివంటివాడు. ఎట్లన ఎండమావులలో కొంతదూరమున నీరు గనిపించి అచ్చటికి వెళ్ళినపుడు మరింతదూరమున గనిపించును. అచ్చటికి పోగా మరికొంతదూరములో గనుపించి, కనిపించి మనుష్యుడు తిరిగి చచ్చుటే గాని నీరు దొరకదు కదా ! ఆలాగున తీర్థయాత్ర సేవించువారికి గూడ ఒక్కస్థలము చూచిన మరియొక స్థలము చూచుటకు బుద్ధి గలుగును. ఆస్థలము దర్శించినను ఇంకొకస్థలము దర్శించిన జన్మసాఫల్యము గల్గునని నిశ్చయించుకొని తిరిగి తిరిగి జన్మము పాడవును. ఇట్లు తిరుగువారి యుద్దేశమేమన, తన్ను అనేకులు అనేక తీర్థములున్ను, పుణ్యక్షేత్రములున్ను దర్శించిన వారని పొగడుట కొరకు. అయ్యో మందులపేరు జెప్పిన రోగులకు శాంతమగునా? ''పుట్ట మీద గొట్ట భుజగంబు చచ్చునా'' శ్రీవేమన్న వచనము.

**బహిర్భ్రమతి యః కశ్చిత్ త్యక్త్వా దేహస్థమీశ్వరమ్ ।**
**స్వగృహే పాయసం త్యక్త్వా భిక్షామటతి దుర్మతిః ॥**

తన హృదయమందుండు పరమాత్మను తగువగు అనుష్ఠాననిష్ఠతో తెలిసికొనుటకు జూడక దేశసంచారము పావనమని తలంచువారు తన యింటిలోనుండు క్షీరాన్నము భుజించి సుఖింపక ఇతర గృహములలో భిక్షాన్నమునకు దిరిగెడి మూఢుల వంటివారలు.

తత్రైవ గంగా యమునా చ వేణీ
గోదావరీ సింధు సరస్వతీ చ ।
సర్వాణి తీర్థాని వసంతి తత్ర
యత్రాచ్యుతో నామ కథాప్రసంగః ॥

నిర్మలభక్తుడు ఏస్థలమున జప, భజన, ధ్యాన, పారాయణముల జేయుచుండునో, ఆ స్థలమున గంగయు, యమునయు, కృష్ణవేణియు, గోదావరియు, సింధువు, సరస్వతియు మొదలుగా గల సమస్తతీర్థములు సాన్నిధ్యముననే గలవు.

క్షమా తీర్థం తపస్తీర్థం తీర్థమింద్రియనిగ్రహః ।
సర్వభూతదయా తీర్థం ధ్యానతీర్థమనుత్తమమ్ ॥

తీర్థమనగా నేమి ? దేనివల్ల సంసారసాగరము తరింపబడునో దానికి తీర్థమని పేరు. అది తీర్థశబ్దముయొక్క అర్థము. ఆ తరణోపాయమగు తీర్థ మేమి యన, క్షమయే తీర్థము, తపస్సే తీర్థము, ఇంద్రియనిగ్రహమే తీర్థము, సమస్తప్రాణులయందు కరుణయే తీర్థము, అన్నిటికన్న ధ్యానతీర్థ మత్యుత్తమము. దీనివలన తరించునే గాని ఈ గుణములు లేనిచో తీర్థములలో మునిగిన తరించునని నమ్ముట తప్పు.

ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు ।
సంయమే యత్నమాతిష్ఠే ద్విద్వాన్యంతేవ వాజినామ్ ॥

అపాయకరములగు విషయములలో సంచరించెడి స్వభావము గల ఇంద్రియములను సంయమము చేయుటలో మంచి యత్నము జేయవలయును. ఏలాగున దారితప్పిపోయెడి గుఱ్ఱములను సారథి కళ్ళెమును బట్టి మంచిమార్గ ములో నడపునో, అట్లు ఇంద్రియములను గుఱ్ఱములను విషయమార్గము నుండి త్రిప్పి ఈశ్వర ధ్యానమార్గముగా నడపువారు ధన్యు లగుదురు.

జలస్నానం మలత్యాగం మంత్రస్నానం మనశ్శుచిః ।
భస్మస్నానం హరేత్పాపం జ్ఞానస్నానం పరం పదమ్ ॥

తీర్థములలో స్నానమాచరించినచో శరీరములో నుండు మాలిన్యమును బోగొట్టును. మంత్రజపమను స్నానముచే మనస్సు పరిశుద్ధ మగును. భస్మస్నానమువల్ల పాపము నశించును. జ్ఞానస్నాన మొకటి మాత్రమే నిజమగు ముక్తి నిచ్చును.

**ధ్యానహ్రదే జ్ఞానజలే రాగ ద్వేషమలాపహే ।**
**యః స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్ ॥**

పరబ్రహ్మధ్యానమను మడుగులో, రాగ ద్వేషాది మలరహితమైన ఆత్మజ్ఞానమను జలములో పరిశుద్ధమనస్సగు తీర్థములో దిగి ఎవడు స్నానము చేయునో వాడు నిశ్చయముగా పరమగతి నొందును అని శ్రీ వ్యాసమహర్షి మానసస్నానమం దుపదేశించిరి. ఇట్లు చెప్పుటచే తీర్థయాత్రను దూషించె దనని తలంపరాదు. విధిప్రకారము భక్తిశ్రద్ధలతో తీర్థయాత్ర చేయుటచే కొంత ఫలము గలుగును. ఆ తీర్థము ఒడ్డున అనేక మహర్షులు తపస్సు చేయుటచే ఆ తపశ్శక్తి యిప్పుడు గూడ పరిశుద్ధ హృదయులను పావనులనుగా జేయును. ఒకపెట్టె యందు సుగంధవస్తువుల బెట్టియుండి తీసివేసినను కొన్నిదినముల వరకు దానియందు సుగంధ మెట్లుండునో ఆరీతిగా మహాత్ముల తపో మహిమ యిప్పుడు గూడ అచ్చోట ప్రకాశించుచుండును. ఈలాటి పుణ్యకార్యములు మహర్షులు ఏర్పరుపకుండినచో సదా సంసార కృత్య మందుండువారికి పుణ్యకార్యములు చేయుటకున్ను, భగవన్నామ సంకీర్తనములు గావించుటకున్ను, సాధుసజ్జనుల దర్శించుటకున్ను సమయము దొరకక పశుప్రాయులై దినములు వ్యర్థమగును. పుణ్యతీర్థమహిమ యుండినచో అచ్చోట నుండు వారలు ఏల పుణ్యాత్ములుగారని ఒక్క ప్రశ్న జను లడుగుదురు. అది సరిగాదు. అచ్చోట నుండువారు గూడ భక్తిశ్రద్ధగలవారై సన్మార్గులై యుండినచో మనశ్శుద్ధి త్వరలో చేకూరును. సదాచారులు గాని కారణముచే పాపము నివృత్తి గాలేదు. ఎట్లన, ఔషధము సరియైన పథ్యముండిన గదా ఫలించును. పథ్యముండక మందు దిని ఫలము లేదని చెప్పవచ్చునా ?

మరియు ఒక్క మహాత్ముడగు గురువువద్దనుండు వారలలో కొందరు అతీతజ్ఞానవంతులుగను, కొందరు క్రూరులుగాను ప్రత్యక్షముగా గనపడు

చున్నారు. క్రూరుల చూచి ఆ మహాత్మునకు మహిమ లేదని చెప్పుట ఎంత ఘోరపాపము ? ఆలాగున తీర్థమున సర్వదాయుండి సంకల్పము జెప్పువారు గూడ ఏల పవిత్రులు గాలేదని గూడ అడుగవచ్చును. కారణ మేమన, వారధికముగా దానము తీయుటచేతను, అసత్యము చెప్పుటచేతను, విధి ప్రకార మనుష్ఠించకయు, వ్యభిచారాది దుష్కృత్యము లుండుటచేతను పుణ్యముకన్న పాప మధికముగా సంభవించుచున్నది. కనుకనే పాపనివృత్తి కాలేదు. ఎట్లన పాలు శరీరమునకు మంచిదైనను ఉప్పువేసి త్రాగిన దానిచే రోగములు గలుగును.

మరియు నాలుగణాలు సంపాదించువాడు పది రూపాయలు ఖర్చు చేసిన వాడెట్లు ఋణస్థుడు గాడు ? తీర్థస్థలమునందుండు వారి యవస్థ ఇట్టిదే. కొందరు కాశీయాత్ర చేసివచ్చిన తరువాత పాపకృత్యములు ఏల నశింపలేదని కూడ యడుగుదురు. వారికిన్ని పోవుటకు ముందుగా నుండు పాపము కొంత శమింపవచ్చును. వచ్చిన తరువాత శుద్ధముగా నుండినచో పుణ్యాత్ముడే. సంశయము లేదు. అట్లు చేయని కారణముచే మరల పాపకార్యముల జేయుచు బద్ధు డగుచున్నాడు. ఏలన ఒక్క డమితముగా నప్పులపాలై యుండగా ఒక గొప్ప ధనవంతుడు వీనిపైదయగలిగి అప్పులను తీర్చెను. మరల వీడప్పుచేయకుండినచో బద్ధుడు గాడు. కాని మరియు ఋణము చేసినచో ఎట్లు ఋణము తొలగును ? కనుక భక్తిశ్రద్ధలతో తీర్థయాత్రలను, పుణ్యక్షేత్రములను సేవించివచ్చిన తరువాత మంచి జ్ఞాననిష్ఠతో నుండువారికి సద్గతి సిద్ధించుగాక!

## గృహస్థధర్మము

ప్రశ్న ॥ అయ్యా స్వామీ ! తమరు అన్ని విషయములను ప్రతిపాదించునప్పుడు గూడ విషయము బంధకమనియు, స్త్రీలు నరక ద్వార మనియు చెప్పుటలో గృహస్థాశ్రమమందుండువారికి గతి లేదని తమ మతమా?

ఉత్తరము ॥ నేను గృహస్థాశ్రమమును ఎచ్చట నైనను దూషింపలేదు. ఆలాగున స్త్రీలను నిందింపను. ఇట్లు నీకు తోచుట నాయొక్క అంతరభిప్రాయము తెలియక పోవుట చేతనే గాని వేరు గాదు. స్త్రీలను నిందచేసి యుంటినా? లేక స్తుతి చేసియుంటినా ? అను సంగతి స్త్రీలకు బ్రహ్మ

విద్యాధికారము చెప్పినచోట చూడుము. స్త్రీలను నిందించినచో నాయొక్క మాతృనిందకు సమముగదా ! అనగా మాతృగర్భమునందుండి గదా మనమందరము జన్మించినారము. నేను గృహస్థాశ్రమమందుండు భక్తులతో వారి భార్యలను ఎక్కువ ప్రేమించమని చెప్పుదునే గాని నిందించమని చెప్పను. కాని ఆప్రేమ పామరులవలె దేహసంబంధము గాకూడదు. ఆత్మపరమ్మై యుండవలెను. కాని, స్త్రీలను కొన్నిస్థలములలో నిండా దూషించిన సంగతి నిజము. అది కేవలము విషయాసక్తులై, దైవవిచారములేక భర్తల భక్తిని పోగొట్టి విషయమునకు లాగెడి వారలను మాత్రమే. అట్లుండినవారిని మాత్రము దూషించితినేగాని, పతివ్రతలై దైవ భక్తి పరులైన వారిని జగన్మాతలని నమ్ముచున్నాను. ఆలాగున గృహస్థాశ్రమమునుగూడ నిషేధించిన సంగతి సత్యము. కాని గృహస్థధర్మము సంగతి తెలియక కేవలము పశుప్రాయులై, విషయలోలురై, మరణపర్యంతము సంసారమే పరమగతియని నమ్మియుండువారినేగాని, సత్యధర్మపరాయణులై, దైవభక్తిపరులై అతిథి సత్కారనిష్ఠ గలవారిని లోకరక్షకులని నేను తలంచుచున్నాను. అట్లుండు పుణ్యపురుషులగు గృహస్థులయొక్క సహాయములేనిచో ఇతరాశ్రమములగు బ్రహ్మచర్య వానప్రస్థసన్న్యాసము లనెడి మూడు ఆశ్రమములు సరిగా జరుగుట కష్టసాధ్యము. ఈమూడు ఆశ్రమస్థులను పోషించెడి కర్తవ్యము గృహస్థుని శిరమున భారముగా నున్నదని గృహస్థుడు మరువకూడదు. ఈవిషయ మిప్పుడు లోకము నందంతరించినది, గృహస్థుడు గూడ యౌవనకాలమువరకు గృహస్థాశ్రమమందుండి తరువాత ఏకాంతస్థల మవలంబించి బ్రహ్మనిష్ఠ చేయవలయునని విధి గలదు. ఈలాటికాలమున తల్లిదండ్రుల కన్న వస్త్రములు కష్టము లేక సిద్ధించుటకు ప్రపంచసంగతి వారితో జెప్పక వారినిష్ఠ పూర్తియగుటకు తగుసహాయము చేయుటకొరకు పుత్రసంతాన మేర్పడినదేగాని, చచ్చి పోయిన తరువాత పుత్రుడు పితృతర్పణాది క్రియలచే తల్లిదండ్రుల నుద్ధరించు ననునది అవిశ్వాసాస్పదము. ఈకాలమున గృహస్థాశ్రమమునకు సంసారమునందుండి రాజ యోగము సిద్ధించుటకొరకు నాలుగు అంగములు పూర్ణముగానుండవలెను. ఈవిధి సాధారణమైన వారికి చెల్లునే గాని విశేషస్థితిలో నుండువారికి నిదియుండినను సరియే, లేకున్నను సరియే.

వీటిలో మొట్టమొదటిది పతి సతుల ప్రాణము లేకమై యుండవలెను. అనగా భార్యాభర్తల మన సేకముగా నుండవలయు ననుట. అనగా భర్తయొక్క బ్రహ్మవిచారమునకు భార్య సహాయురాలు గావలెను. ఆలాగున భార్యయొక్క భగవద్భక్తిచేయు విషయములో భర్త యేయొక్క ఆటంకము చేయరాదు. ఈ విషయమున ఐక్యము గలుగకపోయినచో భర్త యగువాడు భార్యను మంచిదోవకు తీసుకొనివచ్చుటకై నిండా ప్రయత్నము చేయవలయును. గభీలున విడిచి పెట్టరాదు. భార్యను రక్షించెడి కర్తృత్వము పురుషునిపై నున్నది: ఆలాగున స్త్రీయొక్క బ్రహ్మనిష్ఠను పురుషు డాటంకపరచినచో వారిని మంచిమార్గములో తిప్పుటకై మరల మరల నిండాప్రయత్నము చేయవలయును. వేగముగ భర్తను నిరసింపగూడదు. భర్తయొక్క ఆజ్ఞలో నుండుట స్త్రీయొక్క పరమధర్మము. రెండవది విశేషధన మున్నవారికిన్ని, నిండా దరిద్రులకున్ను బ్రహ్మనిష్ఠ సాధించుట కష్టతరము. వీరిద్దరును ప్రపంచములో అధిక సమయము పని చేయవలయును, అన్న వస్త్రాదులకు కష్టము లేకుండా జరుగుస్థితి పరమాత్మ డేర్పరచినచో గృహస్థమందుండు బ్రహ్మనిష్ఠులు మహాభాగ్యవంతులు. మూడవది ఏదైన పనిచేయు విషయములో పరాధీనము లేక స్వాధీనమై యుండినచో నిండా మంచిది. అనగా తన యిష్టప్రకారము పోవుటకు వచ్చుట కనుకూలపడి యుండవలెను. నాల్గవది ఇష్టానుసారముగ పోవుటకు వచ్చుటకు సాధ్యము లేనిచో క్లుప్తసమయ ముండవలెను. ఈనాలుగు సంగతులు సరిగా చేరినచో గృహస్థా శ్రమమందుండి విచారముగల స్త్రీ పురుషులు ధన్యులు గావచ్చును. గృహస్థ ధర్మ మేర్పడినది మనస్సు అన్ని విషయములలోను పరిపక్వమైనదా ? లేదా ? అని పరీక్షించుట కొరకుకాని, మరణపర్యంతము పుత్ర మిత్రకళత్రాదులగు సంసారమున మునిగి చచ్చుటకొరకు గాదు.

**సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ।**
**తస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్ ॥**

భార్యతో భర్తయున్ను, భర్తతో భార్యయున్ను ఏకమనస్సుగలవారై పరస్పర ప్రేమతో సంతుష్టులై, సత్యనిష్ఠులై వర్తించు కుటుంబము నిత్యము మంగళకరమై యుండును. వర్షాకాలమున అన్ని స్థలములలో నుండు జలము మడుగులో

జేరునట్లు సాధ్వీమణుల గృహమున సమస్తవిధములగు శ్రేయస్సులు చేరును అని మనుస్మృతి.

అనుకూలకళత్రో యస్తస్య స్వర్గ ఇహైవ హి ।
ప్రతికూలకళత్రస్య నరకో నాత్ర సంశయః ॥

సదాచారనిష్ఠుడగు వాని కనుకూలమైన భార్య దొరకినచో వాని కిచ్చటనే స్వర్గము గలదు. ప్రతికూలమైన భార్యయుండిన దానికన్న వేరే యొక ఘోరనరకము లేదు అని మహాభారతము.

ఆలిహపరసౌఖ్యములకు
నాలయమై నట్టిదైన నాలనవచ్చుఁ,
ఈ లాగున గాకుండిన
కాలుని పెనుదూత యదియు గదరా వేమా !

గుణవతి గలగృహము గోముగనుండును
చీకటింట దివ్వె చెలగినట్లు,
దేవుడున్న కొంప దివ్వె నిల్పినయట్లె
విశ్వదాభిరామ వినుర వేమ !

ఇట్టి యవ్వనమున నీశ్వరధ్యానంబు,
కలిగి చేయవలయు కరుణతోను,
చేయకున్నగాని క్షితిసౌఖ్యమేదయా,
విశ్వదాభిరామ వినుర వేమ !

యజ్ఞదానాదిభిః పుణ్యైర్యోగసిద్ధిర్భవిష్యతి ।
యోగాత్ సంజాయతే జ్ఞానం జ్ఞానాన్ముక్తి ర్న కర్మణా ॥

మనుజులకు యజ్ఞ, దాన, ధ్యాన, తపస్సులు మొదలుగా గల పుణ్యకర్మములు నిష్కామముగా జేయుచు రాగా రాగా మనః పారిశుద్ధ్యము గల్గి ధ్యానయోగము సిద్ధించును. ధ్యానయోగమువల్ల ఆత్మజ్ఞానము ప్రకాశించును. ఆత్మజ్ఞానముచే జీవన్ముక్తి గలుగును. పాపకర్మము చేయు వారికి సుఖము గలుగదని బ్రహ్మగీత.

**సత్యం సత్యం పునః సత్యం ఉద్ధృత్య భుజముచ్యతే ।**
**ప్రసాదాదేవ సర్వేషాం సర్వసిద్ధి ర్మహేశితుః ॥**

నేను సత్యముగాను, సత్యముగాను, మరియు సత్యముగాను చేతిని పైకెత్తి చెప్పుచున్నాను. సమస్తప్రాణులకున్ను పరమేశ్వరుని అనుగ్రహము వల్ల సమస్తసిద్ధులు గలుగును. కనుక ఈశ్వరకృప గలుగుటకై ధర్మనిష్ఠతో గూడి భక్తి జేయుట గృహస్థుల యొక్క ముఖ్యకర్తవ్యము.

**యథాఽఽదర్శే స్వకం రూపం యథావన్నిర్మలే నరః ।**
**తథా పశ్యతి దేహేఽస్మిన్ ఆత్మానం బ్రహ్మ కేవలమ్ ॥**

ఏలాగున పరిశుద్ధ దర్పణమునందు తనయొక్క రూపము స్పష్టముగా ప్రతిబింబించునో, ఆలాగున మనస్సను అద్దమందుండు సమస్తవిషయవాసన యను మాలిన్యము ధ్యాననిష్ఠచే పోగొట్టినచో సాక్షాత్ పరబ్రహ్మస్వరూపము గృహమునందే కనబడును. పరిశుద్ధహృదయము లేనివారి కరణ్యమున్నైనను మలిన అద్దములో శరీరము గనుపింపనట్లు ఈశ్వర దర్శనము సిద్ధింపదు. (బ్రహ్మగీత)

**వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో**
**నరో వా యః కశ్చి ద్భవతు భవ ! కిం తేన భవతి ?**
**యదీయం హృత్ పద్మం యది ! భవదధీనం పశుపతే !**
**తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి ॥**

బ్రహ్మచర్యాద్యాశ్రమస్థులయినను, బ్రాహ్మణాది వర్ణస్థులయినను, స్త్రీపురుష శూద్రులయినను, వీరికి నన్యులయిన చండాలాదులయినను సరే వారికేమి ? నిర్మల భక్తితో హృదయపద్మమున పరమాత్మను ధ్యానించు మనస్సు గల వాని యొక్క సమస్త సంసార భారములను ఆ సర్వేశ్వరుడే శిరమునందు వహించి భక్తుడగు వానిని కాపాడి రక్షించునని శివానందలహరి.

**స్వధర్మాచరణం శక్త్యా విధర్మాచ్చ నివర్తనమ్ ।**
**దైవాల్లబ్ధేన సంతోష ఆత్మవిచ్చరణార్చనమ్ ॥**

వ్యాసులవారు మహాభారతము రచించినపుడు శౌనకాది ఋషు

లల్పాయుస్సును, స్వల్పబుద్ధియు గల కలియుగ మానవులు ఈ 18 పర్వములు చదివి సారము గ్రహించుట దుస్తరమని వేడుకొనగా సర్వశాస్త్రసారమని చెప్పి ఈ శ్లోకమును సెల విచ్చిరి. దీనిచే సంసారమందుండువారికి సంపూర్ణమగు సత్యనిష్ఠ సలుప సాధ్యములేనిచో ఎంతవరకు సాధ్యమగునో అంతవరకు సత్య ధర్మముతో వర్తించుటయు, మరి యెంతవరకు పాపకార్యము జేయక జీవించుటకు సాధ్యమో అంతవర కధర్మమునుండి విడుదల నొందుటయు, మరియు సత్యధర్మ ప్రయత్నముచే లభించినదానితో సంతుష్టి నొందుటయు, బ్రహ్మనిష్ఠులగు మహాత్ముల సేవించుటయు కలియుగమున గొప్పధర్మము. ఇది గోపాలుడు, భూపాలుడు, యోగి, రోగి మొదలైనవారందరికిని తగువైన అర్థము.

**బహిః కృత్రిమసంరంభో హృది సంరంభవర్జితః ।**
**కర్తా బహిరకర్తాంత ర్లోకే విహర రాఘవ ॥**

ఓ రామచంద్రా ! నీవు సంసారమందుంటివేని లోకులకు సంసార కృత్రిమముతో గూడినవానివలెను, హృదయమున మాత్రము నిర్వాసనగల వాడవుగాను, బహిర్భావముగ జూచువారికి కర్తృత్వాభిమానము గలవాడవుగను, అంతరమున మాత్రము కర్తృత్వాది కర్మ శూన్యుడవుగా లోక మందుండుము నాయనా !

**అంతస్సంత్యక్తసర్వాశో వీతరాగో వివాసనః ।**
**బహిస్సర్వసమాచారో లోకే విహర రాఘవ ॥**

ఓ శ్రీరామచంద్రుడా ! నీవు హృదయమున సమస్తమైన ఆశలను విడిచినవాడవై, రాగరహితుడవై, ప్రపంచవాంఛా శూన్యుడవై, లోకులకు చూచునపుడు అన్ని సమాచారములు చేయువానివలె లోకములో సంచరింపుము అని శ్రీ వసిష్ఠులు శ్రీ రామచంద్రుల కొరకు గృహస్థాశ్రమమందుండి జ్ఞానియై యుండు రీతి నుపదేశించిరి.

ఆహా ! ఇది ఎంతమంచి సూత్రము. ఇదిప్పుడు మనభక్తులకు నిండా యుపయోగము. ఇప్పు డుండు భక్తులు సంసారమందుండి కడతేరుటకు సాధ్యమగునా అని నిండా సంశయము చేయుచున్నారు. వారికి శ్రీవసిష్ఠ భగవంతుని

ఈ యుపదేశము చూచినచో సంశయ ముండదు. అనగా ఈ కాలమున సంసారమందుండువారు కేవలము శాంతులై, ఉదాసీనులుగా నుండినచో పాపాత్ములగు జనులు వీరియొక్క మనః స్థితి గమనించుటకు వీలులేక అంతయున్ను కొళ్ళగొట్టి పాడుచేయుదురు. కావున శ్రీ వసిష్ఠులు చెప్పిన దేమన, అట్లు ఉదాసీనభావము బుద్ధి లేనివారికి చూపగూడదు. వారి దృష్టికి మాత్రము కర్తృత్వాభిమానము చూపియు, అంతరంగమున కర్తృత్వరహితమై అంతయు బ్రహ్మాకారముగా చూడవలయును. మంచి గురువునకు ఉత్తముడైన శిష్యుడు దొరికిన తనకార్యమునకెంత యనుకూలమో అట్లే మంచిభార్య దొరికిన పురుషున కన్ని విషయములకు నిండా యనుకూలకరము. అదే రీతిగా శ్రేష్ఠుడైన గురువు దొరికిన శిష్యునకెంత యుపయోగకరమో, ఆలాగున పవిత్రుడగు భర్త సిద్ధించిన స్త్రీకి జన్మసాఫల్యము గలుగును. - హరిః ఓమ్

## అతివర్ణాశ్రమము

ప్రశ్న ॥ కొందరు అతివర్ణాశ్రములమని చెప్పి వ్యవస్థలేక అంతయున్ను చేయుటయు, తినుటయు చేయుచున్నారు. దీనిలో నుండు రహస్యము తెలుపగోరుచున్నాను.

ఉత్తరము ॥ అతివర్ణాశ్రమ మనియు, అవధూతాశ్రమ మనియు పేరుగల ఒక పద్ధతి గలదు. అది కేవలము బ్రహ్మవేత్తలలో కొందరు మాత్రము ఆచరింతురు. ఇది మహాగొప్ప అవస్థ. ఈ అవస్థ నిజముగా గలిగినచోవారు దుఃఖరహితులు. ఆ అవధూతలకు శుద్ధాశుద్ధములు గాని, మానావమానములు గాని, శీతోష్ణములుగాని, బంగారు మట్టిపెళ్ళ భేదము గాని, స్త్రీపురుషుల భేదము గాని లేక సర్వము పరబ్రహ్మమయముగా గనుపించును. ఇది సాధారణ సంగతి కాదు, అతీతస్థితి. ఇప్పుడు అతి వర్ణాశ్రమ లనియు, అవధూత లనియు చెప్పుకొను కొందరు వేషధారులు గూడ నున్నారు. వారియొక్క స్థితి రాక్షసకృత్యము. వ్యవస్థ లేక భుజించుటలో గొప్పతన మేమియు లేదు. జనులలో నీచ స్థితియందుండు వారుగూడ ఎంగిలిఅన్నము తినుటయు, మద్యమాంసాదు లనుభవించుటయు గనపడుచున్నది. వారిని చూచి గొప్పవారని తలచుట

తెలివిలేనితనము. ఇప్పుడతి వర్ణాశ్రమమని చెప్పువారలలో కొందరు మద్యమాంసములు, గంజాయికొరకు పోట్లాడు వార్లను పైశాచిక సంఘమని తెలిసికొనుట మంచిది. వీరి ప్రసంగ మంతయును ఈ మూడువిషయములలో సమాప్తిచేయుదురు. అతి వర్ణాశ్రమస్థితి విషయమై ఉపనిషత్ ప్రతిపాదనము చూడుడు.

**ఆత్మానమీశ్వరం వేద సోఽతివర్ణాశ్రమీ భవేత్।**
**యోఽవస్థాత్రయనిర్ముక్తం అవస్థాసాక్షిణం సదా ॥**

ఎవడు జాగ్రత్ స్వప్న సుషుప్తులకు సాక్షిగానుండు వాడై, అవస్థా త్రయము లేనివాడై, తన ఆత్మయగు ఈశ్వరుని తెలిసికొని సదా జాతివర్ణాశ్రమములకు పైగానుండు ఆత్మస్వరూపుడే తానని దృఢబోధ గలిగియుండునో, వాడు అతివర్ణాశ్రమియని దత్తాత్రేయోపనిషత్.

**యస్య వర్ణాశ్రమాచారో గళితస్స్వాత్మదర్శనాత్।**
**స హి వర్ణాశ్రమాంత్సర్వానతీత్య స్వాత్మని స్థితః ॥**

ఎవడు ఆత్మదర్శనమువల్ల వర్ణా శ్రమాచారమునుండి విడుదల గలిగి యున్నాడో, వాడు వర్ణాశ్రమములగు సమస్తములను అతిక్రమించినవాడై సదా పరబ్రహ్మధ్యానమందు సుస్థిరముగా నుండును. అనగా జాతివర్ణాశ్రమాచారము కన్న ఆత్మ భిన్నుడై యున్నాడనియు తెలిసికొని ఆత్మాకారుడై యుండుట అతివర్ణాశ్రమమున కర్థమే గాని స్వేచ్ఛావిహారులై తిరుగుట అర్థము గాదు. మహాదేవం విజానాతి 'సోఽతి వర్ణాశ్రమీ భవేత్' ఎవడు దేవుడగు పరమాత్మను ధ్యానయోగముచే దెలిసికొనియున్నాడో వాడే అతివర్ణాశ్రమియని శాస్త్ర సమ్మతము.

**సర్వమేతత్ పరం బ్రహ్మ పశ్యేత్ స్వానుభవేన చ।**
**ముచ్యతే ఘోరసంసారాత్ సద్య ఏవ న సంశయః ॥**

నిర్మలనిష్ఠతో గూడి శ్రుతియుక్త్యనుభవముచే నిదంతయును పరబ్రహ్మమయమని ఎవడు తెలిసికొనునో వాడప్పుడే ఈజనన మరణమునకు

కారణమగు ఘోర సంసారమునుండి ముక్తు డగును. అనగా నిర్వాణస్థితి యను మోక్షము నొందును.

**మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।**
**స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥**

ఎవడు పరమాత్ముడగు భగవంతుని చలనము లేని భక్తియోగముచే సేవించుచుండునో వాడు సత్త్వ, రజ, స్తమోగుణములనున్ను, బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రాది వర్ణములనున్ను, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసము లను ఆశ్రమములనున్ను అతిక్రమించియుండు శుద్ధబ్రహ్మమును బొంది పరబ్రహ్మాకారుడై నిత్య ముక్తు డగును అని శ్రీకృష్ణవచనము. అనగా భక్తియే ముఖ్యముగా నుండవలెను. భక్తియున్న వారి కందరికిని ముక్తి సిద్ధించును.

**హరిః ఓమ్. శాంతిః శాంతిః శాంతిః. సర్వసంగ్రహము సంపూర్ణము.**

**ఓమ్ సర్వే జనాః సుఖినో భవంతు, ఓమ్.**







# శ్రీవేంకటేశ్వర మంగళపంచకమ్

ఓమ్ శ్రియః కాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥ 1

నిత్యాయ నిరవద్యాయ సత్యానందచిదాత్మనే ।
సర్వాన్తరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥ 2

పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రపన్న పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥ 3

శ్రీవైకుంఠవిరక్తాయ స్వామి పుష్కరిణీ తటే ।
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥ 4

శ్రీమత్సుందరజామాతృ మునిమానసవాసినే ।
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥ 5

ఇతి శ్రీ వేంకటేశ్వర మంగళపంచకం సమాప్తమ్.

శ్రీ సిద్ధార్థినామసంవత్సరే, మార్గశీర్షమాసే, శుక్లపక్షే, దశమ్యాం మంగళవాసరే, (2-12-1919) రాత్రౌ, తృతీయయామే సంపూర్ణమ్.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.
లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.
ఓమ్ తత్ సత్.

